# కథా మందారము

## రెండవ సంపుటము



సంకలనము

ఆవుల జయప్రదాదేవి




ప్రచురణ

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-500 004.

## తొలి పలుకు

ఆధునిక యుగంలో తెలుగు సాహిత్యంలో, విశేషించి, తెలుగు కథానికా రంగంలో, రచయిత్రులు బహుముఖ ప్రజ్ఞతో ముందడుగు వేస్తున్నారన్న మాట నిర్వివాదాంతము, తెలుగు సీమలోని నేటి జీవితాన్ని అనేక దృక్కోణాల నుండి చిత్రిస్తూ రచయిత్రులు కథలు, నవలలు అసంఖ్యాకంగా రచించి ప్రకటిస్తున్నారు. వీటికి పాఠకలోకంలో మంచి ప్రాచుర్యం కూడా ఉన్నది ఈ యధార్థమును గమనించియే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగు రచయిత్రుల కథా సాహిత్యములో మచ్చుతునకల వంటి కథలను ఏరికూర్చి: పాఠకుల ముందు ఉంచవలెనన్న ఉద్దేశంతో ''కథామందారము'' అనే పేరుతో మొదటి సంకలనమును 12 మంది రచయిత్రుల కథలను చేర్చి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి సంపాదకత్వమున జూలై, 1968లో ప్రకటించినది. ఆ సంపుటాన్ని పాఠకలోకము ఆదరించినది.

ఈ వరుసలో ఇది రెండవ సంకలనము దీని సంపాదక బాధ్యతను శ్రీమతి ఆవుల జయప్రదాదేవిగారు వహించడం హర్షింపదగిన విశేషము. ఆమె తన బాధ్యతను సమర్థవంతముగా నిర్వహించినారని ఇందులోని కథలు చెప్పకయే చెప్పుతున్నవి. ఈ సంకలనములో 26 మంది రచయిత్రుల కథలు ఉన్నవి. కథా సాహిత్య లోకంలో బాగా ప్రఖ్యాతులైన వారేగాక కొత్తగా రచనలు చేస్తున్న వారు కూడా వీరిలో వున్నారు. తత్ ఫలితంగా ఇతివృత్త వైవిధ్యము, శైలీ వైవిధ్యము కూడా ఈ సంకలనములో గోచరిస్తున్నవి. రచనా విధానములో కొన్ని కొత్త పోకడలు కూడ కనిపిస్తున్నవి: సమాజమునూ, వ్యక్తుల స్వభావాలనూ సూక్ష్మపరిశీలనతో చిత్రించినట్లు విశదమవుతున్నది. ఆంధ్ర పాఠక లోకము యీ సంకలనాన్ని ఆదరించ గలదని విశ్వసిస్తున్నాము.

ఈ సంకలనమును సిద్ధపరచి పీఠికను వ్రాసిన శ్రీమతి ఆవుల జయప్రదాదేవిగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు. ఈ సంపుటములో తమ కథలను చేర్చడానికి అనుమతి యిచ్చిన రచయిత్రులకు అకాడమీ పక్షాన అనేక ధన్యవాదాలు

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి.

జనవరి 28, 1979
హైద్రాబాదు.

# పీ ఠి క

జిజ్ఞాసువు యొక్క భావతరంగాలకు కళాత్మక రూపమే సాహిత్యం. దానిలో కథానిక ఒక ప్రధానాంగం. ఆ కథానిక ఆశయం జీవితంలోని వివిధకోణాలను వాస్తవికతకు దగ్గరగా, కళాత్మకంగా చిత్రిస్తూ, జీవితంలోని విశేషాంశాన్ని తెలియజెప్పి, దాని ద్వారా సామాన్యాన్ని దీపింపజేయడం.

''ప్రపంచానికి కథాభిక్ష పెట్టింది భారత దేశమే'' నంటున్నారు పరిశోధకులు. పాశ్చాత్యులు సహితం అందుకు ఆధారాలు చూపుతున్నారు. భారత దేశంలో ప్రాచీనమైన కథాబీజాలు గ్రంథస్థవాఙ్మయంలో వేదకాలంనుంచి కనిపిస్తాయి. తెలుగులో కథావాఙ్మయం పూర్వంనుంచి ఉన్నా, దానికి ఈ శతాబ్దిలోనే సుమారు ఏడుదశాబ్దాల క్రితం–అంటే 1910లో గురజాడవారి కలంనుంచి వచ్చిన ''దిద్దుబాటు''తో ఒక నిర్దిష్టరూపం ఏర్పడింది. కథానిక ఆధునిక రూపం సంతరించు కోవడానికి సహకరించింది పాశ్చాత్యసాహిత్యం.

'దిద్దుబాటు'గా ప్రారంభమైన ఆధునిక తెలుగు కథానిక తెలుగు దేశంలోనే ఆగక, ప్రపంచమంతా 'గాలివాన'గా విస్తరించింది. అంతర్జాతీయ బహుమానాన్ని పొంది, నాగరక భాషలన్నింటిలోకీ అనువదింపబడి, తెలుగు వారికి గర్వకారణమయింది. ఇట్లా తెలుగు కథానిక తెలుగు ప్రజల అత్యంతాదరణకు పాత్రమై, తెలుగువారి జీవితాలలోకి చొచ్చుకొని పోయింది. కావ్యం, నాటకం, నవల మొదలైన సాహిత్య ప్రక్రియలు కూడా చొరలేని మారుమూల కోణాలను స్పృశించింది. దేశంలో వస్తున్న మార్పుకు ఎప్పటికప్పుడు అద్దం పడుతూనే ఉంది. తెలుగువారి సాంస్కృతిక జీవితంలో ఒక భాగంగా మారింది.

స్వయం సమగ్రత, ఏకాంశవ్యగ్రత, సంక్షిప్తత అనే ప్రధాన లక్షణాలు గల కథానిక ఎన్నో పరిణామాలకు లోనయ్యింది. నూతన సమాజ నిర్మాణానికి ఆవశ్యకమైన నూతన దర్శన (Philosophy) ప్రతిపాదనకు కథానిక ఒక ఆలంబనమయింది. ప్రజలలో వస్తున్న భావ చైతన్యాన్ని ఎప్పటి

కప్పుడు ప్రతిధ్వనిస్తూనేసాగింది. వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమ కారణంగా సంఘంలో గొప్పసంచలనం కలిగింది. తత్ఫలితంగా ఆనాటి విశ్వాసాలు, జీవనవిధానం జిజ్ఞాస హేతువులై, ఆనాటి కథలకు వస్తువులైనాయి. తరువాత చలంగారి రచనల ప్రభావంతో అంతవరకు కేవలం కాముక వ్యాపారాలుగా పాపాలుగా పరిగణింపబడుతున్న అంశాలు కొంత సానుభూతితో అర్థంచేసుకోవాలనే దృష్టి ఏర్పడింది. చలంగారు ఎత్తి చూపే సమస్యలకు ఒక రకంగా పరిష్కారం వంటివి మునిమాణిక్యంగారి భావాలు. తరువాతి కాలంలోని విశేషం రచయిత్రుల సంఖ్య గణనీయంగా పెరగడం. ఇది సమాజంలో వచ్చిన ఒక బలమైన మార్పుకు నిదర్శనం.

నేటి కథానికా సాహిత్యాన్ని సుసంపన్నం చేయడంలో రచయితల కృషి ఎంత ఉందో, రచయిత్రుల కృషీ అంతే ఉంది. స్త్రీల రచనల వల్ల ముఖ్యంగా ఒనగూడిన మేలు సరళమైన, అందమైన శైలి అభివృద్ధి అయి, ఆధునిక సాహిత్యం బహుళజనాదరణ పొందడం. ఇటీవల పాఠకుల సంఖ్య విపరీతంగా పెరగడానికి ముఖ్యకారణం రచయిత్రులేనంటే అతిశయోక్తికాదు.

స్త్రీలు రచించే కథలలో సాధారణంగా స్త్రీ పాత్ర ప్రాధాన్యంతో స్త్రీల సమస్యలనే చిత్రిస్తూ ఉన్నా, ఇప్పుడిప్పుడు ఈ ధోరణిలో మార్పు కనబడుతున్నది. ఈ నాడు స్త్రీలు తమ పరిధి విస్తృతం చేసుకొని సమాజంలోని అట్టడుగు కోణాలలోకి సూటిగా దృష్టిని సారిస్తున్నారు. రాజకీయ. ఆర్థిక సామాజిక రంగాలలో ఎన్నిరకాల అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్నాయో కళ్ళకు కట్టినట్లు చిత్రించే కథలు వ్రాస్తున్నారు. సున్నితమైన భావ వృత్తిని అందంగా తీర్చిదిద్దే కథానికలూ వ్రాస్తున్నారు. మానవుల మనస్తత్వాలను 'ఫొటో' తీసినట్లుండే కథానికలూ వ్రాస్తున్నారు. వస్తువులో, శైలిలో, కథాకథనంలో ఎన్నెన్నో పోకడలు చూపుతున్నారు. కొందరు శిల్పానికి ప్రాధాన్యమిస్తే, మరికొందరు వాస్తవికతకు, ఇంకొందరు ఉక్తివైచిత్రికీ ప్రాధాన్యమిస్తున్నారు. కొందరు కేవలం సిద్ధాంతాల ప్రచారానికే ప్రాధాన్యం ఇస్తున్నారు. ఎన్ని లక్షణాలు ఉన్నా, కథానిక ద్వారా అందంగా చెప్పవలసినది జీవిత సారాంశం. ఆ లక్షణం ఉంటేనే అది పాఠకునికి చెరగని అనుభూతి కలిగించి జీవితగాంభీర్యాన్ని దర్శించిన తృప్తి కలిగిసుంది.

కొందరు రచయిత్రుల కథానికలను ఏర్చికూర్చినదే ఈ సంకలనం. దీనిలో ఒకటి రెండు దశాబ్దులకు పూర్వమే సుప్రతిష్ఠులైన వారి కథానికలూ ఉన్నాయి. ఇప్పుడిప్పుడే కలంపట్టి వెలుగుకు వస్తున్నవారి కథానికలూ ఉన్నాయి. రచయిత్రుల సలహాసంఘంవారు ఇలాంటి కథానికల సంపుటి ప్రచురించాలని తమ అభిప్రాయాన్ని వెల్లడించడంతో సాహిత్య అకాడమి తరపున రచయిత్రుల ఈ కథానికా సంకలనాన్ని అందిస్తున్నందుకు ఆనందిస్తున్నాము.

ఆవుల జయప్రదాదేవి

# వి ష య సూ చి క

# నేను దేవిని కాను

రచన:
శ్రీమతి ఐ. వి. యస్. అచ్యుతవల్లి

"చూసేవురా అబ్బాయ్!" శారదమ్మ పేపరు చూస్తూనే కొడుకుని కేక వేసింది. భోజనం ముందు కూర్చున్న శ్యామా, మంచంమీద నడుం వాల్చి విశ్రాంతి తీసుకోబోతున్న నారాయణా ముందు గదిలోకి వచ్చేశారు.

పేపరు కొడుక్కి అందించింది. రంగాపురంలో "శ్రీదేవి" జన్మదినోత్సవాలట. పదేళ్ళుగా తన అపార మహిమతో వేలాది భక్తుల కోరికలన్నీ సిద్ధింప చేస్తూన్న "శ్రీదేవి" జన్మదిన సందేశం విని భక్తులంతా తమ తమ బాధలన్నీ నివృత్తి చేసుకుందుకు వీలుగా, 'శ్రీదేవి' జన్మదినవేడుకలు మూడు రోజులపాటు అవిరామంగా జరుపుటకు "దేవీ నిలయం" కమిటీవారు నిర్ణయించారనీ, కనుక భక్తులంతా ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలనీ పేపర్లో వార్త. "మహిషాసుర మర్దని" అయిన దేవి విగ్రహం ముందు, మోకరిల్లి కూర్చున్న "శ్రీదేవి" అమ్మవారి ఫొటో కూడా వేశారు. ఆమెవల్ల ఎవరెవరు ఏ యే ప్రయోజనాలు పొందారో, ఎందరెందరు వున్నతపదవులు పొందారో వాళ్ళవాళ్ళ అనుభవాలు వాళ్ళ ఫోటోలతోసహా రెండు పేజీల నిండా వేసారు.

నారాయణ ఆశ్చర్యపోయేడు. తను ఇంచుమించు పాతికేళ్ళు వచ్చేదాకా రంగాపురంలోనే వున్నాడు. అప్పుడు ఇంత మహిమకల 'దేవి' ఎవరూ ఆ వూళ్ళో వుండేవారు కాదు. అయిదారు వందల ఇళ్ళు, ఏడెనిమిది వేల జనాభా వున్న రంగాపురంలో రెండు రామభజన మందిరాలు తప్ప, పెద్ద శిల్పాలున్న కోవెలకూడా లేదు. ఆ రోజుల్లో ఈదేవే అక్కడ వుండి వుంటే "శారదమ్మ" అంతు దొరకని జబ్బుకోసం, వున్న చిన్న తాటాకుల ఇల్లూ, అర ఎకరం మెట్ట పొలం అమ్ముకుని, రాయవెల్లూరుకు పోవలసి వచ్చేది కాదు. తనకోసమే బ్రతికే కన్న తల్లి శారదమ్మను బ్రతికించుకోవటం కోసం ఎన్ని వూళ్లో తిరిగాడు. విశాఖపట్నం, కాకినాడ, గుంటూరు మొదలయిన అన్ని ప్రధాన నగరాల్లో జనరల్ హాస్పటళ్ళలోను రెండేసి నెల్లు వుండి వచ్చింది. ఇంక ఆఖరు ప్రయత్నంగా రాయవెల్లూరు ప్రయాణం పెట్టాడు నారాయణ

"ఓరే అబ్బాయ్! నా జబ్బు తగ్గేది కాదురా! ఎందుకురా పోయే ప్రాణం కోసం, వున్న కాస్త మడిచెక్కా. జానెడు కొంపా అమ్ముకుపోవటం" అంటూ ఏడ్చింది శారదమ్మ. శారదమ్మ పుట్టి పెరిగిన వూరూ, అత్తవారి వూరూ అదే!

ఆమె పొరుగూరుకూడా ఎప్పుడూ దేనికీ వెళ్ళాల్సిన అవసరం వుండేది కాదు. పదహారేళ్ళకే వితంతువు అయినా, భర్తచిహ్నంగా నారాయణని పెంచుకుంటూ ఆ చిన్న తాటాకు ఇంట్లో క్లుప్తంగా మర్యాదగా జీవనం సాగించేది.

నారాయణ బి. ఎ. వరకు చదివి టైపూ షార్టుహేండూ ప్యాసయినాడు. ఉద్యోగ ప్రయత్నాలు చేస్తూవుండగానే శారదమ్మకి అంతులేని జబ్బుపట్టుకుంది. పుట్టి మెట్టిన వూరు వదలి ఎన్ని వూళ్ళు తిరిగినా ఆమె జబ్బు తగ్గు మొహం పట్టలేదు.

"అమ్మా! పుట్టినవాళ్ళు ఎప్పటికయినా పోవటం ఖాయం. అవకాశ వుండీ డబ్బు మీద లుబ్ధత్వంతో నీకు సరయిన చికిత్స చేయించలేకపోతే, ఆ గుండె కోత నేను జీవితాంతం భరించలేను. ఇల్లూ పొలం జీవించటం కోసమే కదా! ఆ జీవితం లేకపోయేక, అవి ఎవళ్ళని ఉద్ధరిస్తాయి?" అన్నాడు నారాయణ.

తనకోసం తన ఆరోగ్యం కోసం, ఆఖరు పైసాకూడా ఖర్చు పెట్టడం కోసం ఏమాత్రం వెనుకంజ వేయని కొడుకుని చూసి తన జన్మ సార్థకమైనదని తృప్తి పడింది శారదమ్మ. "వెళ్ళిపోతున్నావా, నారాయణా?" అంటూవచ్చింది పద్నాలుగేళ్ళ సావిత్రి.

"ఇల్లూ వాకిలీ అమ్ముకుపోతున్నాం తల్లీ!" అంటూ బేలగా ఏడ్చింది ఆ పసిపిల్ల ముందు. శారదమ్మ ప్రౌఢత్వం కరిగి నీరయిపోయింది. అనారోగ్యం వల్ల శారదమ్మ బేలమనసుదయింది.

"నీకు నయమయితే, నారాయణ ఉద్యోగంచేసి బోలెడు పొలంకొంటాడు. పెద్ద ఇల్లు కట్టిస్తాడు. కదూ నారాయణా! దిగులు పడబోకు శారదమ్మా;" అంది సావిత్రి పెద్ద ఆరిందాలా. సావిత్రి బ్రాహ్మల పిల్ల. శారదమ్మ కాపు పడుచు! సావిత్రి తండ్రి దీక్షితులు. చుట్టుపక్కల వూళ్ళన్నీ తిరిగి తిథి వార నక్షత్రాలు చెప్పి ఆయవారం తెచ్చేవాడు. సావిత్రికి ఇద్ద రన్నలూ, ఇద్దరు చెల్లెళ్ళూ వుండేవారు. సావిత్రి వాళ్ళు వూరి బయట ఏటి వొడ్డున వున్న పెద్ద తోటలో చిన్న పాక వేసుకొని వుండేవాళ్ళు. ఆ తోట పొరుగూరులో వుండే ఒక పెద్ద ధనవంతుడిది. తోటకు కాపలాగా వుంటారని, ఈ పేదవాళ్ళకి ఉచితంగా పాక వేసుకుందుకు జాగా ఇచ్చారు. సావిత్రి పచ్చగా పొడుగ్గా, పచ్చి తాటాకు

బొమ్మలాగుండేది. శారదమ్మ ఒకగేదెని మేపుతూండేది. సావిత్రి అప్పుడప్పుడు వచ్చి శారదమ్మ నడిగి మజ్జిగ తీసికెళుతూ వుండేది.

"అమ్మా! నేను సావిత్రిని పెళ్ళి చేసుకోనా?" అన్నాడు ఒకసారి నారాయణ. ముతక చీర కట్టుకున్న సావిత్రిని చూస్తే నారాయణకి దిగులుగా వుండేది. పొడుగాటిజుట్టు ఆ పిల్లది. చెంపకు చారెడేసి కళ్ళు, గుండ్రని అగరు బొట్టూ కళ్ళ నిండా కాటుకతో కళకళలాడుతూ కన్పించేది.

"అమ్మో! తప్పు. వాళ్ళు బ్రాహ్మర్లు!" అంది శారదమ్మ.

"నేను నిన్ను పెళ్ళి చేసుకుంటానంటే మా అమ్మకు భయం. మీరు పెదకులం వాళ్ళట!" అన్నాడు నారాయణ సావిత్రితో.

"కూడు పెట్టి బ్రతికించలేని కులగౌరవం ఎందుకు? నువ్వు చేసుకుంటా నంటే నా కిష్టమే!" అంది సావిత్రి. పద్నాలుగేళ్ళ సావిత్రి తన భావిజీవితాన్ని తన చేతుల్లో పెట్టటానికి సిద్ధపడితే ఇంకా జాలివేసింది నారాయణకు. 'ఆకలి వయసుకు మించిన పరిజ్ఞానం కలుగ చేస్తుంది కాబోలు! దేన్నయినా ధిక్కరించ గలశక్తి ఆకలి జ్వాలనించే పుట్టుక వస్తుంది కాబోలు!' అనుకున్నాడు గ్రాడ్యు యేటు అయిన నారాయణ.

"నేనూ మీతో వచ్చేదా నారాయణా! శారదమ్మ హాస్పటల్లో వుంటే నేను కొంచెం వంటా వార్పూ చూస్తాను" అంది సావిత్రి.

"ఏమే అమ్మా! వెళ్తున్నది దూరాభారం! ఆడ సాయం వుంటే బాగుం డదూ!" అన్నాడు నారాయణ.

"సందేహం ఎందుకూ! మావాళ్ళేం అనుకోరు. ఒకళ్ళ భారం తగ్గినా తగ్గి నట్టే!" అంది సావిత్రి, శారదమ్మ సందేహించటం చూసి.

శారదమ్మ కళ్ళు నీళ్లొచ్చేయి. "ఏనాటి పాపమో రోగంతో తీసుకుం టూంది. అభం శుభం తెలీని పిల్లని తీసుకుపోయి తమ కులంలో కలుపుకుంటే ఇంక ఆ పాపానికి నిష్కృతి వుంటుందా!" భయపడసాగింది శారదమ్మ.

"వద్దు తల్లీ! వద్దు. అక్కడ నేనేమన్నా అయ్యానంటే, పసిపిల్లవు, చూడలేవు" అంది జాలిగా. అయితే శారదమ్మ ఏమీఅవలేదు. డాక్టర్లే అద్భుత పడేలా కోలుకొంది. నారాయణ చిన్న చిన్న వుద్యోగాలు చేసి చేసి చివరికి నెలకు మూడు వందలు ఇచ్చే వుద్యోగంలో కుదురుకున్నాడు. తనలాగే వెనకా

ముందూ ఎవరూలేని శ్యామని పెళ్ళి చేసుకున్నాడు. శారదమ్మది తృప్త జీవనం కాదు. పని తనంలో భర్తని పోగొట్టుకుంది. నారాయణ చదువయ్యేసరికి ఆరోగ్యం పోగొట్టుకుంది. ఇప్పుడు మనుమలని ఆడించాలనే కోరిక తీవ్రమ యింది. పెళ్ళయి పద్నాలుగేళ్ళు. పదహారేళ్ళు గడుస్తున్నాయి. శ్యామకి పిల్లలు కలగలేదు. అదొక తీరని కొరతగా వృద్ధాప్యంలో మనుమల్ని ఆడించాలనే కోరిక శారదమ్మ గుండెల్లో సెలవేసి సలుపుతూ వుండేది. ఎన్నెన్నో మందులు ఎన్నెన్నో వ్రతాలు, పూజలు, జపాలు చేసినా శ్యామని సంతానవతిగా చేయలేక పోయాయి. ఈ ప్రకటన చూసేసరికి శారదమ్మలో ఆశ చిగురించింది.

''అరే! నాలుగు రోజులు సెలవుపెట్టి వెళ్ళి వద్దాము. ఏమో ఏ పుట్టలో ఏ పాముంటుందో ఎవరు చూడొచ్చేరు?'' అంది శారదమ్మ.

"అదే నాకూ అంతుపట్టటం లేదు. మనం ఆ వూరు వదిలి నిండా పదహా రేళ్లు అయ్యుంటుందేమో. ఈ దేవి ఎవరంటావు?" అన్నాడు నారాయణ.

"ఎవరయితేనేం? ఆర్తుల ఆర్తితీర్చేది. వాళ్లు ఎవరయితేనేం? ఎవరని నిర్ణ యించేదిరా!' అని ఆ మహానుభావుడు త్యాగరాజే తికమక పడ్డాడు. మన మెంత?'' అంది శారదమ్మ భక్తిగా.

''అంతా మీ చాదస్తం అత్తయ్యా! కూటి కోసం కోటి వేషాలు! ఈదేవి కూడా అట్లాంటి బాపతే అయ్యుంటుంది'' అంది శ్యామ.

''నీతో అదే వచ్చింది చిక్కు! మనసు పెట్టుకుని పూజలు చేయవు. చదువుకొన్న వాళ్ళు అంతా నీలానే వున్నారా?'' అంది శారదమ్మ విసుగ్గా.

''నాకు నమ్మకం లేదనుకోండి. నా లాంటివాళ్ళకి నమ్మకం కలగాలంటే ఆ దేముడు ఏదో మహత్తు చూపించాలిగదా'' అంది శ్యామ నవ్వుతూ.

"నీలాంటి వాళ్ళని ఆస్తికులని చేస్తేగాని దేముడికి గడవదా?"అన్నాడు నారాయణ.

''నా మాట విను శ్యామా! త్రికరణ శుద్ధిగా నమ్మితేనే ఏపూజచేసినా ఫలించేది. మనసు సహకరించకపోతే శారీరక రుగ్మతలు తగ్గించలేమంటారు ప్రముఖ వైద్యులుకూడా!'' అంది శారదమ్మ.

శ్యామ మాట్లాడలేదు. శారదమ్మ ఎంతో ఉత్సాహంగా ప్రయాణం ఏర్పాట్లల్లో మునిగిపోయింది.

''ముగ్గురం ఎందుకమ్మా! మూడు వందలు దారిఖర్చులయిపోతాయి'' అన్నాడు నారాయణ.

"మీరిద్దరూ ఎల్లానూ వెళ్ళాలి కదా! ఇంక నేనొక్కర్తినీ ఇక్కడెందుకని!"

"మేమిద్దరం మటుకు ఎందుకు?"

"అదేమిట్రా? దంపతు లిద్దరూ వెళ్ళిదర్శనం చేసుకోవద్దూ!"

"అది కాదే! నువ్వెళ్ళు. నీకు మనవూరు చూడాలని వుండటం సహజం" అన్నాడు నారాయణ.

"నేను వక్కర్తినీ ఎందుకురా! ఏమో పుట్టి పెరిగిన వూరు. 'నా' అన్నవాళ్లు లేకపోయినా ఈ 'దేవి' మహిమవల్ల పుణ్యక్షేత్రంగా మారింది. ఒకసారి చూసివస్తే ఏం పోయింది?" అంది శారదమ్మ. నారాయణకి ముందు అనవసరం ఖర్చు. ఎందుకనిపించినా పదహారేళ్ళకి తన కుగ్రామంలో ఎన్ని మార్పులు వొచ్చాయో చూడాలనిపించింది. ముగ్గురూ వారం రోజులు అటు కేసి దగ్గర బంధువులందర్ని చూసిరావొచ్చు ననుకుంటూ బయలు దేరారు.

* * *

రంగాపురం వూరంతా పచ్చని పందిళ్ళు వేశారు. ప్రతీ ఇల్లూ. చివరికి తాటాకు ఇల్లయినా తెల్ల సున్నం కొట్టించి శుభ్రంగా వుంది. ప్రతీ ఇంటికీ మామిడి ఆకుల తోరణాలు కట్టారు. వూరిలోని ప్రతీవాళ్ళ ఇల్లూ వచ్చేపోయే బంధువులతో ఇరుకుగా గలగల్లాడుతూ వుంది. "దేవీ నిలయం" వూరి చివర తోటలోనే వుంది. చక్కని పాలరాతి మందిరం అది! చుట్టూ అందమయిన క్రోటన్స్‌తో, రంగురంగుల విరబూసిన పూలతో వున్న చక్కని తోట. ఎన్నో రకాల ఫలవృక్షాలు వున్న పెద్దతోట. ఏటి వొడ్డున పొడుగూతా ఫర్లాంగు దూరం వ్యాపించి వుంది ఆ తోట. అక్కడక్కడా పొదవయిన దేకు చెట్లు! వాట్లని ఆశ్రయించుకొని వేలాది తలక్రిందుల పక్షులు "కిచ్ కిచ్"మంటూ చేసే రొద! 'దేవీనిలయం'కు వెళ్ళే దారి పొడుగునా టెంకాయలూ, హారతి కర్పూరం, అగరువత్తులు, అరటిపళ్ళు, పసుపు కుంకుమా, పూలదండలూ అమ్ముతున్న దుకాణాలున్నాయి. ఒక వేపు అద్దాల త్రోపుడు బళ్ళల్లో రక రకాల తీపి, కారం, పిండివంటలతో బాటు ఉదయాన్నే కాఫీ, టీ, ఇడ్లీ, దోసె, ఉప్మా మొదలయిన ఉదయపు ఫలహారాలతో ఒక మొబైల్ హోటలు ఏర్పాటు చేసారు.

దారి పొడుగునా గోనె పట్టాలు పరుచుకుని కుంటి, గుడ్డి, మూగా, కుష్ఠ మొదలయిన వ్యాధులున్నవాళ్ళు కూడా కూర్చుని పచ్చేపోయేవాళ్ళకి చేతులడ్డంగా జాపుతూ "అమ్మా ధర్మం తల్లీ! గుడ్డివాణ్ణి తల్లీ", "అమ్మా మీ కోరిక తీరతాది. జబ్బు ముండకి ఒక్క పైసా పడెయ్యి తల్లీ!" అంటూ దీనంగా అడుగుతున్నారు. దేవీ నిలయానికి వచ్చేపోయే భక్తులు చిన్న చిన్న సంచీలలో నూకలు పోసుకొని గోనె పట్టాల మీదకు గుప్పెడు గుప్పెడు విసురుకుంటూ పోతున్నారు. కొంతమంది పైసా నాణేలు విసురుతున్నారు. వాళ్ళని చూసి బిచ్చగాళ్ళు "మాకెయ్యండమ్మా మాకెయ్యితల్లీ నూగ్గింజలు" అంటూ పెద్దగోలగా అరవడం మొదలు పెట్టారు. శారదమ్మా, శ్యామా ఏటిలో స్నానాలు చేసి వొచ్చేరు. ఒక పళ్లెం నిండా బియ్యం తెచ్చి, శారదమ్మ తలొక గుప్పెడూ వేసుకుంటూ వస్తోంది. శ్యామ ఒక రూపాయి పైసలుగా మార్చి, అవివచ్చినంతవరకు తలొక పైసా వేసి ఆ పయిన పూరికే నడిచింది.

ప్రభాత వేళలో దేవస్తుతి మైకులో ఉచ్ఛైస్స్వరంతో విన్పించుతోంది. జనం త్రోసుకుంటూ ఒకళ్ళ నొకళ్ళు త్రొక్కుకుంటూ నడుస్తున్నారు. భక్తిని వెదజల్లే ఆ స్తోత్రగీతాలు వింటూంటే రోమాంచిత మయిపోయింది నారాయణకి. జనంత్రోపిడికి ముఖ ద్వారం దగ్గరికి వచ్చిపడ్డాడు నారాయణ. శ్యామ బాగా వెనుక పడిపోయింది. లోపలికి వచ్చేడు. అది విశాలమైన స్తంభాలతో వున్న పెద్దమండపం. స్తంభాలచుట్టూ రంగు రంగుల ఎలక్ట్రిక్ బల్బుల తోరణాలు కట్టారు. మంటపంలో అక్కడక్కడా పెద్ద పెద్ద గాజు బుడ్లు వ్రేలాడకట్టారు.

చక్కని చిన్న చలువరాతి అరుగుమీద మహిషాసురమర్దని అయిన దేవి బంగారు ప్రతిమ! ఎర్రని గులాబీలు, ముద్దమందారాలు పచ్చగా అరచేయి అంతగా విచ్చిన చామంతులతో ఆ నిలువెత్తు విగ్రహం అలంకరింపబడి వుంది. వెలుగుతూ ఆరుతూ వున్న విద్యుద్దీపమాలిక ఆ మండపానికి వింతశోభ నిస్తోంది. ఆ విగ్రహం ముందు చిన్న నాలుగు కోళ్ళ పీట మీద కూర్చొని అర్ధనిమీలితంగా వుంది శ్రీదేవి.

పొడుగాటి జుట్టుని విరబోసుకుంది. నుదుట ఎర్రగా రూపాయి కాసంత కుంకుమ బొట్టు! సన్నటి కోల ముఖం! చారెడేసి కళ్ళకి చింతాకంత వెడల్పున కాటుక ఎత్తుగా నించున్న ముక్కుకి సన్నని ముత్యాల నత్తు! గడ్డం మీద మూడు చుక్కలు పచ్చబొట్టు! చేతులకి పగడాల రంగులో గోరింట ఒక చేత

జేగంట మ్రోగించుతూ, ఒక చేత హారతి యిస్తూంటే దేవీ విగ్రహంకన్న ఎక్కువ కళగా ఆ హారతి వెలుగులో దేవి ముఖం మెరిసిపోతుంది. పచ్చని పట్టుచీరలో వున్న శ్రీదేవికేసి తదేకంగా చూస్తూ నిలబడి పోయేడు. భక్తులు ఆవేశంతో ఠపీ ఠపీ మంటూ లెంపలు వాయించుకుంటూ "దేవి" ముందు సాష్టాంగ పడుతున్నారు. కొంతమంది గంట మ్రోగించుతున్నారు. కొంతమంది తాముతెచ్చిన పళ్ళు పసుపు కుంకుమ అన్నీ దేవి ముందుంచుతున్నారు. 'శ్రీదేవి' ఎవరివేపు చూడటంలేదు. ఆమెపక్కన ఒకతను నించున్నాడు. బరంపురం పొత్తు పంచె, నడుంకు ఎర్రని సిల్కు తువ్వాలు కట్టుకున్నాడు. నుదుట విభూతి రేఖల మధ్య చిన్న కుంకంబొట్టు! బక్కగా పొడుగ్గా, తెల్లగా వున్నాడు. భక్తులు తెచ్చిన పళ్ళు, ఫలహారాలు వేటికవి విడదీసి, కొంచెం ఒక వారకి త్రోసి, కొంచెం వాళ్ళకి ప్రసాదంక్రింద ఇస్తున్నాడు. ఇదంతా ఎంతో వింతగా చూస్తూనిలబడ్డాడు నారాయణ. ఎవళ్ళ తొందర వాళ్ళది! ఒక అర గంటకి శ్యామ వచ్చింది. పళ్ళూ, పూలూ వున్న పళ్ళెం శ్రీదేవి ముందుంచి సాష్టాంగపడి లేచి భక్తి పూర్వకంగా లెంపలు వేసుకుంది.

"అల్లా నిలబడ్డారేమిటి!" అన్న భార్యమాటకు నారాయణ ఉలిక్కిపడ్డాడు. "వచ్చేవా, నీ కోసమే నించున్నాను." అన్నాడు. పక్కగా గుజగుజ మాటలు వినపట్టంతో శ్రీదేవి చూపు చెదిరింది. దేవి ప్రతిమమీంచి చూపు మళ్ళించుకుని వీళ్ళవేపు చూసింది. నారాయణ చూపు "శ్రీదేవి" చూపుతో చిక్కుపడింది. కలవరపడ్డాడు నారాయణ. శ్యామ ఇచ్చిన పళ్ళు పూలువున్న పళ్ళెరంమీద చేయివేసింది శ్రీదేవి. దేవి విగ్రహం పాదాలముందు రాసిలావున్న పారిజాతాల్లోంచి గుప్పెడు పూలుతీసి శ్యామదోసిట్లో వుంచింది. శ్రీదేవి ప్రక్కనున్నతను పళ్ళెరంతీసుకుని, పళ్ళూపూలు కొన్ని తీసుకుని, కొన్ని పళ్ళెంలో వుంచేడు. దేవి స్వయంగా, శ్యామ పళ్ళెరం తాకటం చుట్టుప్రక్కలున్నభక్తులు చూసేరు. శ్రీదేవి శ్యామని అనుగ్రహించిందని అందరూ శ్యామనారాయణ దంపతులకు సాగిలబడి మ్రొక్కసాగారు. ఈ సంగతి ఎంతో వెనుకపడివున్న శారదమ్మకి ఎవరో చెప్పారు. ఆమె కళ్ళు జలపూరితా లయ్యాయి. ఆనందంతో శారదమ్మకి నోట మాటరాలేదు. జనం నారాయణ దంపతులని నడవనీయటం లేదు. అరచేతులు పరచి ఇవతలకి తీసుకువచ్చేరు.

"నీ కోరిక తప్పక తీరుతుందేతల్లీ!" అంటూ శ్యామని కౌగలించుకుంది శారదమ్మ.

"పూర్తి ఇద్దారు శ్రీదేవి, తప్పక కూతురు పుడుతుంది" అంది ఒక ముత్తయిదువ.

"ఏ పిల్ల అయితేనేం! ఏదో ఒకపిల్ల కలిగితేచాల్సు!" అంది శారదమ్మ. శ్యామ కిదంతా ఏదో సిగ్గుగా వుంది. శారదమ్మ దూరపు బంధువుల ఇంట్లో దిగారు వాళ్ళు! శ్యామని ఒక్కపనైనా చేయనీయటం లేదు వాళ్లు. ఆమె దేవి అయినట్లు భక్తితో అడుగులకు మడుగులు వొత్తుతున్నారు. నారాయణకి అంతా ఏదో కలగా వుంది. ఏదో సందేహంతో మనస్సు కొట్టుకుపోతోంది.

ఇది నిజమేనా? నిజం కాకపోతే మరి చూస్తున్నదేమిటి! పదహారేళ్ళనాటి పేద బ్రాహ్మణపిల్ల. ఒక పూట తింటే రెండు పూటలు పస్తులుండే సంసారం వాళ్ళది. ఇంతలో ఏ భగవంతుడూ ప్రత్యక్షం కాకపోతే ఇల్లా ఎల్లా మారగలదు! నిజంగా దేవీ సాక్షాత్కారం పొందే వుంటారు వాళ్ళు!

"శ్రీదేవి" జన్మదినోత్సవాలు ఎవ్వరూ వూహించలేనంత అత్యద్భుతంగా జరిగాయి. చాలామటుకు ఊరంతా ఖాళీ అయ్యింది. ఎందరెందరో మంత్రులు, కలక్టర్లు, పెద్దపెద్ద వ్యాపారస్థులు అందరూ వచ్చి "శ్రీదేవి"ని సందర్శించి, ఆమె దీవెనపొంది వెళ్ళారు. పేపర్లన్నీ ప్రత్యేక అనుబంధాలని ప్రచురించాయి. ఇంక తెల్లవారి నారాయణ వాళ్ళ ప్రయాణం. ఈ వారం రోజులూ నారాయణ దంపతులు, శారదమ్మ రెండుపూటలా 'దేవీ' భజనల్లో పాల్గొంటూనే వున్నారు. "శ్రీదేవి" నారాయణ చూపులతో తికమకపడ్తూనే వుంది. రాత్రి పదకొండు గంటలు దాటేదాకా 'దేవీ మంటపం'లో పురాణ కాలక్షేపం విని వచ్చారు అత్తా కోడళ్లు. నారాయణకి నిద్రపట్టలేదు. అర్థరాత్రివేళ ఏదో ఆలోచించుకుంటూ వీధి వొడ్డుకి వచ్చేడు. దూరంగా, వంటరిగా వున్న పారిజాతం మొక్కవద్ద ఎవరో తెల్లనిచీరలో ముసుగు వేసుకుని నిలబడినట్లు ఆ మసక మసకవెన్నెల్లో కన్పించింది నారాయణకి. అటుకేసి నడిచేడు. పారిజాతం చెట్టు విరబూసింది. వెనకాతల పొడుగాటి దేకుచెట్ల నీడలు. చారలు చారలుగా వెన్నెల జాడలు!

"ఎవరదీ?" అన్నాడు నారాయణ.

"నేనే నారాయణా!"

"మీరా!"

"ఆమన్నింపెందుకు నారాయణా! నేనుసావిత్రినే. ఇప్పుడుదేవినికాను" నవ్వింది స్నిగ్ధంగా సావిత్రి.

"ఇల్లా వొచ్చేవేం?"

"ఈ వారం రోజులుగా రోజూ వస్తూనే వున్నాను ఇవ్వాళ వొచ్చేవ నువ్వు!"

"అయితే!" సందేహంగా ఆగాడు నారాయణ.

"నీ కోసమే నారాయణా! నీతో మాట్లాడాలనే నా ఆరాటం ఆపుకో లేకనే! పూర్వంలా మన మిద్దరం గంటలకి గంటలు ఏటివొడ్డున సూర్యాస్తమయం చూస్తూ కబుర్లు చెప్పుకుంటూ కాలం గడప గలమా!"

"నన్ను మర్చిపోలేదా నువ్వు!" ఏదో సందేహం, బాధా గొంతులో.

"నువ్వు మర్చిపోయేవా నన్ను?"

"లేదనుకో! కాని..."

"అంత సులభం కాదు నారాయణా. మనస్సుని జోకొట్టటం తాత్కాలికం. అది ఎప్పుడో ఒకప్పుడు లేచి మారాము పెడుతూనే వుంటుంది."

సావిత్రి మనస్సేమిటో నారాయణకి అర్థం అయ్యింది. కొంచెం తల తిరిగినట్లయింది. తనలోతనే ఏదో నచ్చచెప్పుకున్నాడు.

"ఇదెలా సంభవమయింది!" గొణిగినట్టుగా అడిగాడు.

"ఏది?"

"అదే! నీకు దేవీ సాక్షాత్కారం ఎల్లా కలిగింది! నాకు తెలుసున్నంత మటుకు మీ ఇంట్లో పెద్ద పూజలూ, పునస్కారాలూ చేసేవారు కాదుకదా!"

"కూర్చో నారాయణా! స్థిమితంగా చెబుతాను." ఇద్దరూ ఏటివొడ్డున ఇసుకలో కూర్చున్నారు. ఇసుక చేతినిండా తీసుకుని ఇంకో చేతిలోకి ధారగా పోస్తూ చెప్పింది సావిత్రి.

"నీకు మా సంసారం సంగతి తెలుసుకదూ! మానాన్న ఆయివారంచేసి తెచ్చే దానితో ఆరుగురం తినాలి. మా అన్నలకి చదువులు రావు. పౌరోహిత్యాలు చేసేవారు. మా అమ్మ పెద్ద ఆరోగ్యవంతురాలు కాదు. పౌరోహిత్యాలు లేనప్పుడు మా అన్నలు పొలం పనులకి, కూలికి వెళ్ళేవారు.

"అబ్బ! అబ్బ నాకారం బాపనోడివి! నీవు నారు కావిళ్ళం మోస్తావు?" అంటూ కూలిపన్లుక్కూడా రానిచ్చేవారు కాదు. బస్సు దగ్గిరికి మూటలు మోయటానికివెళ్తే మా చిన్నన్నతో "బాపనోడివి నువ్వుకూడా మావోళ్ళున్నా వాళ్ళ

చాలక, వొంతుకి వచ్చేవా! ఎల్లెల్లు అంటూ తోటి కూలీవాళ్ళు దెబ్బలాటకి దిగా రట! పౌరోహిత్యాలు రోజూ వుండవు. మా నాన్న వారం పదిరోజులు చుట్టు పక్కలున్న పల్లెటూళ్ళన్నీ తిరిగినా, నాలుగుకుంచాల బియ్యమయినా పోగయేవి కాదు. తిరిగి తిరిగి వచ్చి నీరసంతో అయిదారు రోజులు కదలలేక పోయేవారు. ఇల్లా చాలీ చాలని ఆకలి బ్రతుకులతో వుండగానే నేనూ, మా చెల్లాయి లిద్దరూ కూడా పెద్దవాళ్ళ మయ్యేము. ఒకరోజు నేను తోటలో చెట్లకి నీళ్ళుపెట్టున్నాను. అనుకోకుండా మా తోట యజమాని కారులో వొచ్చేడు. తోట అమ్మకం పెట్టు న్నారుట. కొనుక్కునే వాళ్ళకి తోట చూపించటానికి వొచ్చేరు. యజమానికీ, కూడా వొచ్చిన వాళ్ళకీ, కొబ్బరికాయలు కొట్టి నీళ్ళు ఇచ్చేడు మా పెద్దన్న. నన్ను చూసేడుట యజమాని. కళ్ళు చెదిరినట్లున్నాయి. పెద్ద ధనవంతుడు కదా పాపం!

"మీ పెద్ద చెల్లేనా ఆ పిల్ల! బాగా తయారయిందే! రేపు అదివారం, కారు పంపుతాను. మా వూరు పంపు! మీ కుటుంబానికి ఏ లోటూ వుండదు. నెలకి రెండు వందలు ఇస్తాను" అన్నాడుట మా అన్నతో.

అయనకి యాభయ్ ఏళ్ళు వుంటాయి. నా వయస్సు మనుమరాళ్లు వుండి వుంటారు. మా అన్నయ్యకి పౌరుషం వచ్చింది. తిండికి లేనివాళ్ళకి ఆత్మాభి మానం శీలం వుండక్కర్లేదు అనుకున్నాడేమో! ఆయనవెళ్ళాక మా పెద్దన్నయ్య నన్ను దగ్గరికి తీసుకుని ఆయన అన్నమాట చెప్పాడు నాతో. అప్పటికి మా ఇంట్లో పొయ్యి రాజేసి మూడురోజులు అయ్యింది. ఏం చెయ్యాలో తోచలేదు. చిలకడదుంపలుంటే ఉడకబెట్టాను ఆ రోజు!

"పోనీ వెళ్తాలే అన్నయ్యా! ఆ వూరు!" అన్నాను బింకంగా. అయినా లోపల భయమే!

"అల్లా కాదుండు" అన్నాడు. ఇంట్లో వున్న చిన్న ఇత్తడి బిందె అమ్మేసి, చిన్న 'మహిషాసుర మర్దని' విగ్రహం ఒకటి కొనుక్కుని వచ్చేడు. మా అన్నయ్య సలహా ప్రకారం నేను ఏటిఒడ్డున జుట్టు విరబోసుకుని నాలుగు రోజులుపాటు కూర్చుండిపోయేను. నన్ను చూసిన గొడ్లకాపు కుర్రాళ్లు వాళ్ళంతా వెళ్ళి వూళ్ళో వాళ్ళతో చెప్పారు. వూళ్ళో వాళ్ళుకొంత మంది నన్నుచూడటానికి రావటం మొదలుపెట్టారు, మా అమ్మ చెల్లాయిలూ కూడా వచ్చేరు. అందరూ చూస్తూ వుండగా అమ్మ చెల్లెళ్లూ "నన్నింటికి రమ్మనమని" కన్నీళ్ళతో బ్రతిమ

లాడటం మొదలు పెట్టారు. నేను వెర్రికోపంతో గుడ్లెర్రచేసాను. వంటిమీదున్న చీరని చింపేసు కున్నాను.

"వెర్రి పీనుగుల్లారా! నే నెవరను కున్నారు! దేవినర్రా దేవిని! ఈ ఏటి ఇసుకలో నన్ను ఇగర్దొక్కారా! మీరు కామ క్రోధ లోభ మోహ మద మాత్స ర్యాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నారా! నన్ను పైకితీయండి! నేను ఆ కన్నెపిల్ల మీద వున్నాను. ఆమె చెప్పినట్లు చేయండి! లేకపోతే వూరు మాడి మసి అయి పోతుంది" అంటూ నోటికి వచ్చినట్లు తిట్టసాగాను. ఇంతలో చాకలాడు వేప మండను తెచ్చి విసరసాగాడు. ఇంకొకళ్ళెవరో కుండ మూకుడులో కణకణ లాడే నిప్పులు తెచ్చి సాంబ్రాణి పొగ వేయసాగారు. వారం పదిరోజులుగా వుండీ లేక అన్నం సరిగ్గా తినటం లేదేమో నాకు అరవగా అరవగా, శోషవచ్చి కుప్పలా కూలిపోయేను. అప్పుడు వాళ్ళంతా నా ముఖంమీద చన్నీళ్ళు చల్లి పాలూ పంచదారా కలిపి నాకు పట్టించారు. నన్ను నెమ్మదిగా ఒక టేకుచెట్టు నీడను కూర్చోపెట్టారు. నేను నాలుగు రోజులుగా కూర్చున్న చోట మా చిన్న న్నయ్య, పెద్దన్నయ్య, వూరివాళ్ళతోకలిసి గునపాలతో తవ్వటం మొదలెట్టారు. మా నాన్న ఎవరూ చూడకుండా, జువ్విచెట్టు రెమ్మల్లో దాక్కుని, దేవీ విగ్ర హం కనపడే సమయానికి పెద్దపెద్ద రెమ్మలు త్రుంచి క్రిందకి పడేసాడు. ఆ విగ్రహాన్ని మా ఇంట్లోనే ప్రతిష్ఠించారు. నన్నుకోరిన యజమానికి నాలుగు రోజులు భయంతో విరోచనాలు అయ్యాయట! నేను మంత్రించి ఇచ్చిన మిరి యాలు, నేతితో వేయించుకుని అన్నంలో కలుపుకొని మూడు పూటలు తింటే విరోచనాలు తగ్గాయిట. అందుకని అతని తోట మేము వుండటానికి 'దేవి నిలయం' కట్టుకుందుకు వ్రాసి ఇచ్చేడు. కాకతాళీయంగా కొంతమంది జబ్బులు నయం కావటం, కొంతమందికి పిల్లలు కలగటం, క్రమక్రమంగా, మా దేవి మహత్తు బాగా ప్రచారం లోనికి వచ్చింది, చాలా డబ్బు పోగయింది. 'దేవి'ని స్మరించిన వేళావిశేషం మా కుటుంబం హాయిగా జరిగిపోతోంది. మా అన్నలు నా శీల రక్షణకు ఈ పథకం వేసినా, ఆపథకమే మా జీవనాధారం అయ్యింది. ఇద్దరు చెల్లెళ్ళకీ అన్నలకీ పెళ్ళిళ్ళు అయ్యాయి. నాన్న, అమ్మ హాయిగావున్నారు. మేము నమ్ముకున్న 'దేవి'కి మందిరంకట్టించాము. ఉత్సవాలు చేస్తున్నాం. పూజలు చేస్తున్నాం. కోరికలు తీరినవాళ్లు మా మహిమ అనుకుని ఇంకా భక్తి పరవశులు అవుతున్నారు. తీరనివాళ్లు "మా పూర్వజన్మ కర్మ – మనకి ఏ

భగవంతుడు సాయం చేయలేదు. కర్మ పరిపక్వం కాలేదు'' అన్న తరతరాల హిందూ వేదాంతమనే దుప్పటి ముసుగులో దూరుతున్నారు. ఇప్పుడు నాకనిపిస్తూంది. నాకు ముప్ఫయ్యేళ్లు దాటుతున్నాయి. శీలరక్షణ కోసం, దేవికవచంలో దూరాను, కాని ఆ కవచం, నా జీవితాన్ని ఒక ఉక్కు చట్రంలో బిగింపచేయటం వనుకోలేదు. మా అన్నలు, చెల్లెళ్ళు పిల్లాపాపలతో హాయిగా వుంటూంటే నాకు ఈ బ్రహ్మచర్య జీవితం రోజురోజుకీ విసుగనిపిస్తోంది. ఎల్లా తప్పించుకోవటం నారాయణా!''

''ప్రజల మూఢ విశ్వాసాలమీద మీ జీవితాలని నడుపు కొంటున్నారా! దేముడు పూనకం అంటూ ప్రజలని వంచించటం పాపం కాదూ!'' అన్నాడు నారాయణ ఆశ్చర్యంగా వింటూ.

''పాపం, పుణ్యం ఎక్కడున్నాయి నారాయణా! మేము పేద బ్రాహ్మణులం. నిత్యదరిద్రంతో ఎన్ని గుమ్మాలు ఎక్కి దిగినా ఈ కరువు రోజుల్లో మా కడుపు నిండటంలేదు. ఎదిగిన ఆడపిల్లలం. మేము అందరికీ అనుభవనీయమైన వస్తువుల్లా కనపడుతున్నాం! అన్నయ్యలు స్మార్తం నేర్చుకున్నారు. తద్దినాలు వస్తేనే వాళ్ళు కడుపు నిండా తినేది! నిత్యం పొట్టలు నిండేదెల్లా అని చూసుకునే సంసారంలో మేము గృహిణులెల్లా అవుతాం! విలాస వస్తువులుగా మారటం ఇష్టంలేదు. భార్యగావుండే అర్హత సంపాయించలేము. కష్టసమయాల్లో భగవంతుడ్ని తలచుకుంటాము. ఆ భగవంతుని పేరుతోనే మేము జీవనాధారం సంపాదించుకున్నాము. భగవంతునియందు భక్తి వున్న వాళ్ళు ఇస్తున్నారు. లేనివాళ్ళ లేదు. మేము ఎవర్ని పీడించటం లేదు! బాధ్యతగల ఉద్యోగాలుచేసి లంచాలు పట్టటంకన్నా, నీతిమాలి శరీరాలు అమ్ముకోవటం కన్నా ఇది నయం కాదూ! దేముని పేరుతో అవినీతి పాలబడకుండా ఒక పేద కుటుంబం తన కాళ్ళమీద తాను నిలబడింది. ఇది పాపమా!'' అంది సావిత్రి.

''నిజమే సావిత్రీ. ఇది పాపం అన్పించటం లేదు. నువ్వు చెప్పిందంతా వింటే మీకూ ఆ సమయంలో ఇంతకంటే వేరు గత్యంతరం తోచి వుండదు.'' బాగా ఆలోచించినమీదట అన్నాడు 'మేము శ్రమకుపనికిరాము.' తల్లి తండ్రులు ఆర్జించి పోసిన మడిమాన్యాలు లేవు. ఈ కాలం చదువులు రావు! ఇప్పుడిప్పుడు చాలా మటుకు పౌరోహిత్యాలు కూడా తగ్గి పోయేయి! దేవి దయవల్ల మా కుటుంబం ఇప్పుడు ఏ లోటూ లేకుండా జరిగి పోతోంది. కానీ...

"కానీ!"

"నాకు ఈ దేవి పదవిమీద మోజులేదు. నాకు సంసారి నవ్వాలనీ, అక్కల్లా చెల్లెళ్ళా నేనూ సంసార జీవితం అనుభవించాలనీ వుంది నారాయణా! చిన్నప్పుడు అస్తమానూ మీ అమ్మతో నన్ను పెళ్ళాడుతాను అనే వాడివి. ఇప్పుడు నేను నీతో వచ్చేస్తాను. మీరు వుండేది చాలాదూరం! అక్కడ నన్ను ఎవరు గుర్తుపడతారు! నన్ను నీతో తీసుకెళ్ళ నారాయణా!" అంది దీనంగా సావిత్రి ముఖుందించుకుని. నారాయణ మనస్సు ద్రవించింది. పదహారేళ్ళక్రితం సావిత్రి ఈ కోరిక కోరింది. అప్పుడు తను సాహసించ లేక పోయేడు. తిరిగి ఈనాడు అదే కోరిక కోరుతోంది. ఇన్నేళ్ళయినా ఈ అమ్మాయికి తనతోనే వచ్చేయాలనే కోరిక ఎందుకు కలుగుతోంది! ఇన్నాళ్ళ జీవితంలో ఆమెకి ఆ కోరిక కోరదగ్గ పురుషుడే తటస్థపడలేదా! లేక చిన్నప్పట్నించీ ఆ పిల్లకి తన యందే ఆ భావం మొలకెత్తి దృఢపడిందా! ప్రేమంటే ఇదేనా!" నారాయణ శరీరం జలదరించింది.

"సావిత్రీ!" కన్నీటితో అన్నాడు నారాయణ.

"ఒకరోజు నన్ను ఇదే కోరిక కోరావు. అప్పుడు అమ్మ అనారోగ్యంతో అస్థిమిత మనస్సుతో నీ కోరికని అంగీకరించలేక పోయేను. నువ్వు ఇప్పుడు అన్నిటా నాకంటె చాలా ఎత్తులో వున్నావు. నీ మనస్సులోని ప్రేమే నీకి దేవీ పీఠం సమర్పించింది. ఉన్నత శిఖరంనుంచి నీచమయిన పంకిలంలోకి జారకు! చూస్తూ చూస్తూ, నీవంటి ఉన్నత వంశీకురాలిని శీలవంతురాలిని భ్రష్టురాలిని చేయలేను. నిజంగా నీవు నాకంటికి దేవీమూర్తిలానే కన్పించుతున్నావు! నీకంటె తక్కువ కులంవాడ్ని. పదహారేళ్ళనించీ సంసార జీవితం అనుభవించినవాడ్ని! నేను నిన్ను తీసుకువెళ్ళి నీకు మావంటివాళ్ళ ఇంట్లో ఎల్లాంటి స్థానం ఈయ గలను! వద్దు సావిత్రీ! వద్దు!" చప్పున చేతులు జోడించి లేచాడు.

"నారాయణా! ఇంత సంసారబంధం మీద చాపల్యాన్ని పెంచుకున్నాక, ఇంక నేను దేవిని కాలేనేమో నారాయణా! నేను దేవినికాను. కాలేను" అంది కన్నీళ్ళతో.

"నీ ప్రేమనీ, దయనీ, వేలాదిమంది భక్తులకి పంచి ఇస్తున్నావు. నీ యొక్క త్యాగంవల్ల మీ ఇంట్లో నాలుగు సంసారాలు చల్లగా సాగుతున్నాయి.

వాళ్ళ తృప్తిలోనే నీ జీవితశాంతి వుంది, మోహాగ్ని శాశ్వతం కాదు. జీవితానికి స్థిరత్వం ఇచ్చేది ప్రశాంత ఏకాగ్రత మాత్రమే! సావిత్రీ! నువ్వు ఈ రోజు కాకపోయినా, వక రోజుకి తెలుసుకుంటావు!'' అన్నాడు నారాయణ. సావిత్రి అరచేతుల్ని కళ్ళ కద్దుకున్నాడు భక్తిగా! నారాయణ భక్తికి సావిత్రి గొంతు మూగదై పోయింది. సావిత్రి మాట్లాడకుండా లేచి, తెల్లని చీరచెంగు తల మీటూ కప్పుకుని పొడవాటి దేకుచెట్ల నీడల్లోకి వడివడిగా నడిచి వెళ్ళిపోయింది.

# చేతులు కాలాయి

శ్రీమతి 'అరవింద'

శాంత కూరలు తరుగుతోంది.

"మీ నాన్న వస్తున్నాడుట. ఉత్తరం రాశాడు" అన్నాడు మూర్తి అక్కడికి వచ్చి. శాంత ఏమీ అనలేదు. విన్నట్లుగా ఒకసారి తలఎత్తి మళ్ళీ దించుకుంది.

"సంగతీ సందర్భం రాయకుండా వస్తున్నానని మాత్రం రాశాడు!" విసుక్కుంటున్నట్లుగా అన్నాడు మూర్తి, శాంత భర్త.

"ఎందుకు రావటం? ఏమైనా ఆస్థి మూట గట్టుకు వస్తున్నాడా? అంత అదృష్టం ఉంటే బాగానే ఉండేది. రావటం, చూడటం, పోవటం అంతేమిగిలింది." అంది అత్తగారు.

తల వొంచుకుంది శాంత. అవి రోజూ వినేమాటలే. ఐనా పాడు మనసు దేనితో చేశాడో భగవంతుడు. పూర్తిగా విరిగిపోదు, రాయీ ఐపోదు. వయసు ముదిరిన ఆవిడ నోటికి హద్దు ఉండదు.

"బిడ్డలంటే ప్రేమలేకపోతే కనటమెందుకు? కామాంధకారం కాకపోతే? ఒక్కగా నొక్క ఆడపిల్ల! శని వదిలించుకున్నట్లు కట్నం డబ్బులు పారేసి అత్తవారింట్లో దిగబెట్టాడు. పోనీ లేనివాడాఅంటే వేలకివేలు సంపాదిస్తున్నాడు. ఆస్థిఉంది. ఐతేనేం, మనకి అదృష్టం ఉండద్దూ. నీ మొహానికి సుఖపడే గీత లేదు. ఆయనకి నీ మొహం చూస్తే పెట్టబుద్ధికాదు..." అట్లాగ సాగుతుంది ఆవిడ వాక్ప్రవాహం. ఆవిడ మాటలువింటూ పమిటకొంగు నోట్లో కుక్కుకునేది శాంత. మొదటినుంచి ఒకేరకంగా ఉంటే ఈబాధ ఉండేదికాదు. పూల ఉయ్యాలలో కూర్చోబెట్టి ఊపుతూ క్రిందికి తోసేసి నట్లుయింది తనపని.

ఆరు సంవత్సరాల క్రిందట!

ఆరువేలు కట్నమిచ్చి శాంతకి పెళ్ళిచేశాడు తండ్రి. అతడికి శాంత ఒకతే కూతురు. భార్య పోయాక మళ్ళీ పెళ్ళి చేసుకోలేదతడు. అతడికి బోలెడు ఆస్థి ఉండటమేగాక ఉద్యోగంతో బాగా సంపాదిస్తున్నాడు.

మూర్తి చదువుకుని ఉద్యోగం చేస్తున్నాడు. కొంచెం ఆస్థికూడా ఉంది. ఒక్కడే కొడుకు. బంధుత్వంకూడా ఉంది. అది మంచిసంబంధమే. అందమూ, చురుకుతనమూ, వినయమూ సమపాళ్ళలో ఉన్న శాంతని చాలా ప్రేమగా చూసుకునేవాడుమూర్తి. అత్తగారు పని చెయ్యనిచ్చేదికాదు. ఇరుగు పొరుగుతో

'మహాలక్ష్మి' అని చెప్పుకునేది. పెళ్ళయిన మూడునెలలకి శాంతకి నెల తప్పింది. పట్టుచీర, బంగారుగాజులు పెట్టి ఘనంగా సూడిదలు జరిపించిందావిడ.

"శాంకిత కొడుకు పుడితే దత్తత చేసుకుంటాను" అన్నాడు తండ్రి అప్పుడు. అతడికి ఏభై వేలు చేసే ఇల్లు, పాతిక ఎకరాలపొలం. అతడిసంపాదన నిలువలు కలిపి మొత్తం మూడులక్షల పైబడిన ఆస్తిఉంది. ఆ ఆస్తిచూసుకునే మూర్తి, ఆతడితల్లి కట్నానికి బేరమాడలేదు. శాంతకి రావలసిన ఆస్తి మనవడికి ఇచ్చినా ఒకటే అనుకుంది అత్తగారు. మూర్తికికూడా రాబోయే ఆస్తిని గురించి ఆశయాలూ, అభిప్రాయాలూ ఏర్పడ్డాయి.

ఇప్పుడు తమది చిన్నడాబా ఇల్లు. ఏభైవేలైనా ఖర్చుపెట్టి ఆధునిక సదుపాయాలతో, అన్ని హంగులతో ఒక పెద్దఇల్లు కట్టించాలి. ఒక కారు కూడా కొనాలి. ఏదైన బిజినెస్ చెయ్యాలి. లేదా డబ్బును వడ్డీలకి తిప్పచ్చు. డబ్బును వాడుకోవటం తెలియాలిగానీ అది పిల్లల్ని పెడుతుంది. రెట్లురెట్లుగా పెరిగిపోతుంది. తనూ శాంతా పిల్లలూ దర్జాగా ఉండాలి. అన్నిసుఖాలూ అనుభవించాలి. డబ్బు అనుభవించటానికి కాకపోతే ఎందుకు? అతడు భార్య ఆస్తికోసం ఎదురు చూస్తున్నాడు.

శాంతకి నెలలు నిండి ఆడపిల్ల పుట్టింది. అత్తగారు ఆ అసంతృప్తిలో నుంచి తేరుకోకముందే, ఆరు నెలలైనా గడవకుండానే శాంత తండ్రి ఎవరూ ఊహించని పని ఒకటి చేసి ఆవిడనీ, మూర్తినీ నిర్ఘాంత పరిచాడు. ఆయన మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. పరిస్థితులు మారటం అప్పటినుంచే మొదలైంది. "ఇప్పుడు మీ నాన్నకి పెళ్ళికావలసి వచ్చింది. ఓ కొడుకుని కనలేకపోయావు. ఇప్పుడు ఆయనే కంటాడు వో కొడుకుని. ఇంక నీకు ఆస్తి ఎక్కడ దక్కుతుంది? నీ మొహానికి ఏడుపే గతి. మాకు ఆకట్నం డబ్బులే ప్రాప్తం. తొందరేమిటిలే అనుకున్నాం. ఆయనే తొందర పడ్డాడు. ఇంక నీకు మొగ పిల్లలే పుట్టరా" అంది అత్తగారు.

ఆవిడ అన్నట్లుగానే తండ్రికి పెళ్ళిచేసుకున్న ఏడాదికే కొడుకుపుట్టాడు. కాన్పుకష్టమయి ఆపరేషనుతో గండం గడిచింది భార్యకి. రెండవసారి శాంతకి కూడా కొడుకు పుట్టాడు

"వీడు అప్పుడే పుట్టిఉంటే అత్తగారిపోరు, ఆయన అసంతృప్తి తప్పి ఉండేవి నాకు. దేవుడెందుకో నాకు ఇట్లాగ అన్యాయం చేశాడు," అనుకుంది శాంత." ఐనా తండ్రి చేసినపనిలో తప్పు కనిపించలేదు

"అమ్మ పోగానే పెళ్ళిచేసుకోలేదు. ఇన్నాళ్ళూ ఏమీ సుఖపడలేదు నాన్న. ఆడపిల్లని, నేను ఇంకోఇంటికి వెళ్ళేదాన్ని. వంశం నిలిపేవాడూ, ఉద్ధరించే వాడూ కొడుకు. ఎవరికైనా తన సంసారం అంటూ ఉండాలని, సుఖపడాలనీ ఉంటుంది. ఇప్పటికైనా నాన్న సుఖపడటం సంతోషించ వలసిన సంగతి!" అనుకుని మనసులోనే తృప్తి పడింది.

ఆ తృప్తిలో కొంత వరకూ తనబాధ మరిచిపోయింది. తరవాత అత్తగారూ భర్త ఆలోచించుకుని తల్లినగలు, ఆస్తి అడగమని పుట్టింటికి పంపించారు. ఆ పదిరోజులూ పిన్నితనని బాగానేచూసింది. కానీ నగలు అడిగితే తండ్రికి బదులు పిన్నే జవాబిచ్చింది.

"ఈ ఇంటి నగలు బయటికి పోవటం ఎందుకు? వాటి బదులు మీనాన్న నీకు పొలం రాసిస్తారులే. ఐనా దానికి మాత్రం ఇప్పుడు తొందరేమిటి?" అంది. పిన్ని పెట్టిన కొత్తచీర పుచ్చుకుని తిరిగి వచ్చింది శాంత.

అత్తగారు సాధించటమేగాక ఇంటి పనంతా అప్పగించింది. అంతగా ప్రేమించిన భర్తకూడా "తెలివి తక్కువదానివి, దరిద్రపుమొహం" అనడానికి వెనుకాడలేదు. మూడులక్షలు రావలసినచోట పాతికవేలు మాత్రమే దక్కాయి. అదీ ఎప్పుడో! అతడిలోని అసంతృప్తిని శాంతపట్ల అతడికి గల ఆకర్షణా అనురాగం జయించలేక పోయాయి. శాంత మీద అతడికిగల ప్రేమ క్రమంగా తరిగిపోతోంది. అసంతృప్తి పెరిగిపోతోంది. అది అతడి సుఖంలో గోతిని తవ్వుతోంది. ఆ గొయ్యి అగాధంగా ఎదిగిపోతోంది.

"ఇంకొకరి ఆస్తిని అనుభవించాలని వీళ్ళకంత ఆశ! తనదితాను అనుభవించాలని నాన్నకి ఉండదా? వీళ్ళు మాత్రం అంతలేనివాళ్ళు కాదుకదా. ఉన్నదానితో ఎందుకు తృప్తిపడరు!" అనుకుని బాధపడేదిశాంత. ఆశలూ. కోరికలూ మనసులోనే అణిగిపోయాయి. నిర్లిప్తంగా ఉండటానికి ప్రయత్నించేది. యాంత్రికంగా పనులు చేసేది. మూర్తి భార్య అవసరాలు కనుక్కోవటం మానేశాడు. బుద్ధిపుట్టి ఒకచీర తెచ్చినప్పుడు కూడా "ఎప్పుడూ మాసిన చీర, చినిగిన జాకెట్టు తోటే ఉంటావు. శుభ్రంగా అందంగా ఉండటం చేతకాదు. దానికి ఏడుపుమొహం తోడు!" అనేవాడు.

"ఎంత చేసినా నీకు తృప్తిలేదు" అనేవాడు.

దగ్గరకు తీసుకున్నప్పుడు కూడా "ఉట్టిమొద్దు. ఒకమాటా, నవ్వూలేదు. సుఖపడే యోగంలేదు." అనేవాడు. శాంత అతడి చేతుల్లో బిగుసుకు పోయేది. చీకట్లోకూర్చుని ఏడవటం తప్ప ఏమనాలో ఏంచెయ్యాలో తెలిసేది కాదు. అప్పుడప్పుడు తండ్రి మీద కూడా కోపం వచ్చేది.

"ఔను, పీళ్ళనేది న్యాయమే. కూతురి కేమీ ఇవ్వకపోవటం అన్యాయమే. కూతురినన్న సంగితే మరిచిపోయారునాన్న. వీళ్ళునన్నుబాధ పెడుతున్నారని నేనిక్కడ కష్టపడుతున్నానని నాన్నకి తెలుసు. ఐనా ఊరుకున్నారు" అనుకుని ఏడిచేది.

తండ్రి అప్పుడప్పుడు వచ్చిచూసి వెడుతుండేవాడు. కూతురిలో వస్తున్న మార్పును అతడు గ్రహించాడు. శాంత చిక్కిపోతోంది. కళ్ళగుంటలు పడ్డాయి. దవడలు పీక్కుపోయాయి. మొహంలో కళా కాంతులు లేవు.

"ఒంట్లో బాగుండటంలేదా? అట్లాగున్నావు!" అనడిగాడు ఒకసారి. అది విన్న అత్తగారు "ఒంట్లోబాగుండక పోతే మాత్రం తినికూర్చుంటే జరుగుతుందా? మాకంతంత ఆస్తులులేవు. కట్నం పారేసి మీబాధ్యత వదిలించుకున్నారు. ఆస్తి వస్తుందని కదా ఇచ్చిన కట్నం పుచ్చుకుని ఊరుకున్నాం రామయ్యగారి పిల్లకి పదివేలు కట్నమిస్తామని వచ్చారు. ఇంతహీనంగా పిల్లని వదిలేస్తారని తెలిస్తే అసలు చేసుకోకనే పోదుము" అంది.

ఆసారి అతడు ఇంటికి వెళ్ళగానే "శాంతకి ఏమైనా ఇవ్వాలి. పొలం రాసిస్తాను" అన్నాడు.

జానకి మృదువుగా నవ్వింది.

"మీకు ఇవ్వాలనిపిస్తే బట్టలు పెట్టండి. కొంతడబ్బు చేతిలో పెట్టండి. అంతే కానీ ఆస్థిరాసుకుంటారుటండీ. మనకి మగపిల్లవాడుండగా అవేం మాటలూ" అంది.

ఇంకొకసారి అతడు మళ్ళీ ప్రయత్నిస్తే. "మీకు నేను సుఖంగా ఉండాలని లేదా? నన్నెందు కిట్లాగ బాధ పెడతారూ? మీరు మళ్ళీ పెళ్ళెందుకు చేసుకున్నారూ?" అంటూ ఏడిచింది.

తను మళ్ళీ పెళ్ళి చేసుకోవటంలో తప్పేమిటో అతడికి తెలియలేదు. ఆ వాదన అర్థంకాలేదు. ఒక నిట్టూర్పువిడిచాడు. మనసులో మగ్గిపోతూ కూతుర్ని చూడటానికి వెళ్ళటం మానేశాడు.

పిన్ని సంగతి తెలిసిన శాంత అర్థం చేసుకుంది.

తనలాగే తండ్రి కూడా నిస్సహాయుడు.

''ఇప్పుడెందుకు వస్తున్నారు నాన్న! పిన్నిని ఒప్పించారేమో! కాస్త ఇస్తే వీళ్ళఆశ తీరుతుందా? సగం ఆస్తికావాలి.'' నిట్టూర్చింది.

వంట మొదలుపెట్టింది. కూరచేస్తుంటే అత్తగారు దగ్గిరికి వచ్చింది.

''రెండవకూర ఎందుకూ?'' అంది.

''మానాన్న వేపుడు తినరు.'' అంది శాంత.

''ఇంతోటి నాన్న... మర్యాదలే తక్కువయ్యాయి.'' సణిగిందావిడ. మావగారు వస్తారని మూర్తి ఇంట్లోనే ఉన్నాడు. తండ్రి రిక్షాదిగి లోపలికి వస్తుంటే గుమ్మంలోపలే నిలబడి పోయింది శాంత. చూపులు ఆత్రుతని అరి కట్టలేక పోతున్నాయి. కల్లోలంగా ఉంది మనసు. ఎందుకు వచ్చారో అని మధనంగాఉంది. సంతోషంగా ఎదురుగా వెళ్ళలేదు. గడపలోపలే ఉండి చూస్తోంది.

అతడి గడ్డం పెరిగి ఉంది. పంచె లాల్చీమాసి, సంస్కారహీనంగా ఉంది రూపు. ముఖం బాగా పీక్కుపోయి ఉంది జబ్బుపడిన వాడిలాగ.

''నాన్న ఇట్లాగయిపోయారేమిటి? నాన్నకేదో అయింది!'' కీడుని శంకించింది మనసు. గుండె వేగంగా కొట్టుకుంది. కంట్లోనీళ్ళు తిరిగాయి. చాలా సామాను ఉండటం చూసి తల్లీకొడుకులు ముఖాలు చూసుకున్నారు.

''అంతా క్షేమమా?'' కళావిహీనంగా నవ్వుతూ అడిగారాయన.

ఆయనకి కుర్చీవేసి తనూ ఒక కుర్చీలో కూర్చుంటూ. ''ఆ మీదయ వలనఅంతాబాగానే ఉన్నాం. మీరు ఇట్లాగ రావటం... ఏదో విశేషం ఉందనే అనుకుంటున్నాం.'' అన్నాడు మూర్తి

ఆయన కొంచెంసేపు మౌనంగా ఉన్నారు. తర్వాత అన్నారు:

''ఔను, నేను హిమాలయాలలో...శివానందాశ్రమానికి వెడుతున్నాను. జీవితాంతం అక్కడ ఉండటానికి ఏర్పాటు చేసుకున్నాను. వెళ్ళేముందర శాంతని ఒకసారి చూద్దామని...''

మూర్తికి అతడి తల్లికి ఒక క్షణం నోటంట మాట రాలేదు.

''అంత ఆస్తి, సంపాదన, ఇల్లూ ఇల్లాలు, వంశోద్ధారకుడూ అందరూ ఉన్నారు. ఆశ్రమానికి పోతానంటున్నాడు. ఈయనకి పిచ్చి ఎక్కలేదుకదా!

ఆ పెళ్ళాం ఆస్తి రాయించుకుని వెళ్ళగొట్టిందేమో! లేచి పోయిందో! రెండవ భార్య అంతకంటె ఎక్కువగా చేస్తుందేమిటి? అయితే మంచి శాస్తి జరిగింది'' అనుకుని తన ఆలోచనలనుంచి తేరుకుని. "అదేమిటన్నయ్యగారూ! నిక్షేపంలాటి సంసారం వదులుకుని ఎక్కడికో పోతున్నానంటున్నారు!'' అంది విచారంగా.

మళ్ళీ ఆయన ఒక నిముషం మౌనంగా ఉండి పోయారు. తరవాత "సంసారం! ఇంక లేదు. హరి జబ్బు చేసిపోయాడు. డబ్బూ డాక్టర్లూ వాడిని బతికించ లేకపోయారు. అసలే అనారోగ్యంగా ఉన్న జానకి ఆ బెంగతో నెల తిరక్కుండా పోయింది. ఇంకేమి మిగిలింది? ఇంక నేనేం చెయ్యాలి? ఈజన్మకి ఈజీవితంచాలు. ఇంక ఏబంధాలూ వద్దు. శాంతని ఒకసారి చూస్తే చాలు.'' అన్నాడు.

అంతలో అతడి పెదవుల మీదికి ఒక వింతనవ్వు వచ్చింది.

"ఇల్లూ, పొలమూ, నగలూ, నలభై వేల కాషూ అన్నీ దాని పేరనే, శాంత పేరునే రాశాను. అవన్నీ దానికి ఇచ్చివెళ్ళిపోతాను.'' అన్నాడు మూర్తినీ ఆవిడనీ చూస్తూ.

"ఇప్పుడు మీకు తృప్తిగా ఉందా?" అని ప్రశ్నిస్తున్నట్లుందా చూపు.

లోపలి నుంచి వస్తున్న సంతోషాన్ని ఆపుకోలేక పోతోందావిడ.

"మీకెంత కష్టం వచ్చింది! డబ్బుదేం ఉంది. ఇవేళ కాకపోతే రేపిస్తారు. కన్నకూతురికి ఇచ్చుకోమని ఒకరు చెప్పాలా?'' అని లోపలికి అరుగేసి "మీనాన్నవస్తే పలకరించవేమేశాంతా? వెళ్ళిమంచినీళ్ళిచ్చిరా. భోజనానికి ఆలస్యమవుతోంది." అంది.

ఆవిడ పాలు పొయ్యి మీదపెట్టి సేమ్యా తీస్తుంటే చూసి నీళ్ళు తీసుకు వెళ్ళి తండ్రి కిచ్చింది. ఇస్తుంటే చెయ్యి గజగజా వణికింది. కళ్ళలోనించి నీళ్ళురాలాయి. మనసుబాధతో నిండి పోగా 'నాన్నా' అనేమాట కూడా గొంతు పెగిలి బయటికిరాలేదు. తనమీద వాలి పోతున్న కూతురి తలనిమిరాడు.

"నీకేంభయం లేదుతల్లీ. ఇంక నీకాపరం చక్కబడుతుంది. నీకు సుఖపడే రోజు లొచ్చాయి. నీభర్త, అత్తగారు ఇంక నిన్నేం అనలేరు.'' అని అభయ మిస్తున్నట్లుగా ఉందాస్పర్శ. చప్పునలోపలికి వెళ్ళిపోయింది శాంత. అక్కడే ఉన్నాడు మూర్తి.

"ఛ. తొందరపడ్డాను అనవసరంగా శాంతని బాధపెట్టాను. ఆయన ఎప్పటికైనా ఇచ్చి ఉండేవాడు ఆస్తి. ఈ డబ్బుగొడవ మనసులో పెట్టుకుని శాంతని కష్టపెట్టాను. నేనూ సుఖపడలేదు. ఇప్పుడైనా శాంతని సంతోషపెట్టాలి!" అనుకున్నాడు. అతడిలో పశ్చాత్తాపం కలగటం మొదలు పెట్టింది.

వంటింట్లోకి వెళ్ళింది శాంత. పాయసం తయారైంది. అప్పుడే అన్నీ వడ్డించేసింది అత్తగారు.

"భోజనానికి రమ్మను. ఇప్పటికే అలశ్యమయింది" అందావిడ.

శాంత అక్కడే నిలబడిపోయి అత్తగారిని చూస్తోంది. ఇన్నేళ్ళనుంచి తెలిసిన వ్యక్తి, ఐనా ఆవిడని చూస్తుంటే విభ్రాంతిగా ఉంది.

"నాన్న ఎంత బాధలోఉన్నారు! భార్యా కొడుకూ, పోయారు వెంట వెంటనే. వీళ్ల పాషాణసములనే నాన్న ఉత్తరం కూడా రాయలేదు. ఎంత వ్యధచెందితే, విరక్తి కలిగితే నాన్న వెళ్ళిపోతున్నారు! పిండి వంటలతో మర్యాద చేస్తోంది ఇప్పుడు. ఎంతలో ఎంత మార్పు మనిషిలో! నాటకం!"

శాంతలో కోపం, కసి, అసహ్యం రగులు కుంటున్నాయి. అక్కడినుంచి కదలలేదు. మూర్తివెళ్ళి మావగారిని పిలుచుకువచ్చాడు. భోజనానికి కూర్చు న్నారు. ఆవిడ తన విచారం వెళ్ళబోసింది.

"మీరు శాంతని, మనవళ్ళనీ చూసుకుంటూ ఇక్కడే ఉండిపొండి. ఆ సన్యాసుల్లో కలసి కష్టపడటమెందుకూ? ఇక్కడ మీకేం తక్కువకాదు. మహా రాజులా జరిగిపోతుంది." అంది.

మూర్తికూడా అదేమాట అన్నాడు. ఉండిపొమ్మన్నాడు.

శాంత తండ్రి నవ్వి ఊరుకున్నాడు. అది జరిగేపని కాదన్నట్టు.

శాంత, అత్తగారు భోజనానికి కూర్చున్నారు.

"ఇంకొంచెం పాయసం వేసుకో. ఈ మధ్య మరీ చిక్కిపోతున్నావు. తిండి సమంగా తినవుకదా. నేను పెద్దదాన్నయి పోతున్నాను. ఇంటినీ, పిల్లల్నీ చూసుకోవలసినదానివి ఇట్లాగ ఈసురోమంటూ ఉంటే ఎట్లాగ?" అంది అత్తగారు.

"నా తిండి సంగతి కనుక్కుంటోంది ఇప్పుడు! సంసారంలో కిటుకులు బోధిస్తోంది. ఎక్కడనుంచి వచ్చిందీ ప్రేమ! పిల్లలు పెరుగు అడిగితే మీతాత తోలిన ఆవులు లేవనేది. నాన్న ఎంతబాధ భరిస్తున్నారో అన్న ఆలోచనే లేదు

మనుషులకి. ఆస్తివచ్చిందని మురిసిపోతున్నారు. నాటకం ఆడుతున్నారు...''
అనుకుంది శాంత. భోజనం చేస్తున్నంతసేపూ శాంత బాధపడుతూనే ఉంది.

భోజనం చేశాక ఒకగంట పడుకుని లేచాడుతండ్రి. పెట్టెతెరిచి ఒక నగలపెట్టి, దస్తావేజులూ బయటికి తీశాడు. మూర్తిని పిలిచి ''రైలు వేళవుతోంది, ఒక రిషాని పిలిపించు'' అన్నాడు. రోడ్డు మీద పోయే రిషాని ఆపించి లోపలికి వచ్చాడు మూర్తి.

''శాంతని రమ్మను. ఇవి అప్పగిస్తే నాబాధ్యత, ఇహ లోక సంబంధాలన్నీ తీరిపోతాయి. శాంత జాగ్రత్త. అంతకంటె నేనేమీ చెప్పలేను బాబూ'' అన్నారాయన.

మూర్తి శాంతని పిలుచుకు వచ్చాడు. తండ్రి శాంత చేతుల్లో నగలపెట్టె దస్తావేజులు ఉంచాడు.

''నేనివ్వగలిగింది ఇంతే తల్లీ. ఇంక నాకు అన్నింటితో, అందరితో ఋణం తీరింది. మీరంతా సుఖంగా ఉండండి'' అన్నాడు ఆశీర్వదిస్తున్నట్లు.

గిరుక్కున తిరిగి వెళ్ళి రిషాఎక్కి కూర్చున్నాడు.

శాంత ప్రతిమలా హాలుమధ్య నిలబడి పోయింది. రిషా కను మరుగయ్యేదాకా చూసి మూర్తి, ముసలావిడ, పిల్లలూ లోపలికి వచ్చారు.

స్టేషన్‌కి వస్తానంటే మూర్తిని వద్దని వారించారాయన. నేను సన్యాసిని అన్నారు.

మూర్తి లోపలికి వచ్చేటప్పటికి శాంత ఇందాక నిలబడినచోట కూర్చుని ఉంది. ఒడిలోనగలపెట్టె, దస్తావేజులూ ఉన్నాయి. అతడు శాంత మొహంలోకి చూశాడు. శాంత తన మొహంలోకి బెదురు లేకుండా చూడటం కొత్తగా ఉంది అతడికి. చిన్నగా నవ్వి ''ఆకస్మిక ధనలాభం'' అన్నాడు. శాంత కూడా నవ్వింది.

అట్లాగ బాధలేకుండా, భయంలేకుండా ఎప్పుడూ నవ్వలేదు శాంత.

తండ్రి తన చేతికి అన్నీ ఇచ్చిపోయాడు. మూడు లక్షల ఆస్తి!

సుడిగుండంలో పడిన మనిషిలా ఆమె మనసు అలవికాకుండా గిరగిరా తిరిగిపోతోంది. గిలగిలా కొట్టుకుంటోంది... సాలెగూడులో చిక్కిన పురుగులా భయంతో విదిలించు కుంటోంది.

''ఈ లోకం మీదా బ్రతుకు మీదా విరక్తితో నాన్న వెళ్ళిపోయారు. ఆస్తి వచ్చిందని మీరు సంతోషిస్తున్నారు. ఎట్లాగ వచ్చిందా ఆస్తి! భార్యా

కొడుకూ పోయి నాన్న బాధతో, విరక్తితో మగ్గుతుంటే వచ్చిందా ఆస్థి! ఇన్నాళ్ళూ నన్ను ఏడిపించారు మీరు. ఇప్పుడు మిమ్మల్ని ఆడిస్తాను నేను."

పళ్ళబిగుసు కుంటున్నాయి కసితో, అసహ్యం నిండిపోతోంది మనసులో.

"ఛీ. డబ్బుపాపిష్టిది. నాన్న సుఖాన్ని మింగేసి వచ్చిన డబ్బు నాకు వద్దు. వాళ్ళ మొహాన్నేపారేస్తాను. ఇన్నాళ్లూ ఆస్థి ఆస్థి అని గిలగిల్లాడారు. వాళ్ళ ఇష్టం వచ్చినట్లు చేసుకోనీ. ఉట్టిగట్టుకుని ఊరేగనీ!"

కసి, అసహ్యం. మరుక్షణంలో బాధా విరక్తి ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి శాంతని.

"ఆకస్మిక ధనలాభంటః కాదు. మీతపఃఫలం. నా పాప పరిహారం." నవ్వుకుంది శాంత. అంతలోనే పళ్లుగిట్టకరిచి. "ఇన్నాళ్ళూ దీనికోసమేకదూ నన్ను బాధ పెట్టారూ. నాకసి తీర్చుకోవటానికి ఇదే అవకాశం. అవకాశం వచ్చినప్పుడే వాడుకోవాలి. విడవకూడదు! ఇప్పుడు చూసుకోండి మీరు నాచేతిలో కీలు బొమ్మలు."

"ఛీ. పగ దుర్మార్గుల లక్షణం. ఇన్నాళ్ళూ నేను అనుభవించిన బాధ చాలు. వాళ్లు ఎట్లాగైనా మారనీ. నేను ఇట్లాగే ఉంటాను. ఆడబ్బూవద్దు...పగా వద్దు. సుఖాలూవద్దు. డబ్బురాకపోతే ఏడిచి, వస్తే గంతులువేసే నాటకం వాళ్ళనే ఆడనీ."......

"ఊహు. ఇది నాది. ఇవ్వను. ఎవరికీ ఇవ్వను...చంపేస్తారేమో. మరీ మంచిది."

భయం, బాధ, విరక్తి ఒకదానివెంట ఒకటి శాంతని ఊపేస్తున్నాయి. అత్తగారు శాంతకి దగ్గిరగా వచ్చి. "వంద తులాల బంగారం అన్నారు. ఏమేం నగలున్నాయీ?" అంది కుతూహలంగా.

పెదిమలు విడివడకుండా సన్నగా నవ్వుతూ పెట్టె తెరిచింది శాంత.

బంగారం, రాళ్లు, ముత్యాలతో చేసిన రకరకాల నగలు మెరిసిపోతున్నాయి. కాసులపేరు, ముత్యాలనెక్‌లెస్, గాజులు, రవ్వల వంకీలు, రాళ్ళగాజులు, వడ్డాణం, అడ్డిగ, పలకసరులు...

ముసలావిడ చూపులు చెదిరిపోతున్నాయ్ ఆ ధగధగలకి.

శాంత ఏడుపు ఆపి గలగలా నవ్వింది. తర్వాత కళ్లు పెద్దవిచేసి అతడిని చూస్తూ "నాన్నకోసం బాధెందుకు? ఆయన సుఖంగా ఉంటారు ఇంక. బాధలన్నీ దాటిపోయారు నా బాధంతా మీ కోసమే...పాపం ఎట్లా బ్రతుకుతారో అని. బ్రతకటం తెలీదు కదా అని. ఔను బాధెందుకూ, సంతోషించాలి. సంతోషంగా ఉండాలి. ఆస్తివచ్చింది కదూ. ఔను సంతోషంగా ఉండాలి. హి హి హి ఉంటాను. హి హి." శాంత నవ్వటం మొదలు పెట్టింది. కళ్ళలోంచి నీళ్లువస్తున్నాయి. నవ్వు ఏడుపుగానూ, ఏడుపు నవ్వుగానూ మారిపోతోంది. వికవికా పకపకా నవ్వుతోంది. వెక్కి-వెక్కి ఏడుస్తోంది. 'శాంతా' అనిపిలిస్తే పిచ్చి చూపులు చూస్తోంది. మూర్తి మతిపోయిన వాడిలాగ శాంతని చూస్తున్నాడు.

ఆస్తి దక్కిందని సంతోషిస్తుంటే ఇదేమిటి?

శాంత ఇట్లాగయిపోయింది! తను, పిల్లలూ పెద్ద అగాధంలో పడిపోయినట్లుగా ఉంది అతడికి. భవిష్యత్తు అంతా అంధకార మయంగా కనిపిస్తోంది అతడికి. భయంతో బాధతో గడ్డకట్టుకు పోతోంది అతడి గుండె!

# అందం

డాక్టర్. ఆనందారామం

కన్నీళ్ళలో ఒక విచిత్రమైన సంతృప్తి లభించే సన్నివేశాలు అసంభవం కాదు, కాని చాలా అరుదు! గుండెలు పగిలేలా వెక్కి వెక్కి ఏడుస్తోన్న నీరజ తన మనసులోని అల్లకల్లోలం మధ్య రేఖామాత్రంగా కురిసే అనిర్వచనీయమైన సంతృప్తిని గురించి తనను చూసుకొని తానే తెల్లబోయింది.

మనకు అత్యంత ఆత్మీయులైన వ్యక్తులు—వారి వియోగం మనమే మాత్రం భరించలేనంత ప్రేమాస్పదులు—ఏ విధంగానూ నయంకాని వ్యాధికి గురయి—అహోరాత్రులు బాధతో అలమటిస్తోంటే...చూసి సహించలేము. ఆ బాధను ఏ విధంగానూ తొలగించలేము. మన చేతులతో మనం విషమిచ్చి చంపలేము, సరికదా ఎన్ని రకాల మందులైనా వాడి ఎలా అయినా ఆ ప్రాణాలు నిలబెట్టాలనే ప్రయత్నిస్తాము. కానీ ఆ వ్యక్తులు మరణించినప్పుడు—దుర్భరమైన వేదన కలిగినా ఆవేదనలో అంతర్లీనమయి ఏదో రిలీఫ్ తోచక మానదు.

జరిగితే బాగుండు ననుకొంటున్నది, తన చేతులతో తను చెయ్యలేనిది... తీరా జరిగినప్పుడు ఏమాత్రం భరించ లేనిది—జరిగినపుడు ఎలా ఉంటుందో అలా ఉంది నీరజ మనసు...

ఆరోజు...ఎంతో అందంగా అలంకరించుకొని అద్దం ముందు నిలిచినపుడు...తనలో ఎక్కడో ఏదో లోపం తోచింది. ఆ అలంకరణలో ఏదో వెలితి కనిపించింది. ఆ వెలితి ఏమిటో ఆ లోపం ఎక్కడో మాత్రం అర్థం కాలేదు! ఎలా అర్థమవుతుంది? మొదటినుంచి అందరిలో అందగత్తెగా ప్రసిద్ధి పొందింది. దానికితోడు అలంకరణ సామాగ్రి అమరించుకోగలిగే స్థోమత ఉన్న కుటుంబం...పచ్చని శరీరం మీద ఎఱ్ఱని చిన్నా క్రేప్ చీర మెరిసిపోతోంది. పెట్టుకున్న ఎఱ్ఱ రాళ్ళ నెక్లెస్‌లో రాళ్ళు అటు చీర రంగుతో పోటీపడి మెరుస్తూ...ఇటు చెక్కిళ్ళ కాంతులముందు ఓడిపోతున్నాయి. ఉంగరాలు తిరిగిన ముంగురులు అందంగా చెదిరి పోతున్నాయి. పచ్చని ఫాల భాగంపైన ఎఱ్ఱని కుంకుమ ఎదుటివాళ్ళను సవాల్ చేస్తున్నట్టు మెరుస్తోంది. ఎఱ్ఱనిగాజులు—ఎఱ్ఱని చెప్పులు...ఎఱ్ఱరాళ్ళ దుద్దులు—మామూలుగా ఈ అలంకరణ ఎంతో బాగుంటుంది నీరజకు. ఆ సంగతి నీరజకూ తెలుసు. అందుకే ప్రత్యేకించి ఆరోజు ఎఱ్ఱసెట్ బయటకు తీసింది.

అయినా ఏమిటిది? నిలువుటద్దంలో ప్రతిఫలించే అందమైన ఆ రూపంలో కనిపించీ కనిపించని ఆలోప మెక్కడ?

ఆనాడు ఎంత ఆలోచించినా అర్థంకాలేదు! ఈనాడు విశ్వం వ్రాసిన ఉత్తరం చదువుతోంటే స్ఫురించింది, లోపం కాని ఆ లోపం...

కొన్ని కొన్ని ఇన్‌స్టింక్ట్స్ చాలా విచిత్రంగా ఉంటాయి. నిండా నీళ్ళు పాలో ఉన్న గ్లాసు చేతులోకి తీసుకోబోతున్నప్పుడు ఎందుకో, ఏమిటో క్రిందకు జారిపోతుందేమో అనిపిస్తుంది, ఒక్కొక్కసారి...అలాగే జారి పడుతుంది కూడా. అప్పుడు పొరపాటున పడిందన్న భావన కాక కావాలని జారవిడుచుకున్న లాంటి భావన కలుగుతుంది...ఇంకొంచెం ముందే హెచ్చరిక పడిఉంటే...మరి కాస్త జాగ్రత్తగా ఉంటే...జారిపడి ఉండేది కాదేమో నన్న ఊగులాట వదులుకోలేదు మనసు...

విశ్వం దగ్గరనుంచి అలాంటి ఉత్తరాన్ని ఏనాడూ ఆశించలేదు నీరజ. తీరా ఆ ఉత్తరం అందుకున్నాక...విభ్రాంతితో—విషాదంతో...తలమునక లయ్యాక...ఇలాంటిదేదో జరుగుతుందని తనకిదివరకే తోచినట్లనిపించింది... ఇంతకూ తనే కారణమో? ఇదంతా తను చే జేతులా చేసుకున్నదేనా?

యశోధరతో తను మాట్లాడిన మాటలు తనలోని అహంకారాన్ని చాటుతున్నాయా? ఆర్ద్రభావాన్ని చాటుతున్నాయా? అసలు యశోధర పట్ల తాను చూపినది అసూయా? సానుభూతా?

విశ్వం బూట్స్‌పాలిష్ చేస్తోన్న యశోధర అనుకోకుండా వచ్చిన నీరజను చూసి ఉలికి పడింది. ఏదో తప్పుడుపని చేస్తూ దొరికిపోయిన నిజాయితీ పరు రాలిలాముడుచుకు పోయింది.

యశోధర ఎంత తొట్రుపడిందో నీరజ అంత తెల్లబోయింది.

"విశ్వం బూట్స్ నువ్వు పాలిష్ చెయ్యటం దేనికి? ఫ్యూన్ లేడూ?" అంది.

యశోధర మాట్లాడలేదు. ఆ బూట్లవంకా బ్రష్‌వంకా చూస్తూ అలాగే కూచుంది.

యశోధర దీనమైన ముఖం చూసే సరికి నీరజలో ఏదో అభిమానం పొంగుకొచ్చింది..."నువ్విలాంటి పనులు ఎందుకు చెయ్యాలి యశో! ఎవరో పరాయి దానిలా ఉండొద్దని ఎన్ని సార్లు చెప్పాను నీకు! నువ్వు నాలా ఈ

ఇంట్లో పిల్లవి! లేనిపోని భావాలు పెట్టుకోకు! ఆ బూట్లు అలా పడెయ్యి, నేను పాలిష్ చేయిస్తాను.''

నలుపులో కలిసే కాంతికాని చామనచాయరంగు ముఖంలో దిగుళ్ళ కారణంగా కళ పోగొట్టుకున్న కళ్ళలో నీళ్ళు నిండాయి యశోధరకు...

''పాలిష్ చేసేవాళ్ళు లేరనికాదు—ఇదొక పని అనుకొని నేను చెయ్యటం లేదు...చెయ్యాలని అనిపించి...అలా చెయ్యటంలో నాకేదో ఆనందం కలగబట్టి...''

అదిరిపడింది నీరజ...విస్తుపోయి చూసింది యశోధరను...స్పష్టంగా చెప్పకపోయినా నీరజ విశ్వాన్ని—పెళ్ళిచేసుకోబోతున్నట్లు అందరికీ తెలుసు. యశోధరకూ తెలుసు—అలాంటిది...నీరజ భావాలు చదివినట్లు గబగబ సమాధానంచెప్పింది...''నేను నీతో అబద్ధాలాడలేను నీరజా! నేనంటే నీకెంత అభిమానమో నాకు తెలుసు! నువ్వు లేక పోతే నేనేమయిపోయే దానినే! అందుకే నీతో అబద్ధాలాడలేను...అయినా అబద్ధమాడవలసిన అవసరమేముంది? నేను ఏ విధంగానూ నీకు అడ్డురాను! అదికాదు. రావాలనుకున్నా రాలేను—ఎవరికీ తెలియకుండా ఈ మూలగదిలో నేనే బూట్లు పాలిష్ చేసుకుంటే ఎవరికి నష్టం?''

అప్పటి కప్పుడు యశోధర చేతిలోంచి ఆ బూట్లు లాగేసుకోవాలని పించింది నీరజకు. ఆపని చెయ్యలేకపోయింది. ఆ పనే కాదు–యశోధరముఖం చూస్తూ యశోధరకు కష్టం కలిగించే ఏ పనీ చెయ్యలేదు. విధి విలయతాండవం చేసి ముక్కలు ముక్కలు చేసిన ఆ గుండెమీద మరొకదెబ్బ. ఎంత చిన్న దయినా సరే–కొట్టగలిగే కరుకుతనం తనకులేదు.

అక్కడినుంచి వెళ్ళిపోయింది. మనసులో ఏదో బరువు...మనసు మోయలేని భావమేదో చేరుకొంది అక్కడ...యశోధరపై సహజంగా ఉండే జాలి సానుభూతి పోలేదు, కాని వాటికి మరో వెక్కసభావం తోడయింది...

చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకుంది యశోధర...తండ్రి స్వార్థపరుడు- అలసుడు. తన సుఖం తాను చూసుకొనేవాడే తప్ప—ఆడపిల్లకు తండ్రిననీ ...ఆ పిల్ల బాధ్యత తనదనీ ఏనాడూ అనుకొనేవాడు కాదు. సంపాదించిందంతా తగలేసేవాడు...తనమీద ప్రత్యేకించి ఏ అభిమానమూలేని తండ్రిని యశోధరే

అమితంగా అభిమానించేది. యశోధరకు పెళ్ళి చేయాలని ప్రయత్నించకపోగా చదువుకూడా చెప్పించ లేదా మహానుభావుడు. వీధిబళ్ళో చదువుకొన్న థర్డు ఫారంతోనే ఆగిపోయింది యశోధర చదువు...చివరకు తండ్రి కూడా చచ్చి పోయాడు...పాతికేళ్ళ వయసులో...చెప్పుకోదగిన అందచందాలులేని... ఆస్తి పాస్తులు లేని...చదువు కాని లేక ఒంటరిగా నిలిచిపోయింది యశోధర. ...చావు కొచ్చిన బంధువుల్లో సుందరమ్మగారి కన్ను యశోధరమీద పడింది. ఇంటెడు చాకిరీ చేసుకోలేక సతమత మవుతోంది. కలిగిన కుటుంబమయినా నౌకర్లూ చాకర్లూ ఉన్నా...ఎక్కడి కక్కడే కనపడని పని...నలుగురిలా దర్జాగా మహిళా సభలకు వెళ్ళాలన్నా...మీటింగుల్లో మాట్లాడాలన్నా కుదిరి చావడంలేదు. యశోధరలాంటి పిల్ల కాస్త ఇల్లు కనిపెట్టుకుంటే తనక్కాస్త ఊపిరి తిరుగుతుంది. ఆ పిల్లకి ఆధారం చూపించిన ఘనతా దక్కుతుంది. ఆ అమ్మాయికి ఇంతకంటె మంచి దారి దొరుకుతుందా? తనేనా బండలు మొయ్యి మనటం లేదు: సినిమా సూర్యకాంతంలా రాచి రంపాన పెట్ట బోవటంలేదు.

లాంఛనంగా భర్తను అడిగింది, అలవాటుగా "సరే" అన్నాడాయన. సుందరమ్మ మాటలు విని ఏదో అదృష్టదేవత తన మెడలో వరమాల వేసినట్టే పొంగిపోయి ఆవిడతో బయలుదేరింది యశోధర...

అయితే సుందరమ్మగారి గారాలకూతురు నీరజ మాత్రం ఈ వ్యవహారం ఇంత సవ్యంగా అనుకున్నది అనుకున్నట్లుగా జరిగిపోనివ్వలేదు...

"అంతా బాగానే ఉందమ్మా! కొన్నాళ్ళు నీకు ఆసరాగా ఉంటుంది. నిజమే! ఆ తరువాత? అప్పుడేం చెయ్యదలచుకున్నావ్?" అంటూ తల్లిని నిలేసింది...

'ఆతరువాత' సంగతి ఏమాత్రం ఆలోచించని సుందరమ్మ తడబిడపడి "ఏముంది? మామూలే?" అంది.

"మామూలంటే పెళ్ళి చేస్తావా? అదేదో ఇప్పుడే చెయ్యి, ఈవిడకి పెళ్ళి వయసు వచ్చేసింది పదివేలో ఇరవైవేలో కట్నం పారేస్తే..."

గుండె పగిలింది సుందరమ్మకి. "నోరుమూసుకో!" అంది కసిరినట్లు.

"పెళ్ళి చెయ్యవా? అయితే చదువు చెప్పించు. తన కాళ్ళమీద తను బ్రతుకుతుంది..."

"బాగుంది! నీకెందుకూ నోరు మూసుకో!"

"నా కెందుకేమిటి? నా సాటి ఆడదాని బ్రతుకు బుగ్గవుతోంటే చూస్తూ కూర్చోమంటావా?"

"లోకంలో అందర్నీ మనం బాగు చెయ్యగలమా?"

"లోకం సంగతి నాకు తెలియదు. నా కళ్ళముందు జరిగే ఘోరం మాత్రం నేను సహించలేను!"

అంతే నీరజ! ఎప్పుడూ ఏ విషయమూ ఆలోచించదు. తన చదువూ తన అలంకరణ, తన ఆటపాటలూ - అదే లోకం...ప్రత్యక్షంగా తన అనుభవంలోకి వచ్చినప్పుడు కాని సంచలించదు! అలాంటి సంచలనం వచ్చినపుడు మాత్రం ఉప్పెనలాగే వస్తుంది—

యశోధర మెట్రిక్ పాసయింది ... పదిహేడేళ్ళు నిండని రజ బి. ఏ. చదువుతోంటే పాతిక పైబడిన తను ఇంటర్ చదవటానికి చాలా సిగ్గుపడింది యశోధర.

"మా అమ్మ బోలెడు కట్నంపోసి నీకు పెళ్ళిచెయ్యదు! కట్నాలను గుమ్మరించకపోతే మనలను వరించటానికి ఎవరూ ముందుకురారు! చదువుకోక ఏమయిపోతావ్?"

అభిమానంతో అదిలించింది యశోధరను నీరజ...

"మనను వరించడానికి.. " అందు తననుకూడా కలిపి మాట్లాడిన నీరజ సౌజన్యానికి బానిసయిపోయింది యశోధర కృతజ్ఞతా హృదయం...

నీరజ బంగారు బొమ్మ...సంపన్నుల ముద్దుబిడ్డ— నీరజ తమను వరించడం అదృష్టంగా భావిస్తారే తప్ప నీరజను వరించని వాళ్ళుంటారా?

కాలేజీలోచేరి చదువుతోన్నా సాధ్య మయినంత ఎక్కువగా సుందరమ్మగారికి ఇంటి పనులలో సహాయంగానే ఉండేది యశోధర...నీరజ వద్దన్నా మానేదికాదు. అందుచేత సుందరమ్మగారికి యశోధరమీద సానుభూతి అలాగే నిలిచింది—

విశ్వాన్ని ఆ ఇంటి అల్లుడుగా నీరజ తలిదండ్రులు లేనాడూ ఊహించ లేదు. ఆతనే ఒప్పుకున్నా అంగీకరించటానికి సిద్ధంగానూ లేరు. విశ్వం అందగాడు, అసిస్టెంట్ ఇంజనీర్‌గా స్థిరమయిన ఉద్యోగంలో ఉన్నవాడు. మంచి కుటుంబంలోనుండి వచ్చినవాడు. ఏదో దూరపు బంధువు, అన్నీ బాగానే

ఉన్నాయి. కాని వీటన్నిటినీ మింగేసేలా విశ్వం విలాస జీవితాల గురించి రకరకాల కథలు వ్యాప్తిలో ఉన్నాయి. ఆ కారణం చేత విశ్వం తమ ఇంటికి వస్తూన్నట్లు ఉత్తరం వ్రాయగానే సుందరమ్మగారు ఆనందించలేదు సరికదా బెంగ పడింది...విశ్వం గుణ గణాలు విన్నదానికి పదింతలుగా వర్ణించిచెప్పి "జాగ్రత్త" అని కూతుర్ని ఒకటికి పది సార్లు హెచ్చరించింది.

ఈ కథలూ హెచ్చరికలూ నీరజ మనసులో జాగ్రత్తకు బదులుగా ఒక విచిత్రమయిన కుతూహలాన్ని ప్రవేశపెట్టాయి. సాధారణంగా ఏ విషయమూ పట్టించుకోని నీరజ అతని రాక కోసం ఒక విధమైన ఉత్సుకతతో ఎదురు చూడ ప్రారంభించింది.

విశ్వాన్ని చూడగానే కన్ను చెదరినట్లయింది నీరజకు!

ఏమి అందం! ఎక్కడుంది అంత అందం?

అంతకంటె ఒడ్డు పొడుగు ఉన్న వాళ్ళను - మంచి ఛాయలో మెరిసే వాళ్ళను—అంతకంటె కను ముక్కు తీరుగల వాళ్ళను... ఎంతో మందిని చూసింది. వాళ్ళందరిలో లేనిది...ఇతనిలో ప్రబలమయి ప్రకాశిస్తున్నది... ఆ సౌందర్య రేఖ ఏమిటో?

తాను విన్న కథలనుబట్టి విశ్వం తన చుట్టూ తిరుగుతాడనీ—పనికట్టుకుని పదిసార్లు పలకరిస్తాడనీ ఊహించింది నీరజ...తనకు తెలియకుండానే ప్రత్యేకించి అతి శ్రద్ధగా అలంకరించుకొంది...కానీ విశ్వం మర్యాదగా కుశల ప్రశ్నలు వేసి ఊరుకున్నాడు...ఆ తరువాత అసలు పలుకరించ లేదు...

క్షణక్షణమూ ఊపిరి బిగబట్టి అతని రాకకోసం...అతని పలకరింపు కోసం ఎదురు చూసిన నీరజకు ఒక విధమైన నిరుత్సాహం కలగ సాగింది. దానికితోడు యశోధర నవ్వుతూ విశ్వంతో మాట్లాడటం గమనించేసరికి ఏదో తిక్క రేగింది—

యశోధరమీద మొదటిసారిగా చిరాకు పడుతూ మాట్లాడింది.

"ఎందుకతనితో అలా నవ్వుతూ మాట్లాడు తావ్?"

"నవ్వుతూ మాట్లాడానా? హాయిగా నవ్వగలిగానా."

పేలవమైన యశోధర కళ్ళలో తళుక్కుమన్న కాంతిచూసి తెల్లబోయింది నీరజ...

"యశో! అతను...ఆ విశ్వం మంచివాడుకాడు తెలుసా?"

"ఏమో! నాకేం తెలీదు. తెలుసుకోవాలనీలేదు. అయినా అతడెలాంటి వాడయితే నాకేం? నన్నెవరూ పాడుచెయ్యరు. పాడుచెయ్యాలనిపించేటంత ఆకర్షణకూడా లేనిదాన్ని..."

ఆ పైన యశోధరతో ఏంమాట్లాడాలో అర్థంకాలేదు నీరజకు. తన మనసులో చెలరేగే ఆ అసహనం ఏమిటోకూడా అర్థం కాలేదు.

ఆరోజే తనంత తానే విశ్వం దగ్గరకు వెళ్ళింది...

తలెత్తి తనను చూసిన విశ్వం కళ్ళల్లో తన అందంపట్ల ప్రశంస స్పష్టంగా ప్రతిఫలించి మనసు చల్లబడింది...

"విదేశాలలో అయితే అతి మామూలుగా "మీరు చాలా అందంగా ఉన్నారు—" అనెయ్యొచ్చు...ఇంకా మన దేశంలో అలా అనటం అమర్యాద గానే భావిస్తున్నారు. అందుకే మిమ్మల్ని చూస్తూ అనాలనుకున్న మాటలు అనలేక పోతున్నాను..."

మెప్పుదలతో అన్నాడు విశ్వం.

ఆ మాటతీరుకు మరింత ముగ్ధురాలయింది నీరజ.

"అందుకనేనా, వచ్చి మూడు రోజులయినా నాతో మాట్లాడకుండా దాక్కుంటున్నారు."

"అవును! దాక్కుంటున్నాను!... మీ అందానికి భయపడి...నేను మంచివాణ్ని కాదు...నేను మీకు సన్నిహితంగా రావటం మీకే మంచిది కాదు!"

మతిపోయినట్లనిపించింది నీరజకు. ఇంత స్పష్టంగా తన బలహీనతలు ఒప్పుకొనేవాళ్ళుంటారా? అతని ముఖంలోకి చూస్తూ పకాలున నవ్వేసింది...

ఆ నవ్వులో...సంకోచాలు—సందేహాలూ అన్నీ ఎగిరిపోయినట్లనిపించింది.

ఆ తరవాత నీరజ, విశ్వానికి చాలా సన్నిహితురాలయిపోయింది. తలిదండ్రులు ఆటంకపరచటానికి ప్రయత్నించినా లాభం లేకపోయింది...

విశ్వం సౌందర్యం మాత్రమేకాదు, అతని మాటల, అల్లరీ...చమత్కార ధోరణి...అన్నీ నీరజను ఎక్కడెక్కడికో తీసుకుపోతున్నాయి...

ఈ మధుర గానంలో అపశ్రుతిలా ఉంది యశోధర విశ్వంతో మాట్లాడాలని తాపత్రయపడటం...విశ్వంకూడా యశోధర పలకరించగానే అటువైపు తిరిగి నవ్వుతూ అర్థ్రంగా సమాధానం చెప్పటం నీరజకు చిరచిరగా ఉండేది!

ఆరోజు యశోధర విశ్వం బూట్స్ పాలిష్ చెయ్యటం...పైగా తన మనసు అలా బేలగా బయటపెట్టటం నీరజ మనసును తొలిచేస్తోంది—యశోధర మనసు స్పష్టంగా తెలిసిపోయాక విశ్వం యశోధరతో నవ్వుతూమాట్లాడటం సహించలేకపోతోంది...

యశోధర తనతో ఏ విధంగానూ పోటీకి రాలేదు!

తన ముందు ఏ విషయంలోనూ యశోధర నిలవలేదు...తనను కాదని యశోధరను స్వీకరించే బుద్ధిహీనులెవరూ ఉండరు...

కానీ...కానీ...తనను కలవర పరుస్తున్నది యశోధర పలకరించగానే విశ్వం కళ్ళలో కదిలే ఒక ఆర్ద్రరేఖ...అది ప్రేమ కాదు...కామంకాదు... ఆరాధనకూడా కాదు...కేవలం కొద్దిపాటి సౌహార్ద్రత!—అంతే! అంతేనని తెలిసినా, అది కూడా సహించలేకపోతోంది నీరజ మనసు...

"యశో! విశ్వంతో మాట్లాడాలని ఎందుకలా తాపత్రయ పడతావ్? అతను నిన్ను పెళ్ళి చేసుకుంటాడనే అనుకుంటున్నావా?"

యశోధరనే అడిగింది...

"విశ్వంగారా! నన్నా?—పెళ్లా—" తనను చూసుకొని తనే హేళనగా నవ్వుకొంది యశోధర. అలా నవ్వకుండా ఉంటే బాగుండును అనుకొంది నీరజ...ఆ నవ్వుముందు నిలవలేకపోతోంది.

"మరి..." అంటూ ఆగిపోయింది.

"ఆయన కంఠం వింటోంటే నాకు కలిగే ఆనంద—అది వదులుకోలేను..."

"కానీ...కానీ... ఆయనను గురించి రకరకాల కథలు..."

'ఛీ! ఛీ! అనిపించింది నీరజకు. తన మాటలు పూర్తి చెయ్యలేకపోయింది.

"ఆ కథలు నిజమయితే ఎంత బాగుండును! క్షణిక వ్యామోహంలోనయినా, ఆయన నన్ను అనుగ్రహిస్తే ఎంత అదృష్టవంతురాలిని! నన్ను పెళ్ళి చేసుకోనక్కర్లేదు, ప్రేమించక్కర్లేదు! ఒక్కసారి దయగా చూస్తే బ్రతుకంతా ఆయనకు బానిసలా ఉండగలను..."

వెట్టి ఆరాధనలో తల మునకలయిపోతూ అంది యశోధర...యశోధర మాటలు గుర్తుకొచ్చినకొద్దీ జాలితో మనసు తరుక్కుపోతోంది...కానీ దానిని మించిన అసూయ మనసును రగిల్చేస్తోంది!...

"విశ్వం! నువ్వు యశోధరతో అలా మాట్లాడటం నేను సహించ లేను!" స్పష్టంగా చెప్పేసింది— తెల్లబోయాడు విశ్వం...

"యశోధరతో...నీకు మతిపోయిందా? యశోధర అంటే నాకు..."

విసుగ్గా అడ్డుకొంది నీరజ...

"అదంతా నాకు తెలుసు! కానీ నువ్వుతనతో మాట్లాడటానికి వీల్లేదు! అలా మాట్లాడితే ఇంక నేను నీతో మాట్లాడను!"

"హమ్మ బాబోయ్! అంత శిక్షవద్దు. నీ దాసానుదాసుణ్ని, నీ ఆజ్ఞ ఏ పరిస్థితుల్లోనూ అతిక్రమించను."

నీరజ నవ్వేసింది.

ఆ తరువాత యశోధర విశ్వాన్ని పలకరించబోయి నపుడు నీరజ ప్రక్కనే ఉంది,

కనురెప్ప లెత్తకుండా తలవంచుకుని కూర్చున్నా నీరజ అణువణువూ తననే పరిశీలిస్తోందని విశ్వానికి తెలుసు.

మామూలు ఆర్ద్ర స్వరంతో యశోధరకు సమాధానం చెప్పలేక పోయాడు—పొడిగా ఏదో అని ఊరుకున్నాడు. యశోధర చిన్నబుచ్చుకుని మళ్ళీ ఏదో అనబోయింది. విసుగ్గా ముఖం తిప్పుకున్నాడు విశ్వం...

బిత్తరపోయి చూసింది యశోధర...తల్లి దగ్గిరకు గారాబంగా వెళ్ళి నప్పుడు తప్పులేకపోయినా తల్లి కొడితే పసిపిల్లవాడు చూసే లాంటి చూపు...

నీరజ మనసు గిలగిలలాడి పోయింది. చరాలున అక్కడినుండి లేచి వెళ్ళిపోయింది...

వెనకాలే వెళ్ళాడు విశ్వం...

"నీరజా, నా మీద కోపం వచ్చిందా? నేనేం చెయ్యను చెప్పు! మాట్లాడ లేదుగా! నేను మాట్లాడకపోయినా తనే పలకరిస్తోంది? నువ్వు అలిగితే భరించ లేను! నేను బలహీనుణ్నని నేనే ఒప్పుకున్నాను! నిజం చెపుతున్నాను. నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను కాదని ఎప్పుడూ ఏదీ చెయ్యలేను—"

ఎందుకో ఏమిటో తెలియకుండా వెక్కి వెక్కి ఏడ్చింది నీరజ... మరింత అయోమయంలో పడిపోయాడు విశ్వం...

"ఏడవకు నీరజా! ఇంకమీదట యశోధర ముఖం చూస్తే ఒట్టు!"

దిగ్గున తలెత్తింది నీరజ...

"నేను యశోధర ముఖం చూడద్దని అన్నానా? నీ యిష్టం! నాకేం!" రుసరుస లాడుతూ వెళ్ళిపోయింది.

మరొకసారి కాఫీ తీసుకొచ్చింది యశోధర విశ్వానికి. ఎంతకీ అందు కోకపోతే అక్కడ బల్లమీద పెట్టింది. ఆ కాఫీ వైపు చూడకుండా అక్కడి నుంచి లేచి యశోధర చూస్తుండగానే వంటవాడితో మరోకప్పులో కాఫీ తెప్పించు కునిత్రాగి అక్కడినుండి వెళ్ళిపోయాడు విశ్వం...

నీరజ కాళ్ళముందు కుప్పలా కూలిపోయింది యశోధర...

"నేనేం తప్పుచేశాను? ఏం కావాలని కోరాను? ఒక పనిమనిషిలా కాఫీ ఇవ్వటానికికూడా పనికిరానా?"

దెబ్బతిన్న పిట్ట ఆర్తనాదం లాంటి ఆ స్వరం వినలేక వణికింది నీరజ ...విసురుగా వెళ్ళబోయిన విశ్వం మధ్యలో వెనక్కి తిరిగి యశోధరను చూచి ఒక్క క్షణం తటపటాయించి అంతలో ముందుకు సాగటంకూడా గమనించింది—

"నీ కెందుకొచ్చిన యాతన యశో! హాయిగా ఉండక! అతనికి కాఫీ ఎవరో ఒకరిస్తారులే!" అంది అనునయంగానే...

"ఊహు! నేనే అందిస్తాను. వదిలెయ్యొచ్చు! త్రాగక పోవచ్చు!... కానీ నేను ఎంత ఆర్తితో ఆ కాఫీ అందించానో...అది గుర్తించక పోడు!"

గుండెలలో ఏదో బరువుపేరుకుంటున్నట్లయి ఎదురుగా ఉన్న పుస్తకం తెరిచి చదువుతున్నట్లు నటించ సాగింది నీరజ...

కూనిరాగం తీస్తోన్న యశోధరను చూసి ఆశ్చర్య పోయింది నీరజ...

"నువ్వు పాడగలవా?" అంది...

"నేను ఏం గలనో ఏం కానో ఈనాటివరకూ నాకే తెలియదు! ఇప్పుడు ఒక్కొక్కటీ తెలుస్తున్నాయి..."

ఏం మెరుపు ఆ కళ్ళలో...

"చాలా హుషారుగా ఉన్నావే!"

"అవును. చాలా ఆనందంగా ఉన్నాను. ఇవాళ నేను పెట్టిన టిఫిన్ విశ్వం తిన్నారు. బాగుందనికూడా అన్నారు..."

ఎక్కడో ఏదో భగ్గుమంది నీరజకు...

"నీరజా..."

పిలిచి ఆగిపోయింది యశోధర...

"ఏమిటీ?"

ఏదో అడగరానిది అడుగుతున్నట్లు కొన్ని క్షణాలు తటపటాయించి చివరకు తెగించి అడిగింది...

"ఇవాళ నీ లేత నీలం పట్టుచీర నాకియ్యవూ?"

తన చెవులు తను నమ్మలేకపోయింది నీరజ. ఇదివరలో ఎన్నోసార్లు తన చీరలు కట్టుకోమంటే నిర్లిప్తంగా "నా లాంటిది ఎలాంటి చీరలు కట్టుకున్నా ఒకటే!" అని తిరస్కరించిన యశోధర...

"అలాగే!..." అంది మరొకలా అనగలిగే శక్తిలేక...

ఆరోజు పార్టీకి విశ్వంకూడా వస్తున్నాడు. యశోధరకు లేత నీలం చీరమీద ఆసక్తికి అదీ కారణం...

తను ప్రక్కన లేనప్పుడు విశ్వం యశోధర పెట్టిన టిఫిన్ తిన్నాడు. బాగుందనికూడా అన్నాడు!

ఏం మొగవాళ్ళు! విశ్వంతో మాట్లాడకూడదు ఇంక! హమ్మో! విశ్వంతో మాట్లాడకుండా బ్రతకగలదా? అతడులేని తన బ్రతుకును ఊహించుకోగలదా?

ఆరోజు అద్దంముందు నించుని శ్రద్ధగా అలంకరించుకోవాలి. కానీ ప్రతిబింబాన్ని చూసుకొంటున్నకొద్దీ ఎంత అందంగా ఉన్నా ఏదో లోపం తోచసాగింది. అక్కడికి యశోధర వచ్చింది మామూలు తెల్ల చీరలో...

"నా లేత నీలంరంగు పట్టుచీర కట్టుకోలేదూ!"

"కట్టుకున్నాను. కానీ ఏమిటో ఆ చీర నా వంటిమీద వెక్కిరించినట్లనిపించింది. విప్పేసి ఇదే కట్టుకున్నాను. నా పిచ్చిగాని అందాన్ని చీరలతో తెచ్చుకోగలనా?"

నవ్వింది యశోధర. నీరజను మెప్పుదలతో చూస్తూ "ఎంత అందంగా ఉన్నావు నీరజా! పరవాలేదులే! దృష్టి తగలకుండా నీ ప్రక్కనే ఉంటాను!" అంది...

నీరజ మాట్లాడలేదు. పార్టీలో ప్రతివారి చూపులూ నీరజమీదనే ఉన్నాయి. విశ్వం చూపులలో ఆరాధన ఇంతా అంతా కాదు. గర్వంతో పొంగిపోతూ ఉన్న నీరజ మనసులో యశోధర నవ్వు ముల్లులా గుచ్చు కుంటూనే ఉంది...

అటు యశోధర, ఇటువిశ్వం కనపడటంలేదు. ఇల్లంతా గగ్గోలయింది. సుందరమ్మ యధేచ్ఛగా నోరువిప్పింది...

వాడిలాంటివాడని నాకు తెలుసు, అందుకే ముందే హెచ్చరించాను. నా మాట వింటేనా! పోనీలే! కొంపమునగకముందే తెలిసొచ్చింది. అయినా దీనికింత బుద్ధిలేదేం? వాడు నాలుగు రోజులుంచుకుని వదిలేస్తే దీని బ్రతుకేంకావాలి! ఏమోలే! ఎవడి కర్మ వాడిది!"...

నీరజ కామాటలేవీ చెవులో పడటంలేదు. విశ్వం తనను కాదని యశోధరతో వెళ్ళిపోయాడు! నమ్మలేకపోతోంది ఈ విషయాన్ని.

బల్లమీది ఉత్తరం పైన పడ్డాయి నీరజ కళ్ళు...విశ్వం వ్రాశాడు.

"నీరజా! అందాల రాణీ!

నేను నిన్నెంతో ప్రేమించాననీ, ఇప్పటికీ ప్రేమిస్తున్నాననీ అంటే ఎంతో హాస్యాస్పదంగా ఉంటుందని నాకు తెలుసు. నేను అల్పుణ్ని నీరజా! నీ ప్రేమకు తగను. యశోధరపైన నాకు ప్రేమలేదు. ఆకర్షణ అసలేలేదు. కానీ, ఏదో శక్తి నన్ను అటువైపు ప్రబలంగా లాగుతోంది!

ఎంత బలహీనుణ్ని! నీ సమక్షంలో నిన్నుచూస్తూ—నిన్ను వదులుకోవలసి వస్తుందనే భయంతో యశోధరను తిరస్కరించినా, మళ్ళీ ఎందుకో అటువైపు మొగ్గుతున్నాను. నిన్న రాత్రి దేవతలాఉన్న నిన్ను...సాకార దైన్యంలా ఉన్న యశోధరను ప్రక్కప్రక్కల చూశాను. ఎందుకో, ఏమిటో నిన్ను నా దాన్ని చేసుకోటానికి భయం తోచింది. పూవులాంటి నీ జీవితాన్ని నా బలహీనతతో నలిపివేస్తా ననిపించింది. యశోధరను పెళ్ళిచేసుకోవాలని నిర్ణయం చేసుకున్నాను.

నా బలహీనతలన్నీ సహించి భార్యగా ఒదిగి ఉంటుందనే ఆశతో...

ఇంతకంటె గొప్ప జీవితం యశోధరకు రాదు! అంచేత యశోధరకు అన్యాయం చేస్తున్నానన్న బాధ నాకు లేదు. అన్ని విధాలా ఆనందమయం కావలసిన—కాదగిన నీ బ్రతుకులోకి నేను రాలేను. విష్ యు బెస్ట్ ఆఫ్ లక్.

—విశ్వం..."

ఆ ఉత్తరం పదే పదే చదువుతోంటే ఆనాటి తన అలంకరణలో లోపం స్ఫురించింది అకస్మాత్తుగా...

బాహ్యాలంకరణలో ఏ లోపమూలేదు...కానీ యశోధర ప్రక్కన తాను ఎంత అందమయినదో నిరూపించుకోవాలనే అహం తన మొహాన్ని మబ్బులా కమ్ముకుంది...

విశ్వం తనను ఎంతగా ఆరాధిస్తాడో ప్రత్యక్షంగా యశోధరకు చూపించాలనే క్రౌర్యం తన కళ్ళలోనుండి విశ్వాన్ని భయపెట్టింది...

అందమంటే ఏమిటని ఎన్నోసార్లు తనలో తను ఆలోచించింది...

సత్యమూ, శివమూ, సుందరమూ! అని కీర్తింపబడే ఈ సృష్టిలో సుందరత దేనినాశ్రయించుకొని ఉందని ఎన్నో సార్లు వితర్కించుకొంది...

అర్థమయీ కానట్లుగా ఏదో అర్థం కాసాగింది...విశ్వంలో పెరిగిపోతూన్న కాంతి అతని నిష్కాపట్యం...అతనిలో ఆకర్షణ సౌహార్ద్రం నిండిన సరసత...

అతి సాధారణమయిన యశోధరలో విశ్వాన్ని ప్రబలంగా తన వైపుకు లాక్కున్నది మట్టిబొమ్మలను మహాశక్తులను చేయగలిగిన ఆరాధన...

నిర్గుణ నిరాకారాన్ని సగుణ సాకారంగా సాక్షాత్కరింప చేసికోగల సంకల్పబలం...

రేగిపోయిన జుట్టుతో—నలిగిపోయిన చీరతో — వడిలిపోయిన ముఖంతో...ఉబ్బిపోయిన కనులతో అద్దంముందు నుంచుంది—

"నేను అందంగా ఉన్నానా?" అనుకొంది...

దౌర్భాగ్యురాలయిన యశోధర బ్రతుకు కుదుటబడింది, అనే సంతృప్తితో మెరిసిన సౌందర్య రేఖను కన్నీళ్ళతో చూసుకుంది.

# వంకర గీతలు

శ్రీమతి డి. కామేశ్వరి

పొడుగాటి వాలుజడా, జడలో కదంబమాల, కళ్ళకు కాటుక, కుంకుమ బొట్టు, మెడలో నల్లపూసలు, కంచి పట్టుచీర, ఆదేరంగు బ్లౌజు, సాదా చెప్పులు, పమిట బుజం నిండా కప్పుకుని తెలుగుతనం ఉట్టిపడుతున్నా వేషంలో పచ్చగా, నాజూగ్గా వున్న శాంతి, రావు వెనకాలే హాల్లోఅడుగు పెట్టింది.

కళ్ళు జిగేలుమన్నాయి. రంగురంగుల కాంతులు చిమ్ముతూ రకరకాల ఆకారాల్లో దీపాలు. నున్నగా మెరిసే ఫ్లోరింగు, చుట్టూ సోఫాల నిండా ఆధునిక దుస్తుల్లో ఆడవాళ్ళు, వాళ్ళ కెదురుగా నిలబడి కబుర్లు చెబుతూ మగవాళ్ళు, చేతుల్లో రంగు రంగుల పానీయాలు, నవ్వులు, మాటలు, అంతా అట్టహాసంగా ఉంది. మగవాళ్ళంతా ఒకలాగే కనబడుతున్నారు. వైవిధ్యమంతా ఆడ వారిలోనే.

చుట్టూ వో డజను జతల కళ్ళు కుతూహలంగా ఇటు తిరిగాయి. శాంతి బెరుకుగా చుట్టూచూసి కొద్ది క్షణాలు తల దించుకుంది. రావు గుంపులో కలిసి పోయాడు.

పెళ్ళయి మూడేళ్ళయినా రావు సిక్కింలో ఉండిపోవటం మూలాన శాంతికి సైనికోద్యోగి భార్యగా సాంఘిక జీవితం అనుభవంలోకి రాలేదు. రావుకి ఈ ప్రాంతానికి బదిలీ అయి నెల కావస్తూంది. అది ఆమెకి మొదటి అనుభవం.

జనరల్ భగవత్ గౌరవార్థం ఆరాత్రి మెస్‌లో 'సోషల్ నైట్' ఏర్పాటు చేయబడింది. బుఫే డిన్నరు. ఆ తర్వాత డాన్స్. బయట రెజిమెంటల్ బాండ్ వాద్యాలు వినపడుతున్నాయి.

"నమస్తే జీ!" తెల్ల షార్క్‌స్కిన్ కోటు, నల్లబౌ, నల్లపాంటు, పచ్చగా, పొడుగ్గా ఒకతను కనపడి చేతులు జోడించాడు.

"నమస్తే!" ఉలిక్కిపడింది శాంతి.

"నేను లెఫ్టినెంట్ మెహ్రా" పరిచయం చేసుకున్నాడు మెహ్రా.

"శాంతి" మొహమాటపడుతూ చెప్పింది శాంతి.

"రండి" మర్యాదగా దారి చూపించి తీసుకువెళ్ళి ఒక సోఫామీద కూర్చోబెట్టాడు మెహ్రా.

అంతకుముందు కూర్చున్న యిద్దరు చెరోవైపు జరిగి ఆమెకి చోటిచ్చారు.

''ఏం తీసుకుంటారు?'' అడిగాడు మెహ్రా ఇంగ్లీషులో.

''నాకేం వద్దండి.''

''మీకు కావాలా, వద్దా అని అడగలేదు నేను!'' ఆమె జవాబు వినకుండానే వెళ్ళిపోయాడు మెహ్రా.

"మనం యింతకుముందు కలుసుకోలేదు. నేను మిసెస్ అరోరా" కుడివైపు ఆమె తనని తాను పరిచయం చేసుకుంది.

"మిమ్మల్ని కలుసుకోడం ఆనందంగా ఉంది, నేను శాంతి."

"యీమె మిసెస్ తివారి."

''నమస్తే, చాలా సంతోషం! నా పేరు శాంతి.'' మిసెస్ తివారి వంక తిరిగి అంది శాంతి.

''ఇంక ఆ పేరు మరిచిపోవాలి మీరు. ఇకమీదట ఇక్కడున్నంతకాలం మీరు మిసెస్ ఎవరో ఒకరు!'' నవ్వుతూ సరిదిద్దింది మిసెస్ తివారి.

''క్షమించండి, మిసెస్ రావు!'' సిగ్గుపడింది శాంతి. అది ఆమెకి మొదటి పాఠం. ఏదో పెద్ద నేరంచేసి పట్టుబడ్డ దొంగలా అదోలా అనిపించింది.

"మేజర్ రావ్ కొత్తగా వచ్చారు గదూ!?—" మిసెస్ తివారి.

''అవును, నెలవుతుంది."

మిసెస్ అరోరా పొట్టిగా, లావుగా, తెల్లగా ఉంది. పల్చటి నైలాన్ చీర, నెరుస్తున్న వెంట్రుకల్ని చుట్టిన బన్మాముడి, స్లీవ్‌లెస్‌బ్లౌజ్, లిప్‌స్టిక్, వయస్సు పెద్దదయినా, వేషం చాలా ఆధునికంగా ఉంది. ఇంగ్లీషులో మాట్లాడాలన్న తాపత్రయమైతే ఉందిగాని అంతగా వచ్చినట్టు కనపడదు.

మిసెస్ తివారి పొడుగు పొట్టీ కాకుండాఉన్నా, లావాటి శరీరం, వయసుకి మించిన వేషం. మితభాషి. మాట్లాడినప్పుడు కల్నల్ భార్యనన్న ఠీవి అధికారం కనపరుస్తూ మాట్లాడుతుంది. కప్పుకున్న షాల్, పెదాలకి రంగు, వగైరా అన్నింటిలాగే యింగ్లీషు మాటలు తరుచు వదలడంకూడా ఆమెకొక ఫ్యాషన్.

మిసెస్ దారువాలా ముప్పైఏళ్ళ మనిషి మంచి గులాబిరంగు ఛాయ, మంచి విగ్రహంవంటి రంగులో కలిసే చీర; చేతులు, వీపులేని జాకెట్టు,

చెవులు కనపడకుండా నడినెత్తిన చుట్టిన ముడి, లిప్‌స్టిక్—వయ్యారంగా ఒరిగి కూర్చుని ఎవరితోనో ఉల్లాసంగా మాట్లాడుతూంది.

శాంతి బెదురుతూ చుట్టూ చూసింది.

మిసెస్ రంజిత్‌సింగ్, పొడుగ్గా, లావుగా, మోటుగా, పంజాబీదుస్తుల్లో, అదోలా కనిపించే ప్రక్క పాపిడితో, చుట్టూ ఉన్నవాళ్ళంతా ఒక మెట్టు తక్కువ అన్నట్లు చూసి మాట్లాడుతూంది.

మిసెస్ థామస్ పొడుగు. ఫ్రాక్‌మీద పుల్‌ఓవరు, ఎత్తు మడమల జోళ్లు, కత్తిరించిన జుట్టు, నలుపుమీద వికారంగా కనిపించే పెదాల రంగు, తనదీదేశం కాదని అనుకోవాలన్నట్టుంది.

మిసెస్ తులాబీ సన్నగా, పొడుగ్గా, తెల్లగా పల్చటి సిల్కు చీర, దానికి మేచయ్యే స్లీవ్‌లెస్ బ్లౌజు, నడినెత్తిన చుట్టిన సిగలోంచి వెండి ఫిలిగ్రీ వర్కుతో చేసిన కుచ్చులు వేలాడుతున్నాయి. చెవులకి పొడు గాటి జూకాలు, పొడుగాటి లాకెట్ గొలుసు, గాజులు, నగలు, చెప్పులు, హేండ్‌బాగ్ అన్నీ చీరకి మేచయ్యేటట్టు ఉన్నాయి. కార్డిగాన్ తొడుక్కుని, మధ్యమధ్య షోగ్గాసిప్ చేస్తూ, ''ఈ కాలంలోనూ ఇలాంటి వాళ్ళుంటారా?'' అన్నట్లు వింతగా చూసింది శాంతివంక.

ఇంకా ఆ ప్రక్క మిసెస్ దేశముఖ్—ఇంచుమించు పైమాదిరి వాళ్ళలానే వేషం, ఆధునికత ఉట్టిపడుతూ.

వీళ్ళందరికి అతకని మనిషి మిసెస్ మీనన్ ఒకతే. మంచి కళగల మొహం, జరీలేని కంచిచీర, ఆదేరంగు జాకెట్టు, రింగు చుట్టిన ముడి, కుడి చేతికి బంగారు గాజులు, ఎడం చేతికి వాచి, కేపు కప్పుకుంది.

శాంతిని చెప్పలేని దిగులు ఆవహించింది.

"తీసుకొండి'' నల్లరంగు డ్రింక్ ఒక గ్లాసులోతెచ్చి అందించాడు మెహ్రా. మొహమాటపడి, ఇబ్బందిగా చూసింది శాంతి.

''అందరూ తాగుతున్నప్పుడు మీరు త్రాగకపోవడం ఆచారంగాదు. మీకింకా క్రొత్త. కొన్నాళ్ళుపోతే మీకే అలవాటు అవుతయి, ఈ కట్టుబాట్లు!'' మిసెస్ అరోరా చిన్నపిల్లలకి చెప్తున్నట్లు నవ్వుతూ అంది.

''కోకాకోలా తాగడానికి అభ్యంతరం ఏమిటండీ!'' నవ్వాడు మెహ్రా. శాంతి మెల్లిగా గ్లాసు అందుకుంది. నలుగురిమధ్య క్రొత్తదనంతో మథన

పడశంకన్నా, అలా క్రొత్తదానిలా, తెలియని దానిలా అందర్లోనూ తేలిపోవడం మరింత బాధాకరంగా ఉంది.

కాసేపు కబుర్లుచెప్పి వెళ్ళిపోయాడు మెహ్రా. మిసెస్ అరోరా, మిసెస్ తివారి ఎవరితోనో కబుర్లలో పడ్డారు. శాంతి గ్లాసు ఖాళీచేసి చుట్టూ చూసింది. ఎవరి చేతుల్లోనూ గ్లాసు ఖాళీగాలేదు. మిగతా అంతా తాగడం మానేసి ఉత్తినే చేతుల్లో పట్టుకుని మధ్య మధ్య కొద్దిగా గుటకవేస్తున్నట్లు ఉంది. క్షణ క్షణం తప్పులు చేస్తున్నట్లనిపించింది శాంతికి. మిగతా అందరి వేష భాషలకీ, తనకీ మధ్యనున్న అంతరం, తన ప్రవర్తన మూలాన మరీ ఎక్కువౌతూందన్న భయమొకటి ఆమెని క్రొత్తగా వెంటాడసాగింది.

సరిగ్గా ఎనిమిదిన్నరకి హాలునిండా కలకలం ఆగింది. మగవాళ్ళంతా గుమ్మంముందు గుమిగూడారు. కరచాలనం జరుగుతోంది. జనరల్ దిగాడన్న మాట బాండ్ వాద్యం ఎక్కువగా వినబడుతోంది. ఆడవాళ్ళ మాటల సద్దు కొద్దిసేపు ఆగింది. అందరూ అటువైపు చూడసాగారు.

పొడుగ్గా, బట్టతలతో, భారీగాఉన్న ఒక మనిషి ఆడవాళ్ళ మధ్యకి వచ్చాడు. ప్రక్కన బ్రిగేడియర్ నిలబడి ఒక్కొక్కరినే పరిచయం చేస్తున్నాడు.

శాంతి దగ్గర నిలబడ్డాడు జనరల్ నవ్వుతూ నమస్కరించి. శాంతి సిగ్గుపడి సంభ్రమంతో నిలబడి నమస్కరించింది. బ్రిగేడియరు పేరు తెలియక కొద్దిసేపు ఇబ్బందిపడి చివరకు "క్రొత్తగా వచ్చారు!" అన్నాడు.

"మిసెస్ రావ్" మిసెస్ ఆరోరా చెప్పింది.

"కూర్చోండి, ఎక్కడనుంచి వచ్చారు?" అడిగాడు జనరల్ నవ్వుతూ.

"రాజమండ్రి"

"రాజమండ్రి.—ఎక్కడుంది? బెంగుళూర్ దగ్గిరా?" అయోమయంగా బ్రిగేడియర్ వంక చూశాడు జనరల్.

"మెడ్రాసు దగ్గిర అనుకుంటాను!" తనకీ తెలియదన్నట్లు చూశాడు బ్రిగేడియర్.

శాంతికి తను చేసిన పొరపాటు అర్థమయింది. కాని సరిదిద్దుకునే లోపునే జనరల్ ప్రక్కకివెళ్ళిపోయాడు. జనరల్ వెళ్ళాక, సన్నగా మిసెస్ తివారి చెప్పింది.

"మీరు తెల్సుకోవాల్సిన విషయాలు కొన్ని ఉన్నాయి. మీకు తెలియక పోయినా చుట్టూచూసి ఉండాల్సింది. జనరల్ వచ్చినప్పుడు మీరు లేవనక్కర లేదు. కూర్చునే నమస్కరించాలి, తర్వాత బ్రిగేడియర్ మీ పేరు తెలియక ఇబ్బంది పడుతున్నప్పుడు మీ అంతట మీరే మీ పేరు చెప్పుకోవాలి......"

శాంతికి చెమటలు పోశాయి—ఇంకా కూర్చుంటే ఏమవుతుందో తెలియ నట్లుంది. కాని వెళ్ళడం ఎలా?

పదకొండు కావస్తూంది. అప్పటికిగాని ఎవరూ డిన్నర్‌కి వెళ్ళలేదు. రావు అప్పుడు కనపడ్డాడు శాంతికి. కళ్లు ఏవో లోకంలో ఉన్నట్లున్నాయి. ఆమె అతన్ని ఎరిగినట్లు లేదు. చేతులూ, కాళ్లూ చాల విసురుతో కదులు తున్నాయి.

"డార్లింగ్! ఎలా ఉంది?" నవ్వుతూ అడిగాడు రావు. అదోవాసన తగిలింది శాంతికి.

డిన్నర్ అయి బయటికి వచ్చిన మరో పావుగంటకి హాల్లో వాద్యం మొదలైంది. జంటలు కదులుతున్నాయి హాలు మధ్యకి. మగవాళ్ళు దగ్గిరకి వచ్చి అడుగుతున్నారు. ఆడవాళ్ళు లేస్తున్నారు. శాంతి గుండెలు గబగబ కొట్టుకున్నాయి.

"మీతో డాన్సుచేసే గౌరవం నాకు కలిగిస్తారా?" కల్నల్ తివారి మర్యాదగా వంగి అడిగాడు.

"క్షమించండి, నావల్లగాదు!" ఎలాగో అనగలిగింది.

"పర్వాలేదులెండి" కల్నల్ వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత ఒకరిద్దరు ఇలానే అడిగి వెళ్ళిపోయారు. డాన్స్‌కి డాన్స్‌కి మధ్య పచ్చని, తెల్లని, ముదురు నల్లనిరంగుల పానీయాలు తాగుతున్నారు మగవాళ్ళు. గంటలు గడిచినకొద్ది నవ్వులు కేకలు ఎక్కువ అవుతున్నాయి. కాళ్లు తడబడ్తూంటే, మాట అస్పష్టమవుతూంటే ప్రతి మనిషీ ఏదో వెర్రిగా మాట్లాడుతూ, బాండ్‌వాద్యానికి లయగా అడుగులు వేస్తున్నారు.

రావు వచ్చి తనని డాన్సు చేయమని అడిగతే ఎంత బాగుణ్ణనుకుంది శాంతి. రావు ఎక్కడా కనపడడంలేదు. ప్రతి అయిదు నిమిషాలకి ఎవరో

వచ్చి అడగడం, ఒకోసారి కొద్దిగా బలవంతం పెట్టడంకూడా జరుగుతూంది. ఎంత కాలమని తప్పించుకోడం?

రాత్రి రెండు దాటింది. అప్పటికింక మగవాళ్ళెవరికీ రెండోమనిషి చెపుతున్నది వినపడుతున్నట్టు లేదు.

"మీరింతవరకు డాన్స్ చెయ్యనేలేదు!"

తలెత్తింది శాంతి.

ఎదురుగా జనరల్ భగత్!

"నాకు డాన్స్ రాదండీ?"

"డాన్స్ రాకపోవడమేమిటి? నాలుగడుగులు ఇటూ అటూ వేయడానికి! రండి, నేను నేర్పుతాను."

శాంతి ఏం మాట్లాడలేకపోయింది. జనరల్ చెయ్యి చాచాడు. బాండ్ వాద్యం మొదలైంది. జనరల్ చేతిని పట్టుకుని ముందుకీ వెనక్కీ ప్రక్కలకీ అడుగువేసింది శాంతి. ఆమె మొదటి సారి ఫ్లోర్ మీదికి రాగానే చుట్టూ అంతా డాన్స్ మానేసి చప్పట్లు చరిచారు. శాంతి మొగం సిగ్గుతో కందింది.

"క్షమించండి, ఇంక చాలు, నాకు అలసటగా ఉంది" అంది శాంతి బాండ్ ఆగగానే.

"మరేం పరవాలేదు—గండి" జనరల్ ఆమెని సోఫాదాకా తీసికెళ్ళి కూర్చున్నాక మర్యాదగా వంగి కృతజ్ఞతచెప్పి గుంపులో కలిశాడు. ఆమె వెంటనే లేచి ఎవరూలేని మూలకి చేరి కూలబడింది. ఆ ప్రక్కనే మిసెస్ మీనన్ ఉంది.

"ఇంకా ఎంత సేపుంటారు వీళ్ళంతా!" అడిగింది శాంతి.

"జనరల్ ఇష్టం. అతను వెళ్ళేదాకా ఎవరూ కదలరు!" నవ్వుతూ అంది మీనన్. రావు దూరంగా కనపడ్డాడు. నిలబడి ఎవర్తోనో మాట్లాడుతూ. సైగ చేసి పిల్చింది శాంతి.

"వెళ్దాం ఇంక" అంది శాంతి నిద్రకి వాలుతున్న కళ్ళతో.

"డోంట్ బి సిల్లీ!" రావు నవ్వి వెళ్ళిపోయాడు.

శాంతికి నిద్ర ముంచుకువస్తోంది. మిగతా అంతా ఎలా నిబ్బరించు కుంటున్నారో అర్థం కావేదు. మొదట్లోఉన్న బెరుకు, క్రొత్తదనంపోయి

విసుగుదల హెచ్చయింది. డాన్స్ తర్వాత డాన్స్, చివరకది ఏ రకం డాన్సో తెలుసుకోలేని విధంగా తయారైంది.

మూడున్నర గంటలవేళ, "ఓకే ఛాప్సు! థాంక్యూ, గుడ్‌నైట్!" అని చెప్పి, ఆడవాళ్ళందరికి నమస్కరించి, కారుకేసి నడిచాడు జనరల్. జనరల్ వెనకాలే బ్రిగేడియర్, కల్నల్స్ అందరూ నడిచారు.

దారిపొడుగునా, ఇంటికి వచ్చాక, శాంతి రావుతో ఏమేమో మాట్లాడాలనుకుంది. ఎన్నో అడగాలనుకుంది. అక్కడి కొందరి మనుషుల ప్రవర్తనని, వాళ్ళ ఆచారాలమీద, పద్ధతులమీద, తన అభిప్రాయాల్ని ఏవేవో చెప్పాలనుకుంది. చర్చించాలనుకుంది. కాని ఇంటికి రాగానే బట్టలైనా మార్చకుండా మంచంమీదపడి నిద్రపోయేడు రావు.

* * *

మర్నాడు ఉదయం రావు తొమ్మిదిన్నరకి లేచాడు. స్నానం వగైరాలు కానిచ్చి వచ్చేసరికి పదిన్నర అయింది. అప్పటికి శాంతి వంటకూడ పూర్తయింది.

రావుకి కాఫీ అందిస్తూ, ఏ భావం వెలిబుచ్చని అతని మొహంలోకి చూసింది. క్రితం రాత్రి కళ్ళలో మైకం ఆమె కళ్ళముందు కదిలింది.

"మీరు తాగుతారని నాతో ఏప్పుడూ చెప్పలేదేం?"

"అదేమంత ఘనకార్యమని ప్రకటించుకోవాలి?"

"త్రాగక పోతేనేం?"

రావు నవ్వాడు. సమాధానం చెప్పలేదు.

"రాత్రి నేనున్నానన్న సంగతే మీకు గుర్తున్నట్టులేదు!"

"నిన్ను కనిపెట్టి చూస్తూనే ఉన్నాను. నువ్వు ఎవర్తోనూ మాట్లాడకుండా తల దించుకు కూర్చోడం, జనరల్ వచ్చినప్పుడు నిల్చుని తడబడడం నిన్నందరూ డాన్స్‌కి పిలవడం, నీవు బిత్తరచూపులు చూడడం, చివరన జనరల్‌తో డాన్సు, ఆఖర్న అక్కడ మిసెస్ మీనన్ దగ్గరకివచ్చి సగం నిద్రలో కూలబడ్డాం—అంతా చూస్తూనే ఉన్నాను!"

శాంతి సిగ్గుపడి తల దించింది.

"చూడు శాంతీ, నీకు, నాకు ఇష్టమున్నా లేకపోయినా మనం ఇక్కడికి వచ్చాం ఇప్పుడు. ఇక్కడున్నప్పుడు ఇక్కడి పద్ధతులు, అలవాట్లు కట్టుబాట్లు

పాటించడం మంచిది. ఎప్పుడో ఒకసారి తాగినంత మాత్రాన పోయేదేం ఉండదు. కాని తాగకపోతే, నలుగుర్లోనూ వెలిగా ఉన్నట్టవుతుంది. అలాగే నువ్వూ అందర్లా కాకుండా ఎవరితో మాట్లాడకుండా ఒకత్తెవే కూర్చుంటే పోయేదే ముండదుగాని, సాంఘికంగా వెనకబడినట్టు చూస్తారంతా. వాళ్ళకా అవకాశం ఎందుకు కలిగించాలి!''

''అయితే నేనూ డాన్స్ చేయాలంటారు?''

''ఏమిటి పోతుంది డాన్స్ చేస్తే?''

''మీరెన్ని చెప్పండి, నా వల్లగాదు, అలా పరాయి మగవాణ్ణి పట్టుకుని ...అసలీ విదేశీ పద్ధతులు, అలవాట్లు మనదేశంలో ఎందుకో ఇంకా?''

రావు మళ్ళీ నవ్వాడు, శాంతి కళ్ళలోకి చూసి. ఆ నవ్వుకి శాంతికి కోపం వచ్చింది. ''నువ్వు ఏం తెలియని అమాయకురాలివని'' చెపుతోన్నట్టుంది, ఆ నవ్వు.

''మీరలా నవ్వితే నాకు కోపం వస్తుంది''

''నీకు కోపంవస్తే నాకు బాగుంటుంది'' ప్రేమగా నవ్వాడు రావు.

మొదట కొన్ని క్షణాలు ఏం చెప్పాలో తెలియని సందిగ్ధంలో పడింది శాంతి. తర్వాత అమె మనసులో మాట చెప్పుకోవాలన్న ఆత్రుత ఎక్కువవుతూంటే మెల్లిగా మొదలుపెట్టింది.

''నిన్నరాత్రి నన్ను వాళ్ళంతా ఏదో వింత వస్తువుని చూసినట్టు చూస్తుంటే నాకెంత చిన్నతన మనిపించిందో తెలుసా? వాళ్ళకన్న ఏదో తక్కువ అన్నట్టుచూసి మాట్లాడడం! క్రొత్తలో తెలియక ఏదో చిన్న పొరపాట్లు చేశానే అనుకోండి. అంతమాత్రాన మరీ అంత ఇదిగా మొఖం మీద చిన్నబుచ్చుకునే లాగ చెప్పాలేమిటి?''

రావు నవ్వాడు, మళ్ళీ అదే ధోరణిలో.

''శాంతి డార్లింగ్! నిన్న నీ వేషంచూస్తే నాకేమనిపించిందో చెప్పనా? ...కోపం తెచ్చుకో కూడదు సుమా!''

''చెప్పండి ఫరవాలేదు''

''పందొమ్మిదో శతాబ్దపు ఆదర్శ భారత నారీమణి అని బిళ్ళ ఒకటి మెళ్ళో వేలాడేసి మ్యూజియంలో పెట్టాలనిపించింది''

''మీకు అలా అనిపించీ ఎందుకు చెప్పలేదు?''

"నేను చెపితేకన్నా, నలుగుర్లోనూ చూస్తే నీకే తెలుస్తుందని వూరుకున్నాను!"

శాంతి చాలసేపు మాట్లాడలేదు.

"శాంతీ! నువ్వు తెలివైనదానివి. చదువు, అందం జ్ఞానం వివేకం అన్నీ ఉన్నాయి. నిన్నుచూస్తే నాకెంత గర్వంగా ఉంటుందో తెలుసా...అయినా నువ్వు కొంచెం మారాలి శాంతీ. రోమ్‌లో ఉన్నప్పుడు రోమన్‌లాగ ఉండమని ఒక సామెత ఉంది. అలాగ యిక్కడున్నప్పుడు ఇక్కడి వాళ్ళలాగ ఉండడం అవసరం. వాలుజడలు, జడకుచ్చులు మానేసి ఇప్పటి ఫేషన్ ప్రకారం ముడులు చుట్టుకోడం, ఎప్పుడూ కంచి జరీ పట్టుచీరలే కాకుండా నాజూకువి కట్టడం మొదలైనవన్నీ పెద్ద విషయాలేం కావు! నీ కిష్టమైతే మారడం నీ చేతిలో పని. ఇదివరకు నేను ఒకటి రెండుసార్లు చూచాయగా అన్నా నీవు పట్టించుకోలేదు. అలా మారితే నలుగుర్లోనూ కలసి మెలసి ఉండడం సులభమైనప్పుడు అలా ఎందు కుండకూడదు? పోయేదేముంది ఇంతలో. ఇక్కడిం కోటి గుర్తుంచుకో, అందరితో కలసి మెలసి ఉండడంవల్ల నీ గౌరవం హెచ్చడమే కాకుండా. సాంఘికంగా స్థాయికూడ హెచ్చవుతుంది. మిగతా చోట్లలా కాదు ఇక్కడ. మిగతా ఉద్యోగాలలా కాదు ఆర్మీ ఆఫీసరు ఉద్యోగం. ఆడా, మగ అంతాచనువుగాకలిసి ఉండేచోట, నీవు వెలిపడినట్లు ఉంటే, నీతో పాటు నేనూ వెలిగా ఉండిపోతాను! ఒక రకంగా చూస్తే నలుగుర్లోనూ నా పరపతి, గౌరవం నీమీద ఆధార పడుంటాయి!"

"అయితే స్లీవ్‌లెస్ బ్లౌజు, లిప్‌స్టిక్‌లు, నైలానులు వాడకపోతే అనాగరికుల క్రిందే లెక్క!"

"...అదికాదుశాంతీ, లోకంతోపాటే మనమూ. రోజులు మారుతున్నాయి. కాలానికి తగ్గట్టు అందరిలా ఉంటే తప్పేముంది."

"అయితే రేపట్నుంచి స్లీవ్‌లెస్ బ్లౌజులు, లిప్‌స్టిక్, షిఫాన్ చీరలు, క్రొత్తరకం హెయిర్ స్టయిల్సు మొదలుపెడతా నుండండి. డాన్సుపాఠాలు కూడ నేర్చుకోమంటారా?"

"డాన్సు అంటే నీ కిష్టంలేదని తెలుసు! కాని అందులో తప్పేం కనపడదు నాకు! ఇదంతా పెద్ద కుటుంబం. ఇక్కడున్న ఆఫీసర్లు అందరూ

నీకు సోదరుల్లాంటివారు. మనసులో ఆ భావం ఉన్నప్పుడు, పరాయి మగవాణ్ణి తాకామన్న ఆలోచనరాదు. పవిత్రత అన్నది మనసులో ఉంటుంది. నిన్న జనరల్‌తో డాన్స్ చేశావు. నీకేమనిపించింది? అతనికి నీ తండ్రి అంత వయసు ఉంటుంది. అతను నీ చేతిని పట్టుకుని కాసేపు అటూయిటూ తిరిగితే యిందులో అపచారం, అవినీతి ఏముంటుంది చెప్పు?"

"...నేనేదో తేలిగ్గా మాటాడితే, మీ రెందుకంత సీరియస్‌గా ఉపన్యాసాలు దంచుతున్నారు..." చిలిపిగా అతని జుట్టు రేపింది శాంతి.

"క్లబ్బులో యివాళరాత్రి పిక్చరున్నట్టు చెప్పలేదేం? నిన్న సర్క్యులర్ వచ్చిందటగా!" మధ్యాహ్నం భోజనంచేస్తూ అడిగాడురావు. ఆఫీసులో మీనన్ మాటల సందర్భంలో 'పిక్చర్‌కి వస్తున్నారా?' అని అడిగేవరకు రావుకి తెలియదు.

"ఎలాగూ వెళ్ళడం అవదని చెప్పలేదు."

"ఏం! ఎందుకు అవదు? రాత్రి భోజనంచేసి ఏడుగంటలకి వెళితే పదిలోపల వచ్చేస్తాం, ఇందులో వీలవక పోవడానికి ఏముంది?"

"బాబుకి తొమ్మిది గంటలకి ఫీడింగ్ టైము, సుజాకి అన్నం అది ఎవరు పెడతారు?"

"ఒక్కపూటకు మరేం కొంప మునగదులెద్దూ, ఆయా, రాము ఉన్నారుగా! సుజాకి అన్నంపెట్టి వెడదాం, ఆయా బాబుకి పాలు పడుతుంది, మంచి పిక్చర్!"

* * *

"తొందరగా కానియ్యి, టైమయ్యింది!" టై కట్టుకుంటూ కేకవేశాడు రావు.

"అయిపోయింది!" అంటూ వచ్చిన శాంతినిచూసి నుదురు చిట్లించాడు రావు.

"మళ్ళీ అదే వేషం! ఎప్పుడూ ఆ పట్టుచీరలే కాకపోతే మొన్న కొన్న షిఫాన్‌చీర కట్టుకోకూడదూ? ఆ నల్లపూసలు, మట్టెలు ఒక్క పూటకి తీసేస్తే మరేం పాతివ్రత్యానికి భంగం రాదులే? శోభనం పెళ్ళికూతుర్లా అన్ని పూలేమిటి? ముడి చుట్టుకోకూడదూ!" శాంతిని ఆపాదమస్తకం పరీక్షిస్తూ అన్నాడు రావు.

శాంతి ఇబ్బందిగా మొహంపెట్టి "ఏమిటో వాలుజడే కంఫర్ట బుల్‌గా ఉంటుంది. ఆ ముడి నాకు సరిగా కుదరదు. ఇప్పుడు మొదలు పెడ్తే వో అరగంట పడ్తుంది. ఈసారికి ఇలా రానిద్దురూ!" చూపులు తప్పిస్తూ అంది.

మౌనంగా స్కూటర్ స్టార్ట్ చేశాడు రావు.

"అయ్యా, బాబుకి సరిగా తొమ్మిది గంటలకి పాలుపట్టు. ఫ్లాస్కులో పోశాను, సుజాని ఏడిపించకుండా పడుకోబెట్టూ రామూ!"

"ఏమిటి, వో రెండుగంటలకి అన్ని అప్పగింతలు పెడుతున్నావు? ఏది నీ కార్డిగాన్ తెచ్చుకోలేదా?"

"పర్వాలేదు లెద్దురూ, ఇవాళ అట్టే చలిగాలేదు. మళ్ళీ లోపలికి వెడితే ఆలస్యం." రావు కింకేం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియలేదు.

♦ ♦ ♦

ట్యూబ్‌లైట్ల కాంతిలో క్లబ్బంతా వెలిగిపోతూంది. రకరకాల మనుష్యులు, రకరకాల ఫాషన్లు. కొందరు అటూ యిటూ తిరుగుతూ పరిచితుల్ని పరామర్శిస్తున్నారు. కొందరు నిల్చుని మాట్లాడుతున్నారు. కొందరు అక్కడ వేసిన కుర్చీల్లో కూర్చుని మాగ్‌జైన్లు తిరగేస్తున్నారు. పిక్చరు ఇంకా ఆరంభించలేదు. అది అక్కడ పనిచేసే ఆఫీసర్లకోసం ప్రత్యేకించిన క్లబ్బు. ఓపెన్ ఎయిర్ థియేటర్లో వారానికి ఒకసారి సినిమా ఉంటుంది. రోజూ పేకాట, బిలియర్డ్స్, టెన్నిస్...ఆటల్తోపాటు అప్పుడప్పుడు డాన్సులూ డిన్నర్లూకూడ జరుగుతుంటాయి.

రావుని, శాంతిని గమనించికూడ ఎవరూ పట్టించుకోలేదు. ఆ రోజు మెస్‌లో పరిచయం అయినవారే కాకుండా యింకా చాలామంది ఉన్నారు. ఆడవాళ్ళ నవ్వుల్తో క్లబ్బు ఎగిరిపోతూంది. క్రితం సారికంటె యింకా ఎక్కువ ఆడంబరంగా తయారయారు అందరూ, ఒక్కొక్కరు ఒక్కొక్క ఫాషన్‌కి నమూనా అన్నట్టు.

రావు మొహంచూసి, అతని భావం అర్థం చేసుకుని ఆడవారి గుంపులోకి నడిచింది శాంతి. అంతవరకూ పెద్దగా నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్న వాళ్ళంతా ఒక్కసారి మౌనం వహించారు.

''ఇవాళ ఎంత సుదినం! మీరు క్లబ్బుకి వచ్చారు!'' మిసెస్ తులాని అడిగింది, కొంత సేపటికి, హాస్యం, హేళన మిలాయించి. అంతా ముసిముసిగా నవ్వి కళ్ళతో మాట్లాడుకుంటున్నారు.

"రోజూ సాయంకాలం ఏం చేస్తారు? సాయంకాలం ఓ గంట క్లబ్బుకి రాకూడదూ!'' మిసెస్ తివారి అడిగింది,

"వీలునిబట్టి చూస్తాను" వాళ్ళ అహంకారాన్ని సహించలేక అదోలా అంది శాంతి.

సినిమా మొదలైంది. లైట్లారిపోయాయి.

''చూశావా, యివాళకూడ ఎవరూ నీతో సరిగా మాట్లాడలేదు...నీ ధోరణి మారేవరకు మనని అందరూ యిలాగే ట్రీట్ చేస్తారు!'' త్రోవలో అన్నాడు రావు.

శాంతి మనసులో చెప్పలేని అందోళన చెలరేగింది. బలమైన శక్తులేవో తనకి ఇష్టంలేని దారివెంట బొమ్మని తనని తోస్తున్నట్టయింది.

♦ ♦ ♦

''ఆరే,......యిది కలా, మాయా! నన్ననుగ్రహించి దిగివచ్చిన అప్సరసా?'' స్లీవ్‌లెస్ బ్లౌజ్, షిఫాన్ శారీ, చెవులు కప్పుతూ నడినెత్తిన చుట్టిన సిగ. లిప్‌స్టిక్, నాజూకు స్లిప్పర్లు, నవనాగరికంగా కనపడిన శాంతిని చూడగానే ఆశ్చర్యపోయేడు రావు.

''ఏం, తృప్తి అయిందా మీకు? ఇంకా ఏమయినా మిగిలాయా?'' కొంచెం నిష్ఠూరంగా అంది శాంతి.

''కోపమా శాంతీ! ఎంత బాగున్నావో తెలుసా యిలా?...... వాళ్ళందరికంటె నీకు యీ స్టయిలు చాల బాగా అమరింది...గుడ్ గర్ల్. యు లుక్ వెరీ స్మార్ట్! ఇలా చెప్పినట్లు వింటే నాకెంత బాగుంటుందో తెలుసా?'' మురిపెంగా చూస్తూ దగ్గరకు తీసుకున్నాడు.

''పదండి, క్లబ్బుకి వెడదాం" కాఫీ ఇచ్చాక అంది శాంతి.

''ఏమిటి ఉప్పెన? యిదంతా నామీద అనుగ్రహమా? హాస్యమా, కోపమా?''

"ఎందుకంత ఆశ్చర్యపోతారు? ఇకమీదట మీ యిష్టం వచ్చినట్టే ఉండదల్చుకున్నాను......శాంతి మిసెస్ రావుగా క్రొత్తరూపం దాల్చదల్చుకుంది. అంతే! ఇవాళ మిసెస్ తులాని దగ్గిరికివెళ్ళి క్రొత్తరకం హెయిర్ స్టయిల్సు నాలుగయిదు నేర్చుకు వచ్చాను. ఆమె డాన్సుకూడ నేర్పుతానంది... ఇకమీదట నాతో రావడం మీకు తలవంపుగా ఉండదు!"

"తలవంపు అని నే నెప్పుడయినా అన్నానా? నన్నెందుకు అర్థం చేసుకోవు?...అందరికంటె చదువు, అందం అన్నీ ఎక్కువే అయినా అందరి ముందు తీసికట్టుగా ఉండడం ఎందుకన్నాను? అంతేగా!" అనునయంగా అన్నాడు రావు ఆమెని శాంతపరచాలని.

"సర్లెండి. మిమ్మల్ని నేనేమి అనడంలేదు, వూరికే అన్నాను... వెళ్దామా, మరి!" క్లబ్బులో అందరూ శాంతిని పరీక్షగా చూశారు. ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. ఆ నాడు అందరి కళ్లూ ఆమె మీదనే ఉన్నాయి.

* * *

"ఇవాళ మిసెస్ దారువాలా ఫోన్ చేసింది. నాలుగు గంటలకి 'లేడీస్ పార్టీ' ఉంది రమ్మని, వెళ్ళనా?" మధ్యాహ్నం డైనింగ్ టేబిల్ దగ్గర అడిగింది శాంతి.

ఎన్నడూ పార్టీలకి వాటికి ఎన్నోమార్లు అడిగితేనేగాని రాని శాంతి తనంతట తానుగా అడగడం ఆనందం ఆశ్చర్యం కలిగించింది.

"తప్పకుండా వెళ్ళు. ఇందులో అడిగి వెళ్ళేందుకు ఏముంది శాంతీ! పిల్లల గొడవ నేను చూసుకుంటానులే!"

"తొందరగావచ్చి, వచ్చాక చేస్తాను వంట"

"చూడు. తిండి అన్నది పెద్ద ఆలోచించాల్సిన విషయంగాదు. నువ్వక్కడనించి వచ్చాక వంట చేయక్కరలేదు! ఏ క్యాంటీన్‌లోనో కాని చ్చేద్దాం ఇవాల్టికి!"

అర్థం చేసుకున్నట్టు నవ్వింది శాంతి.

♦ ♦ ♦

"ఏం ఇంకా రావడంలేదా మీరు? ఏం చేస్తున్నారు ఇంత సేపు?" మామూలు వేళ దాటిపోయాక ఆఫీసుకి ఫోను చేసింది శాంతి.

"సారీ డియర్, ఇప్పుడిప్పుడే రావడానికి వీలవదు, ఏం?"

మీరు వస్తే క్లబ్బుకి వెడదామని రెడీ అయి కూర్చున్నాను."

"వెరీసారీ, నా కివాళ వీలవదు. రేపు వెడదాంలే" ఫోను పెట్టేయ బోయాడు.

"మిసెస్ మీనన్ ఇక్కడికి వచ్చింది. రమ్మంటూంది. ఆవిడతో వెళ్ళనా?"

"వెళ్తావా? సరే వెళ్ళు."

"తొందరగా వచ్చేస్తాన్లెండి. బై. బై."

♦ ♦ ♦

"అబ్బ ఇంతసేపు చేశావేమిటి? బాబు ఎందుకో ఏడ్చి ఏడ్చి ఇప్పుడే నిద్రపోయాడు. సుజా ఆకలి అని ఏడుస్తూంది" ఎనిమిది గంటలకి తిరిగి వచ్చిన శాంతినిచూసి కొంచెం చికాకు పడ్డాడు రావు.

"ఏం ఎందుకు ఏడ్చాడు బాబు? పాలుపట్టి వెళ్ళానే? ఆయా ఏం చేస్తూంది? బేబికి ఆకలంటే అన్నం పెట్టకపోయారా? వండి వెళ్ళాను?"

"ఇంతసేపూ అక్కడ కూర్చోడమెందుకు?" ఆఫీసులో పని భారం రావుమీద పని చేసింది.

"కార్డ్సులో కూర్చుంటే టైం తెలియలేదు. అందులో రమ్మీ! మొదట అయిదు రూపాయలు పోగానే కసి ఎక్కువైంది. దాంతో ఇంకో పది రూపాయలు పోయాయి. అందులో సగమైనా రాబట్టాలని కూర్చుంటే ఈవేళ అయింది!"

"సరే, ఏదో ఒకటయింది! ఇకనైన త్వరగా కానియ్యి."

* * *

"నిన్న పర్సులో నూటయాభై ఉండాలి. ఇప్పుడు ఏభయ్యే ఉన్నాయి. నీవేమైనా ఖర్చు చేశావా శాంతీ?" పర్సు చూసుకుంటూ అడిగాడు రావు

డ్రస్సింగ్ టేబిల్ దగ్గిర కూర్చుని కనుబొమలు పెన్సిలుతో దిద్దు కుంటున్న శాంతి నిర్లిప్తంగా, "నిన్న బాటాషాపులో షూస్ వచ్చాయంటే మిసెస్ దారువాలాతో పాటు నేనూ తీసుకున్నాను. దానికో ఇరవై. టెయిలర్ కో ఇరవై. మొన్న మిసెస్ తులాని కొన్నలాంటి చీర ఒకటి నలభై రూపాయలకి తీసుకున్నాను. ఎల్లుండి పార్టీకి ఎడ్వాన్సు వో ఇరవై ఇవ్వాల్సి వచ్చింది!" అన్నది.

రావు నుదురు చిట్లించాడు. "టైలర్ కి ఇరవై ఏమిటి? ఏంకుట్టించావు?"

"పేపుమీద రకరకాల డిజైన్లు కత్తిరించి స్లీవ్ లెస్ బ్లౌజులు కుట్టడానికి ఎవరో ఎక్స్ పర్ట్ టైలర్ ఉన్నాడంటే ఒక నాలుగు కుట్టమని ఇచ్చాను!"

"మిషన్ ఉందిగా, నువ్వు కుట్టుకోలేకపోయావా?"

"నా కా ఫాషన్లు తెలియవు, అదీకాక తీరుబడిలేదు."

ఇదివరకు ఇంట్లో పిల్లలవి, తనవీ అన్నీ స్వయంగా కుట్టుకుని ఒక్క పైసా ఐనా దూబరా కాకూడదనే శాంతేనా అని అయోమయంగా చూశాడు రావు.

"ఎల్లుండి పార్టీ ఏమిటి?"

"మేమంతా వారానికి ఒకరింట్లో పార్టీ ఇచ్చుకోవాలని నిర్ణయించు కున్నాం, ఎల్లుండి నా వంతు, ఫక్తు ఆడవాళ్ళ పార్టీ. మీరా రోజు దయచేసి బయటికి ఎక్కడికైనా వేంచేయమని ప్రార్థన" నవ్వింది శాంతి.

"రేపు ఇన్సూరెన్సు ప్రీమియం కట్టాలని ఉంచాను. అది కాస్త నీ ఫాషన్లకి, సరదాలకి ఖర్చు పెట్టేశా వన్నమాట!" ఆదోలా అన్నాడు రావు.

"నాకేం తెలుసు, పొరపాటయింది. క్షమించండి" చిన్నపుచ్చుకుని అంది శాంతి.

"సర్లే...తప్పు నాదీ!"

• • •

వారం రోజులు ఏదో పనిమీద ఢిల్లీ వెళ్ళాడు రావు. ఆ రోజే తిరిగి వచ్చాడు రావు. వచ్చేసరికి రాత్రి ఏడయింది. ఇంట్లో అడుగు పెట్టేసరికి సుజాత ఒకర్తే కనిపించింది, మంచంమీద కూర్చుని ఆడుకుంటూ, ప్రక్కలు అన్నీ రేగి ఉన్నాయి. ఇందినిండా బొమ్మలు, పుస్తకాలు, బట్టలు అన్నీ పడి ఉన్నాయి. ఏవీ ఉండాల్సిన స్థానంలోలేవు. కాసేపటికి ఆయా తిరిగివచ్చింది బాబు నెత్తుకుని.

"మేమ్ సాబ్ క్లబ్బుకి వెళ్ళారు! నేను బాబు ఏడుస్తూంటే అలా ఆడించడానికి తీసుకువెళ్ళాను. రాము బజారుకి వెళ్ళాడు. అమ్మాయిగారు అంతా చిందర వందర చేశారు!"

"ఇల్లంతా అలా ఉందేమిటి? సుజాని ఒక్కర్తినీ వదలి అంతా ఏమయ్యారు" అని కేకలువేసిన రావుకి భయపడుతూ పరిస్థితి వివరించింది ఆయా.

తిన్నగా క్లబ్బుకి బయలుదేరాడు రావు.

అడుగు పెట్టగానే శాంతి కనిపించింది డాన్స్ ఫ్లోర్‌మీద జంటలమధ్య. అతనెవరో రావుకీ తెలియదు. ఫాక్స్‌ట్రాట్ వాద్యానికి లయగా అడుగులు వేస్తున్న శాంతి నేర్పుకి ఆశ్చర్యపోయాడు రావు. ఫాక్స్‌ట్రాట్ ఆగింది. వాల్ట్జ్ మొదలైంది. మళ్ళీ అతనితోనే అంత సులభంగానూ వాల్ట్జ్ చేసింది శాంతి.

రావు దగ్గర్లో ఒక పేం కుర్చీలో కూలబడి బేరర్ని "ఏక్ బడా బి.కె." తెమ్మని ఆజ్ఞాపించాడు.

డాన్స్ కొద్ది నిమిషాల విరామం కోసం ఆగింది. మెడని పమిటచెంగుతో తుడుచుకుంటూ విలాసంగా నవ్వుతూ అతనితో టేబిల్ దగ్గిరకి నడుస్తున్న శాంతి రావుని చూసింది. అప్పటికి రావు బ్లాక్‌నైట్ విస్కీ నాలుగు పెద్దవి రుచి చూశాడు.

"ఎప్పుడు వచ్చారు?" సంభ్రమంగా అడిగింది శాంతి, ఎదురుగా కూర్చుంటూ.

రావు మాట్లాడలేదు. చేతిలో గ్లాసుని గుండ్రంగా తిప్పాడు. శాంతికి సగం అర్థమయినట్టయింది, ఆ మౌనం.

"రండి. యింటికి వెడదాం." శాంతి లేచింది.

రావు ఆఖరి గుటక మింగి గ్లాసు బలంగా టేబిల్‌మీద పెట్టిలేచాడు. రావు వెనకాల స్కూటర్‌మీద కూర్చుని అతని భుజాలు రెండూ గట్టిగాపట్టుకుని తలని అతని వీపు కానించింది శాంతి. అతను పోతున్న వేగంలో ఆ మౌనంలో అతని మనసులోని భావాలు ఎన్నో వ్యక్తమవుతున్నాయి.

కళ్లుచెదిరే ఆవేశంలో ఎటూ చూడలేక కళ్ళు మూసుకుంది శాంతి. ఏదో ఆవేదన రేగింది. కళ్ళెదుట రంగు రంగుల గీతలు నిలువుగా, వంకరగా, అడ్డ

దిడ్డంగా, మెరుపుల్లా మెరిసి మాయమౌతున్నాయి. తను ఆ గీతల్లో బందీగా అనిపించింది.

తను గీత దాటిందా? వాటన్నింట్లో ఏది తను దాటగూడని గీత? అంతా చెల్లా చెదురుగా ఉంది.

"అబ్బ ఏమిటా విసురు? తగ్గించండి" గట్టిగా అరచింది శాంతి, వాలు గాలిలో అతనికి వినపడదన్న భయంతో.

"అంత భయం దేనికి? యింత వేగంతో పోవడం ఇదీ ఫాషనే!" పొడిగా అన్నాడు రావు.

శాంతి కళ్ళు మూసుకుని అతన్ని గట్టిగా పట్టుకుంది. ఆమె కళ్ళముందు ఎన్నో గీతలు మెరిశాయి వంకర టింకరగా, మెరుపుల్లా!

# ఫలించని కలలు — శ్రీమతి వాసిరెడ్డి కాశీరత్నం

"ధర్మారావూ, ఇదిగో ఇలా చూడూ. ఇలాంటి ఇంటిప్లాను నువ్వు ఎందుకు గీసినట్లు?"

"ఎందుకేమిటి? చాలా తక్కువ ఖర్చుతో ఎంత బీదవాళ్ళయినా ఒక చిన్న ఇల్లు కట్టుకోవచ్చును. ఈ ప్లాను వాళ్ళకు వూరికే ఇచ్చేస్తాను."

కాగితం ఫక్కున నవ్వింది. అతన్ని పరిహసిస్తున్నట్లుగా వుంది ఆ నవ్వు.

"ఇస్తావులే. బీదవాళ్ళకు డబ్బు ఎక్కడి నుండి వస్తుంది?"

"ప్రభుత్వం వాళ్ళకు లోను ఇస్తుంది."

"వాడికి ఆస్తిలేకపోతే లోను ఇవ్వరు."

"అయితే నన్నేం చేయమంటావు? ప్లాను గీయటం వరకే నావంతు. ఈ దేశంలో బీదవాళ్ళందరి బాధ్యత నేను పుచ్చుకోలేదు. ఆ పని ప్రభుత్వానిది."

"ప్రభుత్వ మంటే ఎవరు?"

"ప్రభుత్వమా? అవును. ప్రభుత్వమే బీదవాళ్ళందరి సంగతీ చూడటం లేదూ? అలాగే. అయినా ఇదేమిటి నువ్వు నా వెంట పడ్డావు?"

దీర్ఘంగా నిట్టూర్చింది కాగితం.

"నేను చెప్పేది నీకు వినపడుతున్నది. ఆలోచించి అర్థంచేసుకోగలవు. అందుకే నీతో చెపుతున్నాను"

"సరే, సరే. అర్థం చేసుకోవటంకూడా ప్రమాదంగానే వున్నది. నీ గొడవతో నా తల తిరుగుతున్నది. నన్ను కాస్త విశ్రాంతి తీసుకోనివ్వు!" ధర్మారావు తలపట్టుకుని లేచిపోతుంటే కాగితం దిగులుగా, జాలిగా అతనివైపు చూసింది. ఆ తరువాత అక్కడే సిగ్గుపడుతూ వొదిగిపోయి పుస్తకాల క్రింద దాక్కుంది.

ఇది ఒక కాగితం కథ. ఆ కాగితం మీద ఒక చిన్న ఇంటిప్లాను. ఇంత వరకూ ధర్మారావుతో మాట్లాడింది కాగితం అంతరాత్మ.

కాగితమూ దానికో అంతరాత్మా? నవ్వివోగలరు. వెనకటి కెవడో వెర్రికుదిరింది రోకలి తలకు చుట్టమన్నాట్ట.

వెక్కిరిస్తున్నారా? వద్దు. అలా వెక్కిరించ వద్దు. ఈ కథ వింటే ఎవరూ అలా ఎగతాళి చెయ్యరు.

ధర్మారావు ఇళ్ళ ప్లానులు గీస్తాడని చెప్పాను కదా, చాలా పెద్ద ఇళ్ళు. వాటికి స్విమ్మింగ్ పూల్స్, టెన్నిస్ కోర్టులు, టెర్రెస్‌లు కూడా వుంటాయి. ఇంటికి ప్లాను వేసినందుకు ధర్మారావు వందలూ వేలూ పుచ్చుకుంటాడు. నిరంతరం ఏదో ఒక ప్లాను గియ్యకపోతే అతనికి తోచదు,

ధర్మారావు ఇప్పుడు సిటీలో వుంటున్నా పల్లెటూళ్ళో పుట్టినవాడే. అక్కడ బాల్యంలో అమాయకంగా మమతలూ, అనురాగాలూ అందుకున్న వాడే. పూర్తిగా కరడు కట్టిపోలేదు. అందుకే కళాహృదయంతో ముద్దుగా చిన్న ఇంటికి ప్లాను గీశాడు.

కేవలం రెండు గదులు, ఓ కిచెన్. చాలా చిన్నదే. అయితే ఏం దానికి అన్ని హంగులూ అమర్చాడు. చుట్టూ వేసిన ప్రహరీ చాలా కొత్తపద్ధతిలో వున్నది. ఖాళీ స్థలంలో రెండు కొబ్బరిచెట్లు, అశోక వృక్షాలు, ఒక కాగితపు పూలచెట్టు అమర్చాడు. వాటికి రంగులు వేశాడు. చిట్టచివరగా ఆ చెట్లలో ఆడు కుంటున్న ఇద్దరు ముద్దొచ్చే పిల్లలూ, వాళ్ళను చూసి సంతోషిస్తున్న తల్లి దండ్రుల బొమ్మలూ వేశాడు. అనుకోకుండా ఫామిలీ ప్లానింగ్ టచ్ వచ్చేసిం దను కున్నాడు.

ప్లాను గీశాడేకాని దాని సంగతే మరచి పోయాడు ధర్మారావు. ఎక్కడో కాగితాలలోపడి కసువులోకి వెళ్ళిపోయింది ఆ కాగితం.

రెండు రోజుల తరువాత చాకలి జంగడి దృష్టిలో పడింది కాగితం. దాన్ని చూడగానే వాడి కళ్లు మెరిసి పోయాయి. భూమ్మీద ఇలాంటి ఇల్లొకటి వుంటే మనిషికి ఇంకా ఏంకావాలనిపించింది. దాన్నితీసి గుండెలకు దగ్గరగా జేబులో పెట్టుకున్నాడు వాడు.

కాని జంగడిది నికృష్టపు బ్రతుకు. ఎంత చాకిరీచేసినా కూటికీ గుడ్డకూ చాలేది కాదు. వాడి భార్య రోజంతా రెక్కలు ముక్కలు చేసుకుని అలిసిపోయి వాడిని తిట్టి పోసేది. వాడు తన వోపికకొద్దీ భార్యను కొట్టేవాడు. ప్రొద్దుకూకే సరికి సారాత్రాగి రాత్రంతా కుళ్ళికుళ్ళి ఏడ్చేవాడు. ఈ గోలంతా భరించలేక పోయింది కాగితం. ఎలాగైనా అక్కడినుండి తప్పించుకోవాలని ప్రయత్ని స్తున్నది.

ఈ సారి కాగితం కవిత్వం రాసే కుఱ్ఱవాడి దగ్గరికి వెళ్ళింది. అతని కళ్ళనిండా ఏవోకలలు. అతను కూర్చుని కవిత్వం రాస్తుంటే అతను అద్దెకున్న ఇంట్లో మేడమీద ఇల్లాలు రోటిలో పిండి దంచేది. కవిత్వం రాసే కుఱ్ఱవాడికి ఆ రోకటిపోటు తలమీద బాదినట్లుగా వుండేది. అప్పుడే అతనికి తన జేబులో వున్న కాగితం గుర్తుకొచ్చేది. అతను ఆ కాగితంతో మాట్లాడేవాడు.

"ఇదిగో చూశావా, ఇంక నీకు విముక్తి. నేను చక్కని ఇల్లు కట్టుకుని అందులో వుంటాను. హాయిగా ఎవరూలేని చోట కవిత్వం రాసుకుంటాను. రోకలితో దంచే ఇల్లాలి గొడవ వుండదు."

కాగితంలో మళ్ళీ ఆశలు మొలకెత్తాయి. సిమెంటూ, ఇసుకా, ఇటుకలూ దాని కళ్ళముందు కనిపించేవి. కాని కొద్దిరోజుల్లోనే ఆ కవి కుమారుడు విప్లవ కవిత్వం రాస్తున్నాడన్న అపరాధంతో జైలుకు వెళ్ళాడు.

కాగితం నిస్పృహ చెందింది. అది తిరిగితిరిగి రాజారావనే ఉద్యోగస్థుడి ఇంటికి చేరింది. అత నొక అద్దెఇంట్లో వుండేవాడు. తల్లీ భార్యా పిల్లలూ. చాలా తక్కువ జీతంతో భార్యా బిడ్డలను సంసారాన్ని పోషించేవాడు. మాటి మాటికీ అద్దె ఎక్కువ ఇమ్మని ఇంటి యజమాని పీడించేవాడు. ఇంటిచుట్టూ పెంచిన కూరగాయలు వాళ్ళ కళ్ళముందే తుంచి పట్టుకెళ్ళేవాడు. అతని తల్లీ, భార్యా నిస్సహాయంగా చూసేవాళ్ళు. వాళ్ళ దుఃఖంచూస్తే రాజారావు గుండెలు తరుక్కుపోయేవి. అతను జేబులో కాగితంతీసి తల్లికి చూపెట్టేవాడు.

"అమ్మా, నాకు ప్రమోషన్ వస్తుంది. రాగానే లోను తీసుకుని ఇలాంటి ఇల్లు కట్టించుకుందాం. మన కష్టాలు తీరిపోతాయి. ఇంటి వాళ్ళతో గొడవ వుండదు."

చెమ్మగిల్లిన తల్లి కళ్ళల్లో ఇంద్ర ధనుస్సులు మెరిసేవి. ఇన్నాళ్ళకు కొడుకు ప్రయోజకు డవుతున్నాడని సంతోషం.

కాని ఆ సంతోషం చాలా రోజులు నిలవలేదు. రాజారావు వస్తుందను కున్న ప్రమోషను వెనక్కుపోయింది. అతని కొలీగ్ వెయ్యిరూపాయలు ఖర్చు పెట్టి ఆ ప్రమోషన్ చేజిక్కించుకున్నాడు. ఆరోజు రాజారావుఇంట్లో దీపాలు వెలగలేదు, అతని తల్లి మంచంపట్టి మరి లేవలేదు. కంపిస్తున్న హస్తాలతో అతను తల్లిని మట్టిచేసి వచ్చాడు.

తల్లి దినవారాలకోసం మళ్ళీ అప్పులయ్యాయి అతనికి. రోజూ అప్పుల వాళ్ళు ఇంటిచుట్టూ తిరగటం మొదలు పెట్టారు. ఇంటి ఓనరు అద్దె పెంచలేదని దుర్భాష లాడేవాడు. ఇవన్నీ రాజారావు భార్యను కృంగదీశాయి. ఏవైపునా ఆశాలేశం లేదు. చీకటి నీడలు తారాడుతున్న దుర్భర జీవితాన్ని ఆమె భరించ లేక పోయింది. బలవంతంగా ప్రాణాలు తీసుకుని విముక్తురాలయింది.

ఇప్పుడిహ రాజారావు ఏడవ లేదు. మొత్తుకో లేదు. మనసులో బాధ ఎవరికీ చెప్పుకోలేదు. నిశ్శబ్దంగా కలలో నడుస్తున్నట్లు శ్మశానానికి నడిచివెళ్ళి అంత్యక్రియలు పూర్తి చేశాడు. అగ్నిదేవుడు విజృంభించి కాలుతుంటే ఆ వెలుగు లోనే జేబులో కాగితం తీసి చితిలో పడేశాడు రాజారావు. అతని ఆశల్లాగే అది కూడా కాలిపోతున్నది.

ఆవేళ కాగితం అంతరాత్మ అనేకసార్లు ప్లాన్లుగీసే ధర్మారావు ఇంటి చుట్టూ తిరిగింది. అతనికేదో చెప్పాలని ప్రయత్నించింది. కాని సాధ్యపడలేదు. అతని ఇంట్లో చాలామంది జనం గుమిగూడి వున్నారు. వాళ్ళంతా పార్టీ చేసు కుంటున్నారు. ఒకసారి ఎవరో ఏదో చెప్పాలను కుంటున్నట్లు లీలగా అనిపించింది ధర్మారావుకు. కాని పార్టీ హడావుడిలో అతను అంతా మరిచిపోయాడు.

బయట పార్టీకి వచ్చినవాళ్ళు చెప్పుకుంటున్నారు:

"ధర్మారావు ఇదివరకు మరీ సెంటిమెంటల్ పూల్‌లా వుండేవాడు. ఇప్పుడిప్పుడే కాస్త గట్టిపడు తున్నాడోయ్."

పార్టీలో తడినీళ్ళూ, పొడినీళ్ళూ త్రాగుతున్న వాళ్ళంతా ఫక్కున నవ్వారు.

కాగితం అంతరాత్మ ఒక్కక్షణం సేపు తనను సృష్టించిన వాడివైపు అలిగా చూసింది. ఆ తరువాత మళ్ళీ వెనక్కితిరిగి శ్మశానానికి వెళ్ళిపోయింది.

# చీమలు

డాక్టర్ నాయని కృష్ణకుమారి

చీమలు చిన్నవి. బలవంతుడైన మనిషి ముందు ఎంతో అల్పమైనవి. అయినా వీటి ముందు ఎంత బలమైనా ఒక్కోసారి ఎందుకూ పనికి రాకుండా పోతుంది. ముక్కలు ముక్కలై, దిక్కులేకుండా ఆ చీమల కలుగుల్లోనే నిర్దాక్షిణ్యంగా నెట్టబడుతుంది చీమల ఎర్రదనంలో అరిభీకరత్వం ఉంది. వాటి సంఘీభావంలో గుండెల్ని అదరగొట్టే శత్రుశక్తి, నిగూఢంగా ఉంది. అవతలప్రాణి అయోమయంలో ఉన్నంత వరకూ వాటి ముట్టడికి తిరుగు లేనే లేదు.

ముప్ఫైయెనిమిదేళ్ళ మురళీధరం ముందుకు సాగిపోతున్న చీమల బారును చూస్తున్నాడు. మత్తుగా వాలి పోతున్న రెప్పల్ని అతి ప్రయత్నం మీద పైకిలాక్కుంటూ చూస్తున్నాడు. కళ్ళముందు సన్నని మసక తెర. ఒక్కో చీమ వెయ్యి చీమల్లాగా బూదర బూదరగా అలుక్కుపోయి, ఆ చీమ లన్నీ ఒక సముద్రం లాగా కనిపిస్తున్నయ్. ఇవన్నీ తరంగాలై ఉప్పొంగి తన్ను ముంచేస్తున్నట్లు శరీరంలో సన్నని జలదరింపు. ఇవన్నీ తన్ను చుట్టు ముట్టి కండకు కండ పీకి కలుగుల్లోకి లాక్కుపోతే: మురళీధరం అరచేతులు భయం వల్ల మంచులా చల్ల బడ్డాయి.

ఎదురుగా బల్లమీద కనిపించే నాటు సారాయి సీసా తెల్లగా మెరుస్తోంది. ఆ మెరుపు భయపెడుతోంది. చెవుల్లో ఏదో హోరు: వెచ్చని ఆవిరి: శరీరం అనుభవించే అయోమయపు సుఖంతో మనసు రాజీపడడం లేదు. గుండె బరువుగా ఏవేవో దిక్కుమాలిన విషయాలతో కొట్టుకులాడుతోంది. తనకే తెలియనంత అయోమయంగా తానీ జీవితం గడపడ మేమిటో మురళీధరానికి అంతు పట్టడం లేదు

మురళి బలవంతాన రెప్పల పైకెత్తి, చీమల్ని చూడడానికి ప్రయత్నిం చాడు ఎదురుగా ఉన్న బల్ల రెండు బల్లల్లాగా కనపడుతోంది. బల్లచుట్టూ ఆమ్లెట్ తునకలూ, పచ్చిమిరప తొక్కలూ చెల్లా చెదరుగా పడి, నానా కంగాళీగా ఉంది. ఒక పెద్ద తునకను లాక్కుపోయే ప్రయత్నంలో ఉన్నయ్ చీమలు. అవన్నీ ఎర్ర చీమలు. ఇంత కూడా సందులేకుండా ఆ తునకను పూర్తిగా చీమలు కమ్ముకోవడం చేత అది ఎర్రని గుండు సూదులు గుచ్చిన

బంతిలాగా మెరుస్తోంది. చీమలన్నీ ఎటులాగితే అటుకదులుతూ విధిచేతులో మనిషి బొమ్మలాగా ఉందది. మురళి దృష్టి సరిగా నిలవకపోయినా మెదడు నిండా గతానికి సంబంధించిన ఎన్నో ఆలోచనలు!

కాలేజిలో చదివేరోజుల్లో మంచి చురుకైన వాడుగా పేరు తెచ్చుకున్నాడు మురళీధరం. ఆటల్లో, చదువులో అన్నిటా నేనే ముందు సుమా అన్నట్లుండే వాడు. నవ్వుతూ నవ్విస్తూ గలగలా తిరిగే ఆ అబ్బాయికి ఇంట్లో పిల్లలంతా భయపడేవాళ్ళు. "అదుగో చిన్నాయన నొస్తున్నాడు" అంటూ మురళి అన్న భార్య పిల్లల్ని కంట్రోల్లో పెడుతుండేది. అన్నకు తమ్ముడంటే ఎంతో గురి. వంశ మర్యాదను కాపాడేవాడు వాడేనని బలరామయ్యకు తమ్ముణ్ణి చూస్తే ఎంతో అభిమానం-

సెలవుల్లో ఇంటికి వస్తే అన్న పిల్లల్ని వెంటేసుకుని ఊరిబయట దిగుడు బావిలో ఈతలు నేర్పేవాడు. ఇంట్లోలైట్లు పోయినా, తిరిగే ఫాను చెడిపోయినా, రేడియో పలక్కపోయినా, చుట్టుపక్కల వాళ్ళందరికీ మురళీ ధరం కావలసిందే. పిల్లల్ని దగ్గర కూచోబెట్టుకుని చదువు చెప్పేవాడు. చిన్నాయన కళ్ళతో బెదిరిస్తే ఎంత రాని లెఖ్ఖయినా వాళ్ళకు టపీ మని వచ్చి కూచునేది. ఉబ్రదంగా ఒంటేలుకు పోవాల్సి వచ్చినా, ఆపుకునే వాళ్ళేగాని వాళ్ళ చిన్నాయనకు వేలు చూపించడానికి భయపడేవాళ్ళు!

"అటువంటి మురళినేనా నేను? ఏమిటో, నూతిలో కప్పలాగా ఇట్లాబ్రతి కేస్తున్నాను. మనుషులూ, సంఘటనలూ అన్నీ చీమలై నన్ను చుట్టు ముట్టే స్తున్నాయ్. వీటికి లొంగి పోతున్నాను నేను. ఇది నన్ను ముక్కలు ముక్కలు చేసి కలుగుల్లోకి ఈడ్చుకు పోతున్నయ్. నేను ప్రతిఘటించాలి. ప్రతిఘటించి తీరాలి!''—— ఉద్రేకంగా అనుకోసాగాడు మురళి. చుట్టూఉన్న ప్రపంచమంతా ఉయ్యాల ఊగుతున్నట్లుగా ఉంది. ఉక్కిరి బిక్కిరిగా నవ్వుతూ, విపరీతంగా కదిలిపోతున్నట్లుగా ఉంది.

మురళీధరం పశువైద్యంలో డిగ్రీ సంపాదించగానే ఉద్యోగం ఆతణ్ణి వెతుక్కుంటూ వచ్చింది. పట్నానికి దూరంగా, ఓ నదిఒడ్డున, పుణ్య క్షేత్రంలో పశువుల డాక్టరుగా ఉద్యోగ జీవితం మొదలు పెట్టాడు. కోట్లాదిభక్తులకు మనశ్శాంతిని ప్రసాదించే ఆ దైవక్షేత్రం తన జీవితాన్ని మరో దారిన

నడవమని శాసించింది—కాదు, క్షేత్రమేంచేసింది పాపం! ఉత్త రాయిలాగా ఏళ్ళతరబడీ చలనం లేకుండా నిలిచిపోయిన దైవమేంచేశాడు? తన్ను శాసించిన వాళ్ళు వేరు. తనతోపోలిస్తే క్షుద్రులు. ఉత్త చీమల్లాంటి వాళ్ళు! వాళ్ళను తలుచుకుంటుంటే ఆ మత్తులో కూడా మురళి శరీరం ఒణికి పోసాగింది. పైన పాలనవ్వులు ఒలక బోసే నియాన్ లైటు మసక మసకగామారి పోసాగింది.

ఆ మసక తెరల్లో ఎదురుగా, నల్లగా చెయ్యెత్తు మనిషి, నీలయ్య పగల బడి నవ్వుతున్నాడు. వాడు నవ్వుతుంటే పళ్లు తెల్లగా మెరిసినా, ఆ తెల్లదనం వెనక నల్లగా అన్నీ కపటత్వపు నీడలు !

"నీలయ్యా! నువ్వా నన్నీ గతికి తెచ్చింది! ఉత్త చీమలాంటి వాడివిరా, అల్పుడివి నువ్వు! అయినా నీలాటి చీమలు గుంపుగా చేరితే బలవంతమైన సర్పం కూడా లొంగి పోవలసిందే కదా! నీకు నిజంగానే నేను లొంగి పోయానురా: ఉత్త చీమల పాల పడిపోయాను" అనుకున్నాడు మురళి.

"నేన్లేనా సార్! నీలయ్యను జ్ఞాపకం పెట్టుకున్నావు. మరి నన్ను!" అంటూ ఎదురుగా నిల్చున్నాడు సంగడు.

వాడూ నవ్వుతున్నాడు. గారగట్టి ఎర్రగా మెరిసే పళ్ళన్నీ బయటపెట్టి నవ్వుతున్నాడు. ఎర్ర చీమలు గుండ్రంగా గుంపు కట్టినట్లు, ఎర్ర జీరలతో భయంకరంగా కనిపించే కళ్ళు వాడివి. వాడిచుట్టూ, రాసి, దుబారా, చప్టీలు, కల్లు గురిగెలు, గిరగిరా తిరుగు తున్నాయి. మురళికి కంపర మెత్తి పోతోంది. భయంతోనూ, అసహ్యంతోనూ ఒళ్లు తూలి పోతోంది. లేచి నిల్చుంటే పడేట్లు న్నాడు. "ఈ అల్పులంతా తనచుట్టూ చేరారు. తనను పీక్కు తింటున్నారు. వీళ్ళను ఒదిలించుకోవాలి. ఎట్లా, ఎట్లా:"—

సంగయ్య ఆ ఊళ్ళో సారాకొట్టు యజమాని. నీలయ్యకు ఆరోప్రాణం. సారాకొట్లను ప్రతియేడూ పాటపాడ్తారు. పాట ఎవరెక్కువ పాడ్తే వాడే ఆ సంవత్సరమంతా సారా వ్యాపారం చేసుకోవచ్చు. సంగయ్య ఎప్పుడూ హెచ్చు పాట పాడేవాడే! నల్లగా పోతపోసిన విగ్రహంలాగుండే సంగయ్య, లావు పెదాల్తో, దుబ్బుగా పెరిగిన కనుబొమల్తో చూడగానే జంకు కలిగిస్తాడు. రాజు

వేషం తగిలిస్తే వాడు ప్రాచీన రాజవంశాలకు చెందిన ఏ ద్రావిడ మహారాజు లాగానో రక్తి కట్టిస్తాడు. కల్లు దుకాణంలో నాపరాయి పరిచిన ఎత్తయిన దిమ్మమీద కూచుని, చుట్టూ పెద్దపెద్ద కల్లుబానల్తో వ్యాపారం చేస్తుంటే, వాడొక మకుటంలేని మహారాజు లాగానే కనిపించేవాడు.

సంగడికి సారా వ్యాపారంతోపాటు పాడి పశువులుకూడా ఉండేవి. పాలనూ సారానూ సమానంగా ఆదరించే ఈ దేశంలో వాడి వ్యాపారాలు రెంటికీ నష్టం ఉండేది కాదు. పశువులకు దొమ్మరోగం వచ్చో, ఉంగిడితగిలో, పొట్ట ఉబ్బో, అవస్థలు ప్రాప్తించినపుడల్లా సంగడికి మురళీధరం గోపాల కృష్ణుళ్ళా కనిపించే వాడు!

మురళి హస్తవాసి మంచిది. జబ్బుగా ఉన్న పశువు తన ముందుంటే, ఇది ధనవంతుడిదా, బీదవాడిదా అన్న ఆలోచన వచ్చేది కాదు. దీని బాధను ఎంత తొందరగా పోగొట్ట గలనా అని తహతహలాడేవాడు. జబ్బుగా ఉన్న పశువుల కళ్ళల్లో భాషను చదవగలిగితే అవి, "మురళి మా అమ్మ, – మురళి మాకన్నతల్లి!'' అంటా యనడంలో సందేహం లేదు.

''అందుకే సార్! నువ్వంటే నాకు దేవుడితో సమానం. ఆ నీలిగాడి మాటలిని నీ మనసు సమాధాన పడ్డదని, నీకు సారాతాగడం నేర్పినాను! నిన్ను పూర్తిగా ముంచేసినాను సార్!" – ఎదురుగ్గా సంగడి బొమ్మలో ఏడుపు ముంచుకొస్తోంది.

''అవున్లే! నీతప్పేముంది!–కల్లుసీసా చూస్తేగాని నిలవలేని స్థితికి నన్ను నువ్వు రమ్మన్నావా!– నేనే ఆ ఊబిలో దిగిపోయాను – కాదు సంగయ్యా, ఆ షేర్ ఖాన్‌తో షరీకై నీలయ్యే నన్నీ ఊబిలోకి దించేశాడు. మురళి శరీరం మత్తుగా ఉన్నా మెదడులో ఏ మూలనో పదునైన ఆలోచనా తరంగాలు! అన్నీ చిక్కుపడి, గజిబిజిగా ఒక కొలిక్కిరాని గతకాలపు భావనలు!

పశువుల వైద్యుడికి, వైద్యంతోపాటు మరో బాధ్యత కూడా ఉంది. అది కబేలాకు తోలుకొచ్చే పశువుల్లో దేన్ని కొయ్యచ్చో, దేన్ని కూడదో చెప్పే బాధ్యత. మురళి అధికారముద్ర లేకపోతే మనుష్యులు తినే అర్హత పశువుల కుండదు. ఈ సందర్భంలోనే షేర్‌ఖాన్ మురళి జీవితంలోకి ప్రవేశించాడు.

షేర్‌ఖాన్ పేరులో కనిపించే పెద్దపులితనం వాడి బతుకులో అణు వణువునా ఉంది. ప్రతి కదలికలో 'పులిసుమా' అనే జంకును ఎదుటి వాడిలో కలిగించే శక్తి ఉంది వాడికి. వాడికి లోకమంతా ఒక పెద్ద కబేలా. ఇందులో తనకు నచ్చని వాళ్ళు పశువులు. తాను మెచ్చిన వాళ్ళు, అట్లాంటి పశువుల్ని మాంసపుపోగుల కింద మార్చి డబ్బు చేసుకునే చతురులు.

డబ్బంటే యేమిటో షేర్ ఖానుకు బాగా తెలుసు. ఒక పులి మేక గొంతు కొరికి చవిచూచే రక్తంలాంటిది డబ్బు. వెచ్చగా చిక్కగా, ఘాటుగా ఎన్నో సదుపాయాలను వెగటు పుట్టే దాకా అందించేదే డబ్బు! ఆ వెగటు దనంలో ఉండే చిత్రమైన సుఖంకోసం వాడేమైనా చేస్తాడు. దాన్ని సాధించ డానికి మొత్తం లోకాన్ని తన కత్తికింద మెడపెట్టిన మేకలాగా చూస్తాడు.

అయితే షేర్‌ఖాన్‌లో ఉన్న ఈ పులితనం మురళీధరం మనసు కెక్కనే లేదు.

ఒక రోజున, "ఏమిటోయ్ ఖానూ, ఎవరీ జీవాల్ని నీకు అంట గట్టింది? వీటికి రోగం ఉంది. ఇవి కొయ్యడానికి పనికిరావు" అంటూ తన పరీక్ష పూర్తి చేశాడు మురళి.

"ఏం చేస్తాం బాబుగారూ! మనుషులకే సరిగా తిండి దొరకని రోజుల్లో పశువులకు జబ్బుగాక మరేంటండి! మీరేదో ఆ ముద్రగొట్టేయండి. మీ రుణం ఉంచుకునే వాణ్ణిగాదు!" అన్నాడు షేర్‌ఖాన్.

మురళికి చర్రున మండింది. వీడు ధర్మపన్నాలు చెప్తున్నాడా! లేక శాసిస్తున్నాడా! "అంటే ఏమిటయ్యా నీ ఉద్దేశం? నేను ప్రభుత్వం చేతి కింద ఉద్యోగినా! కాక నీ కింద పని చేస్తున్నానా! పశువు బాగుందీ లేందీ చెప్పేది నేను. నేను చెప్పాకే, నువ్వు కోసేదీ అమ్మేదిన్నీ!"

ఒక్క క్షణంలో సగం సేపు దిమ్మరపోయినట్లయింది ఖానుకు. ఇన్నా ళ్ళకో మొనగాడు పుట్టాడన్నమాట! గుండెల్లో పొంగి అంచులు తాకుతున్న అహంకారాన్ని అక్కడే అణిచేశాడు. చేతులు పిసుక్కుంటూ మొహం దీనంగా పెట్టుకుని బతిమాలి చూచాడు. కాని మురళి బహు మొండి మనిషి. ఒక వేళ తను చేసేది తప్పని తనకు తెలుస్తున్నా, అదే ఒప్పని వాదించే రకం. అటు

వంటిది తన పక్షం న్యాయపక్షమైనప్పుడు ఇక చెప్పాలా? ఆ రోజు కబేలా కొచ్చిన పశువుల ఆయుర్దాయం పొడిగించ బడ్డది. షేర్ ఖాన్ గుండె ఉప్పెన నాటి సముద్రంలా ఘూర్ణిల్లి పోయింది.

ఇదుగో ఇక్కడ మొదలైంది చీమల సంఘీభావంలోని బలం!

బారులుకట్టి ముందుకు సాగే చీమల్ని ఎప్పుడైనా గమనించారా! ఎదురుగా ఒక చీమవస్తూ బారులో ఉన్న చీమల్ని ముక్కూ ముక్కూ మోటించి రహస్యం చెప్పుకుంటూ పోతుంది. అంతే! అన్నీ ఆ సమాచారాన్ని అక్షరాలా అమలు పరుస్తాయి. ఎక్కడో ఉన్న పెద్ద జీవాల్ని చుట్టుముట్టి లొంగదీసుకుని మోసుకొచ్చేస్తాయి. ముక్కు మోటించిన చీమ మళ్ళీ ఈబారులో కలవదు. అది కావలసినప్పుడు హంగుచేస్తుంది. పైనుంచి పెత్తనం చేస్తుంది. షేర్ ఖాన్ తంతు, ఇక్కడ సరిగ్గా అటువంటిదే.

నీలయ్యా, షేర్ ఖానూ మంచి స్నేహితులు. షేర్ ఖానును కాదని ఆఊళ్ళో నీలయ్య బతకలేడు; ఆమాటకొస్తే ఎవరూ బతకలేరు.

నీలయ్య బతక నేర్చినవాడు. తన అవసరాలు తీర్చుకోడానికి పెద్దవాళ్ళ దగ్గర అతి వినయాన్ని ఎట్లా వాడతాడో, చిన్నవాళ్ళదగ్గర జబర్దస్తీతనం అంతకు రెండు రెట్లు చూపిస్తాడు. వాడి చేతులో కత్తే ఉంటే దానికి రెండు వేపులా పదునుంటుంది. అవడానికి కాంపౌండరయినా మురళిదగ్గర ప్యూనులాగా పనిచేసేవాడు నీలయ్య. ఆ సేవాభావంతోటే మురళి నమ్మకాన్ని బోలెడంత కొనుక్కున్నాడు.

నాయకులంతా ఉపన్యాసాలు దంచే సమ సమాజభావం మురళి శరీరంలో సహజంగా, రక్తంలాగా ప్రవహిస్తుండేది. అతను నీలయ్య భుజంమీద చెయ్యేసుకుని బజార్లలో బాహాటంగా తిరిగేవాడు. నీలయ్య మీదున్న నమ్మకం మురళీధరాన్ని చాలాదూరం తీసుకెళ్ళింది.

ఆసుపత్రినిండా ఖరీదయిన మందులూ, శస్త్రసాధనాలూ ఉండేవి. వాటి వాటి వాడుక వివరాలు తెలియజేసే రిజిష్టరులో ప్రతిరోజూ ఆఫీసు మూసే వేళకు మురళి సంతకం చెయ్యాలి. వాటిని భద్రంగా బీరువాల్లో బిగించి తాళాలు మురళే జాగ్రత్త చేసుకోవాలి. అయినా నీలయ్య రిజిష్టరుతెస్తే వివరాలు చూచు

కోకుండానే మురళి సంతకం పెట్టేవాడు. తాళాలు ఒక్కొక్కసారి నీలయ్య దగరే ఉండేవి.

మురళి ఎదురుగా ఉన్న సీసాలన్నీ ఖాళీ అయిపోయాయి. బుర్రలో ఎన్నో రంగులు మిణుగురుల్లా ఎగురుతూ మాయమౌతూ యాతన పెడు తున్నాయి. "నువ్వురా, నీలయ్యా, మొనగాడివంటే! నా సర్వీసులో ఒడుదుడుకులు తెచ్చావ్. అందరి ముందూ నన్ను తప్పుచేసిన వాడిలాగా నిలబెట్టేశావ్. 'మనసుకు సమాధాన మౌతుంది సార్' అంటూ నన్ను తాగుబోతుని చేశావ్. చివరకు రామచంద్రారెడ్డి హత్యలో నన్ను ఇరికించాలని చూచావ్. పాపం! రామచంద్రారెడ్డి!-" మురళిబుర్ర అడ్డదిడ్డమైన ఊహల్ని పట్టుకుని అలగం తిరుగుతోంది.

నిజానికి రామచంద్రారెడ్డిని గురించి చెప్తేగాని, నీలయ్య ఎంత దుష్టుడో తెలియదు.

ఆ ఊళ్ళో పశువుల ఆస్పత్రీ పంచాయతీ ఆఫీసూ, ఒకే బిల్డింగ్‌లో ఉన్నాయ్. రెండింటిలోకీ ప్రవేశించడానికి ముఖద్వారం ఒకటే. రామచంద్రా రెడ్డి ఆ ఊరికి సర్పంచి. పేరునుబట్టి అతణ్ణి రామచంద్రుడనుకోడానికి వీలు లేదు. ఆ రామచంద్రుడికి రాజకీయాల తికమకలు తెలీక, సవతల్లి అడవులకు పొమ్మందే తానొక్కడే కాకుండా పెళ్ళాన్నీ, తమ్ముణ్ణీ వెంటేసుకుని మరీ వెళ్ళి పోయాడు. ఈ రామచంద్రారెడ్డి రాజకీయాల్లో ఆరితేరినదిట్ట. ఎత్తుకు పైఎత్తులు వేసి ఎప్పుడూ తనకుర్చీకి అతుక్కుని కూర్చుండి పోవడం నేర్చుకున్నవాడు. అందుకే ఆ ఊళ్ళో చాలామందికి అతగాడు నచ్చేవాడు కాదు. పైపెచ్చు, బుద్ధి పూర్వకంగా కొంతా, తెలికకొంతా, రక్తం కళ్ళజూడాలనే కచ్చబోతు మను ష్యుల్ని శత్రువులుగా సంపాదించుకున్నాడు. ఒకరోజు, పంచాయతీ ఆఫీసులో బల్లదగ్గర కూచున్న రెడ్డిని ఎవరో చంపేశారు. అందుకు వాడిన ఆయుధం పశువుల ఆస్పత్రికి చెందిన స్కాల్‌పెల్.

"ఒరే నీలయ్యా! తన కుర్చీతప్ప మరోటి పట్టించుకోని రెడ్డి నిన్నేం చేశాడురా! హంతకుల చేతుల్లోకి మన ఆస్పత్రి స్కాల్‌పెల్ ఎలా వెళ్ళిందిరా రాస్కెల్! మందమైన పశువుల చర్మాన్నే కోసేదానికి మనిషి గుండె ఒకలెఖ్ఖా! దీనికంతా ఎవరురా కారణం, ఎవరు?"- మురళీధరం ఊగిపోతున్నాడు. శరీరం

వశం తప్పిపోతోంది. మత్తుకు తోడు మెదడంతా నిండి రొదచేసే ఆలోచనలు, ఒక దారీ తెన్నూ లేకుండా!

"బి. డి. వో. తనిఖీకి వచ్చినప్పు డెంత నాటకమాడావ్! పోయిన సామాన్లకీ, మందులకీ నేనట్రా కారణం! నాకు నాటు సారా అలవాటుచేసి, అప్పులుపెట్టి, నేను మత్తులో ఉంటే నా జేబులో జీతం డబ్బులు కొట్టేసి—! ఒరేయ్! సంగడి గేదె చచ్చిపోతే నా అశ్రద్ధవల్ల నేనని వాడికి పురెక్కిస్తావురా! సారా మత్తులో ఒకదానికొక మందిచ్చి చంపేశానంటావురా! పశువులు మూగ జీవాలురా! అవి నా ప్రాణాలురా!"

మురళికి ఎక్కిళ్ళొస్తున్నయ్. ఎక్కిళ్ళతోపాటు కన్నీళ్ళొస్తున్నయ్. ఉద్రేకం అతణ్ణి నిలవనియ్యడం లేదు. కుర్చీమీదనుంచి లేచి నిటారుగా నిల్చోడానికి విశ్వప్రయత్నం చేశాడు. లేవబోతూ మోకాలు ముందుబల్లకు కొట్టుకున్నాడు. పక్కకో అడుగు వెయ్యాలనే ప్రయత్నంలో కుడిపాదం ముందుకు నెటాడు. అడితూలి పక్కన ఆమ్లెట్ ముక్కను కమ్ముకునున్న చీమల గుంపు మీద పడ్డది.

కాలికింద మెత్తగా కసకస నలిగిపోతూ ఎన్ని అల్పప్రాణాలు! ఆ క్షణాన వెన్నుపాములో జంకో, జలదరింపో, విద్యుత్తు ప్రసరించినట్టు ప్రసరించింది. ప్రయాణం చేస్తున్న మనిషి నిద్రమత్తు బస్సు కుదుపుకు ఠపీమని ఎగిరిపోయినట్లుగా, మురళి మెదడు మత్తులోనుండి ఒక్కసారిగా తేరుకుంది.

నలిగి అట్టకట్టుకుపోయిన చీమల మీద నుండి కాలు తీసేశాడు మురళి. "ఒరే ఖానూ, నీలయ్యా, సంగడూ! మీరంతా ఉత్త చీమలురా! వీటినిచూడండి! బాగా చూడండిరా! నా కాలికింద నలిగి పచ్చడై పోయాయి. అంటూ పగలబడి నవ్వసాగాడు. ఆ నవ్వుకు ఇల్లంతా దద్దరిల్లి పోయింది.

# కొమ్మ చిగురించింది!

శ్రీమతి తురగా జానకీరాణి

''అమ్మా, ఎందు కింత ముదురు ఎరుపు రంగు చీరె కొన్నావు? నాకు ఉండిగా ఈ రంగు?'' అన్నది నిర్మల, బట్టల పేకెట్లు అన్నీ విప్పి పడేసిన తరవాత,

''అది నీకు కాదే, నాకు. నీకు అదుగో, ఆ గోల్డు కలరు చీరె తెచ్చాను'' అన్నది హేమలత, పర్సులోని డబ్బులన్నీ టేబిలుమీద గుమ్మరించి లెఖ్ఖచూస్తూ.

''నీకా?'' అని నోరు తెరిచి అమ్మవంక చూసి, ''నీకేం బాగుండదు. ఆ పైన నీ ఇష్టం'' అని చెప్పేసి తన కోసం కొన్న చీరె తేసి భుజంమీద వేసుకుని చూసుకోసాగింది నిర్మల.

''ఏం, ఎందుకు బాగుండదూ? అంత నల్లగా ఉన్నానా నేను? నాకు, మీ డాడీకి చాలా ఇష్టం ఆ రంగు'' అన్నది హేమలత.

''రంగుకాదు. నీకు టెరిలిన్ బాగుండదు. నీ ఇష్టం అన్నానుగా?'' అన్నది నిర్మల. ఆ తరవాత నవ్వేసింది. జాకెట్టు బట్టలు అవీ అన్నీ చూసి, తనని వెంట తీసుకునివెళ్ళకుండా బజారు పని చేసినందుకు అన్నీ దండుగ బేరాలు చేసింది అమ్మ అని తేల్చింది.

అది తన చీరె తీసుకుని అవతలికి వెళ్లాక, హేమలత ఎర్రచీరెని చేతుల్లోకి తీసుకుని చూసింది. మెత్తగా జారిపోతూ ఎంత బాగుందో ఆ చీరె? తను సందేహిస్తూనే కొన్నది. కానీ, తను కట్టే నూట ఇరవై నంబరు వెంకటగిరి కంటే ఏమీ పలచగా ఉండదనుకుని కొన్నది. పద్దెనిమిదేళ్ల క్రితం తను ఆ రంగు మైసూర్ జార్జెట్ చీరె కట్టుకున్నప్పుడు ఆయన తనని ఎల్లా కళ్లతో అభినందిస్తూ, ప్రేమిస్తూ చూసిందీ గుర్తుకి రాక మానదు. సంక్రాంతి రాబోతూంది కదా? పండుగనాడు కొత్తచీరె కట్టుకోవాలి కదా అని ఇదే తీసుకుంది. నిర్మల చటుక్కున అనేసింది ఆ మాట.

పోనీ దానికే ఇచ్చేస్తేనో—కానీ, అది వద్దన్నది. వద్దన్న వస్తువు ఏమైనాసరే ముట్టదు, కావాలన్న చీరె వదలిపెట్టదు. తను మనసుపడి కొన్న చీరె కట్టుకోవడానికి ఇంత ఆలోచన దేనికి? ఇప్పుడే తనకి బాగుండనప్పుడు ఇంక నాలుగేళ్లు పోతే అసలు బాగుండదు. కాబట్టి కట్టుకునితీరాలి. ఎర్ర

జాకెట్టు బట్ట తీసి దాని పక్కన పెట్టి చూచి, సంతోషపడి, అవన్నీ తీసుకుని బీరువాలో పెట్టడానికి బయలుదేరింది హేమలత.

రాత్రి ఆయన రాగానే చూపించి, "ఏమండీ, నాకు బాగుండ దంటోంది అమ్మాయి'' అని చెబుదా మనుకుంది. కానీ, ఆమె నిద్రపోయాక వచ్చా రాయన. ఆ నిద్రలో అన్నం తిన్నారా అని అడగడానికే కళ్లు తెరవలేక పోయింది. ఇంక చీరె సంగతి అడిగేదెల్లా? తెల్లారి ఏడున్నరకే వెళ్లిపోయారు. మరునాడు మధ్యాహ్నం భోజనానికి వచ్చినప్పుడు చూపించింది. "ఏమండీ, నే నిల్లాంటి చీరె కట్టుకుంటే బాగుండదా?'' అని అడిగింది.

రామమూర్తి నవ్వి, "ఎవరన్నారు?'' అన్నాడు చీరెని చేత్తోపట్టుకుని చూచి.

"నిర్మల అన్నది. పలచగా ఉంది, బాగుండ దంది.''

ఆయన మళ్లీ నవ్వి, "ఏమో మరి! నాకు తెలియదు. నువ్వు ఏది కట్టు కున్నా అందంగానే ఉంటావు" అన్నాడు.

"ఏది కట్టుకున్నా అని కాదు. పద్దెనిమిదేళ్ల క్రితం సంవత్సరాదినాడు ఈ రంగు చీరె నేను కట్టుకుంటే ఎంతో బాగుందని మీరు మెచ్చుకున్నారు. అందుకే కొన్నాను." అప్పటి దృశ్యమంతా గుర్తు చేసుకుని ఆయన సంతోష పడతాడని అనుకుంది హేమలత.

"అబ్బ, ఎంత గుర్తు నీకు! నేను అల్లాంటివి అప్పుడే మరిచిపోతాను. మరి నా భోజనం మాట చూడవూ?" అన్నా డాయన.

"పెడతాను. ఇంతకీ ఇది కట్టుకోనా, వద్దా?''

"కట్టుకో—కొనుక్కున్నావుకదా? అమ్మాయి ఏదో అన్నదని అను మానం దేనికి?" భోజనానికి తొందర పడసాగాడు రామమూర్తి. వందలు, వేల రూపాయల వ్యాపార విషయాల్లో ఇది ఒక సమస్యే కాదతనికి, మరి.

* * *

"నీ చీరె చాలా బాగుంది, హేమలతా!'' అన్నది మిసెస్ నాయుడు, అద్దం దగ్గిర నిలబడి తలలో పూలుసవరించుకొంటున్న హేమలతతో.

"చీరె సంగతే చెబుతావేం? అది కట్టిన సుందర విగ్రహం సంగతో?" అన్నది మిసెస్ శాస్త్రి నవ్వుతూ. సిగ్గయిన చిరునవ్వుని అట్టే ఆపేసుకుని వెనక్కి తిరిగి, "ఎంతో సందేహిస్తూ కట్టాను దీన్ని. మా నిర్మల గొడవ చేసింది, విశాఖపట్నం కాన్ఫరెన్సుకి మాత్రం దీన్ని పట్టుకెళ్లడానికి వల్లకాదని" అన్నది చీరె కుచ్చెళ్లు సాపుచేసుకుంటూ.

"ఏం? చక్కగా ఉంది మీకీ రంగు. కొత్త పెళ్లికూతురిలా ఉన్నారు" అంటూ గదిలోని ముగ్గురూ మెచ్చుకున్నారు. అందరూ చేరి ఒక వాన్ ఎక్కి సముద్రంలో షికారుకని బయలుదేరారు.

కాన్ఫరెన్సు అనే ఒక తతంగం పూర్తయింది. ప్రతినిధులుగా వచ్చిన వారు వింతలు, విశేషాలు చూడడం మిగిలింది. సముద్రం షికారుకి ఏర్పాటు చేసిన కరుణాకరం అనే ఆఫీసరు వీరికి ఎదురువచ్చి పరిచయం చేసుకున్నాడు. చక్కని విగ్రహం అతనిది. పాతిక, ముప్పై సంవత్సరాలు ఉంటాయి. పరిచయాలు అయినాక స్టీమ్‌లాంచి మీద ఎక్కించారు. గాలి, ఒక మాదిరి పచ్చరంగు నీళ్లు, ఆ నీటిని కోసుకుని పోయే లాంచి, చుట్టూ కొండల్లాగ ఎత్తైన స్టీమర్లు. అక్కడే వాటిని అనుకున్నట్లున్న కొండలు, వద్దంటున్నా వినక స్టీమ్‌లాంచి అంచున కూర్చున్నది హేమలత. కరుణాకరం ఏదో చెబుతూంటే అందరూ గుమిగూడి వింటున్నారు. ఆ తరవాత ఒక స్టీమరు లోపలికి వెళ్లి చూచారు. అక్కడ కేబిన్ల మధ్య నడుస్తూంటే, "మిమ్మల్ని ఇదివరకు ఎక్కడో బాగా చూచినట్లుందండీ" అని మాట కలిపాడతను.

"ఏమో మరి, నాకూ అల్లాగే అనిపిస్తోంది" అన్న దామె.

ఎక్కడుంటారని అడ్రెసు అడిగి తెలుసుకున్నాడు. అతని వెంటే తనూ నడవటం, అతని వెంటే ఇనపబద్దీల మెట్లు దిగడం జరిగింది. లాంచిలోకి మళ్లీ ఎక్కేటప్పుడు "ఫరవాలేదు" అంటూ చనువు తీసుకుని చేయి అందించాడు కూడా.

లాంచి సముద్రం లోపలికి పోతూంటే అలల ఊపు తెలియసాగింది. వేగంగా, అతి వేగంగా సాగుతూ సముద్రంలో కొంతదూరం పోయింది. సబ్‌మెరిన్‌లు, అప్పుడే వచ్చిన స్టీమర్లు చూపించా డతను. దీపాలు వెలుగుతుంటే

ఎవరో హేమలతని పాట పాడమన్నారు. పాడింది. "ఎంత బాగా పాడారండీ!" అని మెచ్చుకున్నా డతను.

కళ్లలో ఆ దీపాలు మెరుస్తూంటే, మెత్తని తన ఎఱ్ఱచీరె గాలికి రెపరెప లాడుతూంటే, చేతిని బుగ్గకి ఆన్చి పాడింది పాట. అంతటినీ వింత కళ్లతో చూసింది. "రేపు ఎక్కడికి వెడుతున్నారు?" అని అడిగా డతను. "అరకువేలీ వెడుతున్నాం—మీరూ రాకూడదూ?" అన్నది. "రావచ్చు మీరు పిలుస్తోంటే తప్పకుండా రావచ్చు" అన్నాడు. ఆ సాయంత్రం అల్లా జరిగింది.

తిరిగి వచ్చాక అందరూ ఏవో పనుల్లో పడిపోగా హేమలత అద్దం దగ్గరకు వెళ్లింది. సాయంత్రం జరిగిన విషయాలన్నీ మనస్సులో కదులు తున్నాయి. ఎఱ్ఱని పెదిమలు, తెల్లని పలువరస గల కరుణాకరం గుర్తుకు వస్తున్నాడు. అతను మాట్లాడిన తీరు మరువరానిదిగా ఉంది. అద్దంలో చూసు కుంటే తనకి నుదుటిపై కనబడిన తెల్ల వెంట్రుకలు నాలుగు, ఇదివరకులాగ నిరాశ కలిగించలేదు. ముప్పైఎనిమిదేళ్ల వయస్సుని, ఎమ్.బి.బి.ఎస్. చదివే కొడుకుని, బి.ఎస్.సి లో చేరబోతున్న కూతురిని తలుచుకున్నది. కానీ, అంత వయస్సు పిల్లలు తనకీ ఉన్నారా అని తనకి తనే ఆశ్చర్యపోతూ వంగి ప్రతిబింబంలో కళ్లలోకి చూసుకుంది. నల్లని కనురెప్పల క్రింద ఒక లాలసభావం తొంగి చూస్తూంది. లజ్జతో, ఆహ్వానంతో నిండిన చూపు చురుక్కుమని వస్తూంది. కన్నెగా ఝల్లనిన ఎదపై చేయి ఉంచుకుంది. తప్పు లేదు సుమా, అనుచితం కాదు సుమా అన్నట్లు గుండెని సవరించుకుంది హేమలత.

* * *

మరునాడు కరుణాకరం రానేవచ్చాడు, అరకులోయ ప్రయాణానికి. వంపులు తిరిగిన కొండదారిపైన కారు హోరుమని శబ్దంచేస్తూ పోతూంటే, అతను ఏదో మాట్లాడుతూనే ఉన్నాడు. "మీ కిద్దరు పిల్లలా? మైగాడ్! మీరే కాలేజీ అమ్మాయిలా ఉన్నారే!" అన్నాడు. ముఖం పక్కకి తిప్పుకుని, "అల్లాగా!" అని మెల్లిగా అన్నది. ముఖం ఎఱ్ఱబడింది.

"ఆ కొండల మీద ఎదురుగా ఆ మామిడిచెట్లు చూడండి. అంతా కొత్త చిగురే. కొత్త ఎఱ్ఱచీరె కట్టుకుని—ఉదాహరణకి నిన్నటి హేమలత గారిలాగ

—ఎంత సొగసుగా నిలబడిందో! ఈ అరణ్యానికి రాణి ననుకుంటోంది. జీలుగుచెట్లుచూశారా, బలమైన పల్లెటూరి మగవాళ్లలాగ ఎల్లా ఉన్నాయో!" అంటూ అతను చేయి చాపి చూపించాడు. అందరితోటీ అతను మాట్లాడాడు కానీ, తనకోసం ఒక ప్రత్యేకమైన కంఠం, ఒక ప్రత్యేకమైన చూపు దాచి ఉంచి, అప్పుడప్పుడు వలలాగ తన మీద విసిరి, బంగారు చేపలాంటి తన మనస్సుని పట్టివేసినట్లు అనిపించింది హేమలతకి.

అడవిచెట్ల వాసన, అడవి కుల అపచ్ఛదనం, కళ్లకి కొత్తదనం చూపించే ఏవో రంగు రంగుల పూలు, పరచిన పచ్చని కాన్వాసు లాగ ఉన్న ఆ పర్వతాలు చూసింది ఆమె. అక్కడక్కడ నిద్రపోతున్న ఊళ్లని, స్వచ్ఛంగా పారే ఊట నీళ్లతో మెట్లుమెట్లుగా అరలు ఏర్పాటుచేసి పండిస్తున్న పంటని చూసింది. పెను సింహాల్లా ఉన్న ఈ కొండలని లొంగదీయాలని మనిషి పట్టిన కుస్తీ అక్కడక్కడ జనిపించింది. ప్రకృతిలాగ సహజంగా పుట్టి పెరుగుతున్న మనుష్యులు కనపడ్డారు. పాట పాడమంటేనే సిగ్గు ముంచెత్తుకు రాగా వంకర్లు తిరిగిన వయ్యారి వనితలు కనపడ్డారు. ఎక్కడో దూరమూరాలకి మనస్సుని తీసుకుపోయే పాటలు విన్నారు. దోర వెన్నెట్లోతడిసిపోతున్న ఆ పల్లెల్ని చూస్తూ, చెంపలని చురుక్కున తాకే చల్లగాలికి వణుకుతూ, చీకటి లాంటి అడవిలో ఏదో అందం చివరిసారి ఇంకా కనపడుతుందేమోనని వెతుకుతూ తిరుగు ప్రయాణం ప్రారంభించారు. తిరిగి వచ్చాక కరుణాకరం, "రేపే వెళ్లిపోతున్నారా? మీ ఊరొస్తే కనపడుతారా?" అన్నాడు. జవాబు చెప్పిన ఆమె కంఠంలోకి ఏదో సున్నితత్వం వచ్చింది. వీణ మీటు లాంటి ఒక ధ్వని నవ్వులో దాగి పలికింది. ఆ ప్రయాణం అల్లా ముగిసింది.

* * *

ఆ ప్రయాణం ముగిసిం దనుకుందే కాని హేమలత దాని తాలూకు ప్రణయం ముగిసిం దనుకోలేదు. పిల్లగాలిలా వీచి, అడవిలోని మావిపూల సుగంధం తెచ్చి, మనస్సుపైన పూసిన ఆ సంఘటలు మరిచిపోలేక పోయింది. మరుపనీయకుండా వారం రోజులకే టెలిఫోన్ చేసి, కరుణాకరం – "ఊళ్లోకి వచ్చాను, ఇంటికి ఎప్పుడురాను" అని అడిగాడు. శీకి రమ్మన్నది. అన్నాక – కాదు, అనేటప్పుడే– కాదు, అనే ముందే – గుర్తు కొచ్చింది రామారావు, నిర్మల ఆ టైముకి ఇంట్లో ఉండరని.

రెండు గంటలనుంచి కంటిమీద నిద్ర తేలిపోయింది. ఏమి చీరె కట్టు కోవాలని, అతన్ని ఎక్కడ కూర్చోబెట్టాలని, ఏది మాట్లాడాలని - అన్నీ ఆలోచనలే. తాపత్రయం మనస్సులో. అద్దంముందు కూర్చుని కళ్లు, ముఖం చక్కగా దిద్దుకుంది. కాటుక వేళ్లతో రెప్పల వెంట్రుకలు ఎగదోసింది. పెదిమలకు అంటీ అంటని రంగుపూసింది. లేతనారింజ రంగు మెరిసే చీర కట్టుకుంది. డ్రాయింగ్ రూమ్ అంతా సర్ది, సోఫాలో దిండ్లు సరిగా అమర్చింది. మూడున్నరకే అతను వచ్చాడు. గేటులోకి కారు వస్తున్న చప్పుడుకి హేమలత గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. అతను లోపలికి వచ్చిన సవ్వడికి రక్తం వెచ్చగా బుగ్గలోకి వచ్చింది. కొద్దిగా తడి వచ్చి తెల్లని కళ్ల మరింత తెల్లగా మెరిసిపోయాయి.

"బాగున్నారా? అబ్బే, అడగడం నాదే తప్పు. నిజంగా చాలా బాగు న్నారు" అన్నాడు కరుణాకరం.

ఏదో మాట్లాడిన తరవాత, "ఈ వారం రోజుల్లో నేను ఎప్పుడైనా గుర్తు వచ్చానా?" అన్నాడు. అత నిల్లాంటి మాటలు అన్నప్పుడల్లా హేమలత హృదయంలో ఒకమూల జివ్వుమనే బాధ బయలుదేరి హృదయాన్నంతటినీ ఆక్రమించి ఆ బరువుకి ఆమెని క్రుంగదీస్తూంది. అంతలోనే అంతా మాయమై మనస్సు దూదిపింజెలా గాలికి గంతులేస్తూంది.

"ఎన్నోసార్లు అనుకున్నాను. మరి మీరో" అన్నది.

"అనుకుంటే తనివితీరకే, ఈ ప్రయాణం పెట్టుకున్నానంటే నమ్మతారా! నిజం, లతా! నన్ను చాలా వెర్రిలో దింపారు. సాయంత్రం పిక్చర్‌కి వెళ్ళడానికి వీలుంటుందా?" అన్నా డతను.

వెళ్ళడమే! అమ్మో, ఇంకేమైనా ఉందా అనుకుంది వెంటనే హేమలత. అతను పిలిచాక వెళ్ళకుండా మానడమే-అతను ఊళ్లోంచివెళ్లిపోతే బాగుండును.

ధైర్యం కూడదీసుకుని, "మీరు మరీ సిల్లీగామాట్లాడుతున్నారు అన్నది.

"ఏం, మీవారికి ఇష్టం ఉండదా" అన్నాడు.

ఆమె ఏమీ మాట్లాడ ఊరుకుంది. చివరికి "చూద్దాం"అని లేచి లోపలికి వెళ్ళింది టి, టిఫిన్ తీసుకువస్తానని.

అతనంటే తనకి ఆకర్షణ కలిగిందా? అవును, కలిగింది. మరి తనంటే అతనికి వెర్రి ఆకర్షణ కలిగిందా? అవును, కలిగింది. తను ఎందుకు అతని వెంట పడింది? లేదే, అతనే తన వెంటపడ్డాడు. రెండూ ఒకటేగా? కాదు! తను హద్దుమీరి ఒక్క అడుగు వేయలేదుగా? పెళ్లయిన ఇరవై రెండు సంవత్సరాలకు తను ఈనాడు మర్యాదను మరిచి పోయి ప్రవర్తించలేదుగా? కానీ, అతను—ఒకటి కాదు, పది అడుగులు ముందుకి వచ్చేసి. మర్యాదలు, కట్టుబాట్లు అన్నీ తోసేసి తన హృదయ ద్వారానికి తను మొన్న చూచిన మామిడి పూలు, ఆకులు కలిపి తోరణం కట్టాడు. అక్కడ నిలబడి అడవి పూలు గుత్తులుకట్టి లోపలికి విసిరేశాడు. ఆ పూలగుత్తి గిలిగింతలు పెట్టింది. ఇదంతా ఎందుకు జరగనిచ్చింది తను?

టీ తయారైంది. పట్టుకుని ముందు గదిలోకి వచ్చేటప్పటికి నిర్మల అప్పుడే వచ్చి పుస్తకాలు లోపల పెట్టడానికి వెడుతూంది. హేమలత టీ టేబిలు మీద పెట్టింది. నిర్మల అతన్ని పరకాయించి చూసింది. టీ తెస్తున్న తల్లి వంక చూసింది. ఆ క్షణంలోనే తల్లి కట్టుకున్న చీరెవంక, మేచింగ్‌గా తలలో తురిమిన కనకాంబరం పూల వంక, ముఖాన దిద్దిన కోలబొట్టు వంక చూసింది, లోపలికి వెళ్లింది.

హేమలత—"టీ తీసుకోండి" అనిచెప్పి, తనూ కూర్చుంది. చాలా బాగుందంటూ మెచ్చుకుంటూ తాగా డతను. హేమలత నవ్వింది. మెల్లిగా లేచి, "నిర్మలను పిలుస్తాను, ఉండండి" అన్నది. నిర్మల ముందు రానన్నది. "ఎవరో ఆయన, నాకు తెలియదు" అన్నది.

"నేను పరిచయం చేస్తానుగా?" అన్నది హేమలత.

"మరి నేను తయారవాలి" అన్నది నిర్మల.

"బాగున్నావులే, రా, అమ్మా" అని బలవంతంచేయగా, చివరికి ముఖం కడుక్కుని, చీరె మార్చుకుని ఇవతలికి వచ్చింది నిర్మల. నల్లని సిల్కుచీరె పచ్చని ఒంటిమీద నిలవనని జారిపోతూంటే, సర్దుకుంటూ వచ్చి నిలిచి, సంభ్రమంగా, "నమస్కారమండీ" అన్నది.

కరుణాకరం టీ కప్పు బల్లమీద ఉంచేసి, "హల్లో! ది యంగ్ బ్యూటీ!" అన్నాడు. నిర్మల ముఖం ఎర్రబడి పోయింది. కళ్లు అటు ఇటు

వెతుకుతున్నట్లు చూశాయి. కూర్చున్నది. ఏదో మాట్లాడాలని ప్రయత్నించింది. అందమైన యువకుడు, ఆకర్షణీయమైన యువకుడు తనని కళ్లతోనే అభినందిస్తూంటే, లేతకొమ్మ క్షణాలమీద చిగురించసాగింది. ఏం చదువుతున్నారు? లాంటి ప్రశ్నలువేశాడు కరుణాకరం. మీరు ఎక్కడుంటారు లాంటి ప్రశ్నలు అడిగింది నిర్మల. హేమలత చూపు మార్చి మార్చి ఇద్దరినీ చూస్తూంది, అతను మాత్రం నవ్వుతూ మధ్యలో తనతో మాటలు కలుపుతున్నాడు. ఉన్న రెండు కళ్లనీ రెండు వైపులా నిలపలేక, నిలపాలన్న కోరికని ఎల్లా తీర్చాలో తెలియక తికమకపడుతున్నట్లు చూస్తున్నాడు.

అతను పొద్దుపోయే వరకు కూర్చున్నాడు. అక్కడ కూర్చున్న నిర్మల అక్కడే కూర్చుండిపోయింది! హేమలత ఒకసారి లోపలికి వచ్చివెళ్లినప్పుడు, ఆమెకూడా వెంటే వచ్చి, "సినిమాకి వెడదామంటున్నారమ్మా!" అన్నది.

"వద్దమ్మా! అతన్ని పంపేద్దాము ఇంక. నాన్నగారు ఫోన్ చేశారు—మిస్టర్ నారాయణ ఇంట్లో డిన్నరుట మనకి వేళ" అన్నది హేమలత.

ఇద్దరూ డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చాక, "ఈసారి సినిమా వద్దండీ.—డిన్నర్ ఎంగేజ్‌మెంటు ఉన్నది" అని చెప్పింది.

"అరే! పోనీ, నే నింక వెళ్లివస్తాను. మరి ఎప్పుడు మళ్లీదర్శనం?" అన్నాడు అతను. అతను తనని కాక నిర్మలని అడిగాడని గ్రహించింది హేమలత.

హేమలతని అనుకునే నిలబడింది నిర్మల. "మీరు చూశారుకానీ మా ఊరు అమ్మాయికి చూపించవద్దా?" అన్నాడు మళ్లీ ఆమెవంకేచూస్తూ.

"ఈ మాటు తీసుకువస్తా" అన్నది హేమలత.

"మరి, వెళ్లనా?" అన్నాడు అనుమతి కోరుతున్నట్లుగా.

హేమలత గడియారం చూసుకుని, "మంచిది, చూద్దాం. మీకు వీలైనప్పుడు ఎప్పుడో రండి" అన్నది.

అతను వెళ్లి బయట నిలబడగానే కారు వచ్చింది. నిర్మల, హేమలత

ఇద్దరూ గుమ్మం దగ్గిరే నిలబడ్డారు. అతను కారు ఎక్కి డోర్ వేశాక, నిర్మలతో, "వెళ్ళివస్తానింక" అన్నాడు. ఆమె తల ఊపింది.

"మాట!" అని ఆమెను పిలిచాడు. ఆమె మెట్లు దిగి వెళ్ళింది. "మా ఊరు రావాలి. అరకు తీసుకువెడతాము" అంటూ షేక్‌హాండ్‌కోసం చేయి చాచాడు. ఆమె అరక్షణం తటపటాయించి, "నమస్కారం" అనేసింది. కారు స్టార్టయి వెడుతూంటే అతను హేమలతని చూచి చేయి ఊపాడు.

హేమలత వెనక్కి తిరిగింది. నిర్మల ఇంకా అక్కడే వెళ్ళిపోయే కారు వంక చూస్తూ నిలబడిందని తెలుసు. పైకి వెళ్ళింది హేమలత. అక్కడ దీపాలు లేవు. చీకటి వ్యాపిస్తూంది. దీపం వేయా లనిపించలేదు. అద్దంలో ముఖం చూచుకోవాలనిపించ లేదు. మంచం మీద పడుకుంది అల్లాగే. నిర్మల ఇంకా లోపలికి వెళ్ళిందో లేదో; గేటు దగ్గిర కరుణాకరం మళ్ళీ చేయి ఊపి పిలిచాడేమో—ఏమో!

తనకి పధ్నాలుగేళ్లు ఉన్నప్పుడు, ముద్దబంతి పూవులాంటి శరీరానికి ఓణీలు వేసుకుంటున్నప్పుడు, దేవాలయానికి వెడుతూంటే అబ్బాయిలు తన వంక చూచేవారు. వయస్సు ఒంటికి మెరుగులు పెడుతున్న రోజుల్లో కాలేజీ ఆవరణలో యువకులకళ్లు తనని వెంబడించేవి. అప్పటి ఆ ఆకర్షణ అది. ఇరవై సంవత్సరాల నాడు రామారావు మరే పనీ చేయకుండా రోజులోని ఇరవై నాలుగు గంటలూ, గంటలోని అరవై నిమిషాలూ తన ఎదురుగానే కూర్చున్నప్పుడు హేమలత తను అయస్కాంతా న్ననుకునేది. అయస్కాంతానికి అనువైన మెత్తని ఉక్కులాగ అత నున్నాడు ఆ నాడు. మరి, ఈనాడు అత నేమై పోయాడు? ఏమీ కాలేదు, ఉన్నాడు. అయితే తేడా ఎక్కడ ఉంది? పద్దెనిమిదేళ్ల యువతి ఎదురుగా వెర్రి కోరికతో కదలకుండా కూర్చున్న ఇరవై నాలుగేళ్ల యువకుడు రామారావు అప్పుడు. ఇప్పుడో? అతని పనులు అతనివి. నలభై నాలుగు సంవత్సరాల వయస్సు అతనిది.

అందుకే కాబోలు—కాబోలు నేమిటి—అందుకే—తాను విశాఖ పట్నంలో అయస్కాంతమై పోయాననుకుని సంబరపడి కరుణాకరం తన చెవిలో చెప్పిన గుసగుసలు ఆమోదించింది! ఆ బలహీనత, ఆ వెర్రిచేష్ట గుర్తుకి రాగానే నలభై సమీపించబోతున్న ఆమె మనస్సు సిగ్గుపడి పోయింది.

నిర్మల బుగ్గలమీద సాయంత్రం పూచిన గులాబులు తీయని వాసన వెద జల్లినాయి. ఎంతో అందంగా కనుపించాయి. కానీ, పద్దెనిమిదేళ్లకలల ప్రాయాన్ని ఎక్కడో, ఏనాడో వదిలేసి, వసంత వనాలన్నీ దాటేసి వచ్చిన హేమలత అద్దంలో చూసుకున్నా కనబడవు ఆ గులాబులు.

చీకట్లో కళ్లకి కనుపించకపోయినా నుదుట నాలుగు తెల్ల పరకలు పడి ఉన్నాయని చూసుకుని హేమలత వాటిని చేతితో సవరించుకుంది. తన వెర్రి తనానికి గిజగిజలాడిపోయింది. కింది అంతస్తులో నిర్మల మనస్సులో మబ్బు పింజెలు తేలగా, పై అంతస్తులో హేమలత మనస్సులో బరు వెక్కిన కారు మేఘాలు భోరుమని వర్షించాయి,

# పాముకాటు

శ్రీమతి పవని నిర్మల ప్రభావతి

కెవ్వుమంటూ అరచిన భారతి కేక గదిలో తలుపులు అమర్చి వున్న ఆ గదిలోపలనే వుండిపోయింది. అక్కడే పాములున్న అద్దాల "షోకేస్"లు తుడుస్తున్న పని కుర్రవాడు 'చందూ' మాత్రం విన్నాడు. కంగారుగా తిరిగిచూశాడు. కట్లపాము వున్న "షోకేస్" దగ్గర భారతి నేలమీద స్పృహ తప్పి పడిపోయింది. కొద్దిగా తెరచివున్న షోకేస్ గ్లాస్ క్రింద నుంచి, పాముమెల్లిగా బయటకు పాకుతోంది!

జరిగిందేమిటో ఒక్కక్షణంలో బోధపడింది చందూకు. గబగబా షోకేస్ దగ్గరకు పరుగెత్తి ఒడుపుగా పాము మెడ దగ్గర పట్టుకుని, షోకేస్ లోపలికి నెట్టివేసి గ్లాస్ క్రిందకు దించేశాడు. తర్వాత భారతి పక్కగా కూర్చుని, ఆమె చెయ్యి పరీక్షగా చూశాడు ఎడమ చెయ్యి మణికట్టుకు కాస్త పైగా, పాముకాటు వుంది.

గబగబా రూం బయటకు పరుగెత్తి ప్రక్క రూములలో పనిచేస్తున్న మిగతా ఉద్యోగులందరికీ ఈ వార్త చెప్పాడు. ప్రొఫెసర్ రూంలోకి బాణంలా దూసుకు పరుగెత్తాడు.

"సార్! సార్! భారతమ్మగారిని పాము కాటేసిందండీ! స్పృహతప్పి పడిపోయారండీ ఆవిడ!"అన్నాడు కంగారుగా. అక్కడే టేబిల్ దగ్గర నిల్చుని "టెస్ట్యూబ్" శుభ్రం చేస్తున్న నర్మద ఒక్కసారిగా బయటకు పరుగెత్తింది. ఏదో భయం ఆమె నరనరంలోనూ వ్యాపించిందొక్కసారిగా.

ప్రొఫెసర్ రాజేంద్ర ఐదారు నిముషాల క్రితం స్వయంగా నాగుపాము నుంచి తీసిన విషం, మరికొన్ని రసాయనిక ద్రవ్యాలూ కలిపి, టెస్ట్యూబ్‌లో ఏదో ప్రయోగం చేస్తున్నాడు. ఆయన 'కాన్‌సన్ ట్రేషన్' అంతా టెస్ట్యూబ్ మీదా నీలిరంగుతో వెలుగుతున్న స్పిరిట్ లాంప్ మీదా, సెకెండ్స్ వాచ్‌మీదా కేంద్రీకరింపబడివుంది. చందూ చెప్పేదేమిటో బోధపడలేదు. చందూ కిట్టే అర్థమైపోయింది. తన మాటలింకా ప్రొఫెసర్‌గారి బుర్రకు చేరలేదని. "సార్! సార్! భారతమ్మగార్ని పాము కాటేసిందండీ!" మరోసారి బాగా దగ్గరగావెళ్ళి అరచాడు.

ప్రొఫెసర్ మెదడు ఈ మారు ఆ వార్త రిసీవ్ చేసుకుంది. "ఏమిటీ?" అన్నాడు మెల్లగా. చందూ మళ్ళీ చెప్పాడు, "అరె! అలాగా? ఎక్కడా? ఎప్పుడూ? పద వస్తున్నా!" అలా అంటూనే టెస్ట్యూబ్‌ను జాగ్రత్తగా స్టాండ్‌లో పెట్టి రూం బయటకు నడిచాడు. భారతివున్న రూంలోకి అడుగెట్టి భారతిని చూశాడు? ఆ సరికే మిగతా ఉద్యోగులు శాంతి, గోపాల్, చటర్జీకిషన్, రాంలాల్ అంతా అక్కడే వున్నారు. అందరి ముఖాలలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది. నర్మద ప్రొఫెసర్ కేసి చూచింది. ఆమె కళ్ళలోభావాలు... ప్రొఫెసర్ స్పష్టంగా చదవగలిగాడు. కళ్ళతోనే వారించాడు. ఆమె తలదించుకుంది.

"ఈ కట్ల పామండీ" అన్నాడు షోకేస్‌వేపు చూపిస్తూ.

భారతి ప్రక్కగా నేలమీద కూర్చుని భారతి చెయ్యి పరీక్షగా చూశాడు ప్రొఫెసర్. పల్స్ చూశాడు. వెంటనే నవ్వేశాడు.

"మరేం పర్వాలేదు. భారతి భయంతో షాక్‌తిన్నది! అంతే!"అన్నాడు మిగతా ఉద్యోగులందరికేసి చూస్తూ. మళ్ళీ తనే అన్నాడు. "డోంట్‌వర్రీ! నథింగ్ హాపెండ్! ఈ కట్లపాముకు నిన్నరాత్రే విషం తీసేశాను. మళ్ళీ విషం దాని వెయిన్స్‌లో చేరటానికి, కనీసం నలభైఎనిమిది గంటలు టైం పడ్తుంది. ఈ లోగా అది మనల్ని ఎన్నిమార్లు కరచినా ప్రమాదం ఏమీ వుండదు. అయితే భారతికి నేనీ పాము విషం తీసినట్లు తెలీదు. కాబట్టి, భయంతో షాక్ తిన్నది! ఇంజక్షన్ ఇస్తాను. షి విల్‌బి ఆల్ రైట్ వితిన్ వన్ అవర్!" అన్నాడు ప్రొఫెసర్ చిరునవ్వుతో.

అంతలోనే నర్మదకేసి తిరిగి "నర్మదా! నా రూం అల్మైరాలో రెండో 'రో'లో నాలుగో బాటిల్...రెడ్‌లేబిల్ వేసివుంటుంది చూడు. ఇంజక్షన్ సిరెంజి తీసుకురా! క్విక్!" అన్నాడు స్థిమితంగా. నర్మద వెళ్లి రెండు నిముషాల్లో తీసుక వచ్చింది. ప్రొఫెసర్ భారతికి ఇంజక్షన్ ఇచ్చాడు. ఇద్దరు నౌకర్లను పిలిచి, భారతిని స్ట్రెచర్‌మీద పడుకోబెట్టి, తన రూంకు చేర్చమన్నాడు. ప్రొఫెసర్ రూంకి అటాచ్ చేయబడివున్న విశాలమైన బెడ్‌రూంలో బెడ్ మీద పడుకోబెట్టారు భారతిని. అక్కడే నర్మదను కూర్చోమని చెప్పాడు ప్రొఫెసర్. ఆమె కుర్చీలో కూర్చుంది. మిగతా ఉద్యోగులంతా ఎవరిపనుల్లోకి వాళ్లువెళ్లిపోయారు. భారతికి ఏమీకాలేదని, కాబోదని అందరికీ ధైర్యం వచ్చేసింది.

"మళ్ళీ మరో అరగంట తర్వాత వస్తాను...నువ్విక్కడే వుండు- అవసరమైతే నన్ను కేకవెయ్!" అంటూనే తన లేబొరేటరీ రూంలోకి నడిచాడు ప్రొఫెసర్. వెళ్తున్న ఆయనకేసి నిదానంగా చూచింది నర్మద. ఈ "సీరియస్‌నెస్" నుంచి. తనను తాను సర్దుకొనేందుకే ఆయనలా వెళ్లారని గ్రహించడానికి ఎంతోసేపు పట్టలేదామెకు. బెడ్ మీదపడుకుని వున్న భారతి వేపు చూచింది. ఎక్కువ పొడవూ పొట్టీగాని సమ ఎత్తు మనిషి. ముఖం ఎంచేతో ఎప్పుడూ సీరియస్‌గా, డ్రైగా వుంటుంది. స్త్రీత్వం మర్చిపోయిన లేదా బలవంతంగా అణచి వేసుకున్న, స్త్రీలాసగం మగవారి కాఠిన్యం, నిగ్రహం అరువు తెచ్చుకున్నదానిలా వుంటుంది. కానీ గత కొద్ది రోజులుగా ఆమెలో కొద్ది కొద్దిగా స్త్రీత్వం తలెత్తుతోందని తనకు తెలుసు. అందుక్కారణం...? ఆ రోజు సర్పదష్టలా అయిపోయిన ఆమె...

ఈ రోజు భారతిని నిజంగానే పాముకాటు వేసింది—ఒక వేళ భారతికి మరి స్పృహ రాక పోతే? ఈ "షాక్" నుంచి తేరుకోలేక పోతే? ఈ భావం నర్మదను నిలువెల్లా కంపింపజేసింది. ఊహూఁ! భారతి బ్రతికి తీరాలి! బ్రతికి తీరుతుంది. ఇందాకా మోడులావుండిపోయింది ఆమె.

భారతి చాలా జాగ్రత్తగా విధి నిర్వహణచేసే మనిషి! ఎప్పుడూ అజాగ్రత్త అపస్మారమూ వుండని మనిషి. పాముల మధ్య మెలగటం ఆమెకు కొత్తేమీకాదు. కానీ ఈరోజు బహుశా పరధ్యానంగా వుండి వుంటుంది. ఏదో తీవ్ర సమస్యను తనలో తాను పరిష్కరించుకొంటూ, ఒక నిశ్చయానికి వచ్చే మూడ్‌లో వుండి వుంటుంది. అందువల్లే ఈ ప్రమాదం జరిగింది ఇది మంచిగా పరిణమించాలి. అసలు భారతిపట్ల తన కెందుకింత వాత్సల్యం?

నర్మద మనో నేత్రాలముందు గత మంతా సినిమా రీళ్ళలా తిరగటం మొదలెట్టింది. భారతికీ, యితరులకూ సంబంధించిన విషయాలు కూడా ఆమె ఊహలో దృశ్యాలుగా కనిపించసాగాయి. ప్రేక్షకురాలిలా చూస్తు డి పోయింది నర్మద!

* * *

ప్రొఫెసర్ రాజేంద్ర మహారాష్ట్రలోని ఓ పల్లెటూళ్ళో పుట్టాడు- చిన్నతనంనుంచీ అడ్వెంచరస్ లైఫ్ అంటే చాలా యిష్టం జీవితం అంటే

పూరికే బ్రతికెయ్యటం కాదనీ, సాటిమానవులకు ఏదో ఓ "మంచి" చెయ్యటమే జీవించటంలో అర్థమనీ, అతగాడి దృఢ విశ్వాసం. తేళ్ళని, మండ్రగబ్బల్నీ జాగ్రత్తగా పట్టడం, పాముల్ని పట్టడం, చంపటం, చరచర వెళ్తున్న పాముని ఒడుపుగా పట్టుకోవడం, విషం కక్కించటం, కోరలు పీకటంలాంటి పన్లు అతగాడికి హాబీలుగా తయారయాయ్యి. బోలెడంత ఆస్తి, డబ్బూ—ఒక్కగా నొక్క కొడుకూ కావటంతో, తలిదండ్రులు చెప్పి చెప్పివూరుకొన్నారు. చెప్పినా వినిపించు కోవటం మానేశాడు. అతగాడికి పద్నాలుగేళ్ళ వయసుండగా, పాముకాటుకుగురై హఠాత్తుగా చనిపోయిన చిన్నాన్న కూతురూ, మరో స్నేహితుడూ, ఇంకొక స్నేహితురాలి తల్లీ, తమ తోటమాలీల మరణం అతగాడిలో పాముల మీదా, పాము కాటుమీదా, పాముయిషంమీదా, ప్రత్యేక మయిన శ్రద్ధనూ, పరిశోధనా దృక్పథాన్నీ పెంచింది. పాముకాటుకు సరైన మందు తెలుసుకోవాలన్న కుతూహలం, పట్టుదలా అతగాడిలో పెరిగ పెద్దవై పోయాయి. డాక్టరుకోర్సు పూర్తయ్యాక, ఆ ఆలోచన ఓ రూపం దాల్చింది.

అసలు పాము కరిచాక, మనిషి చనిపోవటానికి ఎంత టైం తీసుకుంటుంది? ఏ ఏ పాముల విషం మనిషి రక్తంలో చేరాక, రక్తాన్ని విషంగా విరిచేందుకు ఎంతటైం పడుతుంది? ఏ ఏ పాముల విషం మనిషి ప్రాణం తీసే శక్తి కలిగి వుంటుంది? ఇలా తరచి తరచి చూశాడు. పాముకాటు అయినా, తేలుకాటుఅయినా సరిగా "వెయిన్" (రక్తనాళం) మీద పడితే మనిషికి మృత్యువు ఖాయం. ఆ విషం నేరుగా రక్తనాళాలద్వారా గుండెకు చేరటంతో గుండె అరలలోని రక్తమంతా త్వరగా విషపూరితంగా మారిపోతుంది. ఇంకా మనిషిని బ్రతికించటం సాధ్యమయిన పని కాదు! మామూలు శరీరం మీద (వెయిన్ తగలకుండా) కాటు పడితే ఆ పాము స్వభావాన్ని బట్టి, విషం యొక్క "పవర్"ను బట్టి విషం తలకెక్కే టైం వుంటుంది, వాళ్ళని బ్రతికించడం సులభమే! కానీ పాము కనిపించిందనే "షాక్" తోనూ, "గిలి"తోనూ, చుట్టు ప్రక్కల చేరినవాళ్ళు "అమ్మో, అయ్యో!" అంటూ తెలివి తక్కువగా చేసే రభసతోనూ, ఆ వ్యక్తి చని పోవటం జరుగుతోంది! కాస్త దృఢమయిన మనస్థితిగల వ్యక్తి అయితే, పాము కరచిన భాగానికి పైగా గట్టితాడు కట్టి, సరయిన వైద్యం చేస్తే తప్పక బ్రతుకుతాడు.

ఇలా అన్ని రకాల మానవ మనస్తత్వాల మీద కూడా పరిశోధన జరిపాడు.

"నేనే అన్ని రకాల పాములనూ సేకరిస్తాను. వాటి కాట్లు పరిశోధిస్తాను. విరుగుడు కనిపెడతాను. అది పాముల విషంనుంచే తయారుచేస్తాను, చిన్న పిల్లలకు టీకాలూ—ట్రిపుల్ ఇంజక్షన్ ఇచ్చినట్లే, ప్రతి మనిషికీ, పిల్లలకు, పెద్ద లకూ, పాముకాటులోని విషాన్ని, శరీరంలోని రక్తకణాలే ఎదుర్కొనేట్లుగా ఇంజక్షన్ తయారుచేస్తాను. అవి దేశ విదేశాలలో వ్యాప్తిలోకి రావాలి టీకాల లానే! ఇదే నా ధ్యేయం!" అనుకున్నాడు రాజేంద్ర.

చాలామంది రాజేంద్ర ఆలోచనలను హేళన చేశారు. చాలా కొద్ది మంది మాత్రమే ప్రోత్సహించారు. "హాయిగా డాక్టర్‌గా ప్రాక్టీస్ పెట్టి డబ్బు సంపా దించక, ఈ తిక్కేమిటి!" అని మందలించారు మరికొందరు. "ఆ పాములు నిన్నే కాటువేసి స్వర్గానికి పంపిస్తాయేమో చూడు!" అని భయపెట్టారు యింకా కొందరు. కానీ రాజేంద్ర చలించలేదు. తన ఆస్తినంతటినీ అమ్మివేసి, ఆ సిటీకి దూరంగా "స్నేక్ ఫారమ్ అండ్ ఇన్‌స్టిట్యూట్" పెట్టాడు. ఎక్కడెక్కడి పాములనూ సేకరించాడు. తనలానేచేసే ఉద్యోగంలో "థ్రిల్" కోరేవారికి, ఆ పనిలో ఉత్సాహంగా పాల్గొనాలనుకొనే వారికి మాత్రమే "ఇన్‌స్టిట్యూట్"లో స్థానం వుంటుందని ప్రకటించాడు. నిరుద్యోగులయిన యువతీ యువకులు చాలా మందే వచ్చారు గానీ, తీరా పాములతో ముఖాముఖి గడపవలసి రావటం, అస్త మానూ పాముల మధ్యే వుండటంలాంటి పనులు చూచేసరికి, కొందరు భయపడి ఉద్యోగం వద్దని వెళ్ళిపోయారు. కొందరిలో ఉత్సాహంవున్నా, వాళ్ళ పెద్దలు "పాములతో చెలగాటమాడే వెధవ్వుద్యోగం మనకొద్దు, బతికుంటే బలుసాకు తినొచ్చు. ఎక్కడో ఓచోట గుమాస్తాగా చేరవచ్చు," అని నిరుత్సాహపరచి వెనక్కు లాగేశారు మొండిగా. "నిరుద్యోగంకంటే బాధాకర మయింది కాదు పాములతో గడపటం. మేం చేస్తాం," అనుకున్నవారూ, "కోట్లాది ప్రజల కోసం ఆ ప్రొఫెసర్ అంత త్యాగం చేస్తుండగా (జీవనభృతి తీసుకుంటూ) మన వంతు సహకారం మనం యిద్దాం" అనుకున్నవారూ మాత్రం ఉద్యోగులుగా స్థిర పడ్డారు. అలా మిగిలిపోయిన వారిలో భారతి ఒకర్తె.

భారతికి ఒక అక్క, నలుగురు చెల్లాయిలు, ఇద్దరు తమ్ముళ్ళు వున్నారు. తండ్రి తాలూకా ఆఫీసు గుమాస్తా. అక్కకు పెళ్ళి చెయ్యటం తోటే అప్పులు తయారయ్యాయి. ఆ అక్క పురుళ్ళూ తెగుళ్ళతో ఇల్లు గుల్లయిపోయింది. భారతి బి. ఎస్. సి. పాసయ్యే సరికి కుటుంబ ఆర్థిక పరిస్థితి తలక్రిందులై పోయింది. ఉద్యోగం చెయ్యక తప్పని పరిస్థితులు ఏర్పడటంతో, అందాకా ఆడ పిల్లని ఉద్యోగం చేయించటం "తప్పు" అని భావిస్తున్న ఆమె తల్లిదండ్రులు పరిస్థితులతో రాజీ పడ్డారు. భారతి ఉద్యోగంలో చేరింది. ఆమెకు ఒకటే ఆవేదన: తను ఉద్యోగం చేయాలి. చెల్లాయిలందరికీ మంచి మంచి సంబంధాలు తెచ్చి పెళ్ళిళ్ళు చెయ్యాలి. తమ్ముళ్ళను పెద్ద చదువులు చదివించాలి. దారిద్ర్యం అన్నదీ, ఆర్థిక బాధ అన్నవీ భవిష్యత్తులో తమ నెవరినీ "కాటు" వెయ్య కుండా చూసుకోవాలి. తన తండ్రికి ఆర్థిక పరంగా, తనే "కొడుకు" కావాలి. తనకు "పెళ్ళి" అవసరం లేదు. ఈ తన కుటుంబ సభ్యుల కోసం తను పెళ్ళి చేసుకోదు. త్యాగం చేస్తుంది! ఇదే దీక్ష...ఇదే పట్టుదల...ఆమెలో పెరిగి పోయాయి. కానీ ఉద్యోగంలో చేరిన పదేళ్ళలో భారతి చాలా ఎక్కువగా ప్రపంచ జ్ఞానాన్ని ఆర్జించుకుంది. మూడు ఉద్యోగాలలోకి మారింది. ఒక చోట ఆఫీసరు రావణాసురుడైతే, మరో చోట కోక్లర్క్స్‌లో పెళ్ళి గాని ప్రతి వాడూ ప్రేమ లేఖలు రాయటమే! ఇంకోచోట సాటి స్త్రీ ఉద్యోగినులే సాటి స్త్రీ పై నిందా ప్రచారాలు సాగించటం, పెళ్ళి కాని "ఆడ పులి"గా భయపడి పోవటం, వేరుగా కేటాయించటం, మరి కొందరు అతి నాగరిక స్త్రీలు – ఊబిలో దించి ఆనందించాలని చూడటం, ఇలా మానవ మనస్తత్వాన్ని అన్ని కోణాల నుంచి పరిశీలించిన భారతికి తను అవివాహితగా ఉండాలను కోవడం తప్పా? తను ఉద్యోగం చెయ్యటం తప్పా? ఈ సమాజంలో ఆర్థికంగా తక్కువ స్థితిలో జన్మించటం తప్పా? అందులోనూ ఆడ పిల్లగా? ఇలా రాత్రింబవళ్లు బాధ పడేది భారతి. సరిగ్గా ఆ సమయంలోనే రాజేంద్ర "స్నేక్ ఫారమ్ కమ్ ఇన్‌స్టిట్యూట్" నుంచి వెలువడిన ప్రకటన ఆమె కెంతో రిలీఫ్‌నూ, ధైర్యాన్నీ ఇచ్చింది "ఈ మనుషుల కంటే క్రూరమైనవికావు ఆ పాములు. ఉద్యోగంలో, జీవితంలో కూడా "వెరైటీ" ఉంటుందక్కడ అనుకుంది. వెంటనే చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా ఇచ్చింది. ఇక్కడ ఉద్యోగంలో చేరింది. రాజేంద్రను అందరూ "ప్రొఫెసర్" అంటారు. ఆ ఇన్‌స్టిట్యూట్ సిటీకి దూరంగా ప్రత్యే

కంగా, ప్రత్యేక వసతులతో నిర్మింపబడి వుంది. చుట్టూరా పెద్ద కాంపౌండు, పెద్ద పెద్ద గేట్లూ, చక్కగా పెంచిన తోటతో అద్దాల కిటికీలూ, తలుపులూ అమర్చబడిన బ్రహ్మాండమైన భవనం అది. ఎవరి రూం వారికే. ప్రతి రూంకూ ఓ బెడ్‌రూం, అటాచ్‌డ్ బాత్‌రూం, లావెట్రీ ఉన్నాయి. ఇన్‌స్టిట్యూట్‌లో పని చేసే వారందరికీ తర తమ భేదాలు లేకుండా అక్కడే భోజనం, కాఫీ, టిఫినూ ఇవ్వబడతాయి. ఆదివారం శెలవు. ఆ రోజు ఇన్‌స్టిట్యూట్ "వేన్" ఉద్యోగులందర్నీ సిటీలో వదిలి పెడుతుంది. వారు ఇళ్ళకు వెళ్ళవచ్చు. మరునాడు ఉదయాన్నే తిరిగి "వేన్" అందర్నీ ఇన్‌స్టిట్యూట్ దగ్గరకు తీసుక ఎస్తుంది.

భారతి కవెంతో హాయిగా వుంది. జీతం ఎక్కువ. భోజన వసతి వుంది. వారానికో రోజు ఇంటికి వెళ్తే ఇంటి దగ్గర ఆమెకు అందరూ నీరాజనాలిస్తున్నారు. ఎవరో అపురూపమైన అతిథి వచ్చినట్లు హడావిడి చేస్తారు. "భారతీ! మా అందరి కోసం నువ్వెంతటి త్యాగం చేస్తున్నావు!" అంటూ పదే పదే పొగడుతుంటారు! ఈ పదేళ్ళలోనూ ఇద్దరు చెల్లాయిలకు పెళ్ళిళ్ళు చేసింది. రాజేంద్ర వద్ద ఉద్యోగానికి చేరే నాటికి, మరో ఇద్దరు చెల్లాయిల పెళ్ళిళ్ళ బాధ్యత, ఇద్దరు తమ్ముళ్ళ చదువుల బాధ్యతా, పెళ్ళిళ్ళు చేసిన చెల్లాయిల కాన్పుల బాధ్యతలూ భారతి మీద వున్నాయి. ఇంటిల్లిపాదీ తనని ప్రత్యేకంగా, అతి గౌరవంగా చూస్తుంటే, భారతికి నిజంగానే, తానో మానవాతీతురాలైనట్లూ, తను చేస్తున్న ఈ త్యాగం ఏ విలువలకూ అందనంతటి ఉన్నతమైందన్నట్లూ అనుభూతీ, గర్వమూ కూడా కలగసాగాయి.

భారతికి ప్రొఫెసర్ రాజేంద్ర అంటే చాలా గౌరవం ఎరుపూ, తెలుపూ కలసినట్లుండే గులాబిరంగు దేహచ్ఛాయ, తేనె కళ్ళు, కొద్దిగా ఎరుపుగా వున్నట్లనిపించే రాగి రంగు క్రాఫ్, కొనదేరివుండే ముక్కు, తీక్షణమైన పరిశీలనాత్మకమైన చూపులూ, ఎక్కువ పొడవూ పొట్టి కాని ఎత్తు, ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ మాట్లాడే నవ్వుముఖం-ఆయన గారికో హుందాతనాన్ని, గౌరవభావాన్ని సమకూర్చాయి. సుమారు నలభై ఐదేళ్ళ వయసున్న ఆయనలో వయసు కనిపించదు. పాముల చుట్టూరా తిరుగుతూ, లేబొరేటరీ పనిచేస్తూ, వర్కర్ల పట్ల వాత్సల్యం, చనువుతో కూడిన మందలింపు ప్రదర్శిస్తూ చకచక తిరుగుతుండే ఆయన చలాకీ తనమే, నిత్య యౌవనుణ్ణిగా చేస్తూందనిపిస్తుం

టుంది భారతికి. వర్క్‌లో లీనమైనప్పుడు అతగాడికి బాహ్యస్మృతే ఉండదు. పక్కనే వున్నది ఆడా, మగా, అన్న తేడా కూడా తెలియదు. పాములున్న షో కేసుల దగ్గరకి వెళ్ళి నిల్చుంటాడు.

"సీ...ఇది ఆఫ్రికన్ కింగ్ కోబ్రా: బాగా చూడండి. చాలా ప్రమాదకరమైన పాము. చాలా ఒడుపుగా, పటకారుతో, చటుక్కున నొక్కి పట్టెయ్యాలి. ఏ మాత్రం అజాగ్రత్తగా వున్నా ప్రమాదం! ఎర మీద గురిగా విషం చిమ్మి, కళ్ళు పోగొడుతుంది. అందుకే ఈ గ్లాసెస్ వాడాలి కళ్ళకు.

ఇలా చూడండి. ఇది "మిణ్ణాగు" అంటారు మన దేశంలో. గుడ్డు నుంచి పిగిలిన ఇరవై రోజుల్లోనే దీని విషం పని చేసే "వెయిన్స్" పని చేయటం ప్రారంభిస్తాయి. దీనికీ నాగుబాము పిల్లలకూ ఎక్కువ పోలికలున్నాయి. కొందరు చిన్న పిల్లలు పళ్లు వచ్చే టైంలో అందర్నీ కొరికినట్లే, ఇది అతి చిన్న వయసులోనే, పిచ్చిగా, కసిగా అందిన వస్తువునూ, పశువునూ, మనిషినీ–చివరకు కొయ్యలను కూడా కాటు వేస్తుంటుంది. రంగు కొంత గోధుమ రంగూ, లేత పసుపూ కలిపి నట్లుంటుంది. కాబట్టి, ఆత్మరక్షణకు మొగలి పొదలు అనువుగా వుంటాయి. కాబట్టి వాటిలో దాగి వుంటుంది.

ఇది త్రాచు. ఇందులో ఎన్నోరకాలు. నల్ల త్రాచులు– అదో ఆ షోకేస్‌లో ఉన్నాయి. చాలాస్పీడ్‌గా ఎరను తరుముతుంది. వెంటాడుతుంది. బుస కొడుతుంది.

ఇది నాగుపాము, చాలా బ్యూటిఫుల్ కలర్. కళ్ళలో పదును: తీక్షణత: పడగ విప్పినపుడు—దాన్ని చంపాలనుకున్నవారు కూడా దిగ్భ్రాంతి పొందేంతటి అందం...అతి సున్నితమైన శబ్దగ్రాహక శక్తి, చురుకుదనం వున్నాయి. బహుశా ఇన్ని గొప్ప లక్షణాలుండటంవల్లేకావచ్చు, ఈ జాతి పామును దేవుడుగా కొలుచుకుంటారు మన వాళ్ళు. పూజలు చేస్తారు. ఓ పట్టాన చంపరు. చంపినా తామేదో పాపము చేసినట్లు "గిల్టీ"గా ఫీలౌతూ ప్రాయశ్చిత్తం చేసుకుంటారు, శవ సంస్కారం జరుపుతారు: కానీఎంత అంధమైనదో అంత ప్రమాదకరమైనది. చాలా పవర్‌ఫుల్ విషం: ఒక్కోసారి ఇది కాటు వేసిన కొద్దినిమిషాలలో మనిషి చనిపోతాడు:

ఇది నీటి పాము...ఎన్నిమార్లు కరచినా ప్రమాదం లేదు. కానీఇది కరచినా, పాము కరిచిందన్న భయం వల్ల కలిగే షాక్‌తో చనిపోయిన వాళ్ళున్నారు! ఇది కట్లపాము. ఓ మోస్తరు విషం వుంటుంది. కాటుతిన్న మనిషిని బ్రతికించు కోవటం తేలిక! ఇది రక్త పింజరి. దీనికాటు తిన్న వ్యక్తిలో రక్తం ఎక్కువగా పొంగినట్లయి ఒక్కోసారి నవరంధ్రాల నుంచీ రక్తం స్రవిస్తుందా మనిషికి. సరైన వైద్యం చేస్తే, ఆరక్తస్రావాన్ని ఆపి, ఆ వ్యక్తిని సులభంగా బ్రతికించవచ్చు."

ఇలా ఒక్కో పామునూ చూపుతూ, పట్టుకుంటూ, షో కేసులలో వదలిపెడ్తూ అవేవో చాలా సాధారణమైన జీవరాసులూ, సాధు జంతువులూ, అన్నంత తేలికగా, "ఎక్స్‌ప్లేన్" చేస్తుంటే నిర్ఘాంత పోతుంటుంది భారతి!

ఓ రోజు సీరియస్‌గా ఆయన చెప్పుకుపోతున్న టైంలో సంభ్రమంగా, తదేకంగా చూస్తూ వింటున్న భారతి...తన ఫారిన్ నైలెక్స్ చీరె తాలూకు, పమిటె జారి నేలమీద పరుచుకోవటం గమనించలేదు. సుమారు పదిహేను నిముషాలు భారతివైపూ, పాము వైపు మార్చి మార్చి చూస్తూ "ఎక్స్‌ప్లేన్" చేస్తున్న ప్రొఫెసర్, చివరగా, పామును షో కేస్‌లో వదలి అద్దం మూసివేసి, ఇహ ప్రపంచంలోకి వచ్చాడు. భారతి కేసి తిన్నగా అప్పుడు చూశాడు,

"ప్లీజ్! మిమ్మల్ని మీరుసర్దుకోండి!" అన్నాడు మరో షోకేస్ వేపు నడుస్తూ.

భారతి సిగ్గుపడిపోయింది. ఆయనగారు ఏమనుకున్నారో? తను కావాలని ఆయన్ని అట్రాక్టు చెయ్యాలని ప్రయత్నిస్తోందనుకోలేదు కదా?

కానీ నర్మద పకపక నవ్వి ఏదో మాటల సందర్భంలో చెప్పింది. "మీకెలాటి భయమూ అవసరంలేదు భారతీ, ఆయనగారు ప్రొఫెసర్. ఆంబ్సెంట్ మైండెడ్ ప్రొఫెసరనే నేనంటుంటాను. సాధారణంగా పనిలో, ప్రయోగాలలో వుంటే స్నానం, భోజనం, నిద్ర భార్యా బిడ్డల్లాంటి చిన్నచిన్న విషయాలేవీ గుర్తుండవు! నేనే చూస్తాను అవన్నీ! పాపం! మన ఇన్‌స్టిట్యూట్‌లో వర్క్ చేస్తున్న "శాంతి"కి సంగతి తెలీదేమో—అస్తమానూ ప్రొఫెసర్ గారికి ఫోజులిస్తుంటుంది! ఏం చేస్తాం! పట్టువదలని విక్రమార్కుడు ఆవిడైతే, చెట్టు వదలని భేతాళుడీయనగారు!" అంటూ విరగబడి నవ్వింది.

నర్మద, రాజేంద్ర భార్య. గ్రాడ్యుయేట్. అందంగా వుంటుంది. చూచే వారికి ముగ్గురు బిడ్డల తల్లి అనిపించదు. పేద కుటుంబం నుంచి వచ్చింది. "వాల్యూ ఆఫ్ లేబర్" "వాల్యూ ఆఫ్ లైఫ్" తెలిసిన మనిషి. ఒక్క క్షణం ఊరికే కూర్చోదు. ఇన్స్టిట్యూట్ లోని ఉద్యోగులందరి యోగ క్షేమాలూ, భోజన విషయాలూ జాగ్రత్తగా కనుక్కుంటుంది. అందరు ఉద్యోగుల్లా తను పని చేస్తుంటుంది. రాజేంద్రకు తోడు నీడలావుండి, లాబొరేటరీలో గానీ, పాముల విషం తీయటం వగైరాల్లోగానీ అనుక్షణం సహకరిస్తుంటుంది. సిటీలో చిన్న ఇల్లుంది. దూరపు బంధువులూ, పేదవారూ అయిన ఓ దంపతులను పిల్లలకు తోడుగా వుంచి, వాళ్ళు కాలేజీలకూ, స్కూలుకూ వెళ్ళే ఏర్పాటుచేశారిద్దరూ. "లేబ్"ను ఆనుకుని. ముచ్చటగా మూడురూంలున్నాయి. విశాలమైన బెడ్ రూం డైనింగ్ రూం, డ్రెస్సింగ్ రూం, అటాచ్డు బాత్ రూం, లావెటరీ. ఆదివారం ఉద్యోగులందరూ "వేన్"లో వెళ్లాక, రాజేంద్ర నర్మద కారులో సిటీకి వస్తారు. పిల్లలతో గడుపుతారు. తిరిగి రొటీన్! ఇంచు మించు తన వయసుకు కాస్త తక్కువగా ఉన్న భారతి అంటే-ఆమె అవివాహిత అని తెలుసుకున్న నర్మదకు అపరితమైన జాలి సానుభూతి. భారతి ఇంటి విషయాలన్నీ అడిగి తెలుసుకుంటుంది ఐదారు మార్లు సిటీకి వచ్చినప్పుడు, భారతి ఇంటికి స్వయంగా వచ్చి పరిశీలించింది. ఓమంచి స్నేహితురాలిలా మారింది!

"భారతీ! నీ త్యాగం నేను హర్షించనోయ్! మోతాదు మించిన త్యాగం వెర్రితనం కిందికి వస్తుంది. ఇద్దరు చెల్లాయిలకు పెళ్ళిళ్ళు చేశావు! బావుంది. ఇంకా వాళ్ళ కాన్పులూ. ఆపరేషన్లూ కూడా నీ నెత్తిమీదే వేసుకోవాలా? మిగిలి వున్న ఇద్దరు చెల్లాయిలనూ చదివించావు. వాళ్లూ గ్రాడ్యుయేట్స్ అయ్యారు కదా నీలా ఉద్యోగంచేసి, కాస్తంత బాధ్యత అలవర్చుకోరా? నువ్వే "స్పూన్ ఫీడింగ్" ఇవ్వాలా? ఇక ఈ చెల్లాయిలిద్దరికీ పెళ్ళిళ్ళు చేసి పంపి, వాళ్ళ పురుళ్ళూ, పుణ్యాలూ జరిపి నీ తమ్ముళ్ళను చదివించి పెళ్ళిళ్ళు చేసి... ఇంకా తర్వాత నీకు పెళ్ళెందుకూ? ఇది ఎంత అర్థంలేని త్యాగమో ఆలోచించు! "అక్క వుంది మనకు!" అన్న భరోసాతప్ప, ఎవరి కాళ్ళమీద వాళ్ళు నిలబడదామన్న ఆలోచన మీ ఇంట్లో ఒక్కరికీ ఉన్నట్లు కనపడదు! మీ వాళ్ళమీద "ద్వేషం" నూరిపోస్తున్నాననుకోకు! ఎప్పుడూ త్యాగమైనా,

దానమైనా అతి అయితే, ఎదుటవారిలో నిర్బాధ్యతనూ, బద్ధకాన్నీ పెంచుతాయి. హాయిగా పెళ్ళాడు. ఈ సరికే నీలో ఆడతనం పోయి-మగతనం-చోటు చేసుకొంటోంది! మరి కొన్నేళ్ళు పోయాక, నీలోకి నువ్వు చూచుకున్ననాడు అక్కడ శూన్యంకన్పించి. తట్టుకోలేక "డెస్పరేట్" అయిపోతావు! నీకు శాంతి వుండదు. ఇతరులకు శాంతి వుండదు. ఓ మంచి స్నేహితురాలిగా సలహా ఇస్తున్నా! ఇక వరాన్వేషణ ప్రారంభించు!" అందోరోజు నిర్మొహమాటంగా.

భారతెప్పుడూ అలా ఆలోచించలేదు. కానీ ఎంచేతో ఆమె మాటలు పట్టుబడక పేచీ పెడుతున్న నాగుపాము ముందు నాగస్వరంలా వున్నట్లు తోచాయి, పదే పదే ఆలోచించి చూస్తే.

ప్రొఫెసర్‌ను ఒక్క క్షణం వదిలి వుండదామె! "మీకెందుకీ శ్రమ! హాయిగా పిల్లల దగ్గర ఉండ గూడదా?" అందోరోజు భారతి.

నర్మద నవ్వింది. "నీకో రహస్యం చెప్పనా భారతీ!" అంది.

"చెప్పండి!"

"ప్రొఫెసర్ గారిని ఇలా అస్తమానూ వెంటాడుతుంటేనే, ఒక్కోసారి ఆయనగారికి నేను ఆడదాన్ననీ, తన భార్యననీ గుర్తుంటదు. వేవే అవస్థపడి, ఆ వైనం తెలుసుకుంటుంటాను. ఇక దూరంగా వున్నానూ అంటే, కిషన్‌నో, ఛటర్జీనో...మరెవర్నో భార్య అనుకునే ప్రమాదం జరగవచ్చు!"

భారతి ఫక్కున నవ్వింది. "మీరుమరీనూ" అంది నవ్వు అపుకుంటూ!

"లేదు భారతీ! నీకు తెలీదు. పనిలో పరధ్యానంలో, ప్రొఫెసర్‌గారు సర్వ ప్రపంచాన్నీ తననీ మర్చిపోతారు! రాజకీయాలలో తీవ్రంగా పాల్గొనే వారికీ, ఇలాటి ప్రొఫెసర్స్‌కూ...ఎన్నో సమస్యలనుంచి రిలీఫ్ కావాలంటే, వాళ్ళలో ఎక్కువమంది కోరేది వెర్రి సెక్స్! ఆరహస్యం తెలుసుకున్న నాలాటి తెలివిగల భార్యలైతే, నాలా ఏమరకుండా వెంటబడి వుంటారు. లేకపోతే-వాళ్ళు పక్కమార్గాలు తొక్కుతుంటే, విని వూరుకోవలసిందే! ఇలాటి వారి విషయంలో పక్కమార్గాలన్నవి క్షంతవ్యాలు!...నేరాలుకావు! ఏమంటావు!" అంది.

భారతి నిజంగా సిగ్గుపడింది. ఇలాటి చర్చ తనలాటి "కుమారి"తో చేయవచ్చునా? అనుకుంది. నర్మద భారతి ముఖంలోని భావాలు చదివినదానిలా పక పక నవ్వింది. "నీకు సంకోచంగా వుందికదూ నేనిలా మాట్లాడుతుంటే! కాని నాకులేదు! ఈ రోజులలో ఇంగ్లీషు, హిందీ. తెలుగు సినిమాలు చూస్తున్న నీకు, నీకేమిటి? పసిపిల్లలకూ్కడా "సెక్స్"ను గురించి ఏ ఒక్కటీ మిగల కుండా తెలిసిపోయిందన్నది-నువ్వు కాదన్నా నాకు తెలుసు! అన్నట్లు మన ఇన్‌స్టిట్యూట్‌లో పనిచేస్తున్న "కిషన్" నీకు తెలుసుగా? నీలానే, తన కుటుంబంకోసం పెళ్ళి మానేసిన భీష్మాచార్యుడు! "ఇంకా ఎన్నేళ్ళిలా "బ్యాచు లర్"గా వుంటావోయ్ కిషన్?" అని నేను మొన్న ఓరోజు అడిగితే, ఏం సమాధానం చెప్పాడో తెలుసా? "బ్యాచులర్‌గా అనకండి అక్కయ్యగారూ! "అన్ మారీడ్"గా అనండి చాలు!" అన్నాడు నవ్వుతూ. పైగా అన్నాడూ, ""నావయసుకు "తగ్గ" అమ్మాయి రావాలికదండీ!" అని! హుషారైనవాడు ...కదూ?"

భారతి జవాబివ్వలేదు. నర్మద అలా హుషారుగా మాట్లాడినప్పుడల్లా, ఈ మధ్య భారతిలో ఏదో అలజడి రేగుతోంది. అది "ఫలానా" అని తెలి యటంలేదు. నర్మద. ప్రొఫెసర్‌గారి వెంట సిటీకివస్తూ, భారతికి లిఫ్ట్ ఇస్తుంటుంది బలవంతంగా. భారతిని వాళ్ళ ఇంటివద్ద దిగవిడిచి వెళ్ళిపోతా రిద్దరూ! ఒకోసారి, తమ వెంట సినిమాకూ, పిక్నిక్‌కూ రమ్మని కోరుతుంది. భారతి కాదనలేదు. నర్మద రాజేంద్ర, ముగ్గురు పిల్లలూ-సరదాగా నవ్వుతూ, నవ్విస్తూ, తననీ వాళ్ళలో ఒక త్రైగా చేసుక, హాస్య, పరిహాసాలు చేస్తుంటే, భారతికి గంటలు నిముషాలుగా దొర్లిపోతాయి! ఏదో హుషారూ, హాయి ఆమెలో చోటు చేసుకుంటాయి ఆ కాస్సేపూ;

తరచూ ఈ మధ్య నర్మద, భారతి నలా తన వెంట తిప్పుతోంది! తీరా ఇంటికి వచ్చాక, భారతికి ఏదో అసంతృప్తి కలుగుతోంది.

తన ఇంట్లో తను పొందుతున్న దేమిటి? అతి మర్యాద! ఎవరో పరాయి వాళ్ళకు జరిపినట్లు మన్నన! అది ఎందు కోసం? తను వాళ్ళందరికోసం సంపా దిస్తున్నది గనుకా! యజమానికీ, నౌకర్లకూ ఉండే సంబంధం లాటిదది! ఇక వినే విశేషాలు ఎలా వుంటాయి?

''రెండో చెల్లాయిని రెండో కాన్పుకు పిల్చుకురావాలమ్మా భారతీ! నీ కెప్పుడు డబ్బు వసతి వుంటే, అప్పుడు వెళ్ళిపిల్చుకు వస్తారుట మీనాన్నగారు'' అంటుంది తల్లి. తన చెల్లాయికి రెండో కాన్పుగురించే ఆలోచిస్తోందిగానీ, తన పెళ్ళిగురించి ఆలోచిస్తోందా ఏనాడైనా? తననీ ఆలోచించనివ్వదు!

''చిన్న చెల్లాయికి ఈ ఏడాది పెళ్ళి చేద్దామా భారతీ? దాన్ని ఉద్యోగంలో చేర్చటం ఎందుకు? పసిపిల్ల? ఉద్యోగ బాధ్యతలు దాని నెత్తిన పెట్టడం నా కిష్టంలేదు!'' అంటాడు తండ్రి! తనూ ఉద్యోగంలో చేరేనాడు అంతటి పసిపిల్లే! తనూ లోకం తీరు ఆకళింపు చేసుకుంటూ, ఎన్నో చేదుమాత్రలు మ్రింగుతూ, ఎన్ని బొప్పిలో తనలో తను సర్దుకుంటూ, పడగలు విప్పుతున్న తన యౌవనాన్ని, కఠినంగా అణగద్రొక్కుతూ, ఇందాకా ఈ సంసారం కోసం త్యాగం చేసిందన్నది వీళ్ళకెందు కర్థం కాదు?

నర్మదతో చనువూ, సాన్నిహిత్యం పెరిగేకొద్ది భారతికి ఇలాటి ఆలోచనలు తరచూ వస్తున్నాయి. ప్రొఫెసర్‌గారు అదో మాలోకం! పాములూ, కోరలూ, విషాలూ, ప్రయోగాలు ఓవేపూ, మరోవేపు నర్మద! అంతే!

మొన్ననోరోజు ఇన్‌స్టిట్యూట్‌లో ఓ సంఘటన జరిగింది. ప్రొఫెసర్ గారేదో అపరిమితమైన రోషంతో పాములానే బుసలు కొడ్తున్నారు. కొత్త పాము. మాంచి కోడెనాగు! నా కేసును ఛిన్నాభిన్నం చేస్తోంది కోపంతో! దాని విషం తియ్యాలి! దాని ''టెన్షన్'' ''సస్పెన్స్'' చేసేందుకు మత్తు ఇంజక్షన్ ఇవ్వాలి. షో కేస్ గ్లాస్ కొద్దిగా ఎత్తిపెట్టి (పాము గబుక్కున బయటకు దూకకుండా!) పామును పట్టు చిక్కించుకునేందుకు చాలా హైరాన పడ్తున్నారు. ప్రక్కనే, ఇంజక్షన్ సిరెంజ్‌తో నిల్చునివుంది నర్మద. సుమారు గంటసేపు చాలా అలసిపోయారాయన. భారతి అప్పుడే ఆ రూంలోకి అడుగెట్టింది. ప్రొఫెసర్‌గారికి, తను చేసిన ప్రయోగం తాలూకు, ఫార్ములా కాగితాలు చూపి, ఆయన అంగీకరిస్తే, తప్పులు సరిదిద్దితే టైప్‌చేసి ఇంగ్లీషు పత్రికలకు పంపాలి పోస్టులో!

ప్రొఫెసర్ భారతిని చూడలేదు. ఆయన దృష్టిఅంతా షో కేస్ మీదే ఉంది. నర్మద భారతిని చూచింది. ఇప్పుడు ఆయన్ని కదలించవద్దన్నట్లు

సైగచేసింది. భారతి అలాగే నిల్చుంది. ప్రొఫెసర్‌వేపు చూచింది. ఆయన తేనె కళ్ళలో పట్టుదల ప్రతిబింబిస్తోంది. పాముమీద పదునైన చూపులు నిలిపి వున్నాయి. దృఢసంకల్పంవల్లా, కోపం వల్లా ఆయనగారి యెర్రని ముఖం మరింత అందంగా వుంది. ఆయనిప్పుడు మనిషిలా కనిపించటం లేదు. స్వజాతి మీద కోపంవచ్చిన కోడెనాగులా వున్నారు! ఆ అందం, ఆ గాంభీర్యం, ఆ పట్టుదల, ఆ దీక్ష ఒక్కసారిగా భారతి కెందుకో మరీ మరీ చూడాలని పిస్తోంది.

ఈ ప్రొఫెసర్—నర్మద భర్త! నర్మద ఎంత అదృష్టవంతురాలు! ఆమె పిల్లలమీద మాతృసహజమైన మమకారాన్ని కూడా త్రోసిపుచ్చి, ప్రొఫెర్‌గారిని అనుక్షణం నీడలా అనుసరిస్తుందంటే ఆశ్చర్యం ఏమీలేదు! ఇలాటి భర్తకోసం–భార్య ఏమైనా చేస్తుంది.

అవును...తనకిప్పు డర్థమౌతోంది. తనకూ ఇలాటి తోడుకావాలి! తనూ నర్మదలానే ఆ రాబోయే భర్తకు నీడలా మారాలి! తమ దాంపత్యమూ యిలాగే చల్లదనమూ, వెన్నెలలా మారాలి!

కిషన్‌లో చాలా మంచిగుణాలు వున్నాయి. చాలామార్లు తనతో సన్నిహితంగా మెలగాలని, తననుంచి ప్రేమపొందాలనీ ప్రయత్నిస్తున్నాడు. ఎప్పటి కప్పుడు తనే "పెళ్ళి ఇప్పుడు కాదు...చెల్లాయిల పెళ్ళిళ్ళు, తమ్ముళ్ళ చదువులు..." అంటూ అతగాడు తీసుకొనే అవకాశాలమీద చన్నీళ్ళు చల్లు తోంది కఠినంగా.

కానీ, ఈ క్షణంలో అనిపిస్తోంది. కిషన్‌తో తన వైవాహిక జీవితం రాజేంద్ర, నర్మదల దాంపత్యంలానే హాయిగా సాగుతుంది. కిషన్ ఆదర్శాలు పట్టుదలా......అతగాడు జీవితంమీద ఏర్పరచుకున్న నిక్కచ్చి అయిన అభిప్రాయాలూ...అన్నీ ఉన్నతమైనవి

నర్మద మెల్లిగా భారతి భుజంమీద తట్టింది. భారతి ఉలిక్కిపడింది. ఆలోచనలు ఆగిపోయాయి. నర్మదకేసి ఏమిటన్నట్లుచూచింది భారతి. ఉదయం నుంచీ తనింకా కాఫీగానీ, టిఫినుగానీ తీసుకోలేదనీ, ఈ ప్రొఫెసర్‌గారా పామును పట్టేవరకూ, దాని విషం తీసి, ఇంజక్షన్ ఇచ్చేవరకూ...తనకిక కాఫీ

ఆశకూడా లేదనీ, కాస్సేపు తన బదులుగా సిరెంజి పట్టుకు రెడీగా నిల్చుని వుంటే—తను త్వరగా టిఫినూ, కాఫీ తీసుకొనివస్తాననీ సైగలతో, గుసగుసలతో చెప్పింది నర్మద. భారతి నవ్వి సరేనని తలాడించింది. చేతిలోని కాగితాలు టేబిల్‌మీద పెట్టి సిరెంజి చేతికి తీసుకుంది. నర్మద మెల్లిగా రూం బయటకు వెళ్ళిపోయింది. ప్రొఫెసర్ అనిమిషునిలా పాముకేసి చూస్తున్నాడు. అది గ్లాసు క్రిందినుంచి కొద్దిగా తల బయటకు పెడుతోంది. వెనక్కి తీసికొంటోంది. నాలుకలు చాపుతోంది!

భారతి ఆలోచన్లు మళ్లీ ముసురుకున్నాయి. కిషన్‌తో తన పరిచయం పెరుగుతుందేమోనని ఎందుకో అనుమానం వచ్చింది అమ్మా నాన్నలకు! మొన్న ఆదివారం ఇంటికి వెళ్ళినప్పుడు తల్లి పరోక్షంగా పక్కింటి వెంకాయమ్మ గారితో తనకు వినిపించేలా అంటోంది, "మా అమ్మాయి అని గొప్ప చెప్పుకోవటం కాదుగానీ, మా భారతి మాకు మగబిడ్డే! అసలు పెళ్ళి అవసరమే లేదన్నీపిచ్చిపిల్లకు! "చేసుకోవే, చేస్తాం" అన్నా మండిపడుతుంది. మీతో ఎవరు చెప్పారో ఏమో! ఆ కిషన్ ఎవరు? మా కులమా? స్థలమా? కుళ్ళు మాటలు అవన్నీ! అది ఏనాడూ అలాటి దరిద్రపుపని చెయ్యదు. దాని ఇద్దరు చెల్లాయిలకూ పెళ్ళిళ్ళయ్యాక, తమ్ముళ్ళ చదువులు పూర్తి అయ్యాక.... ఇష్టమైతే పెళ్ళాడుతుంది, కులమింటివాణ్ణి! లేదా అలాగే హాయిగా వుండిపోతుంది. ఆఁ!" అని.

అమ్మ ముందే తన కాళ్ళకు బంధం వేస్తోందా! తండ్రిది మరోరకం లౌక్యం!

"భారతీ! జాగ్రత్త! ఇందాకా స్టెడీగా వున్నావు. ఆ మనోనిబ్బరాన్ని ఏక్షణంలోనూ కోల్పోవని నాకు తెలుసు!"

అమ్మ పెట్టదు! అడుక్కు తిననివ్వదుట!

హఠాత్తుగా భారతికి ఏం జరిగిందో అర్థంకాలేదు! చేతిలోని సిరెంజ్ ప్రొఫెసర్ లాక్కున్నాడు. త్రుళ్ళిపడింది భారతి! అసరికే ప్రొఫెసర్ ఎడంచేత్తో పాము మెడ దగ్గర గట్టిగా పట్టుకొనివున్నాడు. పాము వికృతంగా నోరు తెరుస్తూ కాటు వెయ్యటానికి విఫల ప్రయత్నం చేస్తోంది. దాని శరీరమంతా

ఆయనగారి ఎడమచేతి క్రిందుగా మెలికలు తిరుగుతున్నట్లు వ్రేళ్ళాడుతోంది నేలవరకూ! ప్రొఫెసర్ కళ్ళు విజయ గర్వంతో మెరుస్తున్నాయి. గబుక్కున దానికి ఇంజక్షన్ ఇచ్చాడు. పెద్ద పింగాణీ కప్పులోకి విషం తీశాడు. మెల్లిగా 'షో కేసు'లోకి వదిలివేశాడు. ఆకుపచ్చగా, చిక్కగా వున్న విషంబొట్లు కొన్ని నేలమీద కూడా పడ్డాయి! సిరెంజ్ షోకేసు మీద పడేశాడు. మరుక్షణంలో భారతి చుట్టూరా అతగాడి చేతులు బలంగా చుట్టుకుపోయాయి! సక్సెస్ తాలూకు గర్వంతో ఉద్రేకంతో ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అతి వేగంగా, వెచ్చగా ఆమె బుగ్గలకు తగులుతున్నాయి. ఆయనగారి ముఖం భారతికి చాలా దగ్గరగా వచ్చేసింది.

ఒక్క సెకండ్‌లో జరిగినదేమిటో, జరగబోతున్న దేమిటో బోధపడే సరికి భారతి - అనుకోని సంఘటనకు నిర్ఘాంత పోయింది. నిలువెల్లా ఒణికి పోతోంది. ఆ స్పర్శ ఆమెలోని కోటానుకోట్ల రక్తకణాలలోకి- పాముకాటువల్ల విషం చిమ్మినట్లు, ఒక్కసారిగా శరీరమంతా ఆవిర్లు వచ్చేసింది. కొన్ని సెకెండ్లే ఇదంతా......

''సార్ ...నేను...నేను...''భారతి శక్తినంతా కూడగట్టుకొని గొణుగుతోంది. మాట పెగిలిరావటంలేదు. అప్పుడే గుమ్మంలో అడుగెట్టిన నర్మద, క్షణకాలం నివ్వెర పోయింది. మరుక్షణంలో పెద్దగా నవ్వుతూ చప్పట్లు చరుస్తూ అంది: ''ప్రొఫెసరుగారూ! కట్! కట్! షాట్! కట్! అయిందండీ స్వామీ! ఆమె భారతి, నర్మదకాదు!''

ఒక్కసారిగా ''షాక్'' తిన్నట్లు గుమ్మంవేపు చూశాడు. మరుక్షణంలో భారతిని వదలి...రాకెట్ వేగంతో బెడ్ రూంలోకి దూకి, తలుపు దడాలున వేసుకున్నాడు.

ఆ షాక్ నుంచి ఇంకా తేరుకోలేదు భారతి. క్షణకాలం తలెత్తలేక పోయింది. నర్మద ఏమనుకుని వుంటుంది. తనే ప్రోత్సహించానని...

"ఊ! వెళ్ళి నిన్ను నువ్వు కంట్రోల్ చేసుకో భారతీ! చెప్పానుగా? ప్రొఫెసర్‌గారు ఇలాటి అఘాయిత్యం చేస్తారని నాకుతెలుసు! ఇంకా నయం! కిషన్‌నో, ఛటర్జీనో, రాంలాల్‌నో ఇక్కడుంచి పోయానుకాదు. ప్రొఫెసర్‌గారి పిచ్చి ఏమిటో బోధపడేది వాళ్ళకు'' అంది నర్మద నవ్వుతూ.

ఈర్ష్య అసూయలకు అతీతురాలైన నర్మద అలా స్వచ్ఛంగా సరళంగా నవ్వుతుంటే ఆశ్చర్య పోయింది భారతి. రెండు రోజులు శెలవు పెట్టి ఇంటికి వెళ్ళింది భారతి.

"నర్మదా! నన్ను ఫూల్‌ను చెయ్యటానికి నువ్వుకావాలనే వెళ్ళావుకదూ!" అన్నాడు ఎగతాళి చేస్తున్న భార్యతో, ప్రొఫెసర్ కోపంగా, బాధగా.

నర్మద మెల్లిగా అంది: "నో! నో! నిజం గానే కాఫీ తాగివద్దామని వెళ్ళాను. కాని భారతిలో నే నాశించిన మార్పు రావాలంటే ఇలాటి సీన్ ఏదో ఒకటి క్రియేట్ చేసి తీరాలని ఎన్నాళ్ళుగానో అనుకుంటున్నాను. అదీ రోజు యాదృచ్ఛికంగా జరిగిపోయిందంతే"

"...సిల్లీ! ఆ అమ్మాయి ఏమనుకుని వుంటుంది? నన్నొక్క రావణా సురుడిగా!" ప్రొఫెసర్ మాట పూర్తి కాకముందే పెద్దగా నవ్వింది. "ఆ భయం అక్కర్లేదుమీకు. ఎటొచ్చీ ప్రాబ్లెమ్స్ సాల్వ్‌చేసే టైంలో ప్రొఫెసర్ గారికి తనెవరో తన భార్యాబిడ్డలెవరో, పాములేవో, ఆడ, మగ ఎవరో కూడా తెలియ నంతటి ఉద్రేకమూ అపస్మారమూ వుంటాయని మాత్రం..." నర్మద నవ్వులో మిగతా మాటలు కలిసిపోయాయి.

భారతి ఈ రెండు రోజులూ ఇంటిదగ్గరే వుందికానీ, ఆమె మనసంతా ఇన్‌స్టిట్యూట్ లోనే వుంది.

"భారతీ: జీవితంలోని "థ్రిల్" అంతా చంపుకొని నువ్వేం సాధిస్తున్నట్టు? అర్థంలేని ఆదర్శమా? త్యాగమా? రేపు నీలోని యౌవ్వనం, పూర్తిగా ఇంకిపోయాక ఈ నీ త్యాగాన్ని జుర్రుకున్నవాళ్ళే, నీ ఉనికి బరువుగా భావించే తరుణంలో—ఇక పెళ్లాడవలసిన అవసరంకూడా తీరిపోయాక, నీలో ఈ త్యాగం తాలూకు "తృప్తి" నిలుస్తుందంటావా? నాకు నువ్వు "మిస్"గా మిగిలిపోతావన్న భయం లేదు. కాని కిషన్ చెప్పే "అన్‌మారీడ్"గా మారిపోవల్సి వుంటుందేమో నన్నదే బాధ. అదిచాలా అసహ్యాకరమైన జీవితం తెలుసా!" అంది మొన్న వోరోజు నర్మద.

కోరికలని అణచివుంచిన తన శరీరంలో ఆ పులకింత ఎలా కలిగింది? ఆ స్పందన ఏమిటి? ప్రొఫెసర్ గారిని ఏనాడూ తనాదృష్టితో చూడలేదు. చూడ

బోదు. కానీ ఆ నిముషంలో ఆ కఠిన బాహువల్లరిలోని ఏ శక్తో తనని వూపి వేసింది. ఇక ఓ నిశ్చయానికి రావాలి తను.

అంతే, మూడోరోజు ఇన్‌స్టిట్యూట్‌కు వచ్చింది భారతి. ప్రొఫెసర్ ఏమీ జరగనట్టే వున్నాడు. నర్మదా అంతే.

"నువ్వు వరుణ్ని సెలెక్టు చేసుకోవోయ్. నీ పెళ్ళికి మీ పెద్దలు వప్పుకో లేకపోతే నేనూ ప్రొఫెసర్‌గారూ మన స్టాఫూ వచ్చి దీవిస్తాం. బ్రేవో" అంది నర్మద నవ్వుతూ.

నర్మద మాటలు తనకు కర్తవ్యాన్ని బోధించాయి. తియ్యతియ్యని ఆలో చన లేవో ముసురుకుంటుండగా కృత నిశ్చయంతో, ఆ నిశ్చయం నర్మదకు త్వరగా చెప్పాలన్న ఆతురతతో, అజాగ్రత్తగా కట్లపామున్న షోకేస్ దగ్గర పాముకాటు తిన్నది భారతి.

* * *

"ఎలా వుంది నర్మదా? ఈజ్ షీ కమింగ్ ఇన్ టు కాన్షస్‌నెస్?" ఆతు రతగా అడుగుతూ రూంలో అడుగెట్టిన ప్రొఫెసర్ మాటలతో ఉలిక్కిపడింది నర్మద. ఇందాకా ఆమె చూస్తున్న దృశ్యాలన్నీ మాయమైపోయి వర్తమానం కళ్ళముందు నిలిచింది.

"వాట్, కన్నీళ్ళు! నీ కళ్ళలో నీళ్ళు"! ఆశ్చర్యంగా నర్మద దగ్గరగా వచ్చాడు ప్రొఫెసర్.

"భారతి బ్రతుకుతుందంటారా? ఆ పాముకు మీరు విషం తీసివెయ్య లేదన్న నిజం మనిద్దరికి మాత్రమే తెలుసు!"

ప్రొఫెసర్ గబుక్కున ఆమె నోటిమీద తన చెయ్యివేసి మృదువుగా మందలించారు.

"హుష్! గట్టిగా మాట్లాడకు. భారతి స్పృహలోకి వస్తోంది. ఈకేసులో నేను సక్సెస్ అయితే ఇక నా ఇన్‌స్టిట్యూట్ ఏమిటి, నా జీవితమే ధన్యమైందను కుంటాను" అంటూనే భారతి మెల్లిగా కదలటం చూచి మాట్లాడటం ఆపాడు. ఆమె పల్స్ చూచి, సంతృప్తిగా నిట్టూర్చాడు.

"అసలు పాము కాటుకంటే భయంతో ఇలా..." అన్నాడు మళ్ళీ మెల్లిగా...

"అవును! కానీ ఓ నిజం చెప్పనా? ఆమె ఈ రోజు కాదు పాము కాటుకు గురైంది" నర్మద మెల్లిగా అంది.

"అంటే?"

"ఆమెలో జీవితం పట్ల కోర్కెనూ, ఆసక్తినీ, అర్థంలేని త్యాగంపట్ల విముఖతనూ నేను రోజూ పెంపొందిస్తున్నాను. పరోక్షంగా మొన్న నే నను కోని...మీ రామెను..." నర్మద మాటలు మధ్యలో వుండగానే, ప్రొఫెసర్ ఆందోళనగా అన్నాడు. "నో...నో! చెప్పొద్దు... మళ్ళీ మళ్ళీ గుర్తుచెయ్యకు నర్మదా?" సిగ్గుతో ముఖం చేతుల్లో కప్పుకున్నాడు.

"ఊహూం! మిమ్మల్ని కించపరచటం లేదు నేను! మీ ఉద్రేకాలూ, ప్రవర్తనా, ఏ టైంలో ఎలావుంటాయో నాకు క్షుణ్ణంగా తెలుసు! నిజాని కారోజు, నేను కావాలనే, భారతిలో నే నాశించిన మార్పురావాలనే, తప్పు కున్నాను. ఆ సంఘటన- ఆమె హృదయంమీద పాముకాటులా పనిచేసింది: అయితే అది మంచి. పాము కాటు! ఏ చెడూ చెయ్యనిది! తనని సరైన మార్గానికి తిప్పేది అని ఆమె గ్రహించి వుండాలి. లేకపోతే, ఆమె తిన్నగా, ఉత్సా హంగా ఈ రోజు ఉద్యోగంలోకి వచ్చేదికాదు. రాజీనామా ఇచ్చి వుండేది!" అంది మెల్లిగా.

ఆశ్చర్యంగా భార్యవేపు చూస్తూండి పోయాడు ప్రొఫెసర్.

"దాహం!" మెల్లగా కళ్ళువిప్పి, నీరసంగా అంది భారతి. నర్మద, రాజేంద్రల కళ్ళు ఆనందంతో మెరిశాయి!

"దాహంగా వుందా భారతీ!" అన్నాడు ప్రొఫెసర్ ఆమెవేపు వాత్స ల్యంగా చూస్తూ. ఒక సోదరుడు, ఒక తండ్రి, అతి వాత్సల్యంతో ఆప్యాయతతో చూస్తూన్నట్లనిపించిందా క్షణంలో భారతికి.

"ఊఁ!"

"నర్మదా! వేడివేడి ఓవల్‌టిన్‌గానీ, కాఫీగానీ ఇవ్వు!" అన్నాడు మృదువుగా! ఆయన హృదయం ఆనందంతో గంతులు వేస్తోంది! ఆ సాయంత్రం ఇన్‌స్టిట్యూట్‌లోని ఉద్యోగు లందర్నీ సమావేశపరచి ప్రొఫెసర్ సంతోషంగా ఇలా చెప్పాడు:

"భారతిని కాటువేసిన పాము నిజంగా విషం తీయనిదే! కానీ ఆ నిజం తెలిస్తే ఆమె చనిపోయివుండేది. అందుకే అబద్ధమాడాను! కానీ నేను సాధించిన ఈ ఘన విజయం మొదటి ప్రయోగంగా భారతి నిలచింది. ఈ విజయం దేశదేశాల మానవాళికీ, ఉపకారం జరిగేదిగా మారబోతోంది. పాముల విషం నుంచే, పాముకాటుకు విరుగుడు మందు తయారు చేయగలిగాను! ఇక–ఇది అందరికీ అందుబాటులోకి వచ్చే "టీకాల"లా రూపొందించటానికి ఎక్కువ సమయం అవసరంలేదు! చాలు! నా జన్మ ధన్యమైందని భావిస్తున్నాను!" అన్నాడు ఉద్విగ్నంగా.

"కానీ భారతిని మరో పాము కాటు వేసింది!" అంది నర్మద రహస్యంగా భారతి చెవిలో. భారతి ఆశ్చర్యంగా చూచింది.

"ఆ పాము–నర్మద:" అంది నవ్వుతూ నర్మద.

పది రోజుల తర్వాత, కిషన్, భారతిల పెళ్ళి అతి నిరాడంబరంగా రాజేంద్ర, నర్మద, ఇన్‌స్టిట్యూట్ ఉద్యోగుల సమక్షంలో జరిగింది. భారతి తలిదండ్రులూ, బంధువులూ ఎవరూ రాలేదు కోపంతో!

"కొన్ని రకాల పాములు కాటువేసినా అపకారం చెయ్యవు భారతీ! అవి నీటి పాముల్లాటివి. విష్ యూ గుడ్‌లక్!" అంది నర్మద, హనీమూన్‌కు బయల్దేరుతున్న భారతి, కిషన్‌లకు నవ్వుతూ వీడ్కోలు చెబుతూ! ప్రొఫెసర్ గారు కూడా నవ్వుతూ చెయ్యి ఊపారు.

# ఉరి

శ్రీమతి పరిమళా సోమేశ్వర్

గణ గణమంటూ చర్చి బెల్లు పన్నెండుగంటలు కొట్టింది.

ఆ ధ్వని తరంగాలు చీకటిని చీల్చుకుని చెట్ల మీదుగా, యిళ్ళ కప్పుల మీదుగా ప్రయాణం చేస్తూ రంగయ్య గుడిసెలోకికూడా అతని చెవులగుండా పోయి గుండె 'ఝల్లు' మనేట్లు చేసినయ్.

ఆ గగుర్పాటుకు అతని రోమాలన్నీ నిక్కబొడుచు కున్నయ్. అతని కాళ్లూ, చేతులూ చల్లగా అయినట్లనిపించింది.

గుడిసెమధ్య వెలుగుతున్న కిరసనాయిలు బుడ్డి వెదజల్లే గుడ్డి వెలుతురులో అతని కళ్లు నిప్పుకణికల్లా మెరుస్తున్నయ్.

అతని పెదవులు ఎన్ని నెలలుగానో నీటి చుక్క నెరుగక పగిలి బీటలు వారిన నల్లనిరేగడి నేలలోని మట్టిగెడ్డల్లా ఉన్నయ్.

అసలే వికృతంగా, మోటుగావున్న అతని ముఖం భయంతో, అనేక రకాల సందేహాలతో, ఆవేదనతో భయంకరంగా తయారయింది.

కిరసనాయిలు బుడ్డినుండి వొచ్చే మసక వెలుతురు తాలూకు నీడలు అతని ముఖంమీద అటూయిటూ ఊగుతూ అతని ముఖానికి ఒక వింత ఆకృతిని, దానిమీద గల భావ ముద్రకు ఒక విలక్షణమైన అర్థాన్ని యిస్తున్నయ్.

గుడిసెలో ఒకమూల ఎండిన గోగిపుల్లలావున్న అతని భార్య రత్తి కాళ్ళు ముడుచుకుని పడుకుంది. అమాయకంగా అలసట తీరేలా నిద్రపోతున్న రత్తిముఖం చూస్తుంటే రంగయ్య గుండె ద్రవించి పోతోంది.

రోజూ తనుకూడా అంత నిశ్చలంగా ఆదమరచి నిద్రపోయేవాడు. కాని సాయంత్రం జైలు వార్డెను చెప్పిన సంగతి విన్న దగ్గరనుండి తనకి నిద్రాహారాలమీదనే విరక్తి కలిగింది "తెల్లవారుఝామున నాలుగు గంటలకల్లా పని పూర్తి చేసెయ్యాలి. ఓ గంట ముందుగానే అక్కడ సిద్ధంగా ఉండాలి" అది వార్డెను ఆజ్ఞ!

ఆ ఆజ్ఞ పిడుగులా అతని గుండెను తాకింది. ఆ మాట విన్నదగ్గిర నుండి రంగయ్య మనసు మనసులోలేదు. రంగయ్య సెంట్రల్ జైలులో

'హాంగ్‌మన్'గా పనిచేస్తున్నాడు. అతను ఉద్యోగంలోకి చేరి పట్టుమని రెండేళ్లు కూడా కాలేదు. అంతకుముందు రాళ్ళు మొయ్యటం, ఇళ్లు కట్టేటప్పుడు యిటుకలు సిమెంటు అందించటం, పెద్ద పెద్ద భవనాలకు సున్నం వెయ్యటం మొదలయిన పనులు చేస్తూండేవాడు రంగయ్య. రత్తి అక్కడా యిక్కడా పాచిపని చేస్తూండేది.

కాని రత్తి రోగిష్టిదవటం వల్ల ఏ యింట్లోనూ వరసగా నెలరోజులపాటు నిలకడగా పని చెయ్యగలిగేదికాదు. చీటికీ మాటికీ నాగాలు పెట్టే రత్తిని ఏ గృహిణీ పనిలోకి పెట్టుకుంటానికి ఒప్పుకునేదికాదు. ఇటు రంగయ్యకుకూడా రోజూ తప్పకుండా పనిదొరుకుతుందన్న గ్యారంటీలేదు. అందుకే నెలలోకనీసం పదిరోజులన్నా పస్తులుండేవారు ఆ దంపతులు.

అలాటి సమయంలోనే సెంట్రలు జైలులో హాంగ్‌మన్ ఉద్యోగానికి ఖాళీ ఉందని తెలిసి దరఖాస్తు పెట్టుకున్నాడు రంగయ్య.

తీరా ఉద్యోగం దొరికిన తరువాత తను చెయ్యవలసిన పనేమిటో తెలుసుకుని గజగజ వణికిపోయేడు రంగయ్య. "ఖూనీలుచేసిన నేరస్తులను ఉరితీయడమే నీ పని" అని జైలు అధికారులు చెప్పినప్పుడు కళ్ళుతిరిగి పడిపోయినంత పనయింది.

"పస్తులన్నా ఉంటాను. కానీ, యిలాంటి పాపపు పనులు మాత్రం చెయ్యను" అనుకున్నాడు.

కాని అజైలులో పనిచేసే చప్రాసీలు అతనికి అభయమిచ్చేరు. "పేరుకు మాత్రమే నీకీ డ్యూటీ. నిజంగా ఉరి తీయవలసిన అవసరం నీకు ఎన్నడూ రాదు. ఈరోజుల్లో చాలావరకు ఆజన్మాంత ఖైదును విధిస్తున్నారేగాని ఎంతటి నేరస్థుడయినా ఉరిశిక్ష అనేది పడటంలేదు" అంటూ ధైర్యం చెప్పేరు.

ఆ మాటలు విన్నాక యింక కాళ్ళదగ్గరకొచ్చిన ఉద్యోగాన్ని కాదనలేకపోయేడు రంగయ్య. నెలకింత ఖంగుమంటూ జీతంరాళ్ళు జేబుల్లో పడేసే సర్కారు ఉద్యోగాన్ని అంత తెలివితక్కువవాడు మాత్రం వదులు కుంటాడా? పైగా తనకీఉద్యోగం దొరికిందంటే రత్తి మూలుగుతూ ముక్కుతూ యింటా యీ యింటా పాచిపని చెయ్యనక్కర్లేదు. తను ప్రతిరోజూ సూర్యోదయమవ

గానే ఏం పనిదొరుకుతుందా అని నోరు తెరుచుకుని వేచి ఉండనక్కరలేదు. తన నెల జీతంతో తమ యిద్దరి కడుపులు నిండుతయ్. రత్తికి మందూమాకూ యిప్పించి యింటిదగ్గరే విశ్రాంతిగా ఉండేటట్లు చూడవచ్చు. ఆ ఆశతోనే ఈ ఉద్యోగంలో చేరేడు రంగయ్య. మొదటి నెలజీతం అందుకున్న రోజున తను చేసిన పనిలో పొరపాటేమీ లేదన్న విశ్వాసం ధృవపడింది అతనిలో.

రెండేళ్లు ఏ చీకూచింతా లేకుండా కొద్దిపాటి ఒడిదుడుకులతో సాగిపోయింది రంగయ్య జీవితం. నెలరోజుల క్రింత ఆ జైల్లోకి ఖైదీగా సత్యంవచ్చిన రోజు నుండి రంగయ్య మనసు రెప రెపలాడ సాగింది.

అతనికి ఉరిశిక్ష విధించేరట!

అయితే అతను మామూలు ఖైదీకాదు. చాలా ఖరీదైన ఖైది. ప్రభుత్వం మూడుసంవత్సరాలనుండి అతనిని గాలిస్తున్నదనీ, అతనిని సజీవంగా పోలీసులకు అప్పజెప్పిన వారికి లక్షరూపాయల బహుమతినికూడా ప్రకటించిందనీ విని రంగయ్య ఆశ్చర్యపోయేడు. ప్రభుత్వ ప్రకటన వినిన వారికెవరికైనా ఆ నేరస్తుడు ఎంత ప్రమాదకరమైన వ్యక్తో అతని రూపురేఖలు ఎంత భయంకరంగా ఉంటాయోనని ఆలోచనరాకపోదు. కాని అలాటి ఆలోచనలకు విరుద్ధంగా ఎంతో నిర్మలంగా ప్రకాశవంతంగా ఉన్న చిరునగవుల ముఖంతో వెలిగిపోయే ఆ పాతికేళ్ళ యువకుడినిచూచి రంగయ్యేకాదు, జైలు అధికారులే ఆశ్చర్యపోయేరు.

"అతను పదిమందిని హత్యచేశాట్ట!" అన్న వార్త విని రంగయ్య మరింత ఆశ్చర్యపోయేడు.

"అబద్ధం, నేన్నమ్మను" అన్నాడు అప్రయత్నంగా.

"అబద్ధమా? ఏది అబద్ధం? అతను పదిమందిని హత్య చేయటమా? లేకపోతే లక్షరూపాయలు ఊరికే ప్రకటించేరా యితనికోసం? ఏం పనిలేక ఈ కుర్రాణ్ణి జైల్లో పెటేరను కున్నావా?" అన్నారొకరు.

రంగయ్యకు ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు.

కాని అంతటి చురుకైన కళ్లు, ఇంత కాంతివంతమైన ముఖం గల యీ కుర్రవాడు హత్య చేసేడంటే ఎలా నమ్మడం?

అటూ యిటూ చూసి అతను మెల్లగా చెప్పేడు రంగయ్య చెవిలో: "ఈ కుర్రాడిచేతిలో చచ్చిపోయిన వాళ్ళందరూ డబ్బున్న మారాజులేనట" అని.

"డబ్బున్న మారాజులా? వాళ్ళను చంపటం అంత తేలికయిన పనేనా?" గుండెమీద చెయ్యివేసుకున్నాడు రంగయ్య.

''కాదు కాబట్టే యీ కుర్రాడిని అందరూ ''గుండెలు తీసినబంటు'' అంటున్నారు.

''పాపం వాళ్ళు యీ అబ్బాయికి ఏమి అన్యాయం చేసేరో యేమో!''

''ఇతనికి వాళ్ళేమీ అన్యాయం చెయ్యనూలేదు. వాళ్ళ ముఖా లితనికి తెలిసిందీలేదు. ఈతని పేరు వాళ్ళకు తెలియదు. వాళ్ళ సంగతి యీయనకు తెలియదు. అయినా చంపేశాట్ట!''

''ఎందుకో?''

''అదంతా ఓ పెద్దకథలే! ఈ కుర్రాడికి ఓ పెద్ద గాంగు ఉందట. వాళ్ళ పని పగలల్లా నరమానవుడి కంటబడకుండా బ్రతకటం. రాత్రయేసరికి రోజుకో ఊరిమీదపడి ఊరి పెత్తందార్లందరినీ సఫా చెయ్యటమూనట. గమ్మత్తేమంటే వీళ్ళు డబ్బున్నవాళ్ళని చంపుతారే తప్ప పేదోళ్ళ జోలికి చచ్చినా పోరట.''

ఆ విషయాలు విన్న పది పదిహేను రోజుల దాకా రంగయ్యకి మనసులో మనసులేదు.

సత్యం ముఖంచూసి, అతను హంతకుడన్న విషయం విన్నాక ఎంత ఆశ్చర్యపోయేడో అతను చేసిన హత్య ఉదంతం విన్నాక అంతకు రెట్టింపుగా ఆశ్చర్యపోయేడు.

''అతను పేదోళ్ళజోలికి చచ్చినా పోడట?''

పేదోళ్ళను చూసి జాలిపడే దెవ్వరీ రోజుల్లో? పేదవాళ్ళను చూస్తే పెద్దవాళ్ళందరికీ అసహ్యం. కోపం, పేదరికం మహా పాపమైనట్లూ, ఆ పేదరికాన్ని అనుభవించే ప్రజలంతా పాపాత్ములైనట్లూ భావించి గొప్పింటి వాళ్ళంతా

తనకు దూరంగా వుంటారు. కుక్కలు, పిల్లులు, నల్లులు, ఐల్లులు, మొదలైన జంతుజాలంవలె పేదవాళ్ళనికూడా ప్రాణికోటిలోని ఒకభాగంగా భావిస్తారేతప్ప వాళ్లా తమలాటి మనుషులేనన్న సమదృష్టితో గౌరవభావంతో ఎవరూ చూడరు. అవసరమైనపుడు గుర్రాన్ని బండి తోలటానికి, ఎడ్లను పొలందున్నటానికి, కుక్కలను యింటికి కాపలా వుంచటానికి, పిల్లుల్ని ఎలుకల్ని చంపటం కోసం పెంచుకున్నట్లు పేదవాళ్ళను కూడా రిక్షాలు లాగటానికీ, ఇళ్లు కట్టించుకోటానికి, పాయిఖానాను కడగటానికి, చెప్పులు కుట్టించుకోవటానికి, శవాన్ని తగలబెట్టడానికి యిలా రకరకాలుగా ఉపయోగించుకుంటారు డబ్బున్న మారాజులు.

అలా తమ పనులకోసం తోటి మనుషులను ఉపయోగించుకునే గొప్పవాళ్ళకు వీళ్ళమీద దయాదాక్షిణ్యాలు వుండవు సరికదా పైగా కోపం వచ్చినప్పుడు, సక్రమంగా పనిచేయించుకోదలచుకున్నపుడు జంతువులను అదిలించినట్లు వీళ్ళను అదిలించటం, తిట్టటం, కొట్టటం. ఇంకా తిక్కరేగితే చంపెయ్యటంకూడా కద్దు.

అదంతా చూసి చూసి డబ్బున్నవాళ్ళు పేదవాళ్ళని ద్వేషించటం వాళ్ళ సహజలక్షణం అన్న అభిప్రాయాన్ని చిన్నతనంలోనే యేర్పరచుకున్నాడు రంగయ్య. అందుకే భాగ్యవంతుల చేతుల్లో నానారకాలుగా హింసింపబడే తనలాటి పేదవాళ్ళు అతని కంటికి వింతగా కనపడేవాళ్ళు కాదు. అంతేకాదు. పట్టపగలు పదిమందీ చూస్తుండగా నడిరోడ్డుమీద హత్యచేసిన భాగ్యవంతులెంతమందో జైలుగడప తొక్కకుండా, కోర్టు చాయలకు పోకుండా, నిశ్చింతగా, కులాసాగా బ్రతకటం తను కళ్లారా చూసేడు.

కాని పాపం యీ కుర్రవాడు గొప్పవాళ్ళను చంపినందుకు జైల్లో పడ్డాడు. రేపో మాపో ఉరితీయబడతాడు కూడాను. అందుకే అన్నారు: భాగ్యవంతుల ప్రాణాలతో ఆడటం, నిప్పుతోచెలగాటంలాటిదేనని.

రంగయ్య వీలుచిక్కినప్పుడల్లా సత్యంతో మాటలు కలపటానికి ప్రయత్నించేవాడు. సాధారణంగా సత్యం ఎవరితోనూ మాట్లాడేవాడుకాదు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ అటూ యిటూ పచార్లు చేస్తుండేవాడు. కాని అతను మాట్లాడటం మొదలెట్టాడంటే ఆ వాగ్ధాటికి అడ్డువుండేది కాదు. ఆవేశంగా

అతను మాట్లాడుతుంటే ఉజ్జ్వలంగా ప్రకాశించే అతని కళ్ళవంక రెప్పవాల్చ కుండా చూసేవాడు రంగయ్య.

"మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చి పాతిక సంవత్సరాలు దాటుతున్నయ్. కాని బానిసత్వంనుండి బయటపడి నందుకు మనకు దక్కిన ఫలితాలేమిటి? ధనవంతులు మరీ ధనవంతులవుతున్నారు. పేదవాళ్ళస్థితి మరింత దిగజారి పోతోంది. లక్షాధికారులు కోట్లు గడించటానికి, ఒకపూట అన్నంతినేవాడు పస్తులుండటానికి తప్ప స్వాతంత్ర్యంవల్ల ఒరిగిందేమీ కనపడటంలేదు. దేశంలో యింతటి అవినీతి, దారిద్ర్యం ఓ పక్కన. సిరిసంపదలు, విలాసాలు మరో పక్కన పెచ్చుపెరిగిపోతూవుండగా దేశంలో ఆహారధాన్యాల కొరత ఎలా యేర్పడుతోంది? దేశం పారిశ్రామికంగా యింతటి అభివృద్ధిని పొందుతున్నా, విద్యా వైజ్ఞానికరంగాలలో ఎంత ముందడుగు వేసినా దేశంలో నిరుద్యోగ సమస్య ఇంతటి తీవ్రరూపం దాల్చటానికి కారకులెవ్వరు? ఈ అనర్థాలన్నిటికీ కారణం ఒక్కటే? దేశ సంపద నంతటినీ కొద్దిమంది స్వార్థపరులు గుప్పెట్లో పెట్టుకుని మిగిలిన కోట్లాది ప్రజలను నానాగడ్డీ కరిపిస్తున్నారు. ధరలు పెరిగినా, నిరుద్యోగ సమస్య రోజుకు పదింతలయినా, ఆకలిచావులు వందల నుండి వేల సంఖ్యలోకి మారినా యీ కొద్దిమంది మారాజులకు చీమకుట్టినట్లన్నా ఉండదు. పైగా ప్రజలను పీడించటానికి, దోచుకోవటానికి వీరికి మరింత అనువుగా వుంటుంది, అందుకే పరిస్థితులు ఎంతగా విషమిస్తే వారికి అంత లాభదాయకం. ఇలాంటి చీడపురుగులను నాశనం చేస్తే కాని దేశం బాగుపడదు. పుస్తకంలోని ఒక పేజికి చెదలు పట్టినవంటే ఆ పేజీని చింపి మిగతా పేజీలకు అవి ప్రాకకుండా చూడాలి. అలాగే ఒక చిన్నభాగం యిలా అవి నితితో. స్వార్థపరత్వంతో కుళ్ళిపోతుంటే మిగతా సమాజంయొక్క శ్రేయస్సు దృష్ట్యా ఆ కొద్దిభాగాన్ని నిర్మూలించక తప్పదు" అనేవాడు సత్యం.

అలా వ్యక్తుల్ని చంపడంవల్లనే కోరుకున్న నవసమాజ స్థాపన జరగ గలదని అతనికి తట్టకపోవడం చిత్రం. చెదపట్టిన కాగితాన్ని చింపేస్తే దక్కొచ్చు. వ్యక్తుల్ని ఏరిపారేసినంత మాత్రాన సామాజిక విప్లవం జరుగుద్దా?

సత్యం మాటలలోని నిజాయితీని మెచ్చుకున్నా, అతని మాటలు వింటుంటే రంగయ్య కెందుకో విచారంగా వుండేది. రంగయ్య అక్షరజ్ఞానం

లేనివాడేం కాదు. కాస్తోకూస్తో చదువనూ, వ్రాయనూ వచ్చు. పైగా తన చుట్టూ వున్న సమాజాన్ని, పరిస్థితులను అర్థంచేసుకోగల తెలివితేటలు, ఊహకొంత వరకు అతనిలో లేకపోలేదు.

"భాగ్యవంతులు పేదోళ్ళను ప్రేమించటం లేదని యిన్నాళ్లూ మొత్తుకున్నాం. ఇప్పుడు పేదవాళ్ళుకూడా ధనవంతులను ద్వేషించటం మొదలు పెట్టటంవల్ల సమస్యలు తీరి పోతాయా?" అన్నాడు రంగయ్య దిగులుగా.

"సమాజంలో హెచ్చుతగ్గులున్నంతకాలం యీ వర్గ ద్వేషం, రక్తపాతం తప్పవు. అందుకే వర్గరహితమైన సమాజాన్ని నెలకొల్పటానికి మేమంతా ప్రయత్నం చేసేం. అవసరమైతే రక్తాన్ని బలిగొనటానికి రక్తాన్ని త్యాగం చెయ్యటానికికూడా సిద్ధపడ్డాం" అన్నాడు సత్యం.

రంగయ్యకి అతనిమాటలు సగం అర్థమయేవి. సగం అర్థమయ్యేవికావు. అతనికి బాగా తెలిసిందల్లా ఒక్కటే విషయం. అదేమిటంటే "యీ సత్యం హత్యలు చేస్తే చేసి ఉండవచ్చు. కాని యేంచేసినా యితను స్వార్థంకోసం స్వప్రయోజనంకోసం చెయ్యలేదు." సమాజంకోసం చేసేడు. దేశంకోసం చేసేడు. అందుచేత అతనింతటి కఠినశిక్షకు అర్హుడుకాడు. అతను చేసింది తప్పే కావచ్చు. కాని అతని ఆశయాలలో కల్మషంలేదు. అలాటివాడికి ఉరిశిక్ష ఎందుకు వెయ్యాలి? ఎయిర్ కండిషన్డు రూములలో యీజీఛైర్లలో పీఠ పడుకుని తమ స్వార్థంకోసం కాలు కదల్పకుండా కనుసైగతోనే ఎన్నో మారణహోమాలను, హింసాకాండలను జరిపించే అహింసావాదులకంటే సత్యం ఎన్నో రెట్లు మెరుగు, అనుకునేవాడు రంగయ్య.

సత్యం జైలుకి వచ్చినదగ్గరనుండి ఎంతోమంది అతనిని చూట్టానికి వచ్చేవారు. అ వచ్చినవాళ్ళలో తెలుగు మాట్లాడే వాళ్ళు కొందరు. హిందీ మాట్లాడేవాళ్ల కొందరు. ఇంగ్లీషు మాట్లాడేవాళ్లు కొందరు.

ఏ భాషలోనయినా అనర్గళంగా, అనాయాసంగా మాటలాడే సత్యంని చూసి చకితుడయ్యేవాడు రంగయ్య.

వాళ్ళందరూ సత్యంతో ఏదో వాదించేవారు. నచ్చ చెప్పటానికి ప్రయత్నించేవారు. అదేమిటో కొంతదిరోజుల తర్వాతగాని తెలియలేదు రంగ

య్యాకి, అతనికి ఉరిశిక్ష తప్పించేందుకుగాను సుప్రీంకోర్టుకు అప్పీలు చేసుకో మని వాళ్ళు ప్రాధేయపడితే అతడు ఒప్పుకొనేవాడుకాడు. చివరికి అతని తరఫున ఒకతను సుప్రీంకోర్టుకు అప్పీలు చేసుకుంటే అతని అభ్యర్థనను త్రోసి పుచ్చింది కోర్టు.

సత్యంకి ఉరిశిక్ష ఖాయమయింది.

అదివిని రంగయ్య గుండెలు గుభేలుమన్నయ్. అలా అవటానికి సత్యంకి చావు దాపురించటం ఒక్కటేకాదు. ఆ చావు తన చేతులమీదుగా జరగవలసి ఉండటంకూడా ఒక కారణమే.

సత్యంకి ఉరిశిక్ష ఖాయమని తేలిన తరువాత అతనిని చూట్టానికి ఎవరు పడితే వాళ్ళు రాకూడదని నిషేధించేరు.

సత్యంని కొద్దిరోజులలో ఉరితీయబోతున్నారన్న వార్త విని చాలామంది అతనికోసం ఏడ్చేరు. అందులో ఒకరు పక్కనేఉన్న రంగయ్యను, నలుగురైదు గురు చప్రాసీలనుచూచి "సత్యం ఎందుకు చచ్చిపోతున్నాడో తెలుసా? నీకోసం, మీలాంటివాళ్ళకోసం..." అన్నాడు.

ఆ మాట విని అందరూ ఒకరి మొహాలొకరు చూచుకున్నారు. అందరి మనసులూ కలుక్కుమన్నయ్.

సత్యం మాత్రం తనను మృత్యువు సమీపిస్తున్నందున విచారిస్తున్న ఛాయలనేమీ కనపర్చలేదు.

పైగా సంతోష పడుతున్నట్టుకూడా కనపడ్డాడు. కారణం అతడే చెప్పే డొకసారి: "ఈ స్థితిలో నేనే బ్రతికి ఉన్నందువల్ల ప్రయోజనం ఏమీలేదు. పైగా చనిపోవటం వల్ల కొన్ని లాభాలుకూడా ఉన్నయ్. నా మరణవార్త విని కనీసం కొద్దిమంది ప్రజలలోనయినా చైతన్యంవస్తే అంతేచాలు..." అన్నాడు.

రోజులు నడుస్తున్నయ్. సత్యంని ఉరితీసే సమయం ఆసన్నమవుతున్న కొలదీ రంగయ్య మనసు నీరసింప సాగింది. శరీరం కంపింపసాగింది.

ఏ క్షణంలోనైనా, ఏ కారణంచేతనైనాసరే యీ ఉరిశిక్ష తప్పిపోతే బాగుండునని కోరుకునేవాడు.

అలా రంగయ్య కలవరపడుతున్నాడే తప్ప, సత్యం మాత్రం నిశ్చింతగా కనపడేవాడు.

మృత్యువు ఆగమనంకోసం వేచిఉన్నట్లు అతనికళ్లు అనిమిషంగా తీక్షణంగా చూస్తుండేవి. మూడురోజులలో అతనిని ఉరితీస్తారనగా సత్యం మాటలాడటం పూర్తిగా మానివేశాడు. భోజనం చేసేవాడుకాదు. ఎటోదూరంగా అతి దూరంగా, సాధారణ నేత్రాల చూపుకందని ప్రదేశాలలోకి ఎక్కడికో చూస్తుండేవాడు.

అతని ఈ భంగిమని చూసి రంగయ్య నరాలు మరింత బిగుసుకు పోయినవ్. ఒకప్పుడు అగ్నిజ్వాలలు చిమ్మి, ఇప్పుడు మరీ హిమాచలంవలె ఘనీభవించుకుపోయిన యీ వ్యక్తి తన చేతులతో ఎలా చంపటం?

రంగయ్య అవస్థనుచూచి రత్తి గుబులుపడింది. వెంటనే ఆమె ధైర్యం తెచ్చుకుని భర్తకు ధైర్యం చెప్పింది. "నీ డ్యూటీ నువ్వు చేస్తున్నావు. అతనిని చంపాలన్న కోరిక నీకు లేదుకదా. ఐనా చంపటానికి మనం ఎవరం? చంపేవాడు, చంపించేవాడు ఆ భగవంతుడే!" అన్న ధోరణిలో మాట్లాడేది.

కాని ఆ మెట్టవేదాంతం రంగయ్య మనసును సమాధానపరచేది కాదు. అసలే ఒక నిండుప్రాణాన్ని బలికొనవలసి వస్తోందే అన్న చింత. దానికితగ్గట్టు సత్యంవంటి నవయువకుడు, ఉత్సాహవంతుడు, ధైర్యశాలి, ఆదర్శశీలి అయిన మనుష్యుడిని ఉరితీయవలసి వస్తోందని మరింత బెంగ.

చివరికి ఆఖరిరోజు రానే వచ్చింది.

"నీ కిష్టమైన బట్టలు, నీకిష్టమైన తిండి యేమి కావాలి చెప్పు. తెచ్చియిస్తాం" అన్నారు జైలు అధికారులు.

దానికి సత్యం నవ్వి "దేశంలో కోట్లాది ప్రజలు కడుపునిండా తిండిలేక, వంటినిండా బట్టలేక దిక్కుమాలిన బ్రతుకు బ్రతుకుతున్నారు. వాళ్ళకష్టాలు తీరేమార్గాలేమిటో చూడండి. రేపిపాటికి ఈ లోకాన్ని వీడిపోయే నా తిండీ బట్టనుగురించి మీ కెందుకంత దుగ్ధ?" అన్నాడు.

అతని మాటలు వింటుంటే అందరి కళ్ళవెంబడి నీళ్లు తిరిగినయ్. ఆ సమయంలో అంత స్వచ్ఛందగా నవ్వగలిగిన అతనిని చూసి ముగ్ధులయ్యేరు.

అక్కడ వున్నవాళ్ళలో కాస్త తల నెరిసిన ఉద్యోగి ఉరిశిక్ష విధింప బడినవారి ప్రవర్తనను గురించి తన అనుభవములను కొన్నింటిని చెప్పసాగేడు. ''ఎంతటి ఉద్దండులయినా, గుండెలు తీసిన బంట్లయినా, ఎన్ని ఖూనీలు చేసిన వారైనా తమకి ఉరిశిక్ష ఖాయమని తెలిసేక డీలా పడిపోయేవాడు. ఉరితీసే రోజు దగ్గర పడుతున్నకొద్దీ వాళ్ళ శరీరంలో మానసికావస్థలో ఎన్నో విపరీత మైన మార్పులు కనపడేవి. కొందరు ఆలోచనను భరించలేక పిచ్చివాళ్ళయే వారు. కొందరు వెక్కి వెక్కి ఏడ్చేవాళ్లు కొందరా వార్త వింటూనే మూర్ఛ పోయేవారు. గుండె ఆగిపోయిన కేసులుకూడా ఒకటి, రెండూ లేకపోలేదు. ఏమైనా తనకు చావు ఖాయమనీ, అందునా తన చావు బలవంతాన సంభవిస్తుం దనీ తెలుసుకున్న ఏ మనిషీ సహజంగా ఉండలేడు. ఆ పరిస్థితినుండి ఎలా గైనా తప్పించుకు పోదామని ప్రయత్నిస్తాడు. లేదా ఆత్మహత్యకికూడా పాటు పడతాడు...'' ఆ కథలన్నీ వింటుంటే రంగయ్యకి పై ప్రాణాలు పోతున్న ట్లుండేది.

''నీ వాళ్ళెవరైనా ఉన్నారా? ఎవరినైనా చూస్తావా?'' అన్న ప్రశ్నకు ''ఈ దేశప్రజలందరూ నావాళ్ళే. పుట్టిన క్షణంనుండి పాతికేళ్ళుగా దురవస్థను చూస్తూనే వున్నాను. వాళ్ళకోసం ఏమీ చెయ్యకుండానే, వాళ్ళ దుస్థితిని రూపు మాపకుండానే చనిపోతున్నందుకు నాకు సిగ్గుగావుంది. ఈ అవమానాన్ని నేను భరించలేను. నన్ను వెంటనే ఉరితీయండి. నన్ను చంపండి''అన్నాడు.

ఆసాయంత్రం వార్డెను రంగయ్యను పిల్చి తాడు, ముసుగు, బల్ల మొద లైన సరంజామా నంతటినీ సిద్ధం చెయ్యమని చెప్పేడు.

''సరిగ్గా తెల్లవారుఝామున నాలుగు గంటలకు అతని ప్రాణంపోవాలి'' అని హెచ్చరించేడు.

అప్పటినుండి రంగయ్యకి భయంతో నాలుక పిడచ కట్టుకుపోయింది. రత్తికీ మధ్యనే సుస్తీచేసింది. అందువల్ల పెందలాడే అన్నంతిని నిద్రపోయింది. కాని రంగయ్య ఆ రాత్రి అన్నం తినలేదు. కంటిమీద కునుకు రావటం లేదు.

గుడిసె బయట గాఢాంధకారం. తన మనసులోని చీకటికి బయటనున్న ఆ గాఢాంధకారం తోడై అతనిని భయపెడ్తోంది. అందుకే కిరసనాయిలు

బుడ్డిని ఆర్పకుండా, కన్నార్పకుండా గుడిసెలో కాళ్ళు ముడుచుకుని కూర్చు న్నాడు రంగయ్య. మరో రెండుగంటలలో తను ఉరితీసే ప్రదేశానికి వెళ్ళి అన్నీ సిద్ధం చెయ్యాలి, కాని ఎలా వెళ్ళటం? కొద్దిగజాల దూరంలోవున్న జైలుగోడలు అతని కంటికి భయంకరంగా కనపడుతున్నయ్.

ఈ ఆపదనుంచి తప్పించుకోవటానికి ఒక్కటే మార్గం. తనీ ఉద్యోగా నికి రాజీనామా యిచ్చెయ్యాలి. కాని ఆ తరువాత జీవితాంతం తను చేసినపనికి పశ్చాత్తాపపడవలసి వుంటుంది. లేమి యెలాటిదో అనుభవపూర్వకంగా తనకు తెలుసు. తెలిసి తెలిసి మళ్ళీ దారిద్ర్యాన్ని కొని తెచ్చుకోవటమా? తనొక్కడే కాదుగా ఇలాటి ఉద్యోగం చేస్తున్నది! తనలాటి ఉద్యోగస్థులు ప్రపంచంలో చాలామంది వున్నారు. వాళ్ళందరూ తనలానే బాధపడుతున్నారా? ఒక్కొక్కరి ఉద్యోగాలు ఒక్కో రకంగా ఉంటయ్. రోగి ప్రాణాన్ని కాపాడటానికి డాక్టరు శరీరభాగాలను కత్తితోకోస్తాడు. అంతమాత్రాన అతనిని హింసాకారుడంటామా? అతనిలో దయాదాక్షిణ్యాలు లేవనగలమా? తన సంగతీ అంతే! ఉద్యోగ ధర్మ నిర్వహణలో తనొక వ్యక్తి. మెడకు ఉరితాడును బిగిస్తున్నాడు. అందులో తప్పేమన్నా వుంటే అది తనది కాదు.

అలా మనసు కుదుటపరచుకోవటానికి శాయశక్తులా ప్రయత్నించ సాగాడు రంగయ్య.

* * *

చివరికెలాగై తేనేం అన్న టైముకి సిద్ధంచేసేడు. ఏదో అతని కాళ్ళూ చేతులు ఆడుతున్నాయే తప్ప రంగయ్యమనసు మాత్రం శూన్యంగా ఉంది. అతనికి బాహ్యస్పర్శ నశించి పోతున్నట్లు అనుభూతి కలుగుతోంది.

అంతటి వెర్రి భయంలోనూ, అంతటి శీతల గంభీర వాతావరణంలో కూడా...ఏదో ఒక క్షణంలో యీ ఉరి తప్పితే బాగుండును అన్నకోరిక అతని మనసులో మినుకు మినుకు మంటూనే ఉంది.

సరిగ్గా ఉరితీసేముందు "అతనిని క్షమించా" నంటూ ప్రెసిడెంటు దగ్గరనుంచి ఉత్తరువు రావచ్చు, లేదా అతని మెడకు తగిలించిన ఉరిత్రాడులో ఏదో లోపం ఉండి, సమయానికి పుటుక్కున తెగిపోవచ్చు. హఠాత్తుగా

సత్యంకి ఏదో విపరీతమైన జబ్బువచ్చి అతని ఉరిశిక్ష తేదీ పొడిగింపబడవచ్చు. ఇందులో ఏం జరిగినా తనకి పాపం తప్పుతుంది. సత్యం ప్రాణం దక్కు తుంది'' అనుకున్నాడు రంగయ్య,

కాని అతననుకున్నవానిలో ఏ ఒక్కటీ జరగలేదు.

సత్యంని ఉరితీసే ప్రదేశానికి తీసుకువచ్చేరు.

ఆతనితోపాటు జైలువార్డెను, జైలుసూపర్నెంటు, ఒక డాక్టరు, ఒక పోలీసు ఉన్నారు.

వీళ్ళందరి సమక్షంలో రంగయ్య సత్యంమెడకు ఉరిత్రాటిని బిగించాలి.

''చివరగా నువ్వు చెప్పదల్చుకున్న దేమయినా ఉన్నదా?'' సూప ర్నెంటు అడిగాడు.

సత్యం తన సహజమైన ధోరణిలో అన్నాడు: ''కొద్ది క్షణాలలో నా మెడకు ఉరి బిగించబోతున్నారు. నా ప్రాణాన్ని తీయబోతున్నారు. కాని మీరు యీ ఉరిని వేస్తున్నది నాకుకాదు. అల్లకల్లోలంగా వున్న దేశంలో నిప్పురవ్వల్లా ఎగిరి పడుతున్న వందలాది చైతన్య మూర్తులకు. చంపుతున్నది నన్నుకాదు, యుగయుగాలుగా హింసాద్వేషాల వికటాట్టహాసాల మధ్య హీనస్వరంతో ఎలు గెత్తి చాటుతున్న మానవతని ఆ సంగతిని మీరందరూ గుర్తుంచుకోండి. అదే నేను చెప్పవలసిందీ, చెప్పగలిగిందీను'' అన్నాడు సత్యం.

''నీ చివరికోరిక యేమిటి?'' అన్న ప్రశ్నకు.

''మనిషిని మనిషిగా చూడాలన్నదే నా మొదటి కోరికా, ఆఖరికోరికా కూడాను. హెచ్చుతగ్గులు లేని సామాజిక వ్యవస్థే నా ఆశయం, అంతా పాటు పడే నవసమాజమే నా సుందర స్వప్నం.''

ఆవేశంగా, అదేపనిగా అనుకుంటున్న మాటలు అందరి హృదయాలనూ కదిలించి వేసినయ్.

సూపర్నెంటు ఆదేశంప్రకారం రంగయ్య వణుకుతున్న చేతులతో ముఖంమీద నల్లనిముసుగు వెయ్యబోతూ అతనిని చూపుంచేడు. సత్యం

ముఖంమీద ముసుగు వెయ్యబోతూ అతనివంక ఆఖరిసారిగా చూసేడు. సత్యం భావరహితంగా, మౌనంగా సూటిగా రంగయ్య కళ్ళలోకి చూసేడు. తెల్లగా బాలంగావున్న అతని కళ్ళలోని భావమేమిటో అర్థంచేసుకుందామని అతను ప్రయత్నిస్తుండగానే చటుక్కున అతని చేతులలోని ముసుగు జారి సత్యం ముఖాన్ని కప్పివేసింది.

క్రిందికి దిగివచ్చి ఉరితాడును బిగించి పట్టుకున్నాడు రంగయ్య.

సూపర్నెంటు ఏదో అంటున్నాడు. రంగయ్య వంటి మీద స్పృహలేదు.

గడియారం 'ఠంగు ఠంగు' మంటూ నాలుగుగంటలు కొట్టటం, సూపర్నెంటు "వన్, టూ, త్రీ...రెడీ..." అనటం, సత్యం మెడకు ఉరిత్రాడు బిగుసుకుపోవటం, అన్నీ క్షణాల్లో జరిగిపోయినయ్.

సత్యం ప్రాణం గాలిలో కలసిపోయే సమయంలో ఒక భయంకరమైన కేక వినవచ్చింది. ఆ కేకవచ్చింది సత్యం కంఠంనుండి కాదు. రంగయ్య గుండెను చీల్చుకువచ్చింది.

స్పృహతప్పి పడిపోయిన రంగయ్యను జైలు ఆవరణంలోకి తీసుకుపోయేరు. డాక్టరు ప్రథమచికిత్స చేసిన తరువాత తేరుకుని కళ్ళు తెరిచేడు రంగయ్య.

ఒక గంటసేపైన తరువాత యిద్దరు పోలీసులు ఆతనిని వెంటపెట్టుకుని యింటిదగ్గర దింపేరు.

అప్పుడు తెల తెలవారుతోంది.

గుడిసెలలోని వాళ్ళందరూ ఎవరి పనులలో వారున్నారు.

రత్తి రోజూ అలవాటు ప్రకారం ఈ రోజు పొయ్యిలోకి కావలసిన కట్టెలు, పొయ్యిమీదకు కావలసిన పదార్థాలను తెచ్చుకోవటానికి బజారుకు వెళ్ళింది.

అతనిని దించిన మనుష్యులు వెళ్ళిపోయేరు.

రంగయ్య ఒంటరిగా గుడిసెలో కూర్చున్నాడు. అతని కళ్ళముందు

ఏవేవో దృశ్యాలు కదులుతున్నయ్. అతని గుండెలో ఏవేవో మాటలు ప్రతిధ్వనిస్తున్నయ్

ఉరిత్రాడు... సత్యం చూపు...ఏమిటా చూపులో భావం? "రంగయ్యా! నేను చచ్చిపోతున్న దెవరికోసమో తెలుసా? నీ కోసం, నీలాటివాళ్ళకోసం" అని ఆ చూపులో భావం? "ఈ ఉరిని వేస్తున్నది నాకు కాదు. అల్లకల్లోలంగా వున్న, నిప్పురవ్వల్లా ఎగిరిపడుతున్న వందలాది చైతన్యమూర్తులకు" నల్ల ముసుగు, సత్యం కళ్ళు..."వన్, టూ, త్రీ రెడీ— కెవ్వున కేక, డాక్టర్... తెల్లకోటు, జైలు వార్డెను, పోలీసులూ. "ఈ దేశప్రజలందరూ నా వాళ్ళే...ఈ ఈ అసమానత లన్నీ నేను భరించలేను. నన్ను వెంటనే ఉరితీయండి!, ఠంగ్...ఠంగ్...ఠంగ్, ఠంగ్! వన్ టూ త్రీ...రెడీ! సమాజంలో హెచ్చు తగ్గులున్నంతకాలం వర్గద్వేషం, రక్తపాతం రక్తపు...రక్తం...రక్తం... నల్లనిముసుగు...ఠంగ్ ఠంగ్! వన్టూ త్రీ...రెడీ!

"మీరు చంపుతున్నది నన్ను కాదు, యుగయుగాలుగా హింసాద్వేషాల వికటాట్టహాసాల మధ్య హీనస్వరంలో ఎలుగెత్తి చాటుతున్న మానవతని... "సత్యం కళ్ళు...నల్ల ముసుగు..." నేను చచ్చిపోతున్నది ఎవరికోసమో తెలుసా? నీకోసం—నీలాటి వాళ్ళకోసం...వన్...టూ...త్రీ...! త్రీ!..." ఒక్కగంట తరువాత బజారునుండి తిరిగివచ్చిన రత్తి, నులకమంచంలో చేష్టలు దక్కి స్థాణువులా పడివున్న రంగయ్యను చూసి స్తంభీభూతురాలైంది.

# మిసెస్ అండ్ మిస్టర్ సక్సేనా

శ్రీమతి బీనాదేవి

"ఇరవైనాలుగ్గంటలూ ఇంట్లోకూర్చుని మానెత్తెక్కి-పిండి కొట్టకపోతే, ఓసారి మీక్లబ్బుకో, లేక ఫ్రెండ్సు దగ్గరకో, వల్లకాటికో అఘోరించకూడదూ?" మావారనేసరికి నా క్కోపం వచ్చేసింది. మామూలు కోపంకాదు, పిచ్చి కోపం. ఆ అన్నది మావారు కాకుండా యింకెవ్వరైవుండినా, యీపాటికి నేను జైల్లో వుండేదాన్ని. ఆ క్షణంలోనే నిర్ణయించేసుకున్నాను. రోజూ సిటీ బస్సులా ఎక్కడికో ఓ చోటికి తిరిగొద్దామని. నేను అరక్షణం కోపానికి అరవైలక్షల నిర్ణయాలు తీసేసుకుంటాను. నిర్ణయం అంటే చేసేసుకున్నాను కాని ఎక్కడికి వెళ్ళాలి? మావారన్న మూడోచోటికి మనంతట మనం వెళ్ళంకదా, ఎవరైనా మోసుకెళ్ళాలి. ఫ్రెండ్సా? నా కసలు లేరే! ఎవరైనా వున్నా వాళ్ళు నాకు, మావారికి కామన్ ఫ్రెండ్సుతప్ప నాకు విడిగా ఫ్రెండ్సంటూ లేరు. పోగా మిగిలింది క్లబ్బు అంచేత అప్పటినుంచే అమావాస్యకీ, పున్నానికీ క్లబ్బుకీ, ప్రతీ ఫస్టుకీ సూపర్ బజారుకీ వెళ్ళడం ప్రారంభించేను.

ఆవేళ—మాక్లబ్బులో డిన్నర్. నే నెప్పుడూ డిన్నరు మిస్‌కాను. ఎంచేతంటే ఎప్పుడూ చూడని, పేరువినని మెంబర్సంతా ఆవేళ వస్తారు, అందర్నీ ఒకసారే చూసేవచ్చును. ఆవేళ నేను, మరో నలుగురం, అంటే మిసెస్ కైలాసం, మిసెస్ జగన్నాధం, మిసెస్ సేన్, మిసెస్ మధుసూదనం (యీవిడ అయిదడుగుల పొడవు, రెండడుగుల వెడల్పు, ఒక అడుగు మందం, పదకొండు ఘనపుటడుగుల ఘనపరిమాణంలో వుంటుంది. అయితే అతితెల్లగా వుండడంవల్ల కొందరు ఆవిడ్ని ఐరావతం అంటుంటారు రహస్యంగా) ఒకమూల టేబిలుదగ్గర కబుర్లు చెప్పుకుంటున్నాం—మా క్లబ్బులో సాధారణంగా పెద్ద ఆఫీసర్ల పెళ్ళాలంతా ఓ గ్రూపు (ఎవరిపేర్లూ నాకు తెలీవు, అందరూ మిసెస్ ఫలానా అనే తప్ప.) డాక్టర్లతాలూకు ఓ గ్రూపు. అరవ వాళ్లు, కన్నడంవాళ్ళు ఓ గ్రూపు. యిలా రకరకాలుగా విడిపోయి కబుర్లు చెప్పుకోవడం రివాజు. అదేం తప్పుకాదు. ఎవరూ ఫీలవరు కూడా. ఆదేవిటో గాని పెద్ద ఆఫీసర్లనబడేవాళ్ళ పెళ్ళాలు ఎవరూ నన్ను గుర్తించరు, చిన్నవాళ్లు నా దగ్గరకు రావడానికి జంకుతారు. నాకు అరవం, కన్నడం రావు, హిందీ వాళ్ళెవరూలేరు. అంచేత మొదట్లో తీర్థంలో తప్పిపోయిన పిల్లలా బెంగగా,

బెదురు బెదురుగా అయిపోయేదాన్ని క్లబ్బులో. కాని తర్వాత ఏ గ్రూపుకీ చెందని ఓ నలుగుర్ని కూడేసి కాలక్షేపం చెయ్యటం ప్రారంభించేను-

ఆ వేళకూడా మా కబుర్లు సాగుతున్నాయి. ఇంతలో,

"మీరు తరుచు క్లబ్బుకి వస్తూవుంటారా?" అని పరిచయం లేని ఆవిడ ఆకస్మాత్తుగా నాదగ్గరకు వచ్చి అడిగేసరికి తుళ్ళిపడ్డాను పల్లెటూరిలో పెరగడంవల్లో, జడ్జీని కట్టుకోవడంవల్లో తెలీదుకాని నేనసలు క్లబ్బుకి వెళ్ళను. ఇప్పుడైనా పంతానికీ, పౌరుషానికీ వస్తున్నానే కాని మనస్ఫూర్తిగా మాత్రం కాదు. అంచేత ఆ సంగతి ఒప్పుకోవడం ఇష్టంలేక జవాబుగా వెర్రినవ్వు నవ్వేను.

"దటీజ్ రైట్. నేనూ ఎక్కువగా క్లబ్బుకి వెళ్ళను. ఎందుకో తెలుసా? యిక్కడికి వస్తే పేక ఆడకుండా వుండలేను. ఆడితే డబ్బుపోకుండా వుండదు" అందావిడ, "మీ రేవంటారు" అన్న నవ్వు నవ్వుతూ.

జవాబు ఏం చెప్పాలో తెలీలేదు. "పేకాట ఆడకండి" అంటే కాపీ పుస్తకం నీతిలా వుంటుంది. పోనీ "అది గెలవండి" అందామంటే లాటరీ ఎడ్వర్టయిజుమెంటులా వుంటుంది. అంచేత మళ్ళీ వెర్రినవ్వే నవ్వేను.

"మీకు మాటలొచ్చా? మీ ఆయనేం చేస్తారు?"

"జడ్జీ" జవాబు చెప్పక తప్పలేదు.

"నేనూ అలాగే అనుమానపడ్డాను."

"............"

"ఈ జడ్జీలు ఇల్లుకూడా కోర్టులాగే నడుపుదా మనుకుంటారు, అఫ్ కోర్స్ అందరూ కాదనుకోండి. తనంటే అందరూ జడవడం వాళ్ళకి అలవాటై పోతుంది. అంచేత యింట్లో పెళ్ళాం, పిల్లల్ని కూడా ఖూనీ కేసులో ముద్దాయిని చూసినట్టు చూస్తారు. దాంతో ఇంటోవాళ్ళ ఒరిజినాలిటి, ఇనీషియేటివ్ అంతా చచ్చిపోతుంది. మీవారు కూడా ఆ రకమేనా!"

"ఫరవాలేదు."

"మీకు పిల్లలెంతమంది? నాపేరు మిసెస్ సక్సేనా"

"నలుగురు"

"నా పేరు చెప్పేనుకదా. మీ పేరు చెప్పరేం? ప్రశ్నవేస్తేగాని సమాధానం చెప్పడంలేదు మీరు. వితౌట్ డౌట్ మీ యిల్లు సెషన్సుకోర్టే ఆయి వుంటుంది."

"నాకు రెండు పేర్లున్నాయి."

"ఏవిటి? అసలుపేరూ, ముద్దు పేరూనా?"

"కాదు, పెన్‌నేమ్."

"రియల్లీ! యూ యార్టు ఆల్‌రైట్! కాని మీరెక్కడా రైటర్లా కనిపించరే? ఉండండి. బైట లాన్లోకి పోదాం. రైటరంటే ఒక చేతిలో కలం, యింకో చేతిలో లిక్కర్‌గ్లాస్ ...జుత్తు దువ్వుకోకుండా ఎలాగో వుంటారనుకున్నాను"

"పిచ్చివాళ్ళలాగానా?"

"నో. నో. కాని యు లుక్ లైక్ ఏన్ ఆర్డనరీ హౌస్ వైఫ్. మీకు కథలకి మెటీరియలెక్కడ దొరుకుతుంది? కొంపతీసి కోర్టుకి వెళ్తారేమిటి ఖూనీ కేసులూ, డైవోర్సు కేసులూ వినడానికి? ఒహ్. ది కోర్ట్సు ఆర్ అవుల్ ఐసే. ఒకసారి ఖూనీ కేసులో ఎవిడెన్సు యిచ్చేను. ఎవిడెన్సు పూర్తయేసరికి ఎవరు చంపేరా అన్నమాట వదిలేసి అసలు ఎవరైనా చచ్చిపోయారా అన్న డౌట్ వచ్చింది నాకు. అంత కన్ఫ్యూజ్ చేసి పారేసేరు ఆ జడ్జి, లాయర్సు కలిసి నన్ను. బైదిబై మీరు ఎప్పుడైనా ఖూనీ చేశారా?"

ఆవిడ ధోరణి వింతగావున్నా, ఆవిడ చొరవ నన్నాకర్షించింది. నలభై ఏళ్లు వుండొచ్చు. సబ్బు ఎక్స్యర్‌టైజుమెంటు తల్లీ పిల్లలలో-తల్లిలా-ఆవిడలో వయసు కనిపించదు. ఉన్న కొద్దితెల్లవెంట్రుకలూ దట్టంగావున్న నల్ల వెంట్రుకల్లో కలిసిపోయి పరీక్షగా చూస్తేగాని కనిపించవు. మనిషి మాంచి స్లిమ్‌గా వుంది. (నేను లావెక్కిన దగ్గర్నుంచీ, స్లిమ్‌గావున్న ఆడవాళ్ళనిచూస్తే నాకు సరదా. కొండొకచో జెలసీ). అది అందమో, ఆకర్షణో చెప్పలేనంత బావుంది. లిప్‌స్టిక్ రాసుకుందా అన్న అనుమానం వచ్చేటంత ఎర్రగా వున్నాయి.

పెదవులు. ముఖ్యంగా చెప్పుకోవలసింది ఆమె పెద్దకళ్ళు. ఆ కళ్ళకి ఆ మొహం చిన్నదై పోయిందేమో అన్నంత పెద్దగా వున్నాయి. చీకట్లోకూడా మెరుస్తూనే వుంటాయి. ఆవిడలో ఉన్న అతి ముఖ్యమైన ఆకర్షణ అతి కొత్తవాళ్ళతోకూడా అతి సన్నితంగా మాట్లాడ్డం. ప్రపంచంనిండా యిలాంటివాళ్ళే వుంటేయుద్ధాలే వుండవేమో అనిపిస్తుంది.

గదిలో ఒకమూలనున్నా, అవసరమైతే సెంటరాఫ్ దిస్టేట్ దగ్గరున్నట్టు కనిపించగలదు. లేదా నీడలావచ్చి ఎవరికీ కనిపించకుండానూ వుండగలదు. యీవిడ హాబీలేవిటో అన్న ప్రశ్న నాకు అకస్మాత్తుగా కలిగింది. పెయింటింగ్, గార్డెనింగ్ వగైరా అయివుండదు. కవిత్వం ఎందుకో కాదని పించింది. బహుశా స్టేజ్ లేదా మోడల్‌గర్ల్.

"ఏమిటాలోచిస్తున్నారు. మా యింటికోసారి రాకూడదూ?"

"అలాగే"

"చూశేరా. ప్రశ్నకి సమాధానమే చెప్పేరు కాని మీరూ మా యింటికి రండని మాటవరసకైనా అన్లేదు మీరు..."

"ఛ. ఛ. అదికాదు..."

"నేనేం అఫెండవలేదులెండి. మీలోని ఇనీషియేటివ్‌ని మీ జడ్జీగారు ఎలా నొక్కేశేరో రుజువుచేస్తున్నాను. మీరేం అనుకోకండి యిలా అంటున్నానని."

"కాని నన్ను మాటాడొద్దని ఆయన అన్లేదే?"

"చూశారా, మీరతన్ని ఎలా డిఫెండ్ చేస్తున్నారో. మాటాడొద్దనలేదు కాని మాటాడనివ్వరు. అంతే. ఇంతకీ యీ ఇంజనీరు మిసెస్ ఎవరో ఎందుకు యిస్తున్నట్టు యీ డిన్నర్?"

"వాళ్ళాయనకి వచ్చిన ట్రాన్స్‌ఫరు ఆగిపోయిందట."

"ఏవిటీ! ట్రాన్స్‌ఫరాగిపోతే డిన్న..." ఆశ్చర్యంతో వాక్యం పూర్తి చెయ్యలేక పోయింది.

"ఎవరి బాధలు వాళ్ళకుంటాయిలెండి"

"పీతకపాలు పీతవని శ్రీ. శ్రీ. కదూ అన్నది? ఆల్ యూ రైటర్స్ ఆర్ పెసిమిస్టిక్......"

"అందులో సింపథీయే వుంది."

"హేయిర్ స్ప్లిట్టర్స్"

"మీరు తెలుగు చదువుకున్నారా?" అడిగేను. ఆవిడ అక్కడా అక్కడా తెలుగు మాట్లాడినా, ఎక్కువగా ఇంగ్లీషులోనే మాట్లాడుతోంది.

"పరవాలేదు. మీలో నమ్మకం కుదురుతోంది. ఇప్పటికైనా ఒక ప్రశ్న వేశారు."

"కాని మీరు జవాబివ్వలేదు." నాకు కొత్తవాళ్ళతో మాట్లాడ్డమే కొంత బితుగ్గావుంటుంది. కానీ, కొంచెం పరిచయం అయితే మాట్లాడ్డంలో ఆవిడనే బీటౌట్ చేస్తానని ఆవిడకి తెలీదు.

"నేను ఆంధ్రానే. మా ఆయన సక్సేనా. మా ఫాదర్ నార్త్‌లో ఉద్యోగం చేశేవారు. నన్ను చూసిన వాళ్ళెవరూ నేను తెలుగుమనిషని అనుకోరు. అఫ్‌కోర్స్, అదే బావుంది. ఆంధ్రాలో ఎక్కడికి వెళ్ళినా ముందు నా పనే చూస్తారు."

ఆవిడలో సెన్స్ ఆఫ్ హ్యూమర్ గమ్మత్తుగావుంది.

యీలోగా డిన్నరుకి టైమవడంతో అందరం లేచేం. వెళ్ళిపోయేముందు నన్ను వాళ్ళింటికి ఓసారి రమ్మని మరోసారి చెప్పి మరీ వెళ్ళింది ఆవిడ.

ఆ తర్వాత మరో రెండుసార్లు క్లబ్బులోనూ, బజార్లోనూ కూడా ఆవిడని కలుసుకోడం జరిగింది. ఆవిడకి నాకూ కొన్ని కామన్ ఇంటరెస్ట్స్ వుండడం వల్ల ఇద్దరం సరదాగానే కబుర్లు చెప్పుకొన్నాం. కలుసుకున్నప్పుడల్లా వాళ్ళింటికి రమ్మని నన్ను ఇన్వైట్ చేస్తూనేవుంది. అదేవిటో నేనెవర్ని ఇంటికిరమ్మని ఇన్వైట్ చెయ్యలేను, ఇష్టంలేకకాదు, చేతకాక. అక్కడికీ మావారు, "మనింటికోసారి రమ్మను బుద్ధావతారంలాగ అలా నిల్చోక" అని ప్రాంప్ట్ చేస్తూనే వుంటారు. నాలోలేని బోల్డ్‌నెస్, చొరవ వగైరాలు మిసెస్ సక్సేనాలో వున్నాయి. అందుచేతే ఆవిడ నాకు మరీనచ్చింది. అవకాశం చూసుకొని వాళ్ళింటికోసారి వెళదామనుకున్నాను. అనుకోవడమే కాని చాలా రోజులవరకు వెళ్ళడం

కుదరలేదు. నాకు స్టార్టింగు ట్రబుల్ ఎక్కువ. కాని ఒకనాడు అనుకోకుండానే వెళ్ళడం జరిగింది.

ఎలాగంటే-ఆవేళ షష్టుతారీకు. అలవాటుగా నేనూ, మా అమ్మాయీ సూపర్ బజారుకి బైల్దేరేం. బజారుకి వెళ్లేం. గేటుమీద "ఈరోజు శలవు" అని తాటికాయంత అక్షరాల్తో బోర్డు వేలాడుతోంది. మా డ్రైవరు ఏం చెయ్యమన్నా రన్నట్టు కారు ఆపి చూస్తున్నాడు. నేనూ, మా అమ్మాయి ఒకరి మొహాలొకరు చూసుకొని నవ్వుకున్నాం! నవ్వడం అయిపోయేక శలవని నువ్వు చెప్పలేదేం అంటే నువ్వెందుకు చెప్పలేదని వాదించుకొని నాకేం తెల్సని తప్పించుకొన్నాం. ఎలాగా ఇంట్లో సాయంత్రం అయిదు వరకూ రామని చెప్పేంకదా, ఇంకెక్కడికేనా పోదాం అంది మా అమ్మాయి. అప్పుడు నా పీతబుర్రకి తట్టింది ఆ దగ్గర్లో ఎక్కడో సక్సేనాగారిల్లుందని. వాళ్ళింటికి వెళ్దాం అన్నాను. అయిష్టంగానే ఒప్పుకుంది, మా అమ్మాయి.

గుర్తులు వెతుక్కొని వాళ్ళిల్లు చేరేం. బయట ఆర్. టి. సక్సేనా, మేజర్ రిటైర్డు అన్న బోర్డు వుంది. గేటు దాటి లోపలికి వెళ్లేం. వీధి వరండాలో ఒకాయన పడక్కుర్చీలో పడుకొని పేపరు చదువుకుంటున్నాడు. మనిషినీ, తెల్ల మీసాల్నీ చూడగానే అతనే మిలిటరీ ఆఫీసరని అర్థమైపోయింది అతను మమ్మల్ని చూసికూడా లేచే ప్రయత్నం ఏమీ చెయ్యకపోవడంతో నాకు అతని మేనర్సు మీద చిన్న చూపు కలిగింది. మిలిటరీ వాడికి మేనర్సు ఏమిటిలే అని కూడా అనుకున్నాను. మేము ఫలానా అనీ, మిసెస్ సక్సేనాగారికోసం వచ్చేమనీ మా అమ్మాయే చెప్పింది. వెంటనే అతను "రండి. రండి. కూర్చోండి. మీ గురించి మా ఆవిడ తరచు చెప్తూ వుంటుంది, ఇప్పుడే ఆవిడా, అబ్బాయీ బజారుకి వెళ్ళేరు. తొందరగానే వచ్చేస్తారు. కూర్చోండి" అంటూ కుర్చీలు చూపించేడు మమ్మల్ని కూర్చోమన్నట్టు. అతని తెలుగు వింటే తెలుగు వాడే అనుకుంటాం. అంత స్పష్టంగావుంది. విధిలేక కూర్చున్నానే కాని యీ మిలిటరీ అతన్తో నేనేం మాట్లాడగలను. పోనీ వెళ్ళిపోతేనో "మరో సారి వస్తానని చెప్పేసి" అనిపించింది.

మిలటరీవాళ్ళకి సిక్స్త్ సెన్స్ వుంటుందేమో మరి!

"వచ్చేస్తుందిలెండి. అబ్బాయి మళ్ళీ వెళ్లిపోతాడు కదా, అంచేత తల్లీ, కొడుకూ కలిసి అవీ, ఇవీ అన్నీ, తెగ కొనేస్తున్నారేమో. అసలు పొద్దున మీరు ఫోనుచేసి వుండాల్సింది. ఇప్పుడీ శ్రమలేకపోను" అన్నాడతను, ముందుగా ఫోనుచేసి రానందుకు సున్నితంగా విమర్శిస్తూ. ఎంతైనా మిలిటరీ డిసిప్లిన్!!

మేము అనుకోకుండా వచ్చేమనీ, అసలు యిక్కడికి వద్దామని అనుకోనేలేదనీ, అంచేతే ఫోను చెయ్యలేక పోయేమనీ అతి ఎపాలజెటిక్‌గా చెప్పి యీసారి ఫోనుచేసే వస్తామని భరోసాకూడా యిచ్చేం.

అతను కూర్చున్నది వీధివరండా. ఆ వరండామీద అతను కూర్చున్న పడకకుర్చీ కాక మరోనాలుగు గార్డెన్స్ చెయిర్సు, ఒక టీపాయ్ మాత్రం వున్నాయి, వరండా చుట్టూవున్న మెష్‌కి మనీప్లాంట్ చిక్కగా అల్లుకుంది. గోడని ఒకే ఒక పెయింటింగ్ ఒరిజినల్‌దేవుంది. కాంపౌడ్ నిండా గులాబీలు వున్నట్టున్నాయి, మొక్కసైజు, పువ్వుసైజు చూస్తే వాటిని చాలా శ్రద్ధగా పెంచుతున్నట్లు తెలుస్తుంది. కాంపౌండులో ఎక్కడా ఒక రాలిన పువ్వుగానీ, ఎండిన ఆకుగాని లేకుండా నేలనే మనం కూర్చోవచ్చు నన్నంత నీట్‌గావుంది. టీపాయ్ మీదున్న చక్కటి ఫ్లవర్ వేజ్‌లో రెండే రెండు గులాబులు వున్నాయి. ముందలతనికి మంచి అర్టిస్టిక్ సెన్స్ వుంది అనిపించింది. పెద్ద అడవిలాటి సీనులు బోల్డు ప్రింటువున్న లుంగీ కట్టుకున్నాడతను. అంటే మోడర్న్ ఫేషన్స్‌కు యిష్టపడతాడన్న మాట. మనిషికిగాని మనసుకి వయసు రాలేదు బాబోయ్!

"ఆడవాళ్ళు వచ్చినా లేవనందుకు క్షమించండి. నాకు ఒక కాలులేదు. తీసేసేరు" అన్నాడు ఆయన మేము కూర్చున్నాక. పాపం! యీ మిలిటరీ బతుకులే అంత. యుద్ధం లేనప్పుడు యెంతో హాయిగా ఆరోగ్యంగా బతుకుతారు. కాని యుద్ధంవస్తే ప్రాణం పోకపోయినా కళ్లో కాళ్ళో పోతాయి. అంత ఆరోగ్యంగా కనిపిస్తున్న అతనికి కాలు లేదని ఊహించ లేకపోయేను. నోట మాట రాలేదు.

"ఏ యుద్ధంలో పోయిందని అడక్కండి..." అన్నాడాయనే మళ్ళీ. నేను అడగలేదు.

"మూడు యుద్ధాలు చూశేను. సరిగ్గా చెప్పాలంటే చేశేను. ఒక్క గోరుకూడా పోలేదు..."

"......"

"శలవలకి ఇంటికి వెళ్తే లారీ తొక్కేసింది. ప్రిమచూర్ గానే రిటైర్ చేశేరు."

అయితే అతనిలో కనిపిస్తున్న వయసు నిజమైనది కాదన్నమాట. యాక్టివ్‌లైఫ్‌కి అలవాటు పడ్డాక కాలు పోయి కుమిలి కుమిలి వయసు రాకుండానే ముసిలి అయి పోయుండాలి. నా ఆలోచన గ్రహించినట్లున్నాడు. "వయసు రాకుండానే ఇతని కింత నెరసినజుట్టు ఎలా వచ్చిందని ఆలోచిస్తున్నారా, ఈ మిలిటరీ ఉద్యోగం లాగే అదీ నా వారసత్వం" మెల్లగా నవ్వుతూ అన్నాడు.

నే నేమీ మాట్లాడలేదు.

"మీరు నక్సలైట్లా?"

"ఏం అలా అడిగారు?" అడగక తప్పలేదు.

"డెమాక్రసీలో నమ్మకం లేని వాళ్ళలా అతి సైలెంట్‌గా ఉంటే"

మిలటరీవాళ్లు యుద్ధంలో అడవుల్లోనూ, యుద్ధంలేనప్పుడు పెద్ద పట్టణాల్లోనూ ఉండి జీవితాన్ని పరీక్షగా చూడలేరని నేనప్పటివరకూ అనుకునేదాన్ని. ఇతన్ని చూసేక ఆ అభిప్రాయం మార్చుకున్నాను.

"మీవారు జడ్జి అటగా! తీసుకురాలేక పోయారా?" అడిగేడు అతను.

"సూపర్ బజారుకని బయలుదేరేం" సగమే చెప్పేను.

"అతను చాలా తెలివైనవారు అయుండాలి. ఇటీజ్ ఎ ఫాలీ టు గో షాపింగ్ విత్ ఎ వుమన్. ఆడవాళ్ళతో బజారుకెళ్ళడం తెలివితక్కువ. ఫ్రెండ్‌తో బార్‌కి, పెళ్ళాంతో బజారుకీ వెళ్ళకూడదు. మీరేమంటారు?"

"ఫ్రెండ్‌కీ, పెళ్ళానికి డబ్బుంటే తప్పు" అన్నాను.

‘‘అందుకే రైటర్ తోటీ లాయర్‌తోటీ వాదించ కూడదంటారు’’ అన్నాడతను.

పాలిటీషియన్‌తో కూడా’’ అన్నది మా అమ్మాయి.

‘‘కొంపదీసి నువ్వూ రైటర్‌వేనా ఏమిటీ? నీకు టాలెంట్ ఉన్నా నామాట విని రాయకు. నువ్వు బాగారాయలేకపోతే ఆ తల్లికి తగ్గ కూతురివి కావు అంటారు బాగారాస్తే మీ అమ్మే రాసి నీ పేరు పెట్టిందంటారు. అంచేత నీకు ఎలాగూ పేరురాదు కాబట్టి కథలు రాయకు. ఇంతకీ ఈ దేశంలో కథలూ కవిత్వం రాయడంకన్నా కాకర కాయలు అమ్ముకుంటే ఎక్కువ డబ్బు వస్తుంది. నా ఫ్రెండ్ కెప్టెన్ రామచందర్ ఒకసారి కథరాసి ఏదో మేగజీన్‌కి పంపేడు. అచ్చయింది. పత్రికవాళ్లు ఏం పంపుతారో పార్టీ పీకుదాం అని మేమంతా ఆతృతగా ఎదురుచూసేం. పత్రిక పంపేరు’’ అంటూ ఆ విషయం తలుచుకొని అతను గట్టిగా నవ్వేడు.

నేను యింకెంతసేపు ఉండాలో తెలియక ఇబ్బందిగా కూర్చీలో కదిలేను.

‘‘వెళ్ళిపోకండి. మా అబ్బాయి మిమ్మల్ని చూడాలి. మీ అమ్మాయి నన్ను ఇంప్రెస్ చేసింది.’’

ఇంకానయం నేను అతన్ని ఇంప్రెసు చేసేనని అనలేదు. మిలటరీ ముండావాడు అంటేమాత్రం నేను చేసేదేమిటి? గులాబీ చెట్లవేపు చూస్తూ కూర్చున్నాను.

‘‘మా అబ్బాయి తోట ఎలా వుంది? నిన్నల్లా కూర్చుని ఎండాకులు ఏరేను. పువ్వు అందం ఎండాకు తినేస్తుంది. మీరేమంటారు?’’ అతను అడిగేడు.

ఇదేదో రేడియో ఇంటర్వ్యూలా వుంది!

‘‘తినేస్తుందంటాను.’’ అన్నాను.

‘‘మీకు పనులున్నా నిర్బంధంగా కూర్చో పెట్టేస్తున్నానని అనుకోకండి. కేవలం మీరు మా అబ్బాయిని చూడాలనే ఆపుతున్నాను. మియర్లీ ఫాదర్స్ ప్రైడ్. అంతే.’’

"ఏం చదువుతున్నారు మీ అబ్బాయి?" అనడిగేను. ఏం అడక్కపోతే బావుండదని.

"బావుందండోయి. చదువేమిటి! మిలిటరీ ఎకాడమీలో ట్రైనింగ్ అవుతున్నాడు. అసలు నాకేమాత్రం ఇష్టంలేదండి వాడు మిలటరీలో చేరడం. ప్రతి తండ్రీ తన కొడుకు తన ఉద్యోగమే చెయ్యాలనుకుంటాడేమో. మంగలాడి కొడుకు మంగలాడు అవడం మంగలివాడికి ఇతరులకీ కూడా ఇష్టమే. కాని మా మిలటరీ వాళ్ళకి మాత్రం మాపిల్లలు మిలటరీలో చేరాలని వుండదు, మావాడు డాక్టరో, లాయరో అవాలని నా కోరిక. లాయరయితే జడ్జి అవవచ్చు. మా మిలిటరీవాళ్ళకి శత్రువుని చూసిన దాని కన్నా జడ్జీని చూస్తేనే భయం. నువ్వేం చేస్తున్నావ్?" మా అమ్మాయివేపు తిరిగి అడిగేడు.

"మెడిసిన్" అంది మెల్లిగా.

"ఇంకేం అదృష్టవంతురాలివి. మొగాళ్ళకు జబ్బులు ఉండాలేకాని నువ్వు ప్రాక్టీసు ఎక్కడ పెట్టినా డబ్బుకి కొదవ వుండదు. నాకెందుకో మా అబ్బాయి సైకియాట్రిస్ అవాలని కోరిక వుండేది. అన్ని రోగాల్లోకి పిచ్చి మహా భయంకరం. మీరేమంటారు?" కొంచెం ఆయాసం వచ్చినట్టుంది, ఆగేడు.

"కాదనడానికి నాకు ఎప్పుడూ పిచ్చెక్కలేదు" విసుగుతో అనేసి తర్వాత అంత మోటుగా అన్నందుకు బాధ పడ్డాను.

"సైకియాట్రిస్ట్ అవడానికి మావాడికి అర్హతవుంది. వాడు సిగరెట్లు కాలుస్తాడని నాకు చాల్నాళ్లాయి తెలుసు. కాని తను కాల్చడంలేదని నమ్మించడానికి శలవలకి వచ్చేముందు వారంరోజులు ముందు సిగరెట్లు కాల్చడం మానేస్తాడు పెదిమలు. తనని పట్టిఇచ్చేస్తాయని. నాదగ్గర వున్నన్నాళ్లూ లోపల ఎంత బాధపడతాడో తెలియదు కాని సిగరెట్లు కాల్చడు." దూరంగా కొడుకు వస్తాడేమో నన్నట్లు చూస్తూ ఉండిపోయేడతను.

మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చినట్టు మొదలు పెట్టేడు. "నాకు అంత పాతకాలం పెంపకం నచ్చదు. తనంతవాడు తను అయేడు. మైనారిటీ తీరిపోయింది. ఇంకా నా నీడలో వాడు ఎదగకుండా ఉండాలనుకోవడం తెలివితక్కువ. ఎకాడమిలో చేరేక అంతా కొద్దో గొప్పో తాగుతారు. ఇంచేత మొన్న

వాడొచ్చిన్నాడు సాయంత్రం వాడిని ఫ్రిజ్ లోంచి విస్కీ రెండు గ్లాసులూ తెమ్మన్నాను. రెండు గ్లాసుల్లోనూ పోసి ఒకటి వాడికిచ్చి ''మనిషికి ధైర్యం ఉండాలి మైబోయ్. నేనున్నప్పుడు చేయలేని పని నేను లేనప్పుడు కూడా చెయ్యడు. తాగినంతమాత్రాన తాగుబోతూ అవక్కర్లేదు. చెడిపోనూ అక్కర్లేదు. నువ్వు చెయ్యకూడని పనులు వేరే వున్నాయి. ఇవి కావు.'' అన్నాను. ''థాంక్ యూ డాడీ'' అంటూ గ్లాసందుకున్నాడు. ది ఫెలో ఈజ్ డీప్లీ గ్రేట్ ఫుల్ టుమి. నేను చేసింది తప్పంటారా? కాలాన్ని పట్టి మనం పోవాలి.'' మళ్ళీ అతని కళ్ళు అదో మోస్తరుగా అయిపోయేయి. విప్పి వున్నా చూడని కళ్ళలా వున్నాయి, అతనికి కొడుకుమీద వున్న గౌరవానికి ఆశ్చర్యపోయేను.

''వయసు వచ్చింది. కాని చిన్నతనం పోలేదు. ఈ వేళ చూడండి ఏం చేసేడో. ఇంట్లో నేను కర్రకాలు వాడను. క్రచెస్ వాడతాను. తాను బజారుకి వెళ్తున్నప్పుడు నేను పేపరు చదువుకుంటున్నాను. వాడు వచ్చేసరికి నేను ఎక్కడికైనా వెళిపోతానేమోనని నాకు తెలీకుండా నా కర్రలు ఎక్కడో దాచేసేడు. ది లిటిల్ ఇంఫ్ ఇక్కడే అవడంవల్ల వాడేం చేసినా నాకు నచ్చుతున్నాడేమోనని నా భయం.'' అంటూ అతను నవ్వేడు.

ఈలోగా అతని భార్య కారులో వచ్చి ''ఎంతసేపైంది మీరు వచ్చి, క్షమించండి'' అంటూ దిగింది. దిగుతూనే లోపలికెళ్ళి అతని కర్రలు పట్టుకు వచ్చి అతనిపక్క పెట్టి "మీ యుద్ధం కబుర్లతో వీళ్ళని కాల్చుకు తినలేదు గదా కొంపదీసి" అంది.

నాకు ఎ-చేతో ఏదో తెలియనివెల్తి ఆవిడలో కనిపించింది. ''రండి ఇల్లు చూద్దురుగాని'' అంటూ ఆవిడ మమ్మల్ని లోపలికి తీసుకు వెళ్ళింది. ఇల్లు డబ్బుకు ఇబ్బంది లేనివాళ్ళ ఇల్లులాగే కాకుండా మంచి అభిరుచులున్న మనుషుల ఇల్లులా వుంది. ఆఖర్ని వీధి వరండా పక్కనున్న పడక గదిలోకి వచ్చేం. అప్పటికి నాకు కలిగిన వెల్తి అర్థం అయింది.

ఆవిడతో వాళ్ళ అబ్బాయి వస్తాడనుకున్నాను. కాని రారేదు. కారులో ఆవిడ ఒక్కర్తే దిగింది.

''మీ అబ్బాయి ఏడీ?'' అడిగేను.

వెంటనే నన్నూ, మా అమ్మాయినీ దెయ్యాలని చూసినట్టు చూసింది. మొహం వెయ్యి వంకర్లు పోయింది. ఆవిడ కళ్ళు గోరీలోంచి లేచిన మనిషి కళ్ళలా వున్నాయి. క్షణం మావేపుచూసి అకస్మాత్తుగా మంచంమీద బోర్లా పడి ఏడవడం ప్రారంభించింది, వంట్లో ఉన్న ప్రతి ఎముకా విరిగిపోయేటట్టు వణికే ఆవిడ ఏడుపు చూసి మాకు భయంవేసింది. ఈలోగా ఈదురు గాలిలా సక్సేనా గదిలో ప్రవేశించి ఆవిడ పక్కని కూర్చుని ఆవిడ కన్నీళ్ళు చేత్తో తుడుస్తూ "మీరు వెళ్ళిపోకూడదా" అన్నట్టు మా వేపుచూసేడు.

మేము చప్పుడు చెయ్యకుండా వాళ్ళ ఇల్లు వదిలేసేం. పాపం తర్వాత తెలిసింది, వాళ్ళకు ఉన్న ఒక్క కొడుకు పదో ఏటో పన్నెండేళ్ళ కిందటే పోయేడని!

# చిన్నారి ప్రేమలేఖ

శ్రీమతి ఎ. మంజులత

ప్రియమైన రామానుజం.

ఈ ఉత్తరం ఇట్లాగ రాయడానికి వెనక చాలా చరిత్ర ఉంది. ఇట్లాగని బాబాయి అన్నాడు. అసలేమయ్యిందంటే, నేను బాబాయిని ఒకటి అడిగాను. అసలు అంతకన్న ముందు ఏమయ్యిందంటే మా నాన్న, నేను భోంచేస్తున్నాం. మా అమ్మ వడ్డిస్తోంది.

"ఇదేమిటి, ముందే చారు పోస్తున్నావ్? కూరలేదా?" అన్నాడుమానాన్న.

మా అమ్మేమో "ఇది చారు ఎందుకయ్యింది? పచ్చడి" అంది కోపంగా.

మానాన్న నవ్వాడు. మా అమ్మకి ఇంకా కోపం వచ్చేసింది. అందుకని కొంచెం సేపయ్యాక, అమ్మకోపం పోగొట్టెయ్యటానికి మళ్లీ "ఈ దొండకాయ కూర చాలా బాగుందికదూ, చిన్నారీ?" అని నన్ను అడిగాడు మానాన్న.

మా అమ్మ విన్లేదేమోననేసి, మళ్లీ గట్టిగా ఆ మాటే అన్నాడు.

మా అమ్మేమో మళ్లీ కోపంగా చూసి "అది దొండకాయ కూరకాదు, బెండకాయ పులుసు" అంది.

మానాన్న మళ్లీ నవ్వబోయి ఎందుకో ఆగాడు. మళ్లీ నావైపుచూసి "మీ అమ్మ ఎంత గొప్పదో చూశావా చిన్నారీ? పచ్చడి చారులాగా, చారు పులుసులాగా, నీళ్లు మజ్జిగలాగా అది ఇది లాగా, ఇది అది లాగా చేసెయ్యగలదు" అన్నాడు నాతో.

"అది ఇది లాగా, ఇది అది లాగా అంటే ఏమిటి నాన్నా?" అన్నానునేను.

"అది ఇది లాగా అంటే చంద్రుడిని తన ముఖంలాగా అన్నమాట. ఇది అది లాగా అంటే తన ముఖాన్నే చంద్రుడిలాగా అన్నమాట" అన్నాడునాన్న.

అంటే ఏమిటీ అని ఆలోచించాను నేను. అప్పుడు తెలిసిపోయింది నాకు. అంటే అమ్మ మొహం చంద్రుడత్తయ్యలాగా ఉంటుందని నాన్న అనడం. చంద్రుడత్తయ్య తెలుసా నీకు రామానుజం? అప్పుడోసారి నువ్వు మాఇంటికి వచ్చినప్పుడు ఇక్కడుండే—లావుగా? గుర్తొచ్చిందా? ఆవిడనే బాబాయి, అత్తయ్య "పీపా" అని చాటుగా నవ్వేవారు.

నాకు కోపం వచ్చేసింది. అమ్మ మొహం చంద్రుడత్తయ్యల్లే ఉంటుందా? "ఇంచక్కా ముద్దొస్తూ ఉంటుందని" అమ్మమ్మ అంటుంది కదా ?

"అమ్మ మొహం చంద్రుడత్తయల్లే ఉండదు" అన్నాను నేను కోపంగా. నాన్న, అమ్మ నేనన్నదేమిటో తెలీనట్టుగా నాకేసి చూశారు కొంచెం సేపు. "చంద్రుడత్తయ్యల్లే ఉండట మేమిటి?" అని అడిగారు నాన్న.

నేను కోపంగా చూశాను నాన్నకేసి. "అమ్మమొహం చంద్రుడత్తయ్యలాగా ఉంటుందని ఎవరన్నారు?" అన్నాడు మళ్లీ.

నాకు ఇంకా కోపం వచ్చేసింది. "ఇప్పుడు నువ్వేకదా అన్నావు. అబద్ధాలాడొద్దు. ఆడపిల్లలు పుడతారు" అన్నాను నేను.

నాన్న అస్తమానూ అబద్ధాలాడుతాడు. అందుకే నాన్నకి నేనుపుట్టానట. అమ్మ ఎప్పుడూ అబద్ధాలాడదట. అందుకే అమ్మకి తమ్ముడు పుట్టాడట. ఇట్లాగని అమ్మ అస్తమానూ అంటుంటుంది నాన్నతో.

నాన్న పెద్దగా నవ్వాడు. అమ్మకూడా నవ్వింది. "చంద్రుడత్తయ్య కాదు చిన్నారీ! ఆకాశంలో చంద్రుడొస్తాడే, ఆ చంద్రుడిలాగా ముద్దుగా ఉంటుందె అమ్మముఖం" అన్నాడు నాన్న, నవ్వడం అయిపోయాక. అమ్మేమో నవ్వడం అయిపోయాక మళ్లీ ఎప్పట్లాగా కోపం తెచ్చేసుకొని "చాల్లెండి మీరు మరీనీ? చిన్నపిల్ల దగ్గరకూడా ఏమిటదీ?" అంది.

"వయస్సు మీరుతున్నకొద్దీ మీ బామ్మకి మతి పోతోంది. మతిలేని పనులూ, మతిలేని మాటలూ! ఎట్లా వేగేదీ!" అంటుంటాడు మా తాతయ్య. మా నాన్నకికూడా వయస్సు మీరుతున్నకొద్దీ మతిపోతోంది. లేకపోతే అమ్మ మొహం ఆకాశంలో చంద్రుడిలా ఉండటమేమిటి? మతిలేని మాటలు కాకపోతే? తాతయ్యకి లాగా నాకూ వీళ్ళతో విసుగొచ్చేస్తోంది !

"అమ్మమొహం ఆకాశంలో చంద్రుడిలాగా ఉండదు" అన్నాను నేను మా నాన్నతో.

"నా కళ్లతో చూస్తే అట్లాగే కనబడుతుంది లే చిన్నారీ!" అన్నాడు నాన్న అమ్మకేసి చూస్తూ.

"నీ కళ్లతో ఎట్లాగ చూడ్డం నాన్నా?" అన్నాను నేను.

"నా కళ్ళతో అంటే, ప్రేమించే కళ్ళతో అన్న మాట" అన్నాడు నాన్న.

"ప్రేమించడం అంటే ఏమిటి నాన్నా?" అని అడిగాను నేను.

ఇంతలో అమ్మ "ఛట్! నోర్ముయ్!" అని కసిరింది నన్ను. "ఇక మీరు మాటలు కట్టిపెట్టి భోంచెయ్యండి" అంది నాన్నతో.

ఇంక అమ్మ ఏమీ చెప్పనివ్వదు. అందుకే గబగబ భోంచేసి అత్తయ్య దగ్గరికి పరుగెత్తాను.

"ప్రేమించడం అంటే ఏమిటత్తయ్యా" అని అడిగాను. అప్పుడే బాబాయి ఏదో రాసుకొంటున్నాడు.

"అదుగోనే చిన్నారీ, ప్రేమించడం అంటే అట్లా రాయడమే" అంది అత్తయ్య నవ్వేసి.

"ఏం రాయాలి?" అన్నాను నేను.

"ప్రేమ లేఖలు రాయడమన్నమాట!" అంది అత్తయ్య.

నాకూ ప్రేమించ బుద్ధేసింది. "అయితే నేనూ ప్రేమిస్తా నత్తయ్యా!" అన్నాను.

"ఓసి భడవా!" అనేసి అత్తయ్య ఇట్లాగ నానెత్తిమీద మొట్టి లోపలికి వెళ్ళిపోయింది. నేను అత్తయ్య వెంటపడ్డాను.

"అత్తయ్యా! నేనూ ప్రేమిస్తాను. ఎలాగో చెప్పవూ?" అని బతిమాలాను. "ఇదెక్కడి గొడవే!" అని అత్తయ్య నవ్వింది. తర్వాత "ఆ వేషాలన్నీ బాబాయివే! బాబాయినే అడుగు" అంది.

నేను బాబాయి దగ్గరకెళ్ళి అడిగాను "బాబాయి, బాబాయి, ప్రేమించడం నేర్పించవా? అని.

"ఏమిటీ?!!" అన్నాడు బాబాయి చాలా ఆశ్చర్యపోయి.

"నేనూ ప్రేమిస్తాను బాబాయి. నాకూ నేర్పు" అని అడిగాను మళ్ళీ.

"ప్రేమించమని ఎవరు చెప్పారే చిన్నారి నీకు?" అని అడిగాడు బాబాయి నన్ను.

"అత్తయ్య చెప్పింది" అన్నాను. "ఎందుకు చెప్పింద"ని అడిగాడు బాబాయి. "నాకు ప్రేమించబుద్దేస్తే చెప్పింది" అని చెప్పాను నేను.

"ఎందుకు ప్రేమించ బుద్దేసింది?" అని అడిగాడు బాబాయి.

అప్పుడు "అమ్మ మొహం ఆకాశంలో చంద్రుడిలా ఉంది" అని చెప్పాను.

"ఎందుకు ఉంద"న్నాడు బాబాయి.

"ప్రేమిస్తే ఉంటుందని నాన్న చెప్పాడు" అన్నాను.

"నాన్న నీకు ఎందుకు చెప్పాడే?" అని అడిగాడు బాబాయి.

"అమ్మ పచ్చడి చారులాగా, అది ఇది లాగా, ఇది అది లాగా చేసినందుకు చెప్పాడు" అని చెప్పాను.

"ఓహో! ఇంత చరిత్ర ఉందన్నమాట నువ్వు ప్రేమించడానికి!" అన్నాడు బాబాయి.

"చరిత్ర కాదు బాబాయి" అన్నాను నేను.

బాబాయికేం తెలుసు, చరిత్ర అంటే సింధునాగరికత, అశోకుని పరిపాలన, చెట్లు నాటడం అని? బాబాయి పదిహేడోక్లాసు చదువు తున్నాడు. అయినా చరిత్ర అంటే అశోకుని పపారిలన, చెట్లు నాటడం అని తెలీదు. ప్చ్! అందుకే అంటుంది బామ్మ "ఏం చదువులో, ఏమిటో! చదువుకున్న వాడికంటే చాకలాడు నయం" అని, మా బాబాయి కంటే మా చాకలాడే నయం.

"అయితే ఎవర్ని ప్రేమిస్తావే చిన్నారీ?" అని అడిగాడు బాబాయి.

నేను కొంచెంసేపు ఆలోచించాను. అమ్మనే ప్రేమిద్దామనుకు కున్నాను. కానీ ఎట్లాగ? అమ్మ అస్తమానూ ఇంట్లోనే కదా ఉంటుంది? ఇంక ఉత్తరాలు ఎలాగరాసి, ఎలాగ ప్రేమించాలి? నాకు అప్పుడొక అనుమానం వచ్చింది.

నాన్నమాత్రం అమ్మని ఎట్లాగ ప్రేమించాడు. అమ్మ అస్తమానూ ఇంట్లోనే ఉంటే! బాబాయిని అడిగాను. బాబాయి బుర్రగోక్కున్నాడు. అప్పుడు అత్తయ్యగదిలో ఉందికదా, మా మాటలు వింటోంది కదా !

అప్పుడు అత్తయ్య చెప్పింది. ''మీ అమ్మ, వాళ్లనాన్నగారి ఊరు— అంటే రామానుజం తాతగారి ఊరు వెళుతుంది కదే చిన్నారీ! అప్పుడు మీనాన్న మీ అమ్మకి ఉత్తరాలు రాస్తాడు'' అని.

అప్పుడు నువ్వు గుర్తొచ్చావు రామానుజం, నాకు.

అందుకని నేను "అయితే నేను రామానుజం తాతను ప్రేమిస్తాను" అన్నాను.

''సరే!'' అన్నాడు బాబాయి.

అందుకని రామానుజం, నేను నిన్ను ప్రేమిస్తున్నాను.

ఇట్లు

చిన్నారి.

# నా అనుభవంలో

డా॥ కె. మధుకుమారి

గంటన్నర నుండి వరుసగా వచ్చే పేషంట్లను చూస్తున్నాను నేను. అప్పుడే నా సీటులో కూర్చుంటూ 'రష్ అయ్యిందా సిస్టర్ అని అడిగాను. ''ఇంకెవరో వైట్ చేస్తున్నారు, డాక్టర్ పిలవమంటారా'' అంటూనే బయటికి వెళ్ళి పిలిచింది. వాళ్ళు లోపలికి వచ్చారు. అప్పుడు జ్ఞాపకం వచ్చింది నాకు, వాళ్ళు నేను హాస్పటలుకు వచ్చేటప్పటికే వైట్ చేస్తూ కూర్చున్నారు బయటని. అంతగా జ్ఞాపకం ఉండటానికి కారణం ఆవిడ సౌందర్యం! బొమ్మలా చక్కగా ఉంది. ఆశ్చర్యపడుతూ అడిగేశాను: ''ముందే రాలేక పోయారా, ఇంతసేపు వైట్ చేసారేమిటి'' అని! అతనన్నాడు, ''మీతో ఒంటరిగానూ, తీరిగ్గాను మాట్లాడ వలసిన పని ఉంది, అందరూ వెళ్ళేదాకా వైట్ చేశామండి,'' అని. వచ్చినప్పటి నుండీ కంటిన్యూయస్‌గా పేషంట్సును చూస్తున్నానేమో, అతనన్న ''తీరిక'' మాటవినే సరికి విసుగనిపించింది. కానీ బయటకు కన్పించ నివ్వకుండా ''కూర్చోండి, చెప్పండి, ఎవరికి సుస్తీ?'' అని అడిగాను.

''నాపేరు సుబ్బారావు. ఆవిడ మా ఆవిడ సీత. మేంచాలా దూరం నుండి వస్తున్నామండి. మీ పేరువినీ, మీరుచాలా దయగా మాట్లాడతారనీ, దయగా చూస్తారనీ, విని ప్రత్యేకంగా వచ్చామండి'' అన్నాడు చేతులు జోడిస్తూ. నాకొంచెం ఇబ్బందనిపించిం దతని పొగడ్తలకి నవ్వి ''చెప్పండి'' అన్నాను.

''డాక్టరుగారూ! విసుగనిపించినా ఓపిగ్గా వింటారని ఆశిస్తానండి. సుస్తీ మా ఆవిడకు. పెళ్ళయి 5 సంవత్సరాలయిందండి. మాకు ఇద్దరు పిల్లలండి. బాబు 2 సంవత్సరాలు, పాపకు 1 సంవత్సరం. పాప పుట్టినప్పటి నుండి కొంచెం పరధ్యానంగా ఉంటూ వచ్చింది. అప్పుడంతగా పట్టించుకోలేదు. రానురాను ఆవిడలో ఉన్న ఉత్సాహం పూర్తిగా తగ్గిపోయి, తనలోతను మాట్లాడు కోవడం, నవ్వటం, ఊరికే కోపం తెచ్చుకోవటం ఎక్కువయ్యాయి! మరీనెల ఎక్కడ కూర్చుంటే అక్కడే పనిపాట్లు మర్చిపోయి ఆలోచిస్తూ కూర్చోవటం, లేకపోతే ఉత్తపుణ్యానికి కోపం తెచ్చుకుని అందరినీ తిట్టటం, నిద్రలో లేచి వెళ్ళిపోవడం!... ఇలా చేస్తోందండి. మీరిలాంటి కేసులు తీసు కుంటారో లేదోనని అనుమానంగానే వచ్చామండి. కాని డాక్టరుగారూ, మీ దయాహృదయం గురించి, మీహస్తవాసి గురించి ప్రజల ద్వారా విని ఎంతో

ఆశపెట్టుకొనివచ్చామండి. నిరాశచెయ్యకండి. గుట్టుచప్పుడుగా మీచేత వైద్యం చేయించుకుని వెళ్ళాలని వచ్చామండి'' అన్నాడతను. అప్పుడు చూచా నావిడ వైపు. ఎక్కడో శూన్యంలోకి చూస్తున్న ఆ కళ్ళల్లో, నిర్లిప్తత, నిరాశతప్పించి, ఇంకే భావమూ లేదు.

నేనెప్పుడూ ఇలాంటి కేసులు ట్రీట్ చెయ్యను; అందులో కొంత ట్రైనింగు కూడా ఉందినాకు; యత్నించి చూద్దామని పించింది నాకు; అతనిని బయట కూర్చోమని చెప్పి, ఆవిడను పిల్చి, నా ప్రక్కన కూర్చోబెట్టి మెల్లగా 'మీపేరేమిటి?' అన్నాను. 'సీత' అంది పొడిగా. ''మీ బాధేమిటి?'' అన్నాను. 'నాకేం బాధలేదండీ. ఆయన రమ్మంటే వచ్చాను.'' అంది విసుగ్గా. ఒక క్షణం ఊరుకుని "చూడమ్మా సీతా...ఏదన్నా బాధ ఉంటే ఎవరికన్నా చెప్పుకుంటే తగ్గుతుందంటారు. నీకు స్వంత అక్కకానీ, చెల్లికానీ ఉంటే నీబాధ చెప్పుకోవూ? అలాగే నేను అక్కనుకుని బాధేమిటోచెప్పు. నేను సహాయం ఏమైనా చెయ్యగలనేమో చూస్తాను!'' అన్నాను మెల్లగా ఆవిడ చెయ్యి పట్టుకుంటూ. నామాటలు సూటిగా ఆమెమనస్సుని ఏ ప్రదేశంలో అయితే తాకాలో అక్కడే తాకాయి. వెంటనే నా రెండు చేతులూ పట్టుకుని "డాక్టరుగారూ! ఇలాంటి చల్లని మాటవిని ఎన్నాళ్ళయిందండి! మనస్సులో మాట చెప్పుకోటానికి కూడా దిక్కులేని నాకు ఇవ్వాళ మీరు, తల్లి, తోడు దైవం...... అందరిలాగా కన్పిస్తున్నారు." అంటూ ఏడ్చేసింది. ఆవిడ కొంచెం స్థిమిత పడ్డాక ''సీతా—నీవేది చెప్పినా, ఆ రహస్యం నాలో ఉండిపోతుందమ్మా. ఆ నమ్మకంతో చెప్పు...నీ బాధేమిటి ఏందుకిలా అయ్యావు?'' అనడిగాను. కళ్ళుతుడుచుకుని చెప్పటం మొదలుపెట్టింది.

''డాక్టరుగారూ...ఈవిషయా లింత వరకు నేనెవరికీ చెప్పలేదు. చెప్పాలనుకున్నా ఎవరూ లేరునాకు, నేను పుట్టగానే తల్లి పోయిందట. నాకు ముగ్గురక్కలు, ముగ్గురన్నలూ ఉన్నారు. ఎవళ్ళ సంసారాలూ ఎవళ్ళ బాధలూ వాళ్ళవి. అన్నీ అంతంత మాత్రం సంసారాలే. తండ్రి ఉండీ లేనివాడి క్రింద జమయ్యాడు. ఎలాగో అవస్థలతో పెరిగాను. నాకు పెళ్ళిచెయ్యాలనుకున్నప్పుడు మొదట ఒక సంబంధం వచ్చింది. చదువు, అందం, ఆస్తి అన్నీ ఉన్నాయి. చూడగానే నాకు నచ్చారు. కానీ, నేను కానీ, నా ఆర్థికస్తోమతు కానీ వారికి నచ్చలేదు. నాన్న కష్టపడైనా ఆ సంబంధం ఖాయంచేస్తాడని

ఆశపడ్డాను. ఎవరికీ వాళ్ళు స్వార్థపరులే. ఉన్నది కాస్తా నాకిస్తే తను బ్రతకటానికి ఏమీ ఉండదని ఆయన భయం. అన్నలున్నారు కానీ, ఎవరికీ నాసంగతి పట్టలేదు. చివరికి పెళ్ళి ఇష్టం లేకుండానే చేశారు. అదీ ఇస్తానన్న కట్నం డబ్బు సమయాని కివ్వకుండా. అప్పటి నుండి నా జీవితం నరకం అయి పోయింది. అత్తగారు తిట్టని రోజు క్షణం ఉండదు. అప్పుడప్పుడూ చెయ్యి చేసుకుంటుంది కూడా. ఆయన తల్లిచాటు బిడ్డ. లోపల ఎలా ఉన్నా, బయటికి ఏమీ అనలేడు! మానాన్న డబ్బు ఇస్తానని పెట్టిన గడువు అయిపోయింది. ఆయన మంచాన పడ్డాడని తెలిసింది. ఇక ఆ కట్నం డబ్బురాదని రూఢి చేసుకున్న ఈ సంవత్సరంనుండీ మరీ విజృంభించింది ఆవిడ! మానాన్న ఎలా ఉన్నాడో, ఏమైపోయాడో కూడా తెలీదు. నన్ను వెళ్ళనివ్వరు. అక్కలు, అన్నలు ఎవ్వరూ పట్టించుకోరు నా గురించి. చిన్నక్క మాత్రం అరుదుగా ఎప్పుడైనా జాబువ్రాస్తుంది. అదికూడా నాకు చేరనివ్వరు. నా మీద కక్షతో నా బిడ్డని కూడా సరిగా చూడరు. ఇలాంటి పరిస్థితిలో ఉన్న ఏ ఆడదైనా ఎలా ఉంటుంది చెప్పండి డాక్టరుగారూ "అంటూనే ఏడ్చేసింది. ఒక్క క్షణం తర్వాత, తలెత్తుతూనవ్వింది." ఈ పరధ్యాన్నం అలవాటైన తర్వాత హాయిగా ఉందండీ" అంటూ గట్టిగానవ్వి......నవ్వి అలసిపోయినట్లు ఆగి, మళ్ళీ మౌనంగా శూన్యంలోకి చూస్తూండి పోయింది.

ఆవిడ గాధ వింటూ కూర్చుండి పోయిన నేను, ఆ నవ్వుకి ఉలిక్కిపడి ప్రస్తుతంలోకి వచ్చి చూచేసరికి, ఆ అమ్మాయిని చెయ్యి పట్టుకుని తీసుకువస్తూ ఆవిడ భర్త కనిపించాడు! జాలితో నిండి పోయిన మనస్సు ఆవిడను ట్రీట్ చెయ్యమని పోరు ప్రారంభించింది.

అతని వంక చూస్తూ "సరే, ఆవిడను ఎడ్మిట్ చెయ్యాల్సి ఉంటుంది; ఒక పదిహేను రోజుల పాటు ట్రీట్‌మెంటు ఇవ్వాల్సి ఉంటుంది" అన్నాను. చాలా థాంక్స్ డాక్టరుగారూ, ఇప్పుడే యడ్మిట్ చేస్తారా?" అని అడిగాడు ముఖం చాటంతచేసుకుని. ఆవిడ వైపుతిరిగి "ఇక్కడ ఉంటావా సీతా" అన్నాను. గబుక్కున నా చేతులు పట్టుకుని "డాక్టరుగారూ! ఎప్పుడూ ఉండమన్నా ఇక్కడే ఉండి పోతాను" అంది. వెంటనే ఎడ్మిట్ చేసేసాను.

పదిహేను రోజుల ట్రీట్ మెంటు తర్వాత సీత చాలా బాగుపడింది. రోజూ రోగులను చూడ్డానికి వెళ్ళేటప్పుడు, ఎంతపని ఉన్నా ఆవిడతో కనీసం అరగంటైనా మాట్లాడటం, నా కన్సల్టింగు రూమ్‌లోకి తీసుకొచ్చి కూర్చోబెట్టి, అప్పుడప్పుడు హాస్యం చెప్పి నవ్విస్తూ, చిన్నచిన్నపనులు చెయ్యమనటం... ఇలాంటి వాటితో సీత నాతో చాలా అనుబంధం పెంచుకుంది. ఆఖరులో నేను తన గదికి వెళ్ళకముందే, తనే నేను కారు దిగుతూండగానేవచ్చి నమస్కరించి, నాతో పాటు నాగదికి వచ్చి, క్రిందటిరోజు తను తోటమాలికిచ్చిన సలహాలు, సిస్టర్లకు చేసిన సహాయాలు, వీటిగురించి చెబుతూ ఉండేది. దాదాపు మామూలుమనిషిగా అయ్యింది. ఆ నవ్వటం, పిచ్చిచూపులు లేనేలేవు. ఆ రోజు డిశ్చార్జి చేద్దా మని సుబ్బారావు వచ్చాక అడిగాను. "మీ అమ్మగారు ఈ ఊళ్ళో ఉన్నారా?" అని. "లేదండి చెల్లెలి దగ్గరుంది. పిల్లల్ని కూడా నేనే చూచు కుంటున్నాను." అన్నాడు. కొంచెంసేపటి తర్వాత మెల్లిగా "చూడండి, సీతను ఇక ఇంటికి తీసుకెళ్ళవచ్చు. కాని వీలైనంతవరకు మీ ఇద్దరే ఉండండి" అని తటపటాయిస్తూ "మీ అమ్మగారిని కానీ, ఇంకెవ్వరినీ ఇప్పుడప్పుడే తీసుకు రావద్దు" అన్నాను. అతనర్థం చేసుకున్నాడేమో, తలవంచుకుని "సరేనండి" అన్నాడు. అంతా సర్దుకుని వెళ్ళబోతూ నా దగ్గర కొచ్చింది సీత! ఒంగి పాదాలకు నమస్కరించబోయింది. వారిస్తూ లేపాను. "డాక్టరుగారూ... మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనండి. ఇంత మందిలో నేను గుర్తుంటానో లేదో కానీ...నాకు మీరు దైవంతో సమానం", అంది కన్నీళ్ళతో! నా హృద యం ఆర్ద్రిమయింది! దంపతులిద్దరూ నాకు నమస్కరించి ప్రక్క-ప్రక్కన నడుస్తూ సంతోషంగా వెళ్ళిపోయారు.

అది పాత సంఘటనయి పోయింది. అప్పుడప్పుడూ జ్ఞాపకంవస్తున్నా! ఇంటికి వెళ్ళినవారం రోజులకు సుబ్బారావు వచ్చిచాలా సంతోషంగా చెప్పాడు: "సీత చాలా నార్మల్‌గా, సంతోషంగా ఉంటోందని! అంతే...ఆ తర్వాతేమీ తెలీలేదు వాళ్ళ సంగతి.

నెల రోజుల తర్వాతను కుంటాను. ఒక రోజు రాత్రి 11 గంటలయింది. టెలిఫోన్ మ్రోగితే నర్సింగ్ హోంనుంచి కేసు ఏమైనా వచ్చిందేమో అను కుంటూ తీసాను. చెవిదగ్గర పెట్టుకున్నానో లేదో కెవ్వుమంటూ పెద్దకేక.

ఆతర్వాత ధనధనమని చప్పుళ్ళు! అదిరిపోయాను అర్థంకాక! "హలో, హలో" అని అంటూండగనే "డాక్టరుగారూ, నేనండి. సీతని, గుర్తుపట్టారా? మీరు ఇక్కడికి త్వరగారండి. వీళ్ళు నన్ను చంపేస్తున్నారు. నేను..." ఇంకా ఏమిటో చెప్పేలోగా, ఏవేవో శబ్దాల తర్వాత నైట్ సిస్టర్ కంఠం విన్పించింది. "డాక్టర్, నేనండీ. డ్యూటీ సిస్టర్ని. ఆ సీత మళ్ళీ వచ్చింది. నానా గొడవా చేసింది. మిమ్మల్ని చూడందే ఇక్కడి నుండి వెళ్ళనని హఠం వేస్తోంది. మీరు వస్తారా?" అంది. నేను వెంటనే వస్తున్నానని చెప్పి నేను వెళ్ళేలోగా ఇవ్వ వలసిన ఎమర్జెన్సీ ఇంజక్షన్లు ఆవీ ఇవ్వమని చెప్పి ఫోను పెట్టేసి వెంటనే బయలుదేరి నర్సింగ్ హోమ్‌కు వెళ్ళాను. కారు పోర్టికోలో ఆగుతుండగానే కేకలు విన్పించాయి. గబగబా వెళ్ళాను. ఇంజక్షనిస్తోందని సిస్టర్ని నానాతిట్లూ తిడుతోంది సీత. వాళ్ళాయన గట్టిగా పట్టుకొని ఉన్నాడు. అతన్ని కరవ పోవడం, జుట్టుపట్టుకుని పీకబోవడం లాంటి పిచ్చిపనులు చేస్తోంది. నేను వెళ్ళేసరికి ఇంజక్షన్ పనిచేసింది కాబోలు, చేతులు, కాళ్ళూ వదులుగా పడవేసి ఎటోచూస్తోంది. నన్ను చూడగానే "డాక్టరుగారూ, మీరు మంచివారండీ. వీళ్ళంతా నన్ను చంపేస్తున్నారండీ, ఆ"—అంటూనే నవ్వింది గట్టిగా. చెయ్యి పట్టుకుని చూచి "ఎలాఉంది? నిద్రవస్తున్నట్లుందా" అన్నాను. తల మాత్రం ఊపి కళ్ళు మూసుకుంది. అతన్ని బయటకు రమ్మని "ఏమైంది మళ్ళీ" అనడిగాను. అతనిమొహం పాలి పోయిఉంది. కళ్ళనిండా నీళ్ళు తిరుగుతుంటే "డాక్టరుగారూ, మా అమ్మ వచ్చిందండీ మూడు రోజులక్రితం. అంతా మళ్ళీమొదలు. మూడు రోజులనాడు ఇంత ఇదిగా లేదండీ. ఇవ్వాళే మరీ ఎక్కువయింది. పిల్లని పట్టుకొని కొట్టింది. ఏమీతినలేదు. పైగా ఇందాక బావిలోకి దూకుతానని పరుగెత్తింది. పట్టుకుని తీసుకొచ్చాను. డాక్టర్... నేను అసమర్థుణ్ణి, తల్లిమాటను ధిక్కరించ లేనివాణ్ణి. కానీ మనసున్న వాణ్ణేనండీ! ఆవిడను ప్రేమించాను. ప్రేమిస్తున్నాను. అందుకే ఇంతగా బాధపడు తున్నాను." అంటూ చేతుల్లో మొఖం దాచుకుని వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. అతన్ని చూస్తుంటే జాలీ, కోపంకూడా కలిగాయి. సిస్టరుకు ఏమేమి మందులు, ఇంజక్షన్లు ఎలా ఇవ్వాలో చెప్పి ఇంటికి వెళ్ళిపోయాను.

మర్నాడుదయం హాస్పటలుకు వెళ్ళగానే సరాసరి సీత గదికి వెళ్ళాను. ఇంకా మగతలో ఉన్నట్లుంది. నన్ను చూచి మళ్ళీ కళ్ళు మూసుకుంది. బాగానే

ఉన్నదికదా అని నాపని మీద నేను వెళ్ళి పోయాను.

మధ్యాహ్నం ఒకటి ఆ ప్రాంతాల ఆపరేషను పూర్తిచేసుకుని నాగదిలో కొచ్చాను. ఉదయం ఎనిమిదిన్నర నుండీ పనిచేసున్నా నేమో చాలా బడలిక అనిపించింది. ఈజీచైర్ లో కూర్చుని కళ్ళు మూసుకున్నాను. క్రిందనుండి ఏవేవో శబ్దాలు. వెంటనే ఎవరో పరుగెత్తుకుంటూ వస్తున్నశబ్దమూ వినపడ్డాయి: చివ్వున లేచికూర్చున్నాను: సిస్టరు పరుగెత్తుకుంటూ వచ్చి వగరుస్తూ చెప్పింది, "డాక్టర్, మీరు వెంటనేరావాలి. ఆ మెంటల్ పేషంటు చాలావిజృంభించింది" అని. అలసటంతా ఏమైందో, వెంటనే లేచి గబగబా క్రిందికెళ్ళాను. నేను వెళ్ళే సరికే సీత నేలమీద పడిఉంది. ఆవిడ భర్త ఆమెచేతులు గట్టిగాపట్టుకుని ఆపడానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ వదలించుకోడానికి కాళ్ళూ చేతులు కొట్టుకుంటూంది. వంటి మీద బట్టలు కూడా అస్తవ్యస్తమయ్యాయి. గది ముందు ప్రక్క గదుల వాళ్ళు గుమిగూడారు. వెంటనే ప్రక్కగదుల వాళ్ళు ఉన్నట్లుండి పరుగెత్తుకుంటూ వచ్చి మా గదిలోకి జొరబడిందండీ. అతను తీసుకెళ్ళబోతే తిరగబడుతోంది: డాక్టర్ గారూ, రాత్రికూడా మెలకువ వచ్చి నప్పుడల్లా గొడవచేసింది. మాకందరికీ చాలా కష్టంగా ఉందండీ" అన్నారు ఫిర్యాదు చేస్తున్నట్లు.

లోపలికెళ్ళాను. నన్నుచూస్తూనే ఎలా విదిలించుకుందో భర్తను విదిలించేసి ఒక్కడుగులో నా దగ్గర కొచ్చేసింది. రెండు చేతులూ మెడచుట్టూ వేసి పట్టుకుంది. అదిచూచి సిస్టరు కెవ్వున కేక వేసింది, నన్ను గొంతుపిసుకుతోందనే భయంతో. నేను దిమ్మెర పోయి తేరుకుని చూచేటప్పటికి సీత నా భుజం మీద తల వాల్చిఏడుస్తోంది: అందరూ నానుండి ఆవిడను దూరం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. వెంటనే నాకు కర్తవ్యం గుర్తు కొచ్చింది. వాళ్ళందరినీ వెళ్ళమని, నేను మెల్లిగా "సీతా, ఇలారా, ఇక్కడ పడుకో" అంటూ మంచంమీద కూర్చోబెట్టాను చేతులు విడిపించుకుంటూ. సిస్టర్ని ఇంజక్షన్ లోడ్ చేసి తీసుకు రమ్మని చెప్పి అక్కడే కూర్చున్నాను. గభాల్న నేల మీద నాకాళ్ళ దగ్గర కూర్చుంటూ "డాక్టరుగారూ, మీరిక్కడే ఉండండి. నేను మీ దగ్గరే ఉంటాను. మీరు మంచి వారుకదూ: నాకు ఇంజక్షను ఇవ్వరు కదూ' అంటూ, నవ్వుతోంది. సిస్టరు ఇంజక్షను ఇవ్వటానికి భయపడుతూ నించుంది. నేనే సిరంజి తీసుకుని ఇంజక్షను ఇచ్చేసాను. ఎందుకనో ప్రతి

ఘటించలేదా అమ్మాయి: కానీ "డాక్టర్, మీరు మంచి వారనుకున్నాను. మీరూ ఇలానే చేస్తున్నారు." అంటూ ఏడవటం మొదలు పెట్టింది. కొంచెం సేపటికి ఇంజక్షను మత్తులో పడింది. నేను నా గదిలోనికి వచ్చేసాను. నావెంటే వచ్చిన సీత భర్త తలవంచుకుని అలాగే కొంచెం సేపు నిలబడిపోయాడు.

ఆ తర్వాత తలెత్తి "ఏంచేద్దామంటారు డాక్టరుగారు? ఇక్కడ ఉంచినా బాగుండదేమో" అన్నాడు. మిగతా పేషంట్లు చేసిన ఫిర్యాదులు, నాకు కలిగిన ఇబ్బంది గ్రహించాడను కుంటాను. ఇంత సున్నిత హృదయుడు, సూక్ష్మగ్రాహి, భార్యనీ, తల్లినీ సమర్థించుకోలేక మధ్యనలిగి పోతున్నాడు. నాకతన్ని చూస్తే జాలీ, నానిస్సహాయతకు బాధాకలిగాయి.

అతన్ని కూర్చోమని మెల్లిగా చెప్పాను. "చూడండి సుబ్బారావుగారూ ...ఇలా అయితే ఆవిడకు ఆరోగ్యం ఉండదు. మీకు పిల్లలకు ఇబ్బంది. లోకులేమను కుంటారోననేది తీసేసి, ఆవిడను పట్నం తీసుకెళ్ళి మెంటల్ హాస్పటల్లో జేర్పించండి. నేను చీటీ వ్రాసిస్తాను. కొన్నాళ్ళ పాటు అక్కడే ఉంచితే ఆవిడ స్థిమిత పడవచ్చు. మీకు కొంత సమస్య పరిష్కారమవుతుంది. మీరావిడకోసం పడుతున్న బాధ, ఆవేదన అర్థం చేసుకోగలను. కానీ ఇంతకు మించి సహాయం చెయ్యలేక పోతున్నందుకు నాకు చాలా బాధగా ఉంది. అయినా, నాదీ ప్రయివేట్ ప్రాక్టీసు. నా పరిస్థితుల మేరకు జాలీ, దయ చూపించ గలను గాని, మించ లేను కదా?" అంటూ అతని వైపుచూచాను.

ఒక్కక్షణం ఆగి "సీతను చూచి వస్తాను డిశ్చార్జి చెయ్యండి, తీసు కెళ్తాను" అని బయటకు వెళ్ళాడు. నొచ్చుకున్నాడేమోననిపించింది! మరింక అంత కన్నా నేను చెయ్యగలిగిందీ లేదు. అన్నీ సర్దుకుని, టాక్సీ పిలిపించి రెడీ చేసుకున్నాడులా ఉంది! ఇద్దరు కలిసి నా దగ్గర కొచ్చారు. "వెళ్తు తున్నావా సీతా" అన్నాను "అవునండీ, మీరు వెళ్ళిపొమ్మన్నారటగా! మీక్కూడా నా మీద జాలి లేదు! ఏంచెయ్యను మరి! నమస్కారమండీ!" అంటూ నిర్వికారంగా వెళ్ళి టాక్సీలో కూర్చుంది. అతను...సీతభర్త... నా ఎదురుగా వచ్చినిలబడి రెండు చేతులూ నుదుటి మీదపెట్టి నమస్క రించాడు! నీళ్ళు నిండిన కళ్ళతో "డాక్టరుగారూ...మీకు మేమెంత శ్రమ ఇచ్చాం! మా కోసం మీ ప్రిన్సిపుల్సుకూడా కాదని శ్రమపడ్డారు రాత్రి పగలు

చూడకుండా! అయినా ఫలితం దక్కలేదు! అది నా దురదృష్టం! కానీ మీ మేలు జన్మజన్మలకీ మర్చిపోలేనండి!'' అంటూ ఒక కవరుతీసి నా ముందుంచాడు! గ్రహించాను అది ఫీజు అని! ఆ రోగికి న్యాయం చేయలేనినాకు ఆఫీజు తీసుకోడానికి అర్హత లేదనిపించింది. గుండె పిండి నట్లయింది! వెంటనే ''సుబ్బారావుగారూ, దయచేసి ఆ కవరు తీసుకోండి. ఆమెకేమీ చేయలేక పోయాననే బాధపడుతున్నాను. ఇంకా బాధించకండి! వెళ్ళిరండి ''అంటూ అక్కడనుండి వచ్చేసి వరాండాలో నించున్నాను. కళ్ళుతుడుచుకుంటూ అతను కవరుతీసుకుని వెళ్ళి పోయాడు. వరండాలో నుండి వెళ్ళటం చూస్తూనే ఉన్నాను. కాని నా నిస్సహాయతకు బాధపడటం తప్ప ఏం చెయ్యగలను నేను మాత్రం?

# మతం

శ్రీమతి మాలతీ చందూర్

పొద్దుటే ఏడుగంటలకి ఆదరా బాదరా టిఫిన్ తినేసి, డ్రెస్ చేసుకుని, హాస్టల్ గేటులోంచి బయటపడి బస్‌స్టాప్ దగ్గిరకొచ్చింది కమల. ఆమె వుంటున్న హాస్టల్‌నుంచి పనిచేస్తున్న బాంక్‌కి డైరెక్టుగా బస్ వుంది. అయిదేసి నిముషాల కొకసారి వచ్చే ఆ బస్ ఆమె దురదృష్టంకొద్దీ పది నిముషాలైనా రాలేదు.

కమలకి కంగారుగా వుంది. ఆరోజే కొత్త ఎకౌంటెంట్ డ్యూటీలో కొచ్చేస్తారు. తను మొదటి రోజునే ఆలస్యంగా కౌంటర్ దగ్గిర కూచోడం ఆయన కంటపడితే మరేమైనా వుందా! అసలు క్రితంరోజు పాత ఎకౌంటెంట్‌కి ఫేర్‌వెల్, కొత్తాయనకి వెల్‌కమ్ రెండూ కలిసి యిచ్చిన పార్టీలో ఆయన తమని రెండు మూడుసార్లు పరిశీలనగా, తీక్షణంగా చూడటం గమనించింది. తనపక్కనున్న యిద్దరు ముగ్గురు లేడీ క్లర్కులలో తనూ ఒక్కర్తిగా కలిసి కూచున్నపుడు, ఆ కొత్త ఎకౌంటెంట్ అలా పరిశీలనగా చూడటం, తనలో ఏదన్నా లోపం వెతకడానికేమో అని కంగారుపడింది కమల.

కమల పనిచేస్తున్న సేవింగ్స్ కౌంటర్‌లో అరగంట ముందుగా వుండాలి. బాంకి ఎనిమిదికి తెరిస్తే కనీసం ఏడుమ్ముప్పావుకేనా కౌంటర్‌లో వుండాలి. టైము చూసుకుంది కమల. ఏడూ ముప్పై అయిదు-ఇహ ఇప్పుడు బస్ వచ్చినా ఫుల్‌గా వస్తుంది. కండక్టర్ డబుల్ విజిల్ యిచ్చేస్తాడు. ఎలా? కొత్త ఎకౌంటెంట్ వచ్చినరోజే తను ఆలస్యంగా వెళితే ఆయన ఏమనుకుంటాడో. తనమీద ఎటువంటి అభిప్రాయం కలుగుతుందో!

బస్ రాలేదు. కాని ఒక టాక్సీ ఎక్కడా బేరంలేదు కాబోలు, నెమ్మదిగా పెళ్లి నడకలు నడుస్తూ వెళ్తోంది, తనకి తెలియకుండానే కమల చెయ్యి టాక్సీని ఆపమన్నట్లు వూగింది. టాక్సీ ఆగింది. తనే ఆపమన్నానా అని ఆశ్చర్యపోతూ టాక్సీ ఎక్కింది కమల.

టాక్సీ ఎక్కిన కమల వెనుతిరిగి చూసింది. అప్పుడేవచ్చింది తను ఎక్కవలసిన బస్. ఖాళీగా కూడ వుంది. ఒక్కసారి వుసూరు మనిపించింది. ఇరవై పైసలతో వెళ్లే ప్రయాణానికి 2 రూపాయల ఖర్చు. తన సంపాదనంతా

యిలానే అవుతోంది. పోనీ, ప్రైముకి చేరుకో గలుగుతున్నాను గదా అని తనలో తను తృప్తిపడుతోంది.

సీటులో వెనక్కి చేరగిల బడింది. ఏదో గుండెల్లో భయంగా వుంది. ఆ కొత్త ఎక్కౌంటెంట్ ఖండితంగా వుంటాడని తోడివాళ్ళు అనగా వింది.

క్రితంరోజు పార్టీలో అతనిని చూసినపుడు వులిక్కిపడిందితను, ఎక్కడో చూసినట్లు. చిరపరిచితమైన ముఖంలాగు అనిపించింది. మనిషిముఖం ఒకపక్కనుంచి చూస్తే చాలా పరిచితంగా వుంది. కాని ఆ రెండో పక్క చెవినుంచి గడ్డంకింద దాకా ఆ మచ్చచూస్తే మటుకు కొంత ఆశ్చర్యంగానూ, భయంగానూ వుంది. ఆ ఎకౌంటెంట్ కళ్ళుతననెందుకు పరీక్షగా చూస్తున్నాయి? ఆ కళ్ళెందుకు పరిచితంగావుండి కలవర పెడుతున్నాయి? ఒక్కసారి అరి చేతులు చెమటలుపట్టి చల్లబడినాయి. హేండ్ బాంగ్‌లోంచి రుమాలు తీసుకుని అరిచేతులు తుడుచుకుంది విసుగ్గా. అరిచేతులకి చెమటపట్టింది అంటే తను నెర్వస్‌గా అవుతున్నట్లు భయపడుతున్నట్లు లెక్క. భయం దేనికి అని తనకు తను ధైర్యం చెప్పుకో జూసింది.

టాక్సీ ఆగడంతో తన ఆలోచనల్లోంచి బయటపడింది. టాక్సీ డ్రయివరు తలుపుతెరిచాడు. ముందు ఆగిన టాక్సీలోంచి ఎవరో దిగుతున్నారు. డ్రైవర్‌కి డబ్బులిచ్చి అతనిచ్చిన చిల్లర పర్సులో వేసుకు తలెత్తేసరికి. ముందు టాక్సీలోంచి దిగిన ఎక్కౌంటెంట్ తనవంక ఒక్కసారి చూసి మెట్లెక్కడం గమనించి కమలగుండె గతుక్కుమంది. తనలాటి యస్. బి. క్లర్కు టాక్సీలో రావడం చూసి ఏమనుకుంటాడో! తనెందుకీ వెధవపని చేసింది? నెమ్మదిగా మెట్లవైపు నడిచింది.

అతను బాంక్ గుమ్మందగ్గిర తనకోసమే అన్నట్లు నిల్చుని "గుడ్ మార్నింగ్" అన్నాడు. కమల వులిక్కిపడి "గుడ్‌మార్నింగ్ సార్" అంది. తను లేటుగా వచ్చానని మృదువుగా గుర్తు చేస్తున్నాడా? లేక రోజూ యిలా అందరినీ విష్‌చేస్తాడా!

ఈమాదిరి అలవాట్లు యింతవరకు తమ బాంక్‌లో ఎవరికీ లేవు. అంతకు ముందున్న ఎక్కౌంటెంట్ సాధారణంగా లేటుగా వచ్చేవాడు. వచ్చినా

ఈమాదిరి విష్ చేయడం ఏమీలేదు. ఏభై అయిదేళ్లు దాటిన ఆయన దృష్టి ఎప్పుడూ రిటైర్‌మెంట్ మీద వుండేది. ఆయనకి ఏజెంటు అవలేదని పెద్దకసి. ఏజెంటు అవుతే ఫ్రీక్వార్టర్సూ పెద్ద పలుకుబడీ వుంటాయని భ్రమ. ఇవన్నీ ఆఫీసులో అంతా సన్న సన్నగా అనుకునేవారు.

కమల గబ గబా తన కౌంటర్‌లోకి వెళ్ళింది. కాష్‌బుక్సూ-లెడ్జర్లూ-పాస్‌బుక్సూ ముందువేసుకుని, కాషియర్ వద్దకు తాళాల కోసం వెళ్ళింది. కాషియర్ పక్కనే నిలబడి వున్నాడు కొత్త ఎక్కౌంటెంట్. ఇతను 'యిందు గలడందులే' దని ప్రతిచోటా ప్రత్యక్షం కాబోలనుకుంది కమల విసుగ్గా. అతను కమలని గమనించినట్లు లేదు. కాషియర్‌తో యిక్కడి పద్ధతులగూర్చి మాట్లాడుతున్నాడు. తాళాలు తీసుకుని తన కౌంటర్‌లో కూలబడింది కమల. ఆ తరువాత ఆమెకు ఎవరినిగురించీ ఆలోచించే అవకాశంగాని, వ్యవధిగాని వుండదు. డబ్బు లెక్కలు వెయ్యడం, తియ్యడం, కూడికలు తీసివేతలు, అంకెలు-యిదేపని.

తన ఎక్కౌంటు సరి చూసుకుని, తాళాలు కాషియర్‌కి వొప్పజెప్పి, బాంక్ బయటి కొచ్చేసరికి పన్నెండయింది. బస్ స్టాప్‌లో నిల్చున్న కమలకి-పై మేడమీద వరండాలో నిల్చుని ఏజంటుతో మాట్లాడుతున్న ఎక్కౌంటెంట్ కనిపించాడు.

క్రితంరోజు ఆయన పేరు తను సరిగా వినలేదు. పేరు విన్సెంట్ జోసఫ్ట. అంటే క్రైస్తవుడన్నమాట. అతను క్రైస్తవుడని వినగానే కమల కెందుకో ఒక్కసారి ఆశాభంగం కలిగినట్లయింది. ఏదో కొంత అసంతృప్తిగా కూడా వుంది. కాని ఆ ముఖం తనకి చాలా పరిచితమైంది. ఏదో బాగా తెలుసు. ఎవరు చెప్మా...అవునా కాదా! అతనయితే క్రైస్తవుడెందు కవుతాడు?

ఏవో భావతరంగాలు జ్ఞాపకాలు కమలని కుదిపేస్తున్నాయి. బస్ అందు కుని హాస్టలు చేరుకుంది కమల. ఆ వారమంతా కమల యిదమిత్థమని చెప్ప లేకుండా ఏదో అశాంతితో, ఆలోచనలతో గడిపింది. అంకెలకీ ఆలోచనలకీ ఎక్కడా సమన్వయం కుదరదని, ఆలోచనలు అంకెలని చెదరకొడ్తాయని కమలకి తెలుసు. కాని బుర్రని అదుపులో పెట్టలేకుండా వుంది. శనివారం.

ప్రతి సెక్షనూ ఆ రోజు తమ తమ ఎకౌంట్స్ బాలెన్సుచేసి చీఫ్‌కి అప్ప చెప్పాలి. ఆరోజు లంచ్ వైముందుంచి కమల ప్రతి ఎంట్రీ చెక్‌చేస్తోంది. యెన్నిసార్లు కూడినా, తీసివేసినా రూ. 113.75లు తేడావస్తోంది. ఏమయింది? తనెవరికైనా ఎక్కువ యిచ్చిందా? తలదిమ్మెక్కింది. కాఫీతాగివచ్చింది. సాయంత్రం దీపాలు వెలగడంకూడా కమలకి తెలియదు. కాయితాలు కాయితాలు అయిపోతున్నాయి. ఇంతతేడా యెప్పుడూ రాలేదు. పూర్వం అయితే ఇలాటి సమయాల్లో, పాత చీఫ్‌ని ధైర్యంగా అడిగేది, ఆయన "అడపిల్లలు ఈ పనికి లాయకికాదమ్మా. పెళ్లిచేసుకోక మీకెందుకూ లెడ్జర్లూ. గొడవలూనూ" అని సణిగినా చివరికి టాలీ చేసేవాడు. కాని ఈరోజు తను ఎవరినడుగుతుంది? అన్ని కౌంటర్సూ ఖాళీగా వున్నాయి. కాషియరూ-ఏజంటూ లోపల ఆఫీసులో వున్నారు, కమలకి ఏడుపొస్తూంది.

కాయితాలమీద యెవరిదో నీడపడటంతో తలెత్తి చూసింది కమల. ఎదురుగా కొత్త ఎక్కౌంటెంట్. మచ్చవున్న ఆ చెంప తనవైపు తిరిగివుంది. దీపపునీడ పడి ఆమచ్చ కనీ కనపడకుండావుంది. "మే ఐ హెల్ప్ యూ" అంటూ ఆమె పక్క కుర్చీ లాక్కుని కూచున్నాడు. కమల కంగారుపడింది. నోట్లోనుంచి మాటరాలేదు. ఏదో మెరుపు మెరిసినట్లయింది.

"అతనా...కాదు వారా...కాదు, కాదు, ఎలా అవుతారు? కాదు... అవును." అని ఆమె బుర్ర సుత్తితో కొట్టినట్లు శబ్దంచేస్తూంది. ఆమె హృదయం పల్టీలు కొడ్తోంది.

"ఎంత తేడా వస్తోంది" అన్నా డతను కళ్ళతో నవ్వుతూ.

కమలకి "జీవితకాలమంతా తేడాగా వస్తోంది" అనాలనిపించింది. కాని కాని...ఎలా?ఆమె నోట్లోంచి మాటూరావడంలేదు. అతని వంక తేరి పార చూడటం తప్ప బదులు చెప్పలేకుండా వుంది. మనిషిని పోలిన మనిషి వుంటాడా? ఇంత పోలికలుంటాయా!

అతను ఒక్కసారి తలెత్తి నిట్టూర్చాడు. కాయితాలు ముందుకు లాక్కుని ఒక్క పావుగంటలో రూ. 113.75 వెతికి పట్టుకున్నాడు. "ఇదుగో, టాలీ అయింది. మీరు ఎంట్రీ తప్పు వేసుకున్నారు." అన్నాడు చాలా

సామాన్యంగా. కమలకి యివేమీ బుర్రకి ఎక్కటంలేదు. 'అడగనా వద్దా- అవునా కాదా'- ఈ రెండే ఆమె బుర్రలో తిరుగుతున్నాయి.

మెకానికలుగా అతనికి థాంక్స్ చెప్పింది. కాళ్ళు వొణుకుతున్నాయి. సుషుప్తిలో మాదిరి పుస్తకాలు రాక్‌లో సర్దేసి, తన కౌంటర్ తాళాలు కాషియర్‌కి అప్పజెప్పి, చిరపరిచితమైన ఆఫీసు కాబట్టి కాళ్ళు తనని బయటకు తీసుకునిరాగా, వరండా మెట్ల దగ్గిర కొచ్చింది కమల.

గేటు దగ్గర టాక్సీ తలుపు పట్టుకుని నిల్చున్నాడు కొత్తచీఫ్ విన్‌సెంట్. కమలకి ఎటు వెళ్లాలో అగాలో వెళ్లిపోవాలో అర్థం అవడంలేదు. ఒక్కసారి పస్తాయించింది. "ఎక్కు. హాస్టల్లో దించుతా" అన్నాడతను, స్వచ్ఛమైన తెలుగులో. కమలకిగాలి స్తంభించినట్లయింది. తూలిపడబోయి కారు తలుపు ఆసరాగా పట్టుకుంది. అతను రెక్క పుచ్చుకు లోపల కూచోపెట్టాడు.

కమలకి వొళ్ళంతా ఝల్లుమన్నట్లయింది ఆస్పర్శతో. ఆస్పర్శ తానిని వరకు ఎరిగినదే. ఎప్పుడు? ఎక్కడ? ఆమె తెలియకుండానే చేతులతో మెడ తడుముకుంది.

''ఇప్పటికి గుర్తు పట్టగలిగావా?'' అన్నాడతను. ఆ కంఠం మృదువుగా, జాలిగావుంది.

"మీకు...మీకు...నేను. నేను యెలా తెలిశాను?" పొడి ఆరి పోతున్న పెదవులను నాలికతో తడిచేసుకుంటూ అడిగింది కమల.

''నువ్వు నన్ను యెలా తెలుసుకో గలిగావ్? నీ చేతులతో మెడని యెందుకు తడుముకున్నావు చెప్పు?" అతని కంఠం మంద్రంగా అనునయిస్తున్నట్టుగా వుంది.

కమలకు ఒంట్లో సత్తువ లేనట్లయి అచేతనంగా వుండి పోయింది. చెయ్యి నిర్జీవంగా కారు సీటుమీద పడిపోంది. ఆమె చేతిని అతను తన గుప్పెటో యిముడ్చుకున్నాడు. కమలకి ప్రాణం వచ్చినట్లయింది. ''మీ కీ విన్‌సెంట్ పేరేమిటి? నేను కమలనని ఎలా తెలుసుకున్నారు? ముందే తెలుసా?'' మాటలు గొణుగుడులా వస్తున్నాయి. అతను ఏం జవాబు చెప్పలేదు. ఆ చేతిని అలానే గట్టిగా పట్టుకున్నాడు. కారు ఎటు పోతోందో కమలకి బాహ్యస్మృతి లేదు.

కాని ఆనాటి స్పర్శ మాత్రం తను ఎన్నడూ మరిచిపోలేదు. ఎన్ని రోజులు అది కల అని, ఆ స్పర్శ నిజం కాదని చెప్పకో జూసింది? ఎందరు తనని ఆ స్పర్శ నిజం కాదని నమ్మించజూశారు? కాని తాను మరిచిపోలేక పోయింది.

ఎట్లామరిచిపోతుంది! పన్నెండేళ్ళ తనకి-అప్పుడప్పుడే వూహతెలుస్తున్న తనకి మామ్మ పట్టుదలవల్ల అవిడ తన పెళ్ళిచూడకుండా చచ్చిపోతుందేమో అన్న భయంవల్ల ఆ రాత్రివేళ తన మెళ్ళో మూడు ముళ్లు వేయించారు. ఆ మూడు ముళ్లూ పూర్తిగా పడకుండానే ఆస్తి కోసం పెళ్లివారి తగాదా! మామ్మ తనపేర వ్రాసిన ఆస్తిని పెళ్లి కొడుకు పేర పెట్టలేదని పెళ్లికొడుకు తండ్రి పేచీపెట్టి, పసుపు బట్టల్లో వున్న తమ జంటని, కంకణాలు విప్పని తమని మధుపర్కాల ముడి విప్పేసి వేరుచేసి, తనకొడుకు పుస్తె కట్టలేదని ఆ పదహారేళ్లవాడిని రెక్క పుచ్చుకుని లాక్కుపోయాడు. తండ్రిని ఎదిరించే వయసుగాని, సాహసంగాని, వివాహకాండని అర్థం చేసుకునేపాటి వివేకంగాని లేని ఆ పెళ్లికొడుకు పెళ్లివారితోపాటు వెనక్కి వెళ్లిపోయాడు.

పెళ్లి యిల్లు ఏడ్పులూ-మొత్తుకోళ్ళతో నిండింది. తన తల్లీ మామ్మా ఎంత చెప్పినా కోపిష్టీ. పట్టుదల మనిషీ అయిన తన తండ్రి ఆ ఆస్తిని పిల్లవాడిపేర రాయడానికి ఒప్పుకోలేదు. పై పెచ్చు ఆ పుస్తెలు లాగిపారేశాడు. తనపిల్లకు పెళ్లే కాలేదన్నాడు-మళ్లీ పెళ్లి చేస్తానన్నాడు.

ఆ పుస్తెలు అమ్మ బీరువాలో ఓ మూలకి వెళ్లాయి. తనపెళ్లి కోసం తిరిగిచేసిన ప్రయత్నాలు విఫలమయాయి, ఒకసారి. పెళ్లి చేయడానికే నానా తిప్పలు అయే యీ భారతదేశంలో-ఆడపిల్లకి రెండోసారి పెళ్లి కుదర్చడం ఎవరి తరం?

పెళ్ళి అలా అభాసు అవడంతో, మామ్మ ఆ బెంగతో, అసంతృప్తితో పరలోకానికి వెళ్ళిపోయింది. పెళ్లికుదర్చడానికి చేసిన ప్రయత్నాలు ఫలించక పోవడంతో తనను తిరిగి చదువులో పెట్టారు. మామ్మ తన పేరబెట్టిన ఆస్తి ఉన్నందువల్ల చదువుకోడంగాని, హాస్టల్లో వుండటంగాని సమస్యకాలేదు. బి.ఏ. పాసయిన కమలకి తనకి అనుకోకుండా బాంకులో ఉద్యోగం దొరికింది. రెండేళ్ళ బట్టి వుద్యోగం చేస్తోంది హాస్టల్లో వుండి.

తను స్కూలు ఫైనలు కొచ్చేదాకా తండ్రి బ్రతికేవున్నాడు. తండ్రి బ్రతికి వున్నంతకాలం తన అత్తవారి వివరాలు కనుక్కునే పాటి ధైర్యం తనకేకాదు, ఆఖరికి తన అన్నలకి కూడా లేక పోయింది. తల్లి చాటుమాటున కన్నీళ్ళు పెట్టుకు ఏడ్చేది. తన తండ్రిమటుకు వాళ్ళ పేరెత్తితేనే భగ్గున మండిపోయేవాడు.

తండ్రి పోయాక తల్లి పోరువల్ల రెండో అన్నగారు తన అత్తవారి సమాచారం ఆరా తియ్యగా ఆ అబ్బాయి ఇంట్లోంచి పారిపోయాడనీ, అతని తండ్రి బ్రాకెట్లలో ఆస్తంతా పోగొట్టుకుని ఎక్కడో కూతురుదగ్గిర వుంటున్నాడనీ తెలిసింది.

ఈలోగా తను యింటర్‌లోచేరి హాస్టల్లో వుంటూండగా తల్లి చచ్చిపోయింది. తనకి ఒకసారి పెళ్లిఅయిందని, తన కా భర్త దగ్గిర కెళ్లిపోవాలని ఉండవచ్చునని ఆ అన్నగార్లకి తోచలేదు. తన మామ్మ రాసి యిచ్చిన ఆస్తి నుంచి వచ్చేఆదాయంలో నెల కో వంద తనకి పంపిస్తూ మిగతాది వాళ్లు ఖర్చు పెట్టుకుంటున్నారు.

తను బి. ఏ. మొదటిఏడు చదువుతున్నపుడు తెగించి తన భర్త ఆచూకీ తీద్దామనీ, మామగారి దగ్గిరకి వెళ్దామనీ అనుకుంది. కాని తీర్థయాత్రలకు వెళ్లిన మామగారూ వాళ్ళూ గంగలో మునిగి చచ్చిపోయారని తెలిసింది. ఇది గాలివార్తగా తెలిసిందేగాని నిజమాకాదా అని ఎవరి నడుగుతుంది? వొదినగార్లూ, అన్నగార్లూ, తను వుద్యోగం చేసుకుంటూందని అనుకుంటున్నారేగాని, భర్తతో వైవాహిక జీవితం గడపగోరుతూందని అనుకోడంలేదు.

వాళ్లింటిపేరూ, అతనిపేరూ తప్ప ఆఖరికి ఒకే ఒక్కసారి చూసిన ఆ ముఖంకూడా అంతగుర్తులేదు. తను ఎలా వెతికి పట్టుకుంటుంది? ఉద్యోగంలో చేరాక అసలు ఆవిషయంగూర్చి మథన పడటం మానేసింది. హాస్టల్ జీవితం. బాంక్ లెక్కలు. అందరూ తనను మిస్ అనుకుంటున్నారు. నెమ్మది నెమ్మదిగా బాంకింగ్ టెస్టు పాసవుతూవుంది. జీవితాన్ని ఏదో స్తబ్దత, నిస్పృహ ఆవరించాయి. మళ్లీ ఇప్పుడు మెరపులా, బంగారు స్వప్నంవలె ఈయన తనజీవితంలో ప్రవేశించారా? ఇది నిజమా? కలా?

కమల ఒక సారి తలతిప్పి, ఏదో పూర్వ స్మృతికలిగిన దానివలె అతనివంక చూసింది. అతను ఆమెవంక కళ్ళతో నవ్వుతూ చూస్తున్నాడు. సన్నగా, కొంచెం రంగు తక్కువగావున్న ఆ పదహారేళ్ల బాలుడు యీతనా? ఈతను కాస్త లావెక్కాడు. తెల్లబడ్డాడు. మనిషిలో కొంత ఆత్మ స్థైర్యమూ, పట్టుదలా కనిపిస్తున్నాయి. గుప్పెట్లోని ఆమె చేతినివదిలి ఆమె వీపుమీద భయం లేదన్నట్లు రాస్తున్నాడు.

కమలకి ఎలా మాట్లాడాలో సంభాషణ ఎక్కడ ప్రారంభించాలో తెలియటంలేదు.

''మీరు-మీరు'' అని ఆగిపోతోంది.

''నేను-నేనే-రేపన్నీ వివరంగా చెబుతాను. నిన్ను హాస్టల్ దగ్గిర దింపుతాను. రేపు ఆదివారం కదూ. చర్చినుంచి తొమ్మిదింటి కల్లావస్తాను హాస్టలుకి. ఇంక రేపంతా అన్ని విషయాలూ మాట్లాడుకుందాం'' మరోసారి బుజాలు రాశాడు అతను లాలనగా.

హాస్టలుగేటుదగ్గిర నిల్చున్న కమలకి ఏదో నిస్పృహగా, నిరాశగా వుంది. ఎక్కడికి వెళ్తున్నాడు? రేపు నిజంగా వస్తాడా? అతను క్రైస్తవమతం తీసుకున్నాడన్నమాట! అయితే పెళ్లి అయిందా? పిల్ల లెంతమందో!... కదిలిపోతున్న టాక్సీవంక, దూరమవుతున్న అతని తల వెనకభాగాన్ని ఒళ్లంతా కళ్లుచేసుకు చూస్తూంది కమల. తన ప్రాణాన్నెవరో బలవంతాన లాక్కువెళ్తున్నట్లుందామెకు.

తనకిపట్టిన యీ అదృష్టం సంగతి-సినిమాల్లోనూ, కథల్లోనూ మాత్రమే సంభవమయే యీ మహత్తర యోగాన్నిగురించి తన హాస్టల్లో అందరికీ చెప్పాలనిపించింది. "నా భర్త కనిపించాడు. నా భర్త వచ్చాడు" అని గట్టిగా అందరికీ వినిపించేట్లు అరవాలనిపించింది.

కాని తనకి పెళ్ళయినట్లుగాని ఎవరికీ తెలియదే! ఎలా చెప్పడం? అతను తనను తీసుకువెళ్తాననిగాని, తాము కలిసి జీవించడంగూర్చి గాని ఏమీ అనలేదే! ఊరికే 'గుర్తించావా?' అన్నాడు. అతనికి వివాహమై, భార్యా పిల్లలు

వుంటే తనను ఎలా తీసుకువెళ్తాడు? ఎలా స్వీకరిస్తాడు? ఇలా బాంకీలో రోజూ చూడటం, ఆదివారాలుగాని, సాయంత్రాలుగాని కలిసి తిరగడం—తనకి ఇంతే ప్రాప్తియేమో! ఇన్నాళ్ల నుంచీ ఆ పదహారేళ్ల బాలుని రూపమే తన కళ్ళలో మెదులుతుండేది. కాని ఈ రోజు అతనే యితనని తెలిసి, అతను యిలా వుంటాడని, యింత సహృదయుడని తెలుసుకు ఎలా వదులుకోడం, ఎలా వదిలి వుండటం?

అతనికి పెళ్ళిఅయి భార్య, పిల్లలుగనక వుంటే తను యీ బ్రాంచినుంచి, యీ వూరినుంచే ట్రాన్స్ఫర్ చేయించుకోవాలి. ఈ సారి తనంతతానే దూరంగా వెళ్లిపోవాలి. ఇన్నాళ్లనుంచీ ఎవరిని గురించి తను రాత్రుళ్లరాత్రుళ్ళు ఆలోచించిందో ఆవ్యక్తి యిలా తటస్థపడి, మళ్ళీ దూరంగా తప్పుకోడం తను భరించగలదా! ఎంత ప్రయత్నించినా రాత్రి నిద్రరాలేదు కమలకి. ఆశా నిరాశల మధ్య వూగిసలాడుతూ కన్నుమూయలేదు. రెండుమూడుసార్లు అన్న గారికి యీ విషయం రాద్దామని వుత్తరాలు మొదలు పెట్టింది. కాని యీ సమస్యను తనకితాను ఎదుర్కోవాలి. ఇందులో పూర్వమొకసారి పెద్దలంతా కల్పించుకుని తమ జీవితాలతో చెలగాటమాడారు. ఈ సారి తమకితామే నిశ్చయించుకోవాలి.

మరునాటి వుదయం కాలకృత్యాలు తీర్చుకుని అద్దం చూసుకుంటున్న కమలకి తనకళ్లు మహాసముద్రాలు యీదివచ్చిన మనిషి కళ్లులా కనిపించాయి. ఏదో నీరసం, ఏదో వుత్సాహం, ఆదుర్దా ఆ కళ్లలో అవుపించాయి. ఓకప్పు కాఫీతాగి తొమ్మిది అయేరిసకి డ్రెస్‌చేసుకు రెడీగావుంది.

సరిగా తొమ్మిదీ పదికి టాక్సీ గేటువద్ద ఆగింది. వార్డెన్‌కిచెప్పి బయటి కొచ్చింది కమల. అతను టాక్సీపక్కన నిల్చున్నాడు. ఈ సారి చెంపమీద మచ్చ కొట్టవచ్చినట్లు కనిపించింది కమలకి. ఒక్కసారి ఆ మచ్చని తనవేళ్లతో స్పృశించా లనిపించింది. ఎలా తగిలిందో ఆదెబ్బ! అతను తలుపు తెరుస్తూ కమలవంక పరిశీలనగా చూశాడు.

"రాత్రంతా నిద్రపోలేదా? కళ్లు ఎర్రగావున్నాయి" అన్నాడు.

కమల మాట్లాడలేదు. కళ్లంట నీళ్లు గిర్రున తిరిగాయి ఆమెకి. యెందు కింత దయగా మాట్లాడుతాడు!

టాక్సీ కదిలింది. "ఇంటికి వెళ్దాం" అన్నాడు తను.

కమల మరింత నీరసపడిపోయింది. అక్కడ-అక్కడ-అతని భార్యని, పిల్లలని తనుచూడాలా? వాళ్ళనిచూసి తను భరించగలదా!

''ఎవరున్నారక్కడ?'' అంది నెమ్మదిగా.

''నువ్వే చూద్దువుగానిగా'' అన్నాడతను, కొంచెం చిలిపిగానే 'నేను రాను అనాలనుకుంది' కమల. కాని పైకి అనలేకపోయింది. అతని భార్యని, పిల్లలని, యింటిని, పరిసరాలని ఒక్కసారి చూడాలనే కోరికను అణుచుకోలేక పోయింది. ఒక్క అయిదు నిముషాలు కూచుని, మరి అక్కడితో తెగతెంపులు చేసుకుంటేసరి. మౌంట్‌రోడ్‌వైపు వెళ్తున్న టాక్సీ బుహారీ దాటుతోంది. కమల మనస్సులో ఏదో ఆలోచన మెరిసింది. ''ఒక్కసారి టాక్సీ ఆపమనండి, పిల్లలకు బిస్కట్లు తీసుకుంటా'' అంది కమల.

అతను బిగ్గరగా నవ్వి ''ఏం అక్కర్లేదు.'' అన్నాడు.

ఆ నవ్వుచూసి తన మనసులోని ఆలోచన పసిగట్టాడా అనుకుంది కమల. ఆమె చేతిని-భయంలేదన్నట్లు. బుజ్జగిస్తున్నట్లు-పట్టుకున్నాడు.

టాక్సీ కొత్తగా లేస్తున్న కాలనీలో ఒక చిన్నయింటిముందు ఆగింది. చుట్టూ ముళ్ళతీగె. మధ్యనిగేటు. తీగెని ఆనుకుని దడివలె ఎర్ర బటాణీగింజల పూలతీగ. అతను దిగి, కమలకి చెయ్యి అందించాడు. అతని చెయ్యి అందుకునేందుకు సంకోచంగావుంది. ఆయింటి కిటికీలోంచి ఎన్నిజతలకళ్లు తమని పరిశీలిస్తున్నాయో! ఏమనుకుంటున్నాయో! కాని యీచేతిని అందుకునే హక్కు తనకూవుంది. కమల ఆ చెయ్యినందుకు దిగింది అతను నవ్వుతున్నాడు. ఈతను తన ఆలోచనలు పసిగట్టగలడు కాబోలనుకుంది కమల.

ఇల్లు చాలా చిన్నది. ముందు హాలు తన హాస్టల్ గది అంతవున్నది. నాలుగు కేన్ కుర్చీలు-ఒక రేడియోతో అతి సామాన్యంగా, నిరాడంబరంగా వుంది. ఎక్కడా మనుష్యులువున్న అలికిడి వినిపించలేదు. వంటింట్లోమాత్రం పాత్రలచప్పుడు. కమల కుతూహలం అణుచుకోలేకుండా వుంది.

"జోసఫ్" అని కేకపెట్టాడు అతను. పద్దెనిమిదేళ్ళ కుర్రవాడు లోపలినుంచి వచ్చాడు. "కాఫీతెచ్చి పెడతావా?" అని జోసఫ్‌ని పురమాయించి-"పద, యిల్లుచూద్దువుగాని - ఎవరెవరున్నారో కూడా నువ్వే చూసుకో" అన్నాడు. రేడియో మీదున్న మేరీమాత దంతపు బొమ్మని పరిశీలనగా చూస్తున్న కమల నుద్దేశించి.

కమల ఉలిక్కిపడింది. పడకగది, డైనింగ్‌హాలు, వంటగది, డ్రాయింగ్ రూమ్-బ్రహ్మచరియిల్లు. ఆడవాళ్లూ, పిల్లలూ ఉన్నట్లు ఎక్కడా చిహ్నాలులేవు, ఒక మంచం. పక్క అల్మారులో పుస్తకాలు, ఒక గాడ్రెజ్ బీరువా. విన్సెంట్ కమలచేతికి తాళాలు యిస్తూ "ఆ బీరువాలో ఏముందో కూడా చూసుకో" అన్నాడు నవ్వుతూ. కమల బీరువా తీసింది. అందులో రెండు అరల్లోమటుకే బట్టలున్నాయి. మిగతా రెండరలూ ఖాళీగా, తమని నింపమన్నట్లు చూస్తూన్నాయి.

"ఇప్పుడర్థ మయిందా, యింట్లో ఎవరున్నదీ? ఇంక రా! మిగతా విషయాలు అన్నీ చెపుతా" అన్నాడు హాల్లోకి నడుస్తూ.

"మనపెళ్ళినాటికి నేను స్కూలు ఫైనలు చదువుతున్నాను గదూ. ఆరోజు పెళ్లి తంతు నామనసులో అట్టే నాటలేదు. ఆ ఏడాది పరీక్షపోవడం, మానాన్న బాగాతిట్టడంతో యింట్లోంచి పారిపోయాను. ఓ పదిరోజులు యిటు అటు తిరిగి. యింటికి మళ్లీవచ్చాను. ఎక్కడికి పోతాను? కానీ లేదాయె చేతిలో! మళ్లీ పరీక్షకు చదివి పాసయ్యాను. ఇంటర్ సెకండ్ యియర్‌లో వుండగా మానాన్న మళ్లీ నాకు పెళ్లి ప్రయత్నాలూ, కట్నాల బేరాలూ మొదలు పెట్టారు. మగవాణ్ణి కాబట్టి సంబంధాలు బాగానేరావడం మొదలు పెట్టాయి.

"ఆ సెకండ్ యియర్‌లో వుండగానే ఫాదర్ జోసఫ్‌తో పరిచయం అయింది. ఆయన మా కెమిస్ట్రీ లెక్చరరు. ఒకసారి లాబ్‌లోవుండగా-టెస్ట్‌ట్యూబ్ నాచేతిలో పగిలి-చెంపమీద యాసిడ్‌పడింది. అసలు కన్ను పోవలసింది. కాని ఆ పక్కనే సూపర్‌వైజ్ చేస్తున్న ఫాదర్ నన్ను ఒక్కలాగు లాగారు. అప్పుడే యీ చెంపకాలింది. యాసిడ్ పడటంవల్ల చర్మం కాలుకుపోయింది. ఆ గాయానికి మందు రాయడం బాధ్యత ఆ ఫాదర్ తనపై

వేసుకున్నారు. రోజూ మందు రాసేవారు. స్టూడెంట్సు అంతా తమ తమ సమస్యలని ఆయనతో చెప్పుకుంటూండేవారు. చిన్నపిల్లవాడిలా అమాయికంగా నవ్వుతూ దయగా మా సమస్యలకి సరియైన సలహా లిచ్చేవారు.

"ఒకసారి నా చదువూ, మా నాన్న డబ్బుఆశ విషయాలు మాటాడుతూ మన పెళ్ళివిషయంకూడా చెప్పాను. ఆ ఫాదర్ నిర్ఘాంత పోయారు. అందులో ఆయన కాథలిక్కుకూడా, వివాహమంటే ఆయన దృష్టిలో, ఏ మతమయినాసరే, అతిపవిత్రమయినబంధం, ఆ బాంధవ్యాన్ని డబ్బుతో ముడి పెట్టడమంటే ఎంత పరమెహోవడమో అని ఆయన వాపోయారు.

"ఆయన మాట్లాడుతుంటే నాకు తొలిసారి నీ గురించి ఆలోచన లొచ్చాయి. ఈ పెళ్ళివల్ల నీ జీవితం ఎలా మారిపోయి వుంటుందో, నీవు ఎటూగాక ఎలా బాధ పడుతూంటావో అనే ఆలోచనలు కలిగాయి. అది మొదలు ఆ ఫాదరూ, నేనూ నీగూర్చి చాలాసార్లు మాటాడుకున్నాము. నువ్వూ, నేనూ ఒకటి అనీ, మనిద్దరం విడదీయరాని పవిత్రబంధానికి కట్టుబడి వున్నామనీ అంటూండేవారు.

"ఆ సెలవలకి యింటి కెళ్ళినపుడు పెళ్ళి చూపులకి రమ్మన్నారు నాన్న, 'నాకు పెళ్ళిఅయింది. నాభార్య బతికేవుంది. నేను మరో పెళ్ళి చేసుకోను. యీ ప్రయత్నాలు విరమించండి' అని కచ్చితంగా చెప్పాను. దాంతో నాన్నకి చాలాకోపం వచ్చింది. నాకు చదువు చెప్పించేశక్తిలేదన్నారు. ఇంట్లోంచి పొమ్మన్నారు. నేను తనకి కొడుకునే కానన్నారు. అన్నిటికంటే నన్ను బాధించింది ఏమిటంటే-మీరంతా తనవెనుక నాతో మంతనాలు అడి తండ్రీ కొడుకులకి కాకుండా చేస్తున్నారనీ, మీనాన్నమీద దావా వేస్తాననీ మొదలు పెట్టారు.

"నాకేదో విరక్తి కలిగింది. ఆ రాత్రికి రాత్రే పెట్టేబేడా సర్దుకు ఫాదర్ దగ్గిరకొచ్చేశాను. ఆయనకి నామీద ఏదో అవ్యాజమైన ప్రేమ. నన్ను తనకొడుకనే అనేవారు. నా చదువు సంధ్యలు తనే చూస్తానన్నారు. నాన్న మాటలు విని మన పవిత్ర బంధాన్ని కలుషితం చేసుకోవద్దన్నారు. అప్పటినుంచే ఆయన నీగురించి కనుక్కోడం మొదలుపెట్టారు. నువ్వు ఏ స్కూల్లో

చదువుతోందీ ఆయన తెలుసుకున్నారు. నువ్వు ఈ బాంక్‌లో ఉద్యోగానికి అప్లయిచేశావు గదా, నీకు ఈ జాబ్ ఎలా వచ్చిందో తెలుసా?''

కమల ఆశ్చర్యంగా చూసింది.

''ఈ బాంక్ డైరెక్టర్లలో ఒకాయనకి మా ఫాదర్ జోసఫ్ చాలా సన్నిహితుడు. ఆయన ద్వారానే నిన్ను సెలెక్టు చేయించాను.''

కమల కథ వింటున్నట్లు వింటోంది.

''మరి యిన్ని తెలిసీ నాకోసం మీరెందుకు రాలేదు? నన్నెందుకు తీసుకుపోలేదు?'' అని ప్రశ్నించింది.

నిన్ను బలవంతంగా, నీ డబ్బు కోసమన్నట్టు తీసుకెళ్లకూడదని మా ఫాదర్ వుద్దేశం. నువ్వు నీ స్వశక్తిమీద నిలబడ గలిగి, నన్ను భర్తగా అంగీకరించినపుడే మనం కలిసివుండాలని ఆయన అభిప్రాయం. అదీగాక నేను మతాంతరుణ్ణి అయాను కూడా. అది నీకు అభ్యంతరం అవచ్చుగా!''

''ఎందుకయారు? మీరు పరారీ అయారని తెలిసింది. మామగారూ, అత్తగారూ పోయాకనేనా మతం మార్చుకుంట?''

''ఇంచు మించు అప్పుడే అనవచ్చు. నాన్న ఆర్థికంగా చితికిపోయారు. అయన చితికిపోయినప్పటి నుంచీ నావల్ల రాబోయే కట్నంగూర్చి ఆలోచన మరీ ఎక్కువైంది. కనీసం నిన్ను తెచ్చుకుంటే రాబోయే ఆస్తి గురించి అయన బుర్ర ప్లానులు మొదలు పెట్టింది. అదీగాక నా కెందుకో ఫాదర్ జోసఫ్ మాటలూ, ఆయన బైబిల్ ప్రార్థనలూ చాలా ఉపశాంతినిచ్చేవి. నన్ను కన్న కొడుకులా చూసుకు బి. కాం. చెప్పించారు. ఆపైన యం. కాం. కూడ చదివించారు. ఆయనకు నాకు క్రైస్తవమత మిప్పించాలని కోరికగా వుండేది.

''నాకు ఆ మతంలోని దుర్గుణాలుగాని, చెడుగాని ఏమీ కన్పించలేదు.

''ఒక విధంగా ఫాదర్ జోసఫ్‌వల్లనే నీపట్ల నాకు నైతికంగా కొంత బాధ్యతవున్నదని గుర్తించగలిగాను. నీమీద ప్రేమానురాగాలు పెంచుకున్నాను.

"నేను యం. కాం. మొదటి సంవత్సరం చదువుతున్నపుడు ఆయనకి చాలా జబ్బుచేసింది. అప్పుడు అయనపట్ల నాకుగల కృతజ్ఞత, ఆయనమీద నాకుగల ప్రేమ వెల్లడించుకోవాలనుకున్నాను. అప్పుడే క్రైస్తవమతం పుచ్చుకున్నాను ఆ తరవాత నెల్లాళ్లకు ఆయన ప్రశాంతంగా ప్రభువుసన్నిధికి చేరుకున్నారు. ఆయన కడసారి కోరికలేమిటో తెలుసా? నా చదువుని పూర్తిగా మిషనువారుభరించి చెప్పించాలని. ఏనాటికైనా మనిద్దరం ఆ భగవంతుని కృపవల్ల మన పవిత్ర బాంధవ్యాన్ని నెల కొల్పుకోవాలని, ఈ జోసఫ్‌కి నేను చదువుచెప్పించి ప్రయోజకుణ్ణి చెయ్యాలని. నీకు కాఫీ తెచ్చియిచ్చాడే, ఆ జోసఫ్ నా దగ్గిరే వుంటూ పి. యు. సి. చదువుతున్నాడు."

తనకి తెలియని అన్యమతస్థుడైన ఆ దయార్ద్ర హృదయాన్ని తల్చుకుంటూంటే కమలకళ్ళు చెమ్మగిల్లాయి.

"యం. కాం. రిజల్ట్సు వచ్చిన నెల్లాళ్ళకి నాకు ఈ బాంక్ డైరెక్టరు వద్దనుంచి వుత్తరంవచ్చిది. ఫాదర్ జోసఫ్ నా విషయమై యిదివరలో ఈయనవద్ద నుంచి మాట తీసుకున్నారుట. ఆ మాట ప్రకారం నన్ను ఫలానా ఎడ్వర్‌టైజ్ మెంటుకు అప్లయి చెయ్యమని ఆ వుత్తరం.

ఐదేళ్ళయింది నేనీ జాబ్‌లోచేరి. అప్పటినుంచీ నీ కోసం చాలా ఎదురు చూస్తున్నాను. నువ్వున్నచోటికి నేను వెతుక్కుంటూ రావచ్చనుకో. కావి అలా చెయ్యలేక పోయాను. ఫాదర్ ఎప్పుడూ అంటూండేవారు. మనిద్దరం ఎప్పుడో అప్పుడు తటస్థపడతాం అని. అలాగే జరిగింది. ఆయన మాటలు నిజం అయాయి. ఇప్పుడు చెప్పు, ఏమంటావ్?"

"నే నేమంటానో మీరు వూహించుకోలేరూ? అన్య మతానికి చెంది నన్ను ఎప్పుడూచూడని ఒక మాన్యవ్యక్తి నా తల్లి తండ్రులకంటే, రక్త సంబంధీకులకంటే కూడా నా విషయమై ఎక్కువ బాధపడ్డారు. నాగురించి మిమ్మల్ని ఆలోచింప జేశారు. ఆయనమతం మీ మత మయినపుడు, మీమతం నామతం ఎందుకు కాకూడదు? మనిద్దరం ఎప్పుడో దంపతులమయాం. ఈనాడు మతం అడ్డువస్తుందని ఎందు కనుకున్నారు? మీ కంటే ఆ ఫాదర్ గారికే నాగురించి ఎక్కువ తెలుసు," అంటూ అతని చెంపమీదవున్న ఆ మచ్చను చేతితో అతి మృదువుగా స్పృశించింది.

# సీతక్క పెండ్లి

డాక్టర్. యశోదారెడ్డి

తూర్పున సింగిణేసింది. ఉత్తరాన ఉరిమింది. కోటమెరిసింది. ఇంగీ లీకపుపూత బూసినట్లు మొగులుకు అడ్డంగ ఈ ఇంద్రధనుస్సు తీరుతీరు వర్ణాలతోటి కానొస్తుండది. ఓ దిక్కు మసి ముసి సీకట్లు ముసుకు కోంగ మొగులంతా ముత్యాల పందిరి జలకారు చీరకొంగోలె తళుక్కు, తళుక్కు మంటుండది. వూదా, ఎరుపు, డాంకురేకులు గలిసి జిగజిగలు గురిసినట్లు మెర్పులు చిత్ర ఇచిత్రంగ, తళుక్కులు ఈనుతుండయి. పడుమటి దిక్కున మూస బోసిన బంగారం ముద్దోలె సూర్యుడు ఎఱ్ఱగ గ్రానా పట్టిండు. తొడుక్కున్న పరికిణీల మీద సింగారిచ్చుకున్న వొల్లెలు సన్నటి కందిరీగె నడ్ముకు జుట్టి గలగల నగుకుంట ఆడివిల్లలంతా పుంగిళ్ల వూయ వాకిట్ల గుమిగూడుతుంటే అడివిమొల్లలన్ని మొగ్గలిచ్చుకోని ఇరబూసి జతలుగట్టి వొచ్చి నిలవడ్డట్లు అనిపిస్తుండది. ల్యాగదూడలన్ని చెవులల్ల ఏందో కొత్తగాలి జొరినట్లు మెడల గంటలు గణగణ మోగంగ చెంగు చెంగున దుంకుతుండవి. మనిషికైనా పసురానికైనా పసితనమే ముద్దూ మురిపెం.

బూమి అంతా ఏందో అదోతీరు కమ్మటి వాసన్లు జిమ్ముతుండది. యాణోవాన వడ్డట్లుండది, అదో! ఇంగేం మా నెమిలి తల్లి నీల కడిమి చెట్టెక్కి పురిఇప్పతనే ఉండది. దానికీ ఈడొచ్చింది. మిన్నూ-మన్నూ రెండూ దెల్వ నీయని కాలం గదా! ఇది! చిత్రం జూడు! అనుకోకుంద గిఱ్ఱున ఓ యాడాది దాటింది కాలం. ఆఁ దాటక బిచ్చపతి కోసం, లచ్చపతికోసం కూసుంటదా? కుంటువత్తదా? ఈపొద్దు? ఈ కాలానికి ఓతాడా? తలుగా? దాని ఇష్టం వొచ్చినట్లు అది సాగి పోతనే ఉండది. అది అలనాటి అవుతార పురుషుడు రాములవారి కోసమే ఆగలేదు మరి? ఈ నాటి ఈ రాగడూ, రంగడూ ఓ లెక్కా? ఆఁ కాలం ఆగిందో? ఆగలేదో ఎవణి కెర్కగని? అన్నిట్ని అదుపుల. పెట్టుకున్ననని మీసం మెలేస్తున్న ఈ మనిషి తన బుద్దిన జిక్కిచ్చుకోని కాలాన్ని పగ్గాన్నేస్తనని రెప్పపాట్లు, గడియలు, గంటలు, దినాలు, వారాలు, నెలలు, ఏండ్లు, లెక్కలు గట్టి, గుణింతంల బిగిచ్చిండు. అవే పడికట్టురాళ్ళై ఉగాదులు, సంకురాత్రులు, దసురలు, మంటెడ్ల అమాసలు, ఏరొంక పున్నాలు ఏర్పాటై రంకురాట్నం దిరిగినట్లు దిర్గుతుండయి. ఈతీర్గనే ఈత చెట్టుకు ఆకురాలంగ చెట్టుసుట్టు నడుంకట్టోలె గుండుగ గిర

గీసినట్లు గీత ఏర్ప డ్తేదాని గుర్తు యాడాది అన్నడు. ఇట్లే నీళ్ళల్ల చాప ఈది నట్లు ఈది నీళ్ళలోతు దెల్సుకున్నడు. ఇంగ ఆకాశాన పక్షి ఎగిరినట్లు ఎగిరి దాని అంతు గనుక్కున్నడు. గద్దకన్న పదోవొంతు తక్కువ ఆయిష్షువోసు కొచ్చుకున్నమనోడు లేని రెక్కలు గట్టుకోని దానికన్నా ఎత్తుఎగుర జూస్తుండడు. ఎగిర్తే ఎగిరిండు, జవసత్తువలున్నోడు. ఎగురంగ వొద్దన్న దెవరు? గని! తాను ఎగిరేటప్పుడు ఎదురింటి కాకెరపాదు పక్కింటి మల్లె పందిరిని దొక్కకుంట అవుతలి పూరి గుడిసెలకు కుప్పగూల్చ కుంటెజాలు. ఎల్లమ్మగుడి, ఎంకటేశ్వర్లకు కాలు దగల కుంటెజాలు.

ఏందో? మళ్ళానేను చాద స్తంలనే వడ్తుండ. కలిసి కలెబోసుకుంటున్నం అని అనుకొనే ఈ బత్కులల్ల కలిమిడియాండది? ఒగదాని బుగులూ బెదురూ మరోజీవికి ఉండనే ఉండది. కోరలు జూపి, మూపులెక్కి, కుత్కెలు నుల్మి ఓ జాతి నెత్ర వీలిస్తే. మరోజాతి ఉన్నకాణ్ణె నాల్కెలు జాపి తగిల్నజీవిని ఏం ఎర్గనట్లు గుట్కుమంటది. ఇంకోజాతి ఒంటికాలు మీద జపంజేసి అదును జూసి ఆమురజిక్కిచ్చుకుంటది. పిల్లికి చెలుగాటం, ఎల్కకు ప్రాణసంకటం. ఇదోసోకు! ఈ తీర్గనే సంసారంల నరుడు తన బత్కుదెర్వుకు తొలినాడే సంచకారి గట్టి తనమడిగెలుదిద్దుకున్నడు. గడ్సినయాట ఇట్లేగదా! మబ్బున వడ్డది? వాన ఏకసిస్తున కుండ చిల్లి వోయినట్లు, కడువల గుమ్మ రిచ్చినట్లు గురిసింది. మండిన కొల్మిసల్లారిచ్చినట్లు బూమి అంత పొగలు గక్కికక్కి సల్లవడ్డది. అదేందోగని ఉమ్మిర మంతవోయి ఉల్లాసం ఒక్క సారి తొంగిసూసింది. అన్న గతం అయిన జీవితీర్గనే జలగతం ఈ బూలచ్మి. ఆ తల్లి ఇచ్చే పంట. ఎప్పుడు తెల్లార్తదో? తెల్లారంగనే తొలుకరి నాగండ్లు గట్టి పొలం దున్నాలె. ఇత్తులేయాలె.

సుక్కవొడువంగ సీతలేసింది. కడుపలు పూజిచ్చింది. మంగళార్తి దెచ్చింది. మాణిక్యాలల్ల వత్తులేసి నూనేవోసింది. చిగురు పసరు చీరగట్టింది. తీరపువ్వు అంచు రయికె దొడిగింది. నడుముకు గంటల మొలకట్టు, కాళ్ళకు గజ్జెల అందెలు వెట్టింది. అవి నేనంటె నేనని అడ్డు అడ్డుకు మాటల మాటగలిపి మాట్లాడినట్లు గలగల మంటుండవి. ఇంతట్లకే పాలేరు రంగయ్య నాగలి ఎత్తు కొచ్చిండు. నాగల్ని పసుపుకుంకుమల్తోటి పూజిచ్చిర్రు. మల్లన్న రామన్నల

కొమ్ములకుజాజులుపూసిన్రు. పూలుజుట్టిన్రు. సుదుర్న నామాలుదీర్సిండ్రు. పెద్ద పాలేరు నెత్తికి రుమాలు జుట్టిండు. గుగ్గిలపుపొగ ఏసిండు. కొబ్బెరికాయగొట్టిండు. దెబ్బకు అది ముక్కముక్కలైంది. 'నాయినా! బూలక్ష్మి ఈసారి మనంబిలుస్తే పల్కుతదే!' అని అంటుఉంటె ముత్యాలజల్లు గుర్సినట్లు నగులు వొల్కవట్టి నయి. ఇంతట్లకే ఊరి పెద్దరైతు నాగలి నడ్సింది. ఈ త్యాప ఆ నాగలివట్టింది పెద్దపాలేరుగాదు. పెద్దకొడుకు రఘురాములు. తుమ్మపువ్వంచు దోతిగట్టి బొందెల అంగిదొడ్కి చేత్ల చెర్లకోలవట్టి మొగతనమంతా కరిగిచ్చి పోసి నట్లున్నడు. ఆ పిలగాడ్కి మా సీత కండ్లల్ల వడ్డది. కండ్లవడంగనే మంతరిచ్చి నట్లు, మైదు జల్లినట్లు, కనికట్టు గట్టినట్లు, కలగన్నట్లు, కన్నదిమర్సినట్లు, చిత్తార్నిదించిన బొమ్మతీర్గ నిలవడ్డడు. నిలవడడామరి? అందుట్లచిత్రంయాండది? నా బిడ్డ అనిగాదు, గని, కొచిప్పలోలె కండ్లు, జమిడిరెప్పలు, పొల్గారెచెంపలు, తేనె మెత్తగ జుట్టి ఆ తీపికి మత్తెక్కి లేవలేక కుప్పలుగట్టి ఆణ్ణెకూలవడ్డ గండుతుమ్మెదలోల నల్లటి ముంగుర్లు. దాని ముక్కు కొంచెం... ఏంది? కొంచెం? ఏక్తారు తీగోలె. బడిపిల్లల పెన్సిల్ ముల్కితీర్గ సన్నగ కొస్నెగ ఉండాల్నా ఏంది? నిజంగ జెప్పాలంటె ఆ ముక్కుతీర్పే దాని మొకానికి ఎలు గిస్తుండది. అప్పుడు మా సీత తనదిక్కు రఘురాముల కర్రెటి సూపులు తోరుణాలు గట్టంగ ముచ్చెమట్లువోసి తన చేతులున్న మంగళార్తిని పక్కనున్న సుశీలమ్మ కందిచ్చి తప్పుకున్నది.

కన్నమ్మ కష్టంమీద రఘురాంల తండ్రి మా సీత పెండ్లికి ఊఁ అన్న దేమొ. అంతట్లకె పారిజాతపు చెట్టొచ్చి గడ్డిపోసను పలుకరిచ్చినట్లు, గంగానది జలాలొచ్చి పిల్వకాల్వను కౌగలిచ్చుకొన్నట్లు, మేరుపర్వతం పలుగురాయితోటి ఇయ్యం అందినట్లు, నింగి వొడిగివొచ్చి న్యాలను ముద్దిచ్చుకున్నట్లు ఈసంబందం ఏందో నన్ను పొడుగుజేసినట్లు, నానెత్తిన పచ్చల తురాయి పెట్టినట్లు, లేనిది కన్నట్లు, అపురూపమైనట్లు అందరు అనుకోవట్టిన్రు. ఓ రూపుకంగజూస్తే అవుననొచ్చు. అల్లుడుమట్కు అష్రఫీ, మేలిమి బంగారపు సలాక, గుణాల పాతర, నాతల్లి సీత నోసుకున్న గౌరమ్మ నోముఫలం అని నేనెంత ఉల్లాసంగ ఉన్నా నా కెందుకో మనస్సు చివుక్కుమని సిన్నవోయింది. ఈతరాన కులాలు తలాలు లేవంట? యాడలేవు? ఎక్కడలేవు? ఇంగా గడ్డపారన వొడ్సి దిమ్మస జేసినట్లు గట్టిగ పాక్కపోయినయి. ఇంతకు కోటయ్య నాకులపోడేగదా?

అయితే ఈ కుంపటేంది? ఆయినకు మూట ఉండది. నాకు మాట ఉండది. సరేః ఆడిపిల్ల తండ్రిని ఎందుకైనా అడిగిమడిగి ఉండెటోళ్ళమే. కోరినంత వెట్టెనను కోతిశివుడంట. కోరికోరి కొనుక్కున్న సంబురమే గదాః హిమవంతుడు ఆసొం టోడు బిడ్డకోసం జోగి, సన్నాసి, బిచ్చగాడు, బైరాగి, ఇబూతిపూతగాణి కాల్లె గడ్డికట్నంబెట్టలేదాః ఇగ మనంఅసంగ ఎంతః తప్పదు. కోటయ్యతోటి ఇయ్యం అంటె మామూలు మాటలాః పగటి దివిటీలు ఎలిగిచ్చాలె. నా గాదెలు గుమ్మ లన్ని జలగడ్గినా పిలగాణి తరపోండ్లకు ఒక్కపూట కుడ్పుకుగావు దుణం బుట్టకపోతదా. చేబదులు ఇస్తేసరేః లేకపోతే మిత్తికి దేవాల్సివాస్తది, అమ్మోః మిత్తిః అవును మిత్తి – ఆయితె మిత్తిః మిత్తేః

'శ్రీ రంగరాయడాః నాకు తుర్తుల కొంత రొక్కంగావల్సి వొచ్చిందయాః సూడునాగయాః నీపనీ – నాపనీ మరోటిగాదు. ఈ కల్యాణం సాక్షాత్తు ఆ పద్మా వతీ శ్రీనివాసులదే అనుకుంటుండ గని, ఈ నడుమ కూసిన కుక్కకూ, లేసిన జింకకూ యావో పెద్దపెద్ద ఆలోచన్లు. అందర్కి బొందితోనసొర్గం జూతామనే తాపత్ర్యం. అందుకని పైస ఆసరగావాలె. ఆ ఆసరతోటే కంట్రాక్టులు, ట్రాక్టర్లు, ఎరువులు, ఇంజన్లు, విలాయితులు, ఇచిత్రాలు. ఇవి అన్ని సాపుగ జరుగాల్నంటె లక్ష్మిందేవి సల్లగ జూడాలెగదాః అన్నా ఎట్ల జెప్పిన ఇంటవుగని నిజం జెప్తుండ. నా గల్లపెట్టెల రొక్కం పదింతలై నిండుకొస్తున్నా చేతుల మీదిసొమ్ము చేతుల మీదనే ఎగవడి అందుకుంటుండరు. మరి నెలకు నూటికి మూడుః అదైనా మూణ్ణెల్లు ఆగాలె. రామచంద్రాః నూటికి మూడుః వావశం గాదు. వస్తఅన్నాః మరి. "ఖాన్‌సాబ్ నాకు ఇంట్ల ఓ శుభకార్యం వొచ్చింది. ఈడ నిలవడ్డప్లే కొంత పైకం గావాలె. నీ హిమ్మత్ జూసుకోనే అవుతల మాట ఇచ్చిన." "నాగయ్యభాయిః మీరు ఎప్పుడురాంది ఇల్లుసొచ్చుక వొచ్చిన్రు. భాయీ బోల్తాహైతో హందోఖా నైకర్తా చూడుభాయిః నాదిచిన్నపైసా, పెద్దవొడ్డీ. రూపాయికి నాల్గు పైసలు. ఈవొడ్డీ నిన్ను మింగుతది. చిల్లెర జువ్వాగాండ్ల కు, తెల్లది జాలక ఆపూటకు నల్లదిగొని గొంతున వోసుకునేటోళ్లకు నాతాన లా వాదేవీలు జెల్లుతయి. మాఫ్‌కర్నాభాయి." 'ఆవు నెత్తురు జీర్ణంబనందు కేమొ పీడు నిజం బలికుండు. ఆవును పూజిచ్చే మనోడు ఆవొడ్డానికి రంగుపూసి తమాసగ తీర్థంబుచ్చుకున్నడు, సరే ఇంగ మిగిలింది ల్యాండు మార్టగేజు బ్యాంకులుః కానీ రోట్లె నెత్తివెట్టి రోకండ్లకు బయపడ్తే అంగల్లునే తెల్లార్తది.

దరఖాస్తులు, సంతుకాలు, మోయినాలు, బస్సులు, బండ్లు, కాళ్లీడ్పులు, పంచ రంగులు, పంగనామాలు. ఊరుబయలు ఎల్లింది మొదులు తెల్లబంగ్ల మెట్లు ఎక్కిందాంక ఒకటే దక్షిన్లు. గుడ్డికి, కుంటికిగాదు తెల్లటోపులకు, టెరలీన్ బుషర్టులకు. కాగితం ఒకటి కలాలు పన్నెండు, చేతులు ఇరువై. ఇన్ని సోట్ల సేతులుగట్టి, పండ్లు ఇగిలిచ్చుకుంట, సువ్వకు త్తికెవెట్టి నిలవడేట్యాళ్లకు రక్తం గడ్డగట్టి కాళ్ళనరాలు, దొడనరాలు బిగిచ్చుకపోయి కుట్లువడ్డవి. యాదో ఈ యింత నెత్తిరుమాలన్న ఉండది నాకు. సరే ఏమనుకుంటే ఏందిగని? భూములు కుదవలువడి సంతకాలైనవి. ఈ రుణం రేపు నా ఎదలమీద కుంపటే! ఈమిత్తి వాతవడనే వొద్దు మనిషి అన్నాడు. ఇది దెబ్బదిని తప్పిచ్చుకున్న నాగుంబాము పగోలె, విషవాది మనుస్సోలె, తిక్కకుక్కకు ఇసంవోలె, ఆరని కొరకచ్చోలె, అదునుజూసి రగులు కుంటనే ఉంటది. ఈ బాటేం మనిషిని ముందలికి దెచ్చె బాటగాదు. ఈపైస ఇంజన్లకా? బావులకా? మీది సదువులకా? మిద్దెలకా? పసులకా? పన్గదకా? ఉత్తబత్తలకు, తాష్‌మార్లకు తప్పెట్లకు, బీనుబాజాలకు, కట్నాలకు, కళావత్ చీరలకు, మోటర్లకు, హోటర్లకు, ఎలక్టేరు దీపాలకు, పెద్దపోకళ్ళకు, నాగుసుల పీకుళ్ళకు. ఇసీ! నేనేందో మళ్ళా చిల్లెర ఆలోచన్లకే దిగవడ్తిని. ఈ సంబురమంతా నా సీతక్క పాపెట తీర్పుకు, నాబిడ్డ కండ్ల కాట్కెసక్కనకు, నాతల్లి బొట్టు పొందికకు బాసికపుకూర్పుకు. నాపండు ఒడి బియ్యానికి. నామొల్క ఎదుగుకు. నాకంటి సలువకు. ఆ సీతారాముల జంటకు ఆ జత ముద్దు మురిప్యానికి.

మ్యానత్త లొచ్చిన్రు. ఇంటి పెద్దమణుసు లొచ్చిన్రు. సుట్టాలొచ్చిన్రు. జాతుకాలొచ్చినయి. పంచాగాలు వట్టిన్రు. శ్రీమా అన్నరు. పస్పులు జిట్లినయి. ఐదుమంది ముత్తైదలు అప్పడం వొడెం బెట్టిన్రు. పాకంగుదిరి అరిసెలు సాగినయి. మ్యాదర గంపలొచ్చినయి, జీడిగుల్లలొచ్చినయి. పెద్దపేర్పులొచ్చినయి. సక్కెరసంచులు, బెల్లపుముద్దలు, గాదెలగూసున్నయి. జంబుఖానాలు, ఇస్తార్ల కట్టలు, గాజు గిలాసలు గంపల్ల అట్కఎక్కినయి. కుడుకలు, బాదం కాయలు, నగువత్తులు, యాలకాయలు, గుండుపోకలు, కజ్జెరపండ్లు. తలువాల బియ్యాలు, వొడినాలు, రయికెముడ్తలు, పెట్టువళ్ళసీరలు, అత్తర్లు, పన్నీర్లు నాల్లు కొట్టిళ్ల నిండినయి. నేతిపావు దగ్గరనుండి ఇర్సఉడ్కె అండదాక పాతరసామానంత యాదీలేదనకుండ లెక్కజూసి పొందిచ్చిన్రు. కాకెరొడ్లు పొతమైనయి.

నేతిపేసలు పదిలమైనయి. లడ్డూ, జిలేబీలు సాగాలె వొద్దుసుమా! మోటు, నాజూకు పేర్లుండాలె. అయితే జాంగిరి, బాదుషాలు గానీయిండి. ఆ( ఇదంత కట్టె పలారం కిందనే జమ. పెండ్లికొడుక్కు సుట్టాలకు అప్పటికప్పుడు ఉడుకు ఉడుకు ఉండే ఉప్మా, పూరీ కోడిమాంసం ఉండాలె. అదేందుండి? ఓళ్లా మన పాత పాటకొ స్తిరి? అదేందో తీతరూ, బటేరా, అంటగదా? ఇప్పుడు అవి సమ కూర్చుడు కష్టంలే. అది పెండ్లైయినంక ఖదరైన సతరోండ్లకు. దానికైనా పాది యాటకాండ్ల జాడదీయాలె.చేతివొడ్డున్న పుల్లుయాటకాండ్లు లేకపోలేదు గని తిప్ప లెక్కువ సరే సమకూర్తంలే.

అయ్యో! పందిర్ల మాటేంది అన్నయా! అవునమ్మో అసల్దే మర్సిన. ఎన్కటి మన మోతాక్కు పందిళ్లుగావంట. కొబ్బెర ఆకుల్తోటి కళ్యాణ మంటపం గట్టాల్నంట. పోకగెలలు యాళ్ళాడేయాల్నంట. పట్నంలకెళ్లి బషీర్ మియ్యాను పిల్సుకొచ్చి డాంకురేకులతోటీ చాందుతారాలు వెట్టిచ్చి కనుకాంబ రాలు, మల్లెలుగూర్సి పూలసింగారం జేయాల్నంట. దేరాలేయాల్నంట. చాంది నీలు గటాల్నంట. బిజిలిపంకాలు గావాల్నంట. మాడికాయ షర్బతు వొద్దంట. కొత్తకుండల నీళ్ల కొత్తవాసన గొడ్తవంట. మినిష్టర్లు వొస్తరంట. సల్వరేకులు పర్సి తెల్ల చెదర్లు ఏయాల్నంట. ఆనుక, కూసుండేటందుకు గద్దెమెత్తలు, గుండు మెత్తలు ఏయాల్నంట. సలువకొరకు రొండు దినాలకు ముందే బరఫ్ముద్దలు దెచ్చి అది కర్గిపోకుండ ఉప్పుబస్తాలు గుమ్మరిచ్చి కప్పాల్నంట. అయ్యోదేవుడో ఈ కాకకు ఇగం గర్గుతదో కర్గదోగని నేనుమాత్రం ఇంతింత ఇసుమంతై వానగండ్లు గర్గినట్లు గర్గి కాల్వల పార్కుం మాత్రం ఖాయం. సరే! కానీ!

రుణందెచ్చిన సగం ఏన్గెదిన్న ఎలకాకాయతీర్గ యాడ్కి ఎట్లా మాయం అయిందోగని ఐంది. ఆయాళ్ళనిచ్చితార్థం. పెట్టెలున్నపట్టు సీరలన్ని మావోళ్లు ఈయాళ్ళనే సింగారిస్తుండరు. మరి రేపు పెండ్లికి యాదాపుడుసీరలు గడ్తరో. పసురానికి తిన్నది బలం మనిషికి ఉన్నది బలం. మావోండ్లు యాడదా పెట్టుకున్నరో. వొంకర టింకర వయిసేసక్కన సూడు! ఈడొచ్చిన పిల్ల లంతా కాళ్ళకు పసుపులు పూసుకోని ఈ ఆ పనులు అందుకుంట ఉంటే కుసుమ సేను పండినట్లు, బీరపందిళ్లు పూసినట్లు కానొస్తుండరు. నాతల్లి పీటల మీద గూసున్నది. వాళ్ళపెద్దాడి బిడ్డ జోడుచిల్కల చీరవెట్టి పచ్చల ఉంగురం ఏలికి దొడిగింది. మల్లెపూల జడఏసుకోని, నింబోళి చీరగట్టుకోని కొంచెం

నెత్తివొంచి కూసున్న నా బిడ్డను జూడ రెండుకండ్లు జాల్తలేవు. నిండుగ చిగురేసి మొగ్గవెట్టిన మల్లెతీగోలె పూతకొచ్చిన కడ్మి చెట్టోలె గానొచ్చింది. ఇస్సీ! సాలీసాలక బత్కిన నాగుణం బోనియ్యక ఇంత దనుక ఏందోకర్సు; కర్సు అనుకుంట కొంచెపు ఆలోచన్లు జేస్తిని. నా చిల్కసింగారానికి నాబూముల కుదువ ఓ లెక్కనా? నేనమ్ముడు వోయిగాన్గకు ఎద్దెయితిర్గినా పర్వలేదు. అని అనుకున్న. తెల్లార్తే అంతా పండుగనే. తెల్లారింది. రీతిపోంటి మేము వరనిచ్చయానికి బోయినం, భవంతి నడ్మ గద్దె పీటల మీద కోదండం మర్శిన ఆ రఘురాముల తీర్గనే ఈ రఘురాములుగా నొచ్చిండు, అయితే ఆ రఘురాములు అల్లనేరేడు పండోలె నలుపు నా అల్లుడు మట్కు పసి నిమ్మపండోలె పస్పు. కర్కోటకుడు కోటయ్యకు ఈ మాణిక్యం ఎట్ల ఉట్టిండో? పూర్వపుణ్యం. పెట్టిపుట్టిన జన్మల తీరు అది అని సంబురపడ్డ. ఎందుకోగని నాఎట అదుర్తనే ఉండది. చేతులు వొణుకంగ ఆచారం కొద్ది బొమ్మంచు దోతులు బంగారు బటువువెట్టి అక్షంతలు ఏసిన. పిల్లగాడు ఎంటనే లేసి నాకాళ్ళకు దండం బెట్టిండు. అప్పుడది సంబ్రమో? బుగులో? బిడియమో? తెల్వదు. నాపైముల్లేసి ముచ్చెమట్లు వోసింది, దస్తురుమాల తోటిదుడ్సుకున్న. బోజినాలైనయి, తాంబూలం ఇచ్చిన్రు ఇంతట్లనే ఇయ్యంకుడు నన్నొక్కణ్ణి దివాన్ కాండ్లకువిల్సి భావా! అన్నిసరేగని కట్నం మాట? అన్నడు. ఆ మాట ఇట్లసెవిన వడ్డదో లేదోగని నేన్యాడికో పాతాళానికి గూలి పోయిన గని సత్వ జిక్కవట్టుకోని తమరు తొల్త ఈ మాట పేరుకైనా ఎత్తలేదు మరి? అనుంగనే అన్నన్నా; ఏం తెలివి మంతుడవయ్యో! అమాయికమా? నాట్కమా! ఎంత అమాయికం ఉన్నగని దినాం అగ్బార్లు సదువుతలేవా? పెండ్లిల్ల కట్నం రూపుకంగ ఇచ్చిపుచ్చుకాలు తప్పు అని. అయితే నలుగుట్ల బయరంగంగ ఇంత అని కట్నం పేర్నబిల్చి నా బత్కిన బత్కుకు ఓమచ్చ గూర్వమన్నవా? ఎట్ల? ఏదో బజార్నవడి గుట్టు బయలుగాకుండ మర్గోపుర్గ గుర్తుపట్ట కుండ జర్గిపోవాలె అని అనుకున్నగని నీవాల్కం జూస్తే నాగంబీరం నిలవెట్టెటట్లు లేవు, ఆ తెచ్చిన దోతి సింగారం జూడు, బటువుసోకు జూడు బంగారం దెచ్చిండు, రవ్వకరువైనట్లు. ఇంతకూ మేం నీనజరుకు ఆనినట్లులేం. 'అయ్యో!' అఁ లేకుంటె ఏందయ్యో! సరే! జరిగింది ఏదో జరిగిపోయింది. నడ్సినబాగను తిర్గిసూస్కం నా గుణంగాదుగని ముందుమాట మాత్రం ఖరా

కండి. ఒక్కటికి తగ్గదు. 'అయ్యో!' జిలుకర బెల్లాలైన మర్నాడే ఆ వెయ్యి పూలల్ల వెట్టి...అఁ ఏమన్నవూ? వెయ్యా నాకొడుక్కా? మా రాముడు బట్టగొడ్డనుకున్నవా? పోతుదున్ననుకున్నవా? ఈ నాడు ఓ సన్నకారు కోడె దూడనే రొండువేలు చేస్తుంటె నాకొడుక్కనీకు ఇంత ఆగ్వ గండ్ల వడ్తుండడా? అమ్మా! నీ కెంతదీమా? నా తోన సవందం ఖాయం జేయాల్నంటె ఒక్కల కారానికి పొల్లుపోగూడదు. ఇంగోషర్తు! ఇచ్చి పుచ్చుకాలు మావోణి చెవిసోక గూడదు. అయినా నేనేం నీమెడకత్తివెట్టి అప్పుడే రొక్కంస్తాంబాళంల గుమ్మ రియ్య మంటలేను. నిదానంగనే ఇత్తువు గనీ. నీ పది ఎకురాల మాగాణి పొలం మాత్రం నా పేరకాయిదం రాసియ్యి. లేకుంటె తెచ్చిన వరకట్నం నీ ఇంటికి మళ్లతది అనే అనుకో. దీనిమీద నీ ఇష్టం.

అవును నా ఇష్టమే! నాకున్న పొలాన్ని ఇంతకు ముందే పెండ్లికర్సుల కని కుదువ తగిలేస్తిని. ఇంగ నా ఇష్టానికి మిగిలింది నేనూ నా పెండ్లాం. దాన్నె వరుగొంటరు? నన్నె వరుగొంటరు? సత్యహరిశ్చంద్రుల కాలంగన్కనా! కాలకౌశికుడు, కాడిపాపడు కొనేటందుకు? మనిషిమారాలె-మనుస్సుండాలె. అంతేగని, ఈ సర్కారు, సట్టాలు, ఓట్లు, సీట్లు మసిబూసిన మారేడుగాయలు. అవును మరి శంకాన బోసింది అంతాతీర్థం అయితదాపెత్తదా? ఇచ్చకాలకు మెరమెచ్చులకు మాట్లాడితెగాదు. కురాటికుండల మీదతేచు లోపట కడ్గోలెగా కుండ చెప్పేది చేసేది ఒకటైన్నాడే యాదన్న నిలుస్తది. నిలుకడవొందుతది. ఇసం ఉన్నకాడ దాన్కి ఇర్గుడు పుట్టనే పుట్టింది, ఇంతకూ యాదిసక్కన ఉండది గన్క నాగయ్యది వొంకర అందును. తిట్టాల్సివొస్తె నా శాతగాని తనాన్నిదిట్టాలె. అనాల్సివొస్తె ముక్కు సూటిగ వోమే నా గుణాన్ని అనాలె. అంతేగని మందిని నిందెవెట్టి ఏంలాబం. లాబం ఉన్నా లేకున్నా దేన్నిదిట్టినా, దేన్ని మెచ్చినా అనుకున్నా పెండ్లిగాలేదు. రఘురాంలు విలాయతుకు వోయిండు. మాటన్నా పలుకలేదు.

మా సీత కత అంత ఇన్నది. కన్నీటి సుక్కన్నారాల్చలేదు. గని సరసర గిర్కతీర్గ ఇల్లంత దిర్గే సీత మెల్లగ నడుస్తుందది. ఏందో పోగొట్టు కున్నట్లు కండ్లవడ్తది. నగినా ఆ కండ్లల్ల మెరుపులేదు పొగురు స్వాపం పోంటికండ్లు మెరుగు అరి గాజుగుడ్లోలె ఐనయి. దాన్ని దల్చుకున్నప్పుడల్లా

నా మనుస్సు కుమ్మరి ఆవం గాలినట్లు, కుమ్ములలెట్టిన మాడికాయ ఉడ్కినట్లు ఉడుక్కుతది. ఈ సంకటం పగోడ్కి గూడ వెట్టకు తండ్రీ! ఇంత కత నిన్న మొన్న జరిగినట్లే ఉండది. కాలచక్రం ఓ సుట్టుదిరిగింది. వరుదలువొచ్చి మిట్టపల్లాలు గాౖనాకుండవోయినట్లు ఈయాడాది పొద్దు నా బిడ్డగాయాన్ని మాన్పుతే బాగుండు. మరో సవందం దొర్కదనిగాదు. గని ఆ ముచ్చట దీయాల్నంటెనే ఇచ్చినమాట దప్పినట్లు నమ్మిణోని గొంతు గోసినట్లు, దాసుకున్న సొమ్ము దోసుకున్నట్లు, కానిపనిజేసినట్లు బుగులైతది. దానిమనుసు ఎట్లుండదో? అది నిండుకుండ. తొల్కదు. ఆ నాడు శ్రీ రంగనాయికులను మెచ్చిన గోదమ్మతీర్గ మాసీతనడ్తంత అదోతీరున ఉండది. అందుకే ఈకొత్త కారు మత్తెక్కిన ఉర్మలు, మెర్పులు, పక్కగట్టిన పాతపుండును పచ్చి నెత్తుర్లు వొల్కజేసి ప్రాణసంకటం దెస్తవేమోనని భయం,

సీత ఆవు పాలు పిండీ పిండనట్లుజేసి ల్యాగదూడల పల్కలు ఇడ్సి ఆవుల కాడ్కి దోల్తుండది. ఆనెమిలి పిట్ట పురి ఇంకా గుండుగ ఇసునకర్రోలె ఇప్పుకొని కేరింతలు గొట్టుకుంట నాట్యం దొక్కుతనే ఉండది. సీత ఆ కడ్మిసెట్టు కాడ్కి వోకుండ ఉంటదా! పూలన్ని దండ గుచ్చుకున్నది. నా తల్లి ది ఏ సొగుసు? అబ్బ! కండ్లన్ని మిరుమిట్లు వడజేసుకుంట ఈ మెరుపు జుల్మజూడు! అ( ఎవరు అది? ఈ మబ్బులల్ల, గాళ్ళల్లవడి మా ఇంటి దిక్కనడుస్తుండరు! పోవడిజూస్తే మా రఘురాంలతీరు, మా ఏంది మా? ఆ కోటయ్య కొడ్కోలె ఉండడు. పోవడిగాదబ్బో! ఆయినే, ఇంకేం ఉండది? ఆ రాగిడే, ఎంకటేశ్వర్లు!, గౌరమ్మా! ఓ అలివేలుమంగా! ఆంజనేలూ ఈ గండం గడ్పుండి. ఈ పిడ్గునుజూస్తే నా బిడ్డ గూలి బూమిమట్టంగాదా! నా బిడ్డను నాకు దక్కిచ్చుండి. అయ్యో! అనుకున్నంతపనైంది. నా సీత నడిసివొచ్చిన ఈ ముప్పును కండ్లారజూసింది. ఈదరగాలికి తీగెలు అల్లాడినట్లె నా బిడ్డకదిలి పోతుండది. తల్లిని విలిస్తే బాగుండు" అని రొండడ్గులునడ్చిన, అంతట్లకే మెరుపు ఎంటనే ఇంగో మెరుపు వొచ్చినట్లు వొచ్చి ఇల్లు జొచ్చిండు. ఇంట్లకెట్ల ఆ పిలగాడు వొచ్చిండో? చెట్లకింద నిలవడ్డ సీత రాముల సేతులకెట్ల వోయిందో నాకేదెల్వలేదు. కన్నుమూసి తెరిసేట్యాళ్ళకు ఇంత ఇంద్రజాలం జరిగింది.

నేను అడ ఉన్ననన్నధ్యాస గూడమర్సి రఘురాములు తన రొండు సేతుల సీత మొకాన్ని నాజూకుగ మీదికి ఎత్తి ముద్దిచ్చుకున్నడు. నేనేకండ్లు కిందికి వాల్సుకున్న. ఎంటనే సీతసేయిని తన చేతులకల్పి పట్టుకొని గొరగొర గుంజుకుంటొచ్చి, అడ ఓగుంజ తీర్గ నిలవడ్డ నాకాళ్ళమీద వాలిగ్రను. నా కేం జెయాల్నోతోచలేదు. నాకాళ్ళమీద పణలుమోపిన ఇద్దర్ని ల్యావట్టి రొండు చేతుల్తోటి ఎదకు అలుముకున్న. ఇంతట్లకె వాకిట్ల ఏంకత జర్గుతుండదో దెల్వక సీతతల్లి మాలక్ష్మివొచ్చి గుడ్లప్పగిచ్చి నిలవడి యాదిదెల్వక ముగ్గుర్ని ఓముడెల జూసి దేవుణిదిక్కుదిర్గి రొండుచేతులు జోడిచ్చికండ్ల నీళ్లొత్తుకున్నది. ఇంత్రై నంక సీత మేల్కొన్నట్లు మమ్ములను ఇడ్సి సంటిపిల్లోతె తల్లి సంకల జేరింది. ఆ నాడు రాత్రి మా ఇంట్ల కోటి ప్రెమిదలు ఎల్గినవి.

# ఆడది అబల కాదు

శ్రీమతి పోలాప్రగడ రాజ్యలక్ష్మి

"రండి! మంచి ఛాన్స్! తాజాసరుకు, ముప్ఫయి పైసలమ్మే మూర పావలాయే!...కొప్పులో పెట్టుకుంటే కోసెడు దూరం గుభ్‌మనాలి! ... రండమ్మా రండి... మల్లె పూలమ్మా. మూర పావలాయే!" అంటూ కీచు గొంతుకతో గట్టిగా అరుస్తూ బస్‌స్టాండులో వినిపించే తక్కిన శబ్దాలన్నింటినీ మింగేస్తూ, హడావిడి చేస్తున్న గౌరికేసి చూసింది శైలజ.

బస్‌స్టాండుకి ఎదురుగా రోడ్డుఅవతల చిన్నకర్ర మండిగ మీద మల్లె పూవులు గుట్టలుగాపోసి, వాటితో మధ్య మధ్య మరువం కనకాంబరాలువేసి మాలగా కడుతూ, అప్పుడప్పుడు జారిపోతూన్న జానెడు జుట్టూ. వేలికిచుట్టి జారుముడి వేసుకుంటూ అరుస్తూంది గౌరి. పట్టుమనిచూస్తే పదహారేళ్ళులేవు. కొద్దిగా పొట్టిగా సీలమండల మీదకి ఎగదోసుకుపోయిన మాసిన పరికిణీ, అతుకువేసిన వోణీ, మట్టిగొట్టుకు పోయిన చెంపలూ, ఎండుగడ్డిలా గాలికి ఎగురుతూ రేగిపోయిన జుట్టు-ముఖం చామన చాయగా నీరసంగా వున్నా, కళ్ళల్లో కనిపించే తేటదనం, చూపుల్లోనూ మాటల్లోనూ ప్రతిక్షణం వెల్లివిరుస్తూన్న చురుకుదనం. వీటివల్ల ఒకరకమయిన ఆకర్షణే కనిపిస్తూంది గౌరిలో.

చేత్తో బ్రీఫ్‌కేసు పట్టుకుని రాబోయే బస్ కోసం ఎదురుచూస్తూన్న శైలజ చెవుల్లో వచ్చిపోతూన్న బస్సుల చప్పుళ్లూ, హారన్లూ రకరకాల సరుకు లమ్మేవాళ్ళ అరుపులూ ప్రయాణీకుల కబుర్లూ, ముష్టివాళ్ళ కేకలూ, అన్నీగజిబిజిగా అల్లకల్లోలంగా వినిపించి విసిగిస్తూన్నా. మధ్యలో 'కయ్' మంటూ గౌరి అరుస్తూన్న అరుపు ఒకరకమైన వైవిధ్యంతో శైలజకి ఆసక్తిని కలిగిస్తోంది.

రెప్ప వెయ్యకుండా గౌరి చలాకీ తనాన్నీ చురుకుతనాన్నీ చూస్తూన్న శైలజ తన హుందాతనంతో కూడిన సౌమ్య ప్రకృతిని ఆమె హుషారుతో పోల్చుకుంది. ఆమెకేం ఉంది? తనలా చదువా, సంస్కారమా, ఉద్యోగమా హోదాయా, సంపదా? ఏం లేవే? అయినా ఎంత చైతన్యంగా ఉంది ఈ పిల్ల! ముఖంలో ఏం ఆత్మవిశ్వాసం. ఏం సంతృప్తి? అన్నీ ఉన్న తను అలా ఎందుకు ఉండలేదు? చిన్నప్పటి నుంచీ తనది పిరికి మనసే అవుచు. గట్టిగా ఒకళ్ళని అనలేదు, ఒకళ్ళంటే పడలేదు.

చిన్నప్పుడు నాన్నగారంటే ఎంత హడలని! పోనీ అని ఆయన తనని ఎప్పుడూ గట్టిగా కేకలేసింది కూడా లేదు. అయినా తనకి భయమే! కాన్వెంటుకి కట్టవలసిన జీతం అడగాలన్నా, స్నేహితురాలితో అలా ఆడుకోడానికి వెళతానని చెప్పాలన్నా, కొత్తచెప్పులు కొనమని అడగాలన్నా, అన్నింటికీ భయమే!... తలుపు వెనకాల నిలబడి నాలుగైదుసార్లు రిహార్సల్స్ వేసుకుని, నోరు తడి చేసుకుంటూ వణికిపోతూన్న కంఠంతో నెమ్మదిగా అడిగేది. ఇంతా చేస్తే ఆయన "సరేలే అమ్మా ఇదిగో ఈ డబ్బు తీసుకో" అనేసేవారు, నాన్నగారు ఏం అనరని తెలుసు. అయినా ఏమిటో...

ఏదో బస్ వచ్చింది. తీరాచూస్తే తను వెళ్ళేదికాదు. స్టేండ్ గుమస్తా చెప్పిన ప్రకారం అయిదున్నరకి రావాలి అది. వాచీ చూసుకొంది శైలజ. ఇంకా పావుగంటసైముంది. పావుగంటా ఇలా బస్‌స్టాండ్‌లో నిలబడి ఉండాలి కాబోలు! కూచుందాం అంటే బెంచీల నిండా నలుగురైదుగురు మగాళ్ళయితే ఏం పనిలేనట్లు నడుంవాల్చి కబుర్లు చెప్పుకుంటున్నారు.

"కొట్టనా అండీ!" అని ఎవరో తనని ఉద్దేశించి అన్నట్లయి శైలజ ఉలిక్కిపడి అటు చూసింది. పదేళ్ళ కుర్ర వెధవ! జారిపోకుండా మొలతాడుతో పట్టించిన పాత కాకీ నిక్కరూ, బొడ్డుమీదకిలాక్కుపోయిన చిరుగుల బనీనూ! వాడూను. "షోడా కొట్టమంటారా అమ్మగారూ!" అంటూ. ఇంకా తను వద్దని చెప్పేలోగానే కీచు మనిపించి షోడా తనచేతికి అందియ్యబోయాడు.

"నాకు వద్దు... ఎవరుకొట్టమన్నారు" శైలజ కొంచెం విసుగ్గా అంది.

"కొట్టేశాను కదాండీ...తీసుకోండి" తీసుకోక తప్పదు అన్నట్టుంది వాడిమాట. ఏమిటి వీడి దబాయింపు! శైలజ కోపంగా కుర్రాడికేసి చూసింది.

"ఊ..." అన్నాడు షోడా కుర్రాడు ఒక రకమైన ఆజ్ఞాపిస్తూన్న స్వరంతో. శైలజకి ఈ మారు కోపమే వచ్చింది.

"నాకు వద్దంటూంటే!"

"వద్దా?... అయితే డబ్బులిచ్చెయ్యండి"- ఆ పదేళ్ళ కుర్రాడి కంఠం లోనూ బెదిరింపూ, తెగువతనం...ఈ బస్స్టాండులో వీడితో లేనిపోని గొడ వెందుకు? పదిమందీ జేరడం, అల్లరీను-అనుకొని అయిష్టంగా పదిపైసలు తీసి వాడి చేతిలో పెట్టి ఒక గుక్కెడు షోడా తాగినట్టే తాగి వాడి కిచ్చేసింది శైలజ.

సన్నగా నాజూగ్గా, కేలీ సిల్కుచీరలోంచి పాతికేళ్ళ వయస్సు తాలూకు అందాలు స్పష్టాస్పష్టంగా కనిపిస్తూంటే "డబ్బున్న ఆవిడలాగవుంది. డబ్బున్న వాళ్ళు చదువుకుంటారు. ఇంకా డబ్బు సంపాదిస్తారు. తమకే కనక డబ్బుంటే తన అక్కకూచా ఇలాంటి బట్టలేసుకో పోయిందా? ఇలా చదువుకో పోయిందా? ప్చ్" అని నిట్టూరుస్తూ ఆ కుర్రాడు డబ్బులూ షోడాసీసా తీసుకు వెళ్తుంటే వాడెందుకు నిట్టూర్చాడో అర్థంకాలేదు శైలజకి. అయితే వాడు తిన్నగా అరుస్తూ పువ్వులమ్ముతున్న ఆ పిల్లదగ్గిరికి వెళ్ళి పదిపైసల బిళ్ళ ఆమెచేతికిస్తూ దూరంగా నిల్చున్న తనని వేలితో చూపిస్తున్నప్పుడూ. ఇద్దరూ కలిసి తనను చూసి నవ్వుకున్నప్పుడూ ఏదో అర్థమయినట్లయి శైలజకి కొంచెం ఉడుకు మోతు తనం వచ్చింది. "డబాయించి తన దగ్గర డబ్బులు లాగానని వాడు చెప్తున్నట్లున్నాడు, వాడూ అదీ కలిసి తన అసమర్థతకీ చేతగాని తనానికీ నవ్వుకుంటున్నట్లున్నారు."

శైలజకి ఒక్కక్షణం ఆ పువ్వులమ్మే పిల్లమీదా, షోడా కుర్రాడి మీదా భలే కోపం వచ్చింది. ముఖం మరో వైపుకి తిప్పేసుకుంది. కోపం వస్తే తను ముఖం తిప్పేసుకుంటుంది. అంతకంటే తను ఎదట మనిషిని ఏం అనలేదు. పరుషంగా మాట్లాడాలన్నా, చెడామడా నాలుగు అనాలన్నా తనకేమిటో ఇష్టం ఉండదు. ఎంతకోపం వస్తే అంతగా మూతి ముడుచుకుని మౌనంగా ఉంటుంది తను. అఫ్కోర్స్—అది అర్థం అయిన వాళ్ళకే అర్థం అవుతుంది. లేనివాళ్ళకి లేదు.

ఇంటర్మీడియేట్లో తనకి లెఖ్ఖల్లో నూటికి నూరు మార్కులు వచ్చి ఇంజనీరింగ్ కాలేజీలో చేరడానికని వెళ్ళినప్పుడు ప్రిన్సిపాల్ పగలబడి నవ్వి

"ఏవిటమ్మా నువ్వు ఇంజనీరింగ్‌లో చేర్తావా? సర్వేసెట్టూ, ఇనపగొలుసూ మొయ్యాలి. వర్క్‌షాపులో సుత్తీ దాగరాతో పనిచెయ్యాలి. ఇంజనీరింగ్ అంటే గచ్చకాయలు ఆడుకోవడం కాదు. పైగా ఫస్టియర్ నుంచి ఫైనలియర్ దాకా అంతా మొగపిల్లలు. నువ్వు ఒక్కతైవే ఉంటావు ఆడపిల్లవి. ఆలోచించుకో మరి ఎటువంటి సమస్యలు వస్తాయో" అంటూ అవహేళనచేశారు. తనకి కోపంతోనూ అవమానంతోనూ ముఖం అంతా కందగడ్డలా అయిపోయింది. ఆయన తనకి పౌరుషం వచ్చిందని గ్రహించాడు. కనకే "సరే నీ యిష్టం" అంటూ సీటు ఇచ్చాడు.

ఆయన అన్నట్లు అయిదేళ్ళూ తనకో అయిదు యుగాలుగా గడిచాయి. నిత్యమూ ఏదో ఒక సమస్యే. ఎవరో ఒకరు తనని లోకువకట్టి ఏదో ఒక మాట అడనమే. కాలేజీ స్టూడెంట్స్‌తో సగం కళ్ళు తనమీదే!...ప్రతివాడూ ఏదో ఒక వంకని తనని పలకరించడమే!

"వాసుగాడు వట్టిపోజుగాడండి! వాడి మాటలు నమ్మేరు కనక?" అంటూ ఓ రాముగాడొచ్చి వార్నింగ్ ఇచ్చి వెళ్లే-

"ఏమండోయ్, ఆ రాముగాడితో తరుచు మాట్లాడకండి. వాడంత అబద్ధాలకోరు ఈ కేంపస్‌లో లేడు" అంటూ మరో సోముగాడు వచ్చి హెచ్చరిక చేసేవాడు.

సర్వేకేంపుల్లో అందమైన చీరతో "కులుకుతూ పైట సర్దుకుంటూ గాజులు గల గలమనిపిస్తే డిగ్రీ రాదు. ఈ ఇనప గొలుసు మొయ్యాలి. సర్వే కేంపుల్లో ఇనపగొలుసు ఒక్కసారైనా మొయ్యని వాళ్ళకి మహాపాపం రావడమే కాదు, ఇంజనీరింగ్ డిగ్రీ కూడా ఆర్నెల్లు ఆలశ్యంగా వస్తుంది, ఇంటర్వ్యూల్లో అడుగుతారు సర్వే కేంప్‌లో ఇనపగొలుసు మోశావా. అని 'లేదు' అన్నవాళ్ళకి ఉద్యోగం గోవిందః" అని ఒకడు అన్యాపదేశంగా తనకి ఉక్రోషం కలిగిస్తే;

"మీ అందాల చేతులు కందేను పాపం ఎందుకు ఈ బెడద" అంటూ తనకితోషం వచ్చేలాగ తన చేతిలో గొలుసుని సున్నితంగా మరొహడు తీసుకునే వాడు.

"ఈ జీవిత కుసుమం నీ పాదాల కంకితం" అంటూ ఒకడు కవిత్వంలో ఏడిస్తే, "ఇవి పువ్వులుకాదు, నా ప్రాణా"లంటూ మరొకడు ఇన్ని బొగడ పువ్వులో జాజిపువ్వులో తెచ్చిముంగిట్లోపోసి పోయేవాడు.

"విరిబోణీ విప్పచెట్టు దగ్గర కలుసుకో" అని ఒక విరహార్తుడి కబురూ, "నువ్వు పెళ్ళికి ఒప్పుకోక పోతే నా ప్రాణాలు తీసుకుంటా" అని ఒక పిచ్చివాడిలేఖా!

అ మ్మ మ్మ !......ఆ అయిదేళ్లూ అయిదు మహాయుగా లయి పోయాయి. తనకి కోపం, అసహ్యం, ఆవేశం ఒక్కుమ్మడిగా వచ్చేవి. ఆడ దంటే మగాడికింత అలుసెందుకు?...మహిళాభ్యుదయం అంటూ మళ్ళీ అరుస్తారే, తమతో సమంగా ఉండే స్త్రీ పట్ల వీళ్ళచూపులు మారవేం? వీళ్ళ ఆలోచనల్లో మార్పురాదేం! అని తను తెగ బాధపడేది. ఈ మాటలే మొహం మీద అడగాలని ఎన్నిమార్లో అనుకుంది, కాని అలా అపరకాళిలా కేకలేసి అల్లరిచేస్తే మర్యాదగా ఉండదేమో అని ఎప్పటి కప్పుడే తమాయించుకొని ఊరుకొంది.

శైలజ ఇలా ఆలోచిస్తూనే వుంది.

'గ(య్' మంటూ గౌరి కంఠం బిగ్గరగా వినిపించింది.

"ఏంటిరా సచ్చినాడా! ఏంటి కూశావ్? మళ్ళీకుయ్! నాను నీ కంటికి సినీమా టారులా ఉన్నానా? పిచ్చి పిచ్చి వాగుడు వాగేవో నాలిక సీల్చేత్రా, జేగర్త" అంటూ చేతులు ఊపుకుంటూ పక్కనేవున్న పళ్ళకొట్టు వాడిమీద మీదకి వెళుతోంది. పక్క పక్కనున్న వాళ్ళు "ఊరుకో గౌరీ, ఊరుకో" అంటూ ఆమెని ఆపుతున్నారు. ఇందాకటి షోడా కుర్రాడు "ఏంటే అక్కయ్యా ఏంటన్నాడు ఆడు" అంటూచేత్తో సోడాబుడ్డి పుచ్చుకుని పైకి యెత్తాడు.

పక్కనున్న పళ్ళ కొట్టువాడు బిక్కచచ్చిపోయి "నేనేంటన్నాను? నేనేంటన్నాను?" అంటూ తనలో తను గొణుక్కుంటూ వెనక్కి వెనక్కితగ్గు తున్నాడు. బాగా అయిదారడుగుల మనిషే! బలంగా కండలుతిరిగి, కోరమీసం మెలితిరిగి, మనిషిలోని పాతికముప్పై యేళ్ళ యౌవనాన్ని సూచిస్తున్నాయి.

తిరగబడితే సునాయాసంగా నలుగురైదుగుర్ని తన్నగలడు. అయితేనేం? తప్పుచేసినవాడిలా సిగ్గుపడిపోతూ, అవమానంతో క్రుంగిపోతూ వెనక్కి వెనక్కి నడుస్తున్నాడు.

ఆ స్థితిలో పళ్ళుకొట్టువాడిని చూసేసరికి శైలజకి జాలేసింది. పాపంవాడి స్థితి ఎంత దయనీయంగా తయారైంది! ఈ పువ్వు లమ్మాయి మరీను. వాడి పరువు బజార్న పెడుతోంది. ఏదో కొంటెమాట అన్నాడే అనుకో. దానికింత హంగామా చెయ్యాలా?

ఇలా శైలజ అనుకోవడమే కాదు. తగువు తీర్చడానికి వచ్చిన వాళ్ళల్లో ఒకళ్ళిద్దరు కూడా ఆ మాటే అన్నారు. "పోనియ్యి గౌరీ-ఏదో తెలివి తక్కువ మాట అన్నాడే అనుకో. అన్నదానికి సిగ్గుపడుతున్నాడు కదా-ఇంక వాడిని వదిలెయ్యి" అని. గౌరి మాత్రం ఊరుకోకుండా "ఇలాంటాళ్ళని ఊరుకో కూడదయ్యా-ఊరుకుంటే లోకువకట్టి మరింత అలుసు సేస్తారు. పొద్దుగూకులా ఇక్కడుండ వలసినదాన్ని. అలుసైతే ఇక బ్రతికినట్టే!" అంటూ గట్టిగా అరిచింది.

గౌరి అన్న ఆ మాటలు విని శైలజ ఉలిక్కి పడింది. నిజమే. తన పరిస్థితి నిజానికి అలాగే ఉంది నెల్లాళ్ళ క్రితం. సరదా పడి వచ్చిన ఉద్యోగం వదులు కోవడం ఎందుకని ఈ ఊళ్లో కొత్తగా తెరిచిన డివిజనల్ ఇంజనీరింగ్ ఆఫీసులో సూపర్ వైజరుగా చేరింది. చేరింది లగాయతు తోటి సూపర్‌వైజర్ల దగ్గర్నుంచి డివిజనల్ ఇంజనీర్ వరకూ అందరి కళ్లూ తనమీదే. వాళ్ళంతా తనని ఆదోలా చూటమే! కొందరు అవసరం ఉన్నా లేకపోయినా పని కల్పించు కొని తనతో కబుర్లు చెప్తున్నారు. అర్థంలేని చనువు తీసుకొని మరో అర్థం వచ్చేలా మాట విదుల్తూ కొంటె నవ్వులు నవ్వుతున్నారు కొందరు. అన్యాప దేశంగా కొందరు అవహేళన చేస్తుంటే ఆత్మబంధువుల్లా నటిస్తూ మరికొందరు అనవసరం జాలి ప్రకటిస్తున్నారు. తనకి చికాకు, కోపం, తన నిస్సహాయస్థితి మీద తనకే విసుగూ రాసాగాయి. ఒక్కళ్ళైనా తన జోలికి రాకుండా తన గొడవ పట్టించుకోకుండా ఉంటారనుకుంది! ఉహుఁ! ఆఖరికి డివిజనల్ ఇంజ నీరు ప్రవర్తన కూడా రానురాను చిత్రంగా మారిపోసాగింది.

"ఒక్కత్తెవూ కూర్చుంటే ఏంతోస్తుంది? అప్పుడప్పుడు మా యింటికి వస్తూ ఉండు" అన్నాడు.

"అర్జంటు కాగితాలున్నాయి. ఇవాళ ఇంకో గంట నువ్వు ఆఫీసులో ఉండాలి" అన్నాడు మరో రోజున.

మొన్నటికి మొన్న రూమ్‌లోకి సంతకాలకని కాగితాలు పట్టుకెళ్ళిన తనని 'కూర్చో కూర్చో' అంటూ బలవంతంగా కుర్చీలో కూర్చోబెట్టి, కాఫీ తెప్పించి తన అందాన్ని పనిమాలా పొగడడం మొదలెట్టాడు. తనకి సర్వ అసహ్యం వేసింది. కాని ఆ అసహ్యాన్ని మనసులోనే అణుచుకుంది. తనకి ఉద్యోగం ఇబ్బందిగా ఉందనీ, రాజీనామా చేసి వచ్చేస్తున్నాననీ అక్కయ్యకి ఉత్తరం రాస్తే, ఇంత పొడుగు జవాబు రాసింది అక్కయ్య. "తొందర పడొద్దనీ. ఈ రోజుల్లో ఉద్యోగాలు రావడం కష్టంగా ఉన్నాయనీ, అంతగా అయితే ఓ వారం రోజులు శలవు పెట్టి రమ్మనీ, అవసరం అయితే మరో చోటికి ట్రాన్స్‌ఫర్ చేయించుకుందా" మనీను.

తనకి వళ్లు మండుకొచ్చింది ఆ సలహాలు చూసేసరికి. ఇంకో ఊరు ట్రాన్స్‌ఫర్ అయితే మాత్రం అక్కడ ఇలాంటి మనుషులు ఉండరని నమ్మకం ఏముంది? ఏమిటో...తనకేం తోచటం లేదు...బుర్రంతా చీకాగ్గాఉంది. ముందు ఓ వారం సెలవుపెట్టి ఆ తర్వాత రాజీనామా కాగితం పంపిద్దాం అని నిశ్చయించుకుని, తన ఊరు వెళ్ళడానికి సిద్ధమయ్యే ఇప్పుడిలా బస్‌స్టాండ్‌కి వచ్చింది. ఇంకో అయిదు నిమిషాల్లో బస్ వస్తుంది.

శైలజ దృష్టి అంతా దూరంగా కూర్చున్న గౌరిమీదే ఉంది. నిజానికి తనలాంటి సమస్యే ఆ అమ్మాయిదీనూ? తన కాలేజీ క్లాస్‌మేట్స్‌కి, ఇప్పుడు ఆఫీసులో కొలీగ్స్‌కీ కొట్టు అబ్బాయిలకీ తేడా ఏం ఉంది? వీళ్ళంతా తోటి ఆడవాళ్ళని కళ్ళతో నంజుకొనే అనాగరికులే. మాటలతోనూ చేతలతోనూ హింసించాలని చూసే కరకు హృదయులే-ఇలాంటి వాతావరణం మధ్య ఆడదాని బ్రతుకు క్షణంక్షణందుర్భరమే.

కాని-ఈ వాతావరణాన్ని ఎదుర్కొని ధైర్యంగా ధీమాగా కూర్చుంది ఈ అమ్మాయి.

మరి తనో-అంతే—ఆ ఆలోచనతో శైలజ హఠాత్తుగా ఒక నిర్ణయానికి వచ్చి, బస్‌కి వెళ్ళకుండా వెనక్కి రూమ్‌కి వెళ్ళిపోయింది. మర్నాడు సెలవు కేన్సిల్ చేసుకుని ఆఫీసులోచేరి, కొత్త పద్ధతిలో సమస్యల్నీ, జీవితాన్నీ ఎదుర్కోవాలనే నిశ్చయంతో.

# బ్రతకవలసిన మనిషి

శ్రీమతి కె. రామలక్ష్మి

ఒక అసహజం అయినపని జరిగితే అదొక వింత? అసహజం వాస్తవంలో జరిగింది కనుక నమ్మక తప్పదు. వింత అయినా మామూలు విషయం లాగా చెప్పుకోకా తప్పదు. కాని అదేమిటో కొన్ని విషయాలు జరిగాయి అని చెప్పినా నాకు నమ్మబుద్ధికాదు. అలాంటప్పుడే ఆకాశంలో ఎగిరే నా వూహల రెక్కలు కత్తిరించి. కిందికి దింపుతూ వుంటుంది నా స్నేహితురాలు శాంత. లాయరు కావడంవల్లనో ఏమో వున్నది వున్నట్టు చూస్తూనే అదలా జరగడానికి ఏర్పడిన పరిస్థితులని వూహించుకో కల్గుతుంది. ఆశ్చర్యం ఏమిటి అంటే— ఆమె వూహలు చాలావరకూ నిజం అయికూర్చోడం!

మనుషుల మంచితనంలో, అమాయికత్వంలో నమ్మాలని వుంటుంది నాకు. 'ఈ నమ్మకం వమ్ము అయే పరిస్థితి ఏర్పడితే అప్పుడు చూద్దాం' అనుకుంటాను. కాని శాంత శుద్ధ న్యాయవాది... ఆ కళ్ళద్దాలు తీసి మామూలు కళ్ళతో చూడదు-ఏ సంఘటనా. ఆ రోజు సాయంత్రం సినిమాకని బయలుదేరి బీచిలో తేలాం. సెలవురోజు కాక పోడంవల్ల కాబోలు మరీ అంత రద్దీగాలేదు. నీళ్ళకి దగ్గిరగా తడిలేని చోటు చూసి కూర్చుని లోకాభి రామాయణంలో పడ్డాం. ఆ కబురూ యీ కబురూ చెప్తున్నా శాంత సడన్ బ్రేకు వేసినట్లు మాట్లాడం మానేసింది. అప్పుడే నేను తలెత్తి చూశాను. ఏమిటి? సంగతి అన్నట్టు. దూరంలో నీటిఒడ్డున నడుస్తూ వస్తున్నారిద్దరు. పద్దెనిమిదో ఇరవయ్యో వుంటాయి అమ్మాయికి. అబ్బాయి పాతికేళ్ళపైవాడు. 'చూశావా కొత్త దంపతులు కాబోలు' అంది నవ్వుతూ "చూస్తేనే తెలుస్తూంది" అన్నా నవ్వుతూ. అబ్బాయి చేతిలో అమ్మాయిచెయ్యి గువ్వపిట్టలాగా ఒదిగిపోయి వుంది. అంత సువిశాలమైన సముద్ర తీరాన యిరుకు సందులోపడి నడుస్తున్నట్లు ఒకరి నొకరు రాసుకుంటూ నడుస్తున్నారు. గాలికెగిరిన అమ్మాయి చీరకొంగు అబ్బాయి ముఖం కప్పుతోంది. వాళ్ళు ఈ లోకంలో లేనట్లు, చుట్టూ ఎవరూ లేనట్టు కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. అమ్మాయిజుట్టు చిందర వందరగా ఎగిరిపోతోంది. అబ్బాయి పాంటు మోకాళ్ళదాకా నీళ్ళలో తడిసింది. ఇదేం వాళ్ళు గమనిస్తున్నట్టు లేదు.

"ఇన్ని కబుర్లు ఎక్కడి నుంచి వస్తాయో? అయినా యిలా పబ్లికులో ప్రేమ ప్రదర్శనలు పట్నంలోనే ఎక్కువ" అన్నాను. దొరికిన గుల్లలతో తడి యిసుకలో పువ్వులు పేరుస్తూ.

"బహుశా యింట్లో ఏకాంతం దొరక్కపోవచ్చు" అంది శాంత.

"కొత్త దంపతులకి ఏకాంతం యివ్వని కొంపలు వుంటాయా?" ఆశ్చర్యంగా అడిగాను.

"నీకు మామూలు విషయాలన్నీ ఆశ్చర్యంగా కనపడతాయి, ఆశ్చర్య పడవలసినవి మామూలుగా కనబడతాయి. నీ బుర్ర కాస్త చెక్ చేయించాలి" అంది నవ్వుతూ.

"నువ్వు మరీను...కొత్తగా పెళ్ళి చేస్తే..."

"అది సరే. మధ్యతరగతి కుటుంబాలలో ఎంత మందికి నువ్వు చెప్పే ఏకాంతం లభిస్తుందని నీ ఉద్దేశ్యం? రెండు గదుల దివ్య భవంతులలో పదేసి మంది వుంటూ—..."

నేనేం మాటాడలేదు. కాస్త చీకటి పడుతోందేమో–జనం లేస్తున్నారు. సముద్రం నల్లని వల పరిచినట్టు వుంది. ఒకటి అరా నక్షత్రాలు మిణుకు మిణుకుమంటూ కళ్ళు తెరుస్తున్నాయి.

"నీకో కథ చెప్పనా?" అడిగింది శాంత.

"కథా!" ఆశ్చర్యంగా అడిగాను. ఎందుకంటే శాంత చెప్పేవి కథలు కావు. కేసులు. అవి జీవితంలో ఎవరికోతగిలిన ఎదురు దెబ్బలు. అవి విన్నప్పుడల్లా నా కళ్ళపొర కాస్త తొలగిపోయి – జీవితంలో యిలాంటి పరిస్థితులూ వుంటాయి, యివీ మనుషులకే జరుగుతాయి– అనుకుంటూ వుంటాను.

"కథ కాదనుకో. ఈరోజు డాక్టర్ కళ్యాణి పిలిస్తే వెళ్ళాను. అదే చెప్తాను" అంది.

కళ్యాణి గవర్నమెంటు డాక్టరు. అసలు డాక్టర్లకి ఒక్కొక్కప్పుడు హృదయం లేకుండా ప్రవర్తించే హక్కు వుంటుంది అనుకుంటాన్నేను. గవర్న

మెంటు డాక్టరుకి అయితే అసలు వుండకూడదు. వాళ్ల మనుషులని శరీరాల్లాగా శవాల్లాగాచూసేసి సర్టిఫై చేసేసి సంతకాలు పెట్టేసి వూరుకోవడమే పెద్దపని అనుకునేదాన్ని కళ్యాణిని కలుసుకునేదాకా. కాని కళ్యాణిని చూశాక ఈ బాపతు కేడరులోనూ కోపంతో మండి పడిపోయి. ఏం చెయ్యలేక పళ్ళు కొరుక్కునే వాళ్ళు వుంటూ వుంటారని గ్రహించాను. శాంత లాగే కళ్యాణి కూడా నాకు చాలా దగ్గిర అయింది. హత్యానేరాలూ అవీ పెర్రీమేసన్ కధల్లోలా అందంగా కుతూహలాన్ని రేకెత్తించేవిగా ఎలా వుండవో శాంత దగ్గిర తెలుసుకోడం మొదలు పెట్టిన నేను. హత్యల వెనుక అమానుషాల కథలు డాక్టర్ కళ్యాణి దగ్గిర తెలుసుకోడం ప్రారంభించాను. చచ్చినా చంపినా–దాని వెనుక గాయపడ్డ హృదయం తప్పక వుండి తీరుతుంది' అంటుంది కళ్యాణి. ''అవునవును. ఆత్మహత్య చేసుకున్నా నువ్వు కారణాలకి చూడాలి, హత్య అయితే మేం కారణాలకి చూడాలి' అని ఎప్పుడూ వేళాకోళం చేస్తూ వుంటుంది శాంత.

బాగా చీకటి పడిపోయింది. నేరేడు రంగు ఆకాశంలో నక్షత్రాలు ఏదో అదృశ్యహస్తం కుట్టిన చెమ్కీ బిళ్ళల్లాగా కన్పిస్తున్నాయి. ఎక్కడో సముద్రపు గర్భం దగ్గిర ఆకాశం నేల తాకేచోట ఉండి ఉండి ఒకటీ అరా మెరుస్తూంది, అలా మెరిసినప్పుడు సముద్రం వెండి రంగులో మెరిసి మళ్ళీ నల్లబడుతోంది. విశ్రమించని చేతులు కదుపుతున్నట్టు గీతలు గీతలుగా నురుగుల అంబులు దూరం నుంచి తీరానికి వచ్చి పడుతున్నాయి.

''ఆ దంపతులను చూస్తూంటే నాకి సంఘటన జ్ఞాపకంవచ్చింది'' అంది శాంత– మా మధ్య అలముకున్న నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

''చెప్పు. ఏదైనా విషాదాంతమా? వాళ్ళలాగే చాలాసుఖాంతమా?'' అడిగా.

''అది నువ్వు తేల్చు కోవాలి రచయితవి కనుక. జీవితం మీరు ఊహించేటట్టు యిలా రెండుకంపార్టు మెంటుల్లో యిమిడిపోతుందని నేను అనుకోను'' సర్దుకుని కూర్చుంటూ అంది శాంత.

''ప్రేమికులు కలుసుకుని పెళ్ళితో ముగిస్తే సుఖాంతం. ఆత్మహత్యతో

ముగిస్తే విషాదాంతం. ఒకరి కోసం ఒకరి త్యాగంతో ముగిస్తే తెలుగు సినిమా కథ—ఏదైతేనేం? స్త్రీజనాన్ని కంటతడి పెట్టించడానికి! చెప్పు!'' అన్నా—నేనూ యిసుకలో సర్దుకూర్చుంటూ.

''మధ్య, మధ్య అనుమానాలకోసం ఆపకుండా వినేయ్. ఒకేసారి చివర అడిగేద్దువుగాని'' అంటూ శాంత చెప్పడం ప్రారంభించింది. సముద్రపు హోరూ, శాంత గంభీరమైన కంఠస్వరం మినహా బీచిలో యింకే గొడవా వినపడ్డం మానేశాయి...

''కళ్యాణి అర్జెంటుగా రమ్మని ఫోను చేస్తే ఆస్పత్రికి వెళ్ళాను. అక్కడ ఓ పోలీసు అధికారి కూడా వున్నారు. నన్ను చూస్తూనే ఈమె ఎందుకు అని అధికారి అడగడం విన్నాను నన్ను నేను పరిచయంచేసుకున్నాను. 'ఒక వేళ యీమె బ్రతికితే ఆమె తరపున శాంతి కేసు తప్పకుండా చేపట్టుతుంది అదీ కాక చనిపోతున్న ఆమె కూడా కోరింది ఓ లాయరు కావాలని, అని కళ్యాణి వివరించింది. ఆలస్యం దేనికి పదండి' అంటూ లోపలికి దారితీసింది కళ్యాణి.

ఆస్పత్రిలో చుట్టూ చాలా గోలగానే వుంది. కాని ఈ గదిలో శ్మశాన నిశ్శబ్దం తాండవిస్తూంది. గదిలో మంచంమీద ఓ పీల శరీరం పడివుంది. ఆ శరీరంలో చైతన్యం కన్పించడం లేదు. కాని బ్రతికే వుంది. ముఖం బాగా ఉబ్బిపోయింది. జుట్టు అస్తవ్యస్తంగా ఎదిగివుంది. నాలో నేనే అనుకున్నాను తిరుపతి మొక్కు తీరాక పెరిగింది కాబోలు అని...నిర్లక్ష్యంగా వదిలేసిన కలువు జ్ఞప్తికి తెస్తూందా తల

''ఇనస్పెక్టర్, మీరు వాఙ్మూలం తీసుకోండి. శాంత పేషెంట్ తరపున వుంటుంది కావలిస్తే. మీ రామెని సాక్షిగా వాడుకోవచ్చు'' నంటూ నా ముఖం లోకి చూసింది కళ్యాణి. నేను తలూపి సరేనన్నాను.

''ఈమె వాళ్ళెవరూ లేరా?'' ఇనస్పెక్టరుగారు అడిగారు. మెళ్ళో పుసెల తాడు ఆయన కళ్ళ పడినట్టుంది!

''ఉన్నారు. అత్తగారి తరపు వాళ్ళు అమ్మగారి తరపు వాళ్ళు. ముఖ్యంగా భర్త, అంతా అవతల వున్నారు భర్తని పిలుద్దామా?

"నో. నో. ఆమెకిష్టంలేదు. వాళ్ళెవరున్నా ఆమె మాట్లాడనని చెప్పడం వల్ల-లాయరుని పిలిపించాం...తను విషం తాగానని చెప్పింది. గదిలో చీమ చిటుక్కు-మన్నా వినిపించేటంత నిశ్శబ్దం ఆవరించింది. మంచంమీద అమ్మాయి కాస్త వూపిరి కూడ కట్టుకుని కళ్యాణికేసి చూసింది.

'నువ్వు చెప్పదల్చుకున్నదంతా చెప్పు. నీకేం ఫరవాలేదు...' అంది ధైర్యం చెప్తూ కళ్యాణి-ఎక్కడో నూతిలోంచి వస్తూన్నటుంది ఆమె కంఠ స్వరం...

''మేంఅంతా కలిసి తిరపతి వెళ్ళాం ఆ రోజూ...'' "ఏరోజు, ఎవ రెవరు?" ఇనస్పెక్టరు ఆత్రంగా అడిగాడు.

'ప్లీజ్, మీరామెని అంతా చెప్పనియ్యండి. ఇలా ఎక్కడ కక్కడ ఆపితే-ఆమె తను చెప్పదల్చుకున్నది పూర్తి చేయలేకపోవచ్చు' అంది డాక్టర్.

"చాలాకాలం నుంచీ అనుకుంటున్నాం... అందుకని వెళ్ళాం...బావ... నేనంటే చాలా యిష్టం కాని—కాని మారిపోయాడు, మా అత్తయ్య కూడా మారిపోయింది...తిరుపతి వెళ్ళేదాకా అంతా ఆదీయిదీ మాట్లాడుతూనే వున్నారు. కాని ఎక్కడ మామూలు మాటలు దెబ్బలాటల్లోకి మారాయో నేను గ్రహించ లేదు..."

అడక్కుండానే కళ్యాణి గ్లూకోజు నీళ్ళు రెండు చెంచాలు ఆమె నోటిలో పోసింది. చిన్న తువ్వాలు పెట్టి ఆమె నుదుట పట్టిన చెమటలు తుడిచింది.

"నన్ను గురించి చాలా అసహ్యంగా నాన్నగారితో చెప్తున్నాడు బావ. నాకు చాలా కోపం వచ్చింది. ఇప్పుడే కాదు ఈమధ్య అస్తమానూ నన్ను కొట్టడం తిట్టడం చేస్తున్నాడు. నాకెందుకో అర్థం కాలేదు, కాని యిప్పుడీ మాటల్లో చూచాయిగా తెలిసింది-నన్ను అనుమానిస్తున్నాడని. పుట్టినప్పటి నుంచి తెలిసిన నన్ను అనుమానించడం దేనికి? నాకే ఆశ్చర్యం వేసింది... బస్సుదిగి సామాను దింపుతున్నారు. నాన్నగారికీ బావకీ మాటా మాటా పెరి గింది. ఇటు మామయ్య కూడా ఎగసన ద్రోయిడం ప్రారంభించాడు...ఏం జరుగుతోందో నాకు తెలిసేసరికి బావ నా బారెడు జెడ పట్టుకుని బరబర లాక్కెడుతున్నాడు కళ్యాణి కట్టకేసి. 'దీనికిదే శాస్తి. బుద్ధి వస్తుంది' అంటూ.

నేను విదిలించుకున్నాను, వదల్లేదు, రక్కి. బావ చెయ్యి కొరికి నాన్నగారి దగ్గిరకి పరుగెత్తాను. 'నాన్నా, నాన్నా, చూడండి నాన్నా' అంటూ వారి వెనుక దాక్కుని వెక్కి వెక్కి ఏడ్చాను. ఓ క్షణం. ఏమనుకున్నారో నాన్నగారు-తెలియలేదు. మరుక్షణం ఓ చేత్తో నన్ను పట్టుకొని బావ ముందుకి నడుస్తూ "వెధవా వేలెడులేవు నీకుందేం యింత హక్కు! నిన్నకాక మొన్న కట్టుకున్న వెధవ్వి నీకే ఇంత హక్కువుంటే పెంచి పెద్దచేసిన నాకెంత హక్కుందో చూపిస్తానురా-చూడు అంటూ నన్ను బరబర లాక్కెళ్ళడం మొదలుపెట్టారు. కళ్యాణకట్టకేసి. నా గుండెల్లో భయం రగిలింది. నాలో ఏదో చచ్చిపోయినట్ట యింది. కాని విదిలించుకున్నాను. అరిచాను. ఏడ్చాను. నాన్నగారు టిక్కట్టు కొని మంగలి ముందు కూలవేశారు, 'గొరగరా, గొరుగు!' అంటూ హూంకరించారు మంగలిని. పాపం. వాడు బెదిరిపోయాడు 'స్వామి, యిదేంపని!' అని మందలించాడుకూడా...కాని నాన్నగారు వాడిచేతిలో కత్తి లాక్కొని నాబారెడు జడ కోసిపారేయడమే కాదు-'అయిందా. చాలా' అంటూ యిష్టం వచ్చినట్టు పట్టులాంటి నా జుట్టు కోసిపాడేసారండీ...ఏడుపుతో కంఠం పూడుకుపోయింది. డాక్టర్ కళ్యాణి మెకానికల్‌గా గ్లూకోజ్ నీళ్ళు అందించింది. ఇనస్పెక్టరుగారి చేతిలో కలంకూడా మెకానికల్‌గా రాస్తున్నది. ఓక్షణం-ఆగింది...

""వికృతంగా చేసిన నన్ను బావ ముందు ఏడుస్తూ చూడరా. నువ్వేం దాన్ని కొన్నాననుకున్నావా? దానిమీద నీకెంత హక్కుందో నాకూ అంతకంటే ఎక్కువే వుందిరా! చూడు! చూడు!'' గట్టిగా అరుస్తున్నారు...నాకు చెవులు వినిపించడంలేదు. ఏదో హోరు! నాకు తెలివి వచ్చేసరికి సత్రంలో ఓ గదిలో వున్నాం. మా అత్తయ్యా. అమ్మా నా పక్కనే కూర్చుని వున్నారు. "పోనీలే తల్లీ జుట్టుతో పోయింది శని!' ఓదారుస్తున్నారు...రెండు చేతులా నా తల తడిమి చూసుకున్నాను...భోరున ఏడ్చాను...జుట్టు పోయినందు కేడుస్తున్నాననుకున్నారు వాళ్ళు. కాదండీ. నేనందుకేడవలేదు...నామీద ఈ రాక్షసుల కింత హక్కున్నందుకు ఏడ్చాను. ఆ రాత్రే అక్కడో కుర్రాడి చేత ఎలకలముందు తెప్పించి మింగాను...అవును. కన్నందుకు నాన్నకి, కట్టుకున్నందుకు మొగాడికి యీ శరీరంమీద అంతేసి హక్కులుంటే మోస్తున్న నాకు కూడా లేదా కాస్త హక్కు! యింత నీచంగా వీళ్ళపంచన బ్రతకడం

యిష్టంలేక నేను చచ్చిపోవాలనే మందుతిన్నాను. నన్ను బ్రతికించకండి. నేను బ్రతకను"...పొడారిన పెదవులు పల్చని నాలుకతో తడుపుకుంటూ అంది ఆమె.

అప్రయత్నంగా ఆమెకి నవ్వు వచ్చింది. "నన్ను వికృతంగా చేస్తే యిక నాకేసి ఎవరూ చూడరని బావ నమ్మకం. కాని నన్నిలా చూసి నందుకు నేనూ అతగాడిని చూడడానికి అసహ్యించుకుంటానని ఊహించలేకపోయాడు బావ. ఎటూ ఎక్కడికి పోలేను అని అతగాని ధైర్యం. కాని నేను గెలిచి తీరాలి...నేను గెలవాలంటే చచ్చి తీరాలి...అందుకేనండి నన్ను బ్రతికించొద్దు. నన్నా దరిద్రపు బ్రతుకులోకి తొయ్యొద్దు...' గట్టిగా అరవడం ప్రారంభించింది.

కళ్యాణి నర్సుకోసం బయటికి వెళ్ళింది. రెండు నిముషాల్లో... ఆక్సిజన్ అమర్చడం అయింది. "ఇంకా ఎంత సేపు?" ఇనస్పెక్టర్ గారి కంఠం కూడా యిప్పుడు నూతిలోంచి వస్తూంది. "ఫ్యూమినిట్స్" అంది నెమ్మదిగా కళ్యాణి. "ఇంకామె ఏం చెప్పక్కరలేదు. మేడమ్. యిక్కడ సంతకం చేస్తారా!" అంటూ కలం అందించారు అధికారి. నేను డాక్టరు సంతకాలు చేశాం...

గదిలో ఆమె తీస్తున్న కొన వూపిరి శబ్దం మినహా ఏం శబ్దంలేదు. అదీ నెమ్మదిగా ఉధృతం తగ్గుతూ వస్తూంది.

'మైగాడ్! వాట్ పీపుల్!' లేచి కిటికీదగ్గరకి వెడుతూ అనుకున్నారు.

నేను వెనక్కి తిరిగాను. 'నర్స్, ఆక్సిజన్ తీసెయ్. అనవసరం అంది కళ్యాణి.

అలాగే వెనక్కి తిరిగి మంచంకేసి చూశాను. తలవాల్చి నిద్రకొరిగి నట్టుందామె!

మేం యివతలికి వస్తుంటే ఆత్రంగా అడిగిన వాళ్ళని ముఖంలోకి చూడకుండానే 'వెళ్ళిచూడండి. త్వరగా బయిటికిరండి' అంది చాలా కటువుగా కళ్యాణి.

"ఆమె బ్రతికివుంటే బాగుండేది కళ్యాణీ. ఈ పెద్దలనో ఆటపట్టించే పని! అన్నాను. "సారీ శాంతా! నేను అదేఅనుకున్నా...వెళ్దామా!"అడిగింది.

నేనింకా మెట్టు దిగకుండానే-చుట్టాలు గొల్లు మనడం వినిపించింది. దానివెంటనే "కాంపౌండులో కూర్చుని ఏడవండి యింకా కాస్త పనివుంది. బాడీ యివ్వడానికి టైమ్‌పడుతుంది" అంటూ కళ్యాణి ఆఫీసు కేసి నడుస్తూ న్నట్టుంది-ఆమె జోళ్ళచప్పుడు దూరం అవుతోంది. చాలాసేపు కార్లోకూర్చు నా ని కారు స్టార్ట్ చేయలేకపోయాను అంటూ ఊరుకుంది శాంత.

నెను అలాగే శిలలాగా చీకట్లో కూర్చుండి పోయాను... 'ఇది జరిగిందా!' అనుకుంటూ! నేను మనస్సులో అనుకున్నాననన్నమాట పైకి అన్నట్టుంది "జరక్కపోతే. యీ కథ చెప్పేఛాన్సు లేదు కద...రాయిక బయలుదేరుదాం!" అంటూ లేచింది శాంత.

ఆ చీకట్లో సముద్రం ఏడుస్తూన్నట్టుంది.

"ఆ అమ్మాయి పేరు?" ఎందుకోతెలియదుఅడిగా.

"సుందరిట. అందుకే కాబోలు-వికారంగా చేస్తే సరిపోతుందనుకున్నాడు!" అంది తనూచూడని ఆ బావను ఉద్దేశించి.

"అయినా కన్నకూతురి కిలాంటి పాడుపని ఎలా చేశాడు ఆ తండ్రి?"

"కావేషాలు పెరిగినప్పుడు కక్షసాధించడానికి హక్కులు నిరూపించుకోడానికి- కన్నకూతుళ్ళనీ కట్టుకున్న పెళ్ళాలనీ లెక్కచేయరని-యిందలి నీతి. పద లేటైంది" అంది శాంత. ఆ చీకటిలో శాంత కళ్ళు నీటిపొర కమ్మి వున్నాయి.

నా కళ్ళు వర్షించి చెంపలు తడిసి పోయాయి. తెలుగు సినిమా చూసి ఏడ్చే నన్ను వేళాకోళం చేసే శాంత కూడా అంత బాధపడిందా సుందరిని చూసి అనిపించింది. 'కేసుకి నువ్వు కదలడం చూడ్డం యిదే మొదటిసారి!" అన్నా'

"ఏస్. ఎక్కడో ఓ మొదటిసారి వుంటుంది...కాని...ఆమె బ్రతకవలసిన పిల్ల! ఎంతో జీవితం చూడవలసిన పిల్ల! ఎంతో జీవితం చూడవలసిన ప్రాణి..." తనలో తనగా అనుకుంటూ రోడ్డుకేసి దారి తీసింది శాంత. నేనా దారిని అనుసరించాను. అప్పుడు చూశా. బీచ్‌లో జనమే లేరు!

# చీకటి రాజ్యం

"సుకాంచన"

ఆవేళ సంక్రాంతి పండుగ.

సంక్రాంతి పండుగ అంటేనే తెలుగువారికి కావలసినంత ఉత్సాహమూ, ఉత్తేజమూ కల్గుతాయి. విత్తు మంచిదైతే చవిటి పఱ్ఱలో పారేసినా చఱ్ఱున సాగి వస్తుందన్నట్లు పండుగ ఒక్కరోజైనా, పట్టెడు సొమ్ము కలవారింట్లో జరిగే సందడికి హద్దు ఉండదు. ఇక సంపన్నుల ఇంట్లో సంక్రాంతి పండుగ సామ్రాజ్యాన్ని గూర్చి ఏంచెప్పాలి?

ఆ గ్రామంలో కరణం సీతయ్యగారే సంపన్న గృహస్థు. పండుగకు వచ్చిన కూతుళ్ళతో, అల్లుళ్ళతో, మనుమ సంతానంతో సీతయ్యగారిల్లు కలకల లాడిపోతూ ఉన్నది.

పచ్చగా పసుపురాసి కుంకుమ బొట్లుపెట్టి సమ్మాలూ, పచ్చని మామిడి తోరణాలతో శోభను వెలారించే ద్వారబంధాలూ, క్రొత్తగాకొట్టిన గోపీచందనంతో ఘుమాయించి నిలబడిన ఇంటిగోడలూ, వచ్చేపోయే గ్రామనౌకర్లతో సందడిగా ఉన్న ముంగిలీ, పాతికమంది పిల్లాపెద్దల హడావిడితో కన్నుల పండువుగా ఉన్న లోపలి భవంతీ, కరణంగారి ఐశ్వర్యాన్ని, వైభవాన్నీ చెప్పక చెప్తూ ఉన్నాయి. దోసకాయలు దొఱికితే విందుకు లోటులేదన్నట్లూ, దోర ముగ్గిన జామపండ్లు ఉంటే జిమ్మకు చేదులేదన్నట్లూ అసలైన అధికారం చేతిలో పట్టుకొన్న కరణంగారి కా చుట్టుప్రక్కల అలవికానిదంటూ లేదు. కలెక్టరుగారి ఫర్మానాకైనా తిరుగుండవచ్చు కానీ, కరణంగారి కంటి రేఖలకు వ్యతిరేకంగా జరిగేదంటూ ఆ పరగణాలో ఏమీ ఉండదు.

పార్వతీదేవి వలె కుంకుమ ధరించి సౌభాగ్యరేఖలు ప్రసరించే కను దమ్మితో, నోరు మెదపకుండానే అన్ని పనులూ అజమాయిషీచేస్తూ నడయాడే మంగళదేవతలాగ, ఇంట్లో సందడిగా తిరుగుతూ ఉన్నది కరణంగారి ఇల్లాలు రాధమ్మ.

ప్రొద్దు నెత్తిమీదికి వచ్చింది. గ్రామ చావిడిదగ్గఱ పనివాళ్ళకు పండగ గింజలు కొలిచి, వెట్టివాళ్ళచేత తమలపాకులూ, అరటాకులూ, చక్కెరకేళీ గెలలూ పట్టించుకొని సీతయ్యకరణం అప్పుడే ఇంటికివచ్చి, "రాధాదేవీ, అవన్నీ

ఇంట్లో పెట్టించు, ఎంత తొందరపడినా, ప్రొద్దు మారనే మారింది. అల్లుళ్ళంతా ఇంట్లో ఉన్నారుగా, ఇక నాదేం ఆలశ్యం లేదు. త్వరగా వడ్డనలు కానియ్యి. పెద్దబ్బాయి సుందరం ఎక్కడ? అందరినీ భోజనాలకు పిలవమంటూ" గబ గబా గుక్క త్రిప్పకోకుండా భార్యకు చెప్పి కండువా వంకెన వేసి పట్టు తాపితా చేతికి తీసికొన్నాడు సీతయ్యగారు.

"అట్లాగే, వడ్డనఎంత సేపూ! అబ్బాయి ఇంట్లోనే ఉన్నాడు, పిలుస్తాను." అంటూ భర్తకు కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళిచ్చి తువ్వాలు అక్కడ పెట్టి లోపలకు వెళ్ళింది రాధమ్మ.

వడ్డనలైనాయి. బొబ్బట్లూ, పులిహోరా, బజ్జీ, క్షీరాన్నం, గుత్తివం కాయకూరా, బంగాళా దుంపవేపుడూ, దోసకాయపప్పు, నాలుగురకాల పచ్చళ్ళూ, వెజిటబుల్ పలావు, ఒకటి రెండు పండ్లదినుసులూ, ఏమిటేమిటో నవకాయ పిండి వంటలతో ఉప్పుతో తొమ్మిదీ, పప్పుతో పదీ అన్నట్లు, విస్తరి చుట్టూరా వడ్డించి పిలిచింది రాధమ్మ.

అల్లుళ్ళూ, కొడుకులూ మనుమ సంతానం అంతా ఒక యాభై మంది ముండువా హాల్లో భోజనానికి కూర్చున్నారు. పరిహాసాలతో, పత్రికా విశేషాలతో విరుస్తూన్న అప్పడాల చప్పుళ్ళతో, కాలక్షేపం కబుర్లతో హాలంతా ప్రతిధ్వనించి పోతున్నది. అప్పుడే కాచిన కమ్మని నెయ్యి ఘుమ ఘుమలాడ్తూ ఉండే, నేతి చెంబు చేతపట్టుకొని రాధమ్మ హాలులోకి ప్రవేశించింది.

'పోస్టు' అని కేకవేస్తూ పోస్టు బంట్రోతు ముండల చావిడిలో వచ్చి నిలువబడ్డాడు. "అప్పుడే పోస్టేమిటి, ఏదైనా అర్జంటు ఉత్తరం వచ్చిందేమో. అమ్మాయి! అరుంధతీ, ఆ పోస్టు తీసికో" అని రాధమ్మ పెద్దకోడలిని కేక వేసి చెప్పింది.

ఇంతలో క్రొత్తగా ఆయేడే పెండ్లయిన నాలుగో అల్లుడు రాజగోపాల్ "నేను తీసికొంటాలెండి" అంటూ చివ్వున లేచి, పోస్టు జవాను దగ్గల నుండి కవరు తీసికొని "ఇది సుందరం బావగారికి ఎక్స్‌ప్రెసు డెలివరీ కవరు! పండుగ గ్రీటింగ్సుకాబోలు, ఏ సుందరి దగ్గఱనుండో" అన్నాడు రాజగోపాల్.

ఆ మాటకు సుందరం గతుక్కుమని, తెప్పిరిల్లుకొని "ఆఁ, రాజగోపాల

చక్రవర్తుల మటయ్యా మేము? అయినా ఏ గోపికామణి గోపాల చక్రవర్తికి సిఫార్సు చెయ్యమని నాకు అప్లికేషను పెట్టుకొన్నదో లెండి? చింపండి బావ గారూ, చూస్తారే. "అన్నాడు, ఆకు దగ్గఅనుండి లేవకుండానే.

కవరు చింపి ఆ కవరులోనుండి. 50, 60 రూ॥ల మందులు, ఇంజెక్షన్ల బిల్లుతీసి, "ఏమండోయి బావగారు. తెనాలినుండీ వచ్చిన మందుల బిల్లులండీ. వాడి ఆరాటం పాడుగాను? పండుగ నాడు చేరేట్టు పంపాడే," అని మందుల పేర్లన్నీ ఏకరువు పెట్టాడు రాజగోపాల్?

సుందరం ముఖం కత్తివాటుకు నెత్తురు చుక్క లేకుండా పోయింది. రాధమ్మ ముఖం బాధతో వివర్ణమై పోయింది. అరుంధతి వంచిన తలయెత్త లేక కన్నీటి చాలు గోటితో నేర్పుగా మీటుకుంటూ చరాలున లోపలికి దూసుకు పోయింది.

"ఏంబావా, చాలా మందులు వాడావే, ఇంకేం శృంగారం కట్టలు। తెంచు కొన్నదన్నమాట. ప్రౌఢ సుందరుడవే?" అన్నాడు మేనత్త కొడుకు ప్రసాదు.

అల్లుళ్ళెవరూ నోరెత్తలేక ఒకళ్ళ మొగాలు ఒకళ్ళు చూచుకొంటూ కంటి సంజ్ఞలతో కబుర్లందించుకొంటూ ఉండిపోయారు,

ఇదేమీ అర్థంకాక, పిల్లలంతా, నోళ్ళు తెరుచుకొని బొమ్మల్లా ఉండి పోయారు. సీతయ్య ఉగ్రుడయిపోయాడు."ఛీ, సిగ్గులేక పోతేసరి ఖర్మకు, రోడ్డు మీదపందీ బ్రతుకుతూంది? నీవూ బ్రతుకుతున్నావు. చెట్టులాగా ఎదిగావు. ఏంలాభం, మచ్చలు మఱిన్ని అయినా, మంగళ వాద్యాలకు తక్కువ ఉండ కూడదురా..." అని ఇంకాఏదో అనబోతూంటే అడుగుపిడుగై అంతా కాల్చేసిన ఈ వ్యవహారాన్ని ఎట్లా జేబులో వేసికోవాలో అర్థం కాక తికమక పడ్తూన్న సుందరం, ఏదో ఆలోచన మెఱుపులా మెఱసి, తేరుకొని, "ఆగండి నాన్నగారూ, ఇవి నా కోసం తీసి కొన్నవి కాదు. మొన్న చెల్లాయి మను గుడుపుల్లో తెనాలి బాబాయి కోడలు రాజ్యం నా చేత తెప్పించుకొన్న మందులు? అన్నయ్యకు తెలియకుండా డబ్బులు పంపాలి మఱి, కొంచం ఆలస్యం అవుతుందేమో మఱి? కొట్టు వాళ్ళను తొందర పడవద్దని చెప్పుబాబూ, ఈమారు నీవు తెనాలి వచ్చినప్పుడు ఇచ్చేస్తానంటే, వాళ్ళకు చెప్పి వచ్చేళా," అన్నాడు, సుందరం.

"ఇంకేం, ఆ బిల్లు వాళ్ళు నీకు పంపారన్లే ఉంది. బాగానే ఉన్నది నాటకం. ఇంకేం మంచి రక్తికట్టించావు"! అన్నాడు ప్రసాదు.

సుందరం మాటలు ఉప్పచప్పగా ఉండి, తేలిపోతూన్నా ఆ ఉడుకులో ఆ బోలుమోత నెవరూ పసిగట్టలేదు సరికదా ఆ దెబ్బతో ఆ రసాభాస తప్పడమే కాదు! కథ అమాంతం అడ్డదోవ పట్టేసింది.

"ఆ, ఏమిటన్నావ్! రాజ్యం నీచేత ఈ మందులు తెప్పించుకొని ఇంత నాటకం ఆడిందా! ఔను లే ఎం. ఏ. చదివి లెక్చరరు వెలగ బెట్టే ఘటానికి ఆ మాత్రం ఉపాయాలు తెలియకపోతే ఇక ఆ చదువు ఫలిత మేమిటిలే! మంచి పనే జరిగింది. వాడికంతేకావాలి. ఇంతకూ దాన్ననేదేమున్నది. చక్రాయి గాడిననాలి. వాడి తలకెక్కినపొగరు ఇదంతా. అది ఈదెబ్బతో అణిచిపారేస్తా" అన్నాడు సీతయ్య. ఎంత జాణ రాజ్యం అనీ. ఈ కాలపు చదువుల ఫలిత మింతేలే అనీ, ఈపాడు చదువులొచ్చాయి ఆడవాళ్ళు అన్నింట్లో మతీ బరి తెగిపోతూ ఉన్నారు అనీ, తలా ఒక మాట మహిళల మీదా, మహిళా సంఘాల మీదా, మహిళావిద్య మీదా ఉన్న అక్కసునంతా క్రక్కేశారు ప్రబుద్ధులంతా.

సుందరం కూడా అంతతో ఊరుకోకుండా, రాజ్యంప్రేమకలాపాలను గూర్చి ఓహ్ చిలవలుగా చిత్రించి శ్రోతల మెప్పు పొందేస్తున్నాడు,

పండుగ ఉల్లాసం ఈ ఉబుసుపోకతో రెట్టింపై ఒక్కసారి మళ్ళీ తారస్థాయినందుకొన్నది.

"ఏమిట్రా సుందరం! అది మరీ అంత విచ్చలవిడా! ఎప్పుడూ చెప్పావు కాదే అయితే. ఆ చక్రాయిగాడిని ఒక ఊపు ఊపచ్చు నన్నమాట! మహా మిడిసి పడుతున్నాడులే తనకుటుంబంలో అంతా చదువూ సభ్యతా కలవాళ్ళనీ, తన కుటుంబమంత సంస్కృతిగల గల కుటుంబం ఈ భూప్రపంచంలోనే లేదనీ. భాగ్యమంటె తనదేననీ, మొన్న ఊరికే పనస వల్లిం చేస్తూ ఉన్నాడు. చిక్కింది లే పిట్ట! ఈ దెబ్బతో నసాలం అంటాలి", "అవు నండీ నాన్నగారూ, రాజ్యానికి క్రిందభూమీ, పైన ఆకాశం కనబడ్డం లేదంటే నిజమను కోండి. ఆ చక్రధరరావు బాబాయి కామె ముద్దుల కోడలు. బాగా

పాడుతుందనీ, బాగా లెక్క లేస్తుందనీ, ఏదో మురిసిపోతాడు. ఆవిడగారు భూమ్మీద నడిస్తే కందిపోతుందని నెత్తిన పెట్టుకొంటాడు; మామగారి మన్నన చూచుకొని ఆవిడకు మరీ గిజ్జ ఎక్కువైపోతూన్నది" అజ్యం పోశాడు సుందరం.

"ఈవరస చూస్తే, అసలు ఆ మామగారితోనే తగలడు తూన్నదేమోరా అది; ఏమంటావురా?" ఆలోచనలను తాడుగా పేనుతూ కొరడా తయారు చేసికొంటూ చిన్నదగ్గ దగ్గి చిటికెలు వేశాడు సీతయ్య.

"నాకూ అదే అనుమానం' గుగ్గిలం ధూపం వేశాడు సుందరం.'

ఈ వరస రసపిచ్చిలోకి పోయేటట్లు గ్రహించి రాధమ్మ "ఇక చాల్లెండి మీమేళం. దానికి పీడొక ప్రక్కతాళం. బాగానే దొరికారు అబ్బా కొడుకూ; పనేమున్నదీ, ఎప్పుడూ, ఎల్లి మీద పిల్లీ, పిల్లి మీద ఎల్లి" ప్రస్తావన త్రుంచి వెయ్యడానికి ప్రయత్నించింది.

"ఊ, ఇంకా చదువు పనస ఊరుకొన్నావే, అగ్గి మీద గుగ్గిలం, గుగ్గిలం మీద అగ్గి" రుసరుస లాడాడు సీతయ్య.

ఆరాత్రి అరుంధతి "ఎందుకండీ అంత పాపానికి ఒడికట్టారు. పాపం రాజ్యం మీకేం అపకారం చేసింది. అది మీ పాపానికి ఆహుతి కాలేదని మీ మీద పడిన అభాండాన్ని అమాయకురాలి నెత్తిన వేశారు. అది చాలా శీలవతి. మీరు ఏదో ఆ సమయానికి మీ పాపం నల్గురి ఎదుటా బట్టబయలు కాకుండా కాపాడు కోవడానికి ఆ అమాయకురాలిమీద పులిమారు" అని భర్తకు హితోపదేశం చెయ్యబోయింది.

"ఏమిటి ఇప్పుడు మొదలుపెట్టావ్ భాగవతం" అని చిర చిరలాడాడు సుందరం.

"మీరు చిర చిరలాడినా, విర విర లాడినా నేనీ విషయంలో కళ్ళు మూసికొని ఊరుకోను. ఇది ఇంతతో పోయేటట్లు లేదు, మీ నాన్నగారు తాచు పాము. పంతంపడితే ఎదుటి వాళ్ళను మసి చేసి పారేస్తారు. రాజుకొంటున్న ఈ కార్చిచ్చును ఇప్పుడే ఆర్పేయండి. లేకపోతే కొంపలంటుకు పోతాయి."

"ఆ ఊరికే నీడలు చూసి భయపడతావు; ఆ మాటకొస్తే బాబాయి

కేం పొగరు, మొన్న నలుగురిలో పట్టుకొని నన్నూ, నాన్నగారినీ దులిపేశాడు. ఇప్పుడు ఏ రాజకీయ నాయకుడు మడికట్టుకొని కూర్చున్నాడు. మనం పచ్చగా ఉన్నామనేగా, ఆ ఓర్చలేకపోవడం. చేతనైతే తనుకూడా సంపాదించుకొనమను. చేతులు కట్టుకొని కూర్చొని ఒకళ్ళ నాడిపోసుకోవడం మగతనమా...పిన్నినిబట్టుకొని కూడా చాలా చాలా..."

'ఏ పిన్నండీ, మీ నాన్నగారి విలాసవతేనా? ఆమెను పిన్ని అనడానికి మీకు నోరెలా వచ్చింది. అధికారం చేతిలో ఉన్నది కదా అని మీ నాన్నగారు చెయ్యని అఘాయిత్యం ఏమున్నది? జాయింటు మేనేజిమెంటు చేతిలో పెట్టుకొని మీ బాబాయిని ఎన్ని చెఱువుల నీళ్ళు త్రాగిస్తున్నారు. ఆ విలాసవతి భర్తను గంగపాలుచేసి ఎంత పరాభవించారు! పదిమంది పిల్లల తండ్రికి మీనాన్నగారికీ బుద్ధిలేదు. నలుగురి పిల్లల తండ్రికి మీకూ బుద్ధిలేదు, కండ్లకావరం తగ్గడం లేదు. చేతిలో కానీ ఆడక, ఆ పిల్లలగోడు భరించ లేక మీబాబాయి ఏ మన్నా అంటే..."

"చాల్లే ఇక ఆపు ఊక దంపు. గుక్క త్రిప్పకోకుండా ఉపన్యాసం ఇస్తున్నావు."

"అవున్లెండి, అట్లాఅనక ఇంకెట్లా అంటారు మీరు. చిన్న పిల్ల శీలవతి. దాని ఉసురు మీకు తగలక ముందే తప్పుకోండి. కామాంధకారాన్న కళ్ళకు పొరలుగమ్మి నానా అగచాట్లూ పడి ఇప్పటికి ఇంకా తేరుకోలేదు. చెప్తున్నా, ఇది మంచి పని కాదు. మీ నాన్నగారికి ఈ విషయం రహస్యంగా చెప్పేయ్యండి. లేకపోతే ఆయన చాలా దూరం వెళ్ళేట్లున్నారు."

"నీవు ఊరుకుందూ. వేణ్ణీళ్ళకు తాటాకులు కాలవులే. వాళ్ళు ఏంపని వాళ్ళుకారులే."

"లేకపోతే మీ తండ్రి కొడుకులతో పడలేక ఎప్పుడో దేశాంతరాలు పట్టి పోదురు"

"పోనీ, పీడా విరగడై పోతుంది. ఎందుకీ శ్రీరంగ నీతులు. భగవంతుడు బుద్ధినిచ్చింది సంపాదనకీ, సంపదనిచ్చింది అనుభవించడానిక్కాక, వాజమ్మలాగా రుద్రాక్ష మాలలు తిప్పకొంటూ కూర్చోవడానిక్కాదు."

"ఇదేదో సర్వ నాశనానికి వచ్చినట్లుంది. ఎన్ని చెప్పినా మీరు వినడం లేదు. నాకు భయంగా ఉన్నది. అత్తయ్య కూడా ఈ పాపం ఎటుపోయి ఏం కొంపలు తగుల బెడుతుందోనని భయపడ్తున్నారు."

"ఉహూ! ఇంకేం, ఇందులో కూడా, అత్తాకోడళ్ళు ఏకమయ్యారన్నమాట. ఇందులో ఏం పాపంలేదు. నీవు ఊరుకో. ఆడవాళ్ళకు రాజనీతి ఏమి తెలుస్తుంది. సామాన్య జనానికి సామాన్య నీతికానీ, ప్రభువులకు ప్రభునీతి వేరుగా ఉంటుంది. మా నాన్న సామాన్యుడు కాడు. ఆయన ఊహలకి కలక్టర్లే హడిలి పోతారు. మొన్న వెంట్రుక వాసిలో తప్పిపోయింది కానీ, లేకపోతే ఈపాటికి ఎం. ఎల్. ఏ. అయి ఈ పాటికి ముఖ్య మంత్రి అయి ఉండే వాడు."

"అవునవును, ముఖ్య మంత్రేం ఖర్మ, ప్రధాన మంత్రే అయిపోయేవాడు. ఏదో భగవంతుడది తప్పించ బట్టి ఇంట్లో ఈ మాత్రమైనా ఉంటూఉన్నారు. లేకపోతేనా......" ఆవేశంతో పళ్ళు బిగపట్టి ఇక మాట్లాడలేక పోయింది అరుంధతి.

"ఏం, ఊరుకొన్నావేం. నీవు పతివ్రతవేగా. అందఅనూ తలదన్నిన ధర్మంనీది. మమ్మల్ని శపించి పారెయ్యి, ధర్మం రక్షింపబడుతుంది." వికటాట్టహాసం చేశాడు, సుందరం.

"ఎందుకట్లా భయంకరంగా నవ్వుతారు. మీ రన్నంత పనీ చేద్దునుకానీ మీరు నా దేవుడైపోయారు. నామాట వినండి. మీ పన్నాగం పాముల పుట్ట. అయ్యో అందులో నుంచీ లేచిన పాములు నా మనస్సులో పడగలు విప్పి బుసలు కొట్తూ ఉన్నాయి. అవి నన్నూ మిమ్మల్నీ కాటందుకోనిదే ఊరుకోవనిపిస్తుంది. మీరు నా దేవుడు. మీకు ఏ అపాయం కల్గినా నేను సహించలేను. ఆ ఆవేదనతో ఇంత దూరం చెప్తున్నా. ఇంటి విషయాల్లో రాజనీతికి స్థానం లేదు. మీకూటనీతికి ఒక అమాయకు రాలి జీవితం బలికాకూడదు." అని రోదిస్తూ అరుంధతి భర్త కాళ్ళకు చుట్టేసుకొని బ్రతిమిలాడ సాగింది.

"అరూ, ఏమిటీ నీ పిచ్చి ఊహలూ నీవూనూ, అప్పుడే ఏం పుట్టి మునిగి పోయిందని నీగోల? ఏమీలేదు. నీవూరుకో. ఏదో నేను మంత్రించిన నాగు కట్టుదప్పి నాకేఎదురు తిరిగిందని ఆ సమయానికి నన్ను కాటెయ్యకుండా

ఏమీతోచక రాజ్యం మీదకు విసిరేశా. అంతే ఇంకేమీలేదు. పిచ్చిపిల్లా ఏమిటా ఏడుపు: లే, కళ్ళుతుడుచుకో అంత చింత పడతావేం.'' అంటూ అరుంధతిని తలనిమిరి, లేవదీసి గుండెలకు హత్తుకొన్నాడు సుందరం.

తెల్లవారిందో లేదో, ఏవో అర్జంటు పనులున్నాయంటూ, అబ్బాకొడుకూ ఆ ఊరూ ఈ ఊరూ వెళ్ళిపోయారు.

''అమ్మాయి, దమయంతీ కులాసా. చూడమ్మా కాసిని మంచినీళ్ళియ్యి. ఇట్టారా, కాస్సేపు సావధానంగా నా మాటవిను...చూడు! ఈ బిల్లులన్నీ చూడు. చూచి మరీ ఈ మాట మాట్లాడమ్మా. ఆ చక్రిగాడూ, ఆ రాజ్యం ఎంత గొప్పవారో నీకు తెలుస్తుంది. ఊరికే మీరంతా ఎప్పుడూ నన్ను అడి పోసుకోవడమేగా, మీకళ్ళ పొరలు తీసెయ్యడానికి ఈమాటు తగిన సాక్ష్యాధారాలతో వచ్చానమ్మా.'' అంటూ సీతయ్య తన చెల్లెలి దగ్గర మంత్రగాడు, తేళ్ళూ, జెర్రిలూ తీసినట్లు, జేబులో నుండి ఆ బిల్లులన్నీ తీసి చూపి, రాజ్యం శీలవతికాదని, అలవలు సలవలు అల్లి కథ రక్తి కట్టించాడు.

''ఏమోనన్నయ్యా, చక్రధరరావన్నయ్య కుటుంబంలో ఇంతపని జరిగిం దంటే నమ్మశక్యం కాకుండా ఉన్నది. పోనీ అది మంచిది కాదే అనుకో, సుందరం చేత మందులు తెప్పించుకోవలసిన అవసరమేమొచ్చింది దానికి? ఈ పాపమంతా సుందరానిదేమో.''

''అంతేలే మీరెందుకు నమ్ముతారు, అభంశుభం ఎఱుగని సుందరానికేం గతి పట్టింది ఇవన్నీ తీసికోవడానికి!''

''అంతే లే అన్నయ్యా ఏ పుట్టలో ఏ పామున్నదో ఎవరికెఱుకలే.''

* * *

''పరంధామయ్య బాబాయి. విన్నావా! ఈ విషయం.''

''ఏ విషయం సుందరం''

''అదే మన చక్రధరరావు బాబాయి కోడలు రాజ్యం లేదూ, ఎంత నాటకం ఆడిందనుకొన్నావ్. నిజమేనంటావురా! వేనూవిన్నా,'' ''కానీనమ్మలేక పోయాన్రా. రాజ్యం చాలా మంచి పిల్ల. అల్లాంటి పని చేస్తుందనుకోను అది చాలామంచి పిల్ల.''

"అవున్లేబాబాయి, మీరెందుకు నమ్ముతారు. మేము చదువూ, గిదువూలేని శంతలం. అందుకని వాళ్ళబుట్టలో పడిపోయాం. లేకపోతే తను తప్పించుకొని తర్వాత డబ్బులు పంపుతానని పంపకపోవడంలో రహస్య మేమంటావు? అది నా నెత్తినన్రతోసి, నన్ను నా సంసారాన్నీ నాశనంచెయ్యాలని కదూ, అది అంత ప్లాను వేసింది. కానీ అంత అన్యాయానికి భగవంతుడోర్వలేక పోయాడు. త్వరలోనే అంతా బట్టబయలు చేశాడు. ఇంకేం చేస్తుందో చూస్తా!"

"అయితే నిజమే నంటావుర్రా. అబ్బా, ఎంత నంగనాచి."

"వస్తా బాబాయి, పిన్నేదీ, పిన్నికూ్కడాచెప్పు, ఏమైనా మీరింక అక్కడకు రాకపోకలు తగ్గించడం మంచిదంటూ" సుందరం వెళ్ళిపోయాడు.

"జగదాంబా, విన్నావా, ఈవేళ పరంధామయ్య, ఎంతమాట అన్నాడో."

"అవునండీ విన్నాను. నాకూ్కడా చెప్పాడు. అది విన్నప్పటినుంచీ, ఒంటినిండా, తేళ్ళూ, జెఱ్ఱులూ ప్రాకుతున్నట్లున్నది. తలతిరిగి పోతూంది. ఆఖరుకి బావగారి పగ ఇంత దారుణరూపం ధరించి విషం కక్కుతుందని నే ననుకోలేదు."

"నేనూ అనుకోలేదు. ఈర్ష్య మానవుణ్ణి దానవుడిగా మార్చింవన్నమాట."

'నాకు మన భవిష్యత్తునిగూర్చి చాలాభయంగా ఉన్నదండీ, మన జగన్ వింటే, ఇంకేమైనా ఉన్నదా, ఒక్కమాటు సముద్రం నిఱుమకు పడ్డట్లే."

"హుష్, ఇంక ఊరుకో. అదుగో జగన్ రానే వచ్చాడు."

"అమ్మా ఏదీ అపిశాచి! నీకోడలు. మంచిదిమంచి పనీ, ఎం.ఏ.ప్యాసైనా, ఈ కాలపు పిచ్చివేషాలు లేవనీ, తెగ సంబర పడుతూంటివే."

"శివరాత్రికి వాళ్ళవాళ్ళతో శ్రీశైలానికివెళ్ళాలని వాళ్ళపుట్టింటికి వెళ్తానని అడిగితే వెళ్ళ మన్నావుగా ఇంతకు ముందే వెళ్ళింది."

"వెళ్ళింది, కానీ, ఎక్కడకు పోతుందిలే, నేనువెళ్ళి దీని అంతు తేలుస్తాను."

"ఏమిట్రా జగన్! ఆ గావుకేకలు. ఆదేం చేసిందని", చక్రధరరావు

మందలించాడు.

"ఏంచెయ్యాలింకా, సర్వనాశనం చేసింది. ఇప్పటికి చేసింది చాలదూ. అది ఇంక శాశ్వతంగా పుట్టింట్లో పడి, పాపంపండి, కుళ్ళి కుసమారి పోవాల్సిందే, ఈవేళే వ్రాస్తా, ఇంక ఈ గడప త్రొక్కవద్దని."

"జగన్, ఈవ్యవహారం చాలాముదిరింది. ఆవేశం తగ్గించుకొని కొంచం నిజానిజాలు ఆలోచించు. ఎంత ఆలోచించినా, రాజ్యం నడవడిలో నాకు పొరపాటు కనిపించడం లేదు. అదంతా ఆ పెద్దాయనా, సుందరం కలసి పన్నిన పన్నాగం. తొందరపడి కొంపకు చిచ్చుపెట్టకు. నిజం నిలకడమీద తెలుస్తుంది. రాజ్యంవిషయంలో నీవు ఇలాంటి పిచ్చిపిచ్చి నిర్ణయాలు చేసికొని అమలుపరిస్తే నే నూరుకోను."

"ఏమిటీ, నావి పిచ్చి ఆలోచనలు, అమలుపరిస్తే మీరు ఊఱుకోరా. ఊఱుకోవడానికి, ఊరుకోక పోవడానికీ ముందు మీ రెవరు? రాజ్యం నాభార్య. రాజ్యం విషయంలో నిర్ణయాలు తీసికోవడానికి మీకు గల హక్కు ఏమిటి? ఇదంతా చూస్తే, దీనికి మూలకారణం......"

"ఛీ ఛండాలుడా, ఎంత దారుణానికి సాహసించావ్..."

తల్లి ఏదో చెప్పబోతే, వినిపించుకోకుండా, జగన్మోహనరావు ఉద్రేకంతో ఊగిపోతూ గిఱుక్కున తిరిగి వెళ్ళిపోయాడు.

సీతయ్య., సుందరం, ఊరు ఊగం అంతటా చల్లిన నిప్పు రవ్వలు గాలీకంపా తోడై రగిలి రాజుకొని జగన్ మనస్సులో దావానలం దరికొల్పాయి. ఆ దావానలం అతన్ని నిలువునా దహించేస్తూ ఉంది. ఒక్క నిముషం నిలువబడలేక పోతూఉన్నాడు. ఒక నిమిషం కూర్చోలేక పోతూ ఉన్నాడు. శరీరం సెగలు పొగలు కక్కుతూంది. ఆకాశం. భూమి నోరు తెఱచుకొని మింగడానికి మీదపడే పెనుభూతంలాగ కనబడుతున్నాయి. ఏ ఆలోచనా మనస్సులో నిలదొక్కుకోవడం లేదు, రాజ్యం శీలాన్ని గూర్చిన దుష్టభావన ఒక్కటే బ్రహ్మాండమంత రూపందాల్చి మనస్సంతా ఆక్రమించి మెదడ్డికొరికి వేస్తూంది. నా రాజ్యం ఇంతపనిచేస్తుందా? తనకి నేనేం ఆపకారం చేశాను. నాకలోకంతెచ్చి కౌగిలిలో చూపావే. నందనవనం తెచ్చి తన అందానికి కానుకలిచ్చానే. కుటుంబంలోని ఆర్థిక బాధలను లక్ష్యపెట్టకుండా, పెదవి మీద దోబూచులాడే తన

మందహాసానికి సుందరాకృతులు మలచానే, వలపు దోసిళ్ళతోబట్టి తన చరణ రాజీవాలకు పారాణిగాచేసి అర్చనచేశానే! రాజ్యం! నా రాజ్యం. కాదుకాదు,రాక్షసి, రాక్షసీ, నీవెంత ఘాతకురాలవు! తెలుసుకోలేక పోయాను. ఓసీ పాతకీ, ఉండు నీపని పట్టిస్తా. ఆరునూరైనా, అడుగు మడుగైనా ఇక ఊరుకొనేది లేదు. ఆలువాలై అదిరిపడి కుత్తుకలు కత్తిచిరిండానికి మీదకు దూకుతూంటే, మెడ వంచి ఊరుకునేటంతా అసమర్థుణ్ణి కాదు. హతభాగ్యురాలా నేటితో నీ పనిసరి.'' ఉన్మాదునిలా ప్రలాపిస్తూ మెలికలు తిరిగిపోతూ ఉన్నాడు జగన్. కాలేజీకి ఎలా వెళ్ళాడో తెలియదు. ఏంచేశాడో తెలియదు. స్టాఫ్‌రూమ్‌లో తలపట్టు కొని కూర్చున్నంతసేపూ కూర్చున్నాడు. అమాంతం లేచి ఒక్కమాఱు జుట్టు పీక్కొని, బుసలుకొట్టూ చంద్రనిప్పులాంటి కళ్ళతో ఎదుటివార్ని మింగేట్టు చూడ్డం మొదలుపెట్టాడు, ఊపిరందక రోజుతూ, రొప్పుతూ రెండు పిడికిళ్ళూ బిగించి గాలితో కుస్తీలుపడ్తూ పెద్దపెద్ద అంగంపంగలతో దురుసుగా పచార్లు చెయ్యసాగాడు. దెయ్యం పట్టినట్లు నానా హంగామా చేస్తూన్నా జగన్నిచూచి తక్కిన లెక్చర్లంతా ఖంగారు పడిపోయి ''ఏమిటోయ్ జగన్, ఎప్పుడూ, ఉత్సాహంతో ఉరకలువేసే వాడవు. ఈవేళ నిప్పులు తొక్కిన కోతిలా చిందు లేస్తున్నావ్. ఏం వచ్చిపడిందోయ్ నీకు,''అని ఆందోళనతో జగన్ని చుట్టిముట్టి ఏదో లోకంలో ఉన్న జగన్ని జెబ్బపట్టుకొని ఊగించారు. అయ్యో ఒళ్ళు మసిలి పోతూఉన్నది. ''ఇంత జ్వరంగా ఉంటే, ఏం మునిగి పోయిందని కాలేజీకి వచ్చావు. లీవు పారెయ్యలేక పోయావ్'' అంటు రిక్షామీద ఎక్కించి ఇంటికి పంపేశారు.

'నమః పార్వతీ పతయేనమః హర హర మహాదేవ శంభో శంకర' అనే భక్తుల నినాదాలతో మల్లికార్జున స్వామి ఆలయమంతా మార్మోగి పోతూఉంటే శ్రీశైలంలో భ్రమరాంబా దేవాలయ ప్రాంగణంలో, జన సందోహానికి కొంచం దూరంగా, కండ్లు మూసుకొని ధ్యాన్య ముద్రతో లోకం మరచి, తన్ను తానే మరచి పోయిన రాజ్యం, తన భుజం మీద ఎవరో చెయ్యి వెయ్యడంతో లోకం లోకి వచ్చి, కండ్లు తెరచి ఎదురుగా అరుంధతి కనబడ్డంతో ఆశ్చర్యపడి, ''ఏమి టక్కా, నీవూ, శివరాత్రికి శ్రీశైలం వచ్చావా? అంతా క్షేమమా, మన వాళ్ళు అంతా వచ్చారా? లేక ద్రోణాచలం నుండీ, మీ వాళ్ళతో వచ్చావా?'' అని ప్రశ్నించింది.

"లేదమ్మా రాజ్యం, ఎవ్వరితోనూ, రాలేదు. చెల్లెలి పురిటికి అమ్మకు సాయం కొరకు ద్రోణాచలం వచ్చి, ఈ వేళ శివరాత్రి కదా అని, స్వామి దర్శనం చేసికొందామని శ్రీశైలం వచ్చానమ్మా. ఔనుకానీ, అన్నట్లు నీకు కాబోలు, జ్వరం అనుకొన్నారు"

"ఏమిటీ. మీ మఱిదిగారికి జ్వరమా, నేను బయలుదేరేటప్పుడు, ఏమీ లేదే, అయితే నే నీవేళే బయలుదేరి వెళ్ళి పోతాను."

"అంత పెద్ద జ్వరం కాదులే, హడావిడి పడకు, నిదానించి పరిస్థితులు తెలిసికొని మఱీ వెళ్ళు"

"అదేమిటక్కా! అట్లామాట్లాడు తున్నావు? నా యింటికి నేను వెళ్ళడానికి పరిస్థితులు తెలిసికొని వెళ్ళడ మేమిటి? ఏం అమ్మవారు చూపిందా ఏమిటి?"

"అబ్బేఅలాంటిదేమీలేదు. నీపరిస్థితి విచారించుకొమ్మంటున్నాను,అంతే"

"నాపరిస్థితులలో ఇప్పుడు క్రొత్తగా వచ్చిన మార్పేమిటి? అక్కా నీ మాటలు నాకు అర్థం కావడం లేదు. పైగా ఏదో నా ఊహకందని కీడును ధ్వనిస్తూ ఉన్నవి. ఏమీ అభ్యంతరం లేకపోతే కొంచెం విడమర్చి చెప్తావా?"

"ఏంలేదు చెల్లమ్మా, ఆడవారి జీవితం ముల్లుమీది అరిటాకు వంటిది. ధర్మ ప్రతిష్ఠాపనకోసం భూమి కవతరించిన ఆదిశక్తి అవతారం సీతకే పాట్లు తప్పలేదు"

"ఆ, బోధపడింది అక్కా, విషయం బోధపడింది."

"చదువుకొన్నదానవు, నీకు తెలియక పోవడమేమిటమ్మా"

"సరేకాని అక్కా, ఒక్క చిన్న యుక్తివాదం. ధర్మం ప్రతిష్ఠించే నిమిత్తం, కష్టాలను ఎదుర్కొనడానికి సిద్ధపడే అవతరించి కావాలని కష్టాలను ఆహ్వానించింది. కాబట్టి సీతమ్మ ఆ రామునిచే త్యజింపబడింది. మఱి నేను ధర్మ ప్రతిష్ఠాపన కోసం పుట్టినదానను కానుకదా. అయినా ధర్మం మీరకూడ దనుకొన్నాను. నాకుకూడా ఏదో కష్టం, అనుభవించడం తప్పదు కాబోలు!"

"ఏదోకష్టం కాదమ్మా, వియోగమే, పైగా నీవిపుడు తల్లివి కాబోతు న్నావు కాబోలు."

అవునక్కయ్యా, అందుకే సెలవు పెట్టాను. ఇందులో కూడా సీతమ్మ సామ్యం తప్పలేదా, పోనీలే ఏంచేస్తాం. భారత సతికి ఇవి తప్పవు కాబోలు."

"రాజ్యం, నేవేదో ఛలోక్తిగా చెప్తున్నానని నీవు తేలిగ్గా మాట్లాడుతూ ఉన్నట్లున్నావు. జగన్ నిన్నింక ఆవాకిట్లోకి రానియ్య నంటున్నాడు. దీనికంతా కారణం, మావారూ, మామగారూనూ. మొన్న మా ఆడపడుచు పెండ్లి. మను గుడుపుల్లో నువ్వు మావారిచేత ఏవో ఆ దరిద్రపు మందులు తెప్పించు కొన్నా వటగా, అదే నీ కొంప ముంచడానికి కారణం అయ్యాయి. అయినా నీ కెందు కమ్మా ఆ మందులు?"

"ఏమిటక్కా నీమాటలు, మఱీవిచిత్రంగా ఉన్నాయి. నేనేమిటి, సుందరం బావగారిచేత మందులు తెప్పించు కోవడమేమిటి? నేనెప్పుడైనా వారి ఎదుట నిలబడి వారితో మాట్లాడి ఎఱుగుదునా, చాలా బాగుందీకథ. అసలు సంగతివిను చెప్తాను. ఆయనే మా ఇంటికి వచ్చి "అమ్మాయి రాజ్యం ఒక యాభై ఉంటే ఇయ్యమ్మా, మీ అక్కయ్యకు, ఇంజెక్షన్లు కొనుక్కొని వెళ్ళాలి. ఈ ప్రక్క కొట్టుకువచ్చి మందులుకొని, డబ్బులు చూచుకొంటే చాలలేదు. నేనేమొ ఇంటికి పోతున్నా, మళ్ళీ వెనక్కు వెళ్ళడం ఎందుకని, మీ ఇంటికి వచ్చా. నీవు కన బడ్డావు. ఈ భాగ్యానికి కాదంటావా, అని అడిగాను. ఏమీ అనుకోకు. మళ్ళీత్వర గానే ఇచ్చేస్తాను. ఈమాత్రందానికి ఎవ్వరికీ చెప్పకులే," అన్నారు. అసలే మీ కుటుంబానికీ. మా కుటుంబానికీ పడక పోవడంచేతా, ఆయన వక్రస్వభావం తెలిసినదాన్నవడంచేత, ఇయ్యనా, మాననా, అని కొంచెం తటపటాయించికూడా ఇయ్యకపోతే, ఏం ముప్పు తలపెడతారో అని ఇచ్చానక్కా. అపనికి ఇది ఫలితమన్న మాట."

"ఆఁ ఏమిటి? నీదగ్గర యాభై రూపాయలు పుచ్చుకొని అవి ఎక్కడో ఖర్చుపెట్టి, నీవు ఏదో ఆ దిక్కుమాలిన మందులు కొనమన్నావని కథ అల్లి ప్రచారంచేసి మీ ఆయన మనస్సులో ఉప్పుగల్లువేసి నీ పచ్చని సంసారంలో నిప్పులు పోశారా? అవురా, దుర్మార్గులు ఎంతకు తెగించారు."

"నాకు ఇంకో విషయం జ్ఞాపకం వస్తున్నదక్కా, ఆ యాభై పుచ్చుకోనే టప్పుడు, అటూ, ఇటూ చూచి ఎవ్వరూ లేరు గదా అని చూచి మఱీ పుచ్చు కొన్నారు. పైగా ఏదో అసందర్భ ప్రేలాపన ప్రేలి మఱీ వెళ్ళి పోయారు. ఇవన్నీ మీ మఱదిగారికి నేనప్పుడే చెప్పాను కూడా. అయినా అనుమాన భూతానికి చిక్కిన వారికి, న్యాయాన్యాయ, విచక్షణ ఎక్కడ కుదురుతుందిలే."

"సరే ఇంత గ్రంథం జరిగిన తరువాత ఇంక ఊరుకోకూడదు. గట్టిగా బుద్ధి చెప్పాలి చెల్లాయి. అయితే, మీరు కొల్లూరెప్పుడు వెళ్తారు. నీవు తెనాలి వెళ్ళడం మాటేమిటి?"

"మేము రేపేబయలు దేరి వేళ్ళిపోతాము. కానీ ఇప్పట్లో నేను తెనాలికి వెళ్ళే ప్రసక్తి లేదు. ఏమీ, మీ మఱిదిగారికి, నేను నిప్పు లాంటి దాన్నని తెలియదా? సెలవు పొడిగించి, మా వాళ్ళింటికి వెళ్ళిపోతాను. అక్కా, నాకెందుకో ఏడ్పు రావడం లేదు. హృదయం కోపాగ్నికి ఆహుతై కళాపెళా మఱిగిపోతూఉంది. ఇప్పుడు కవిత్వం ఏమిటను కోకపోతే, ఈ చరణాలు విను.

'చీకటి రాజ్యంలో, సింభూతం వెలసింది. పాపాలభైరవుడు కొలువు దీర్చాడు. సింభూత రాయడు, సైగ చేయంగానే, అజ్ఞాన వీరులు తొడ కొట్టినారు, తొడకొట్టి జ్ఞానంతో సవాలుచేశారు. దౌర్జన్య రాక్షసి, గజ్జెకట్టింది. గజెగట్టి వేగ గంతులేసింది. అన్యాయ సామంతు గడయెక్కి ఆర్తుంటే, అనుమాన పిశాచి కోరలు చాచింది. అధర్మతాంబూల చర్వణం చేసింది...'

"వహ్వా, బాగుంది, చాలాబాగుంది, నీవిప్పుడా కొలువుకు వెళ్ళావంటే, అనుమానపిశాచి యొక్క అధర్మ తాంబూలంలోనీవు పోక చెక్కవైపోతావు."

"అంతే కాదక్కయ్య, పొంచున్న కాలసర్పం ఇదేసందని కాటేస్తుంది."

"నిజం చెల్లీ, నిజం. నీబుద్ధి పాదరసం లాంటిది. మీ పుట్టింటికి వెళ్ళడమే మంచిది. చెల్లెమ్మా, భయపడకు ఆఖరుకి పర్యవసానం శుభాంతమే ఔతుందిలే."

"అక్కా, ఎన్నివిపరీతాలు వచ్చినా, నేను భయపడే దాన్ని కాదు. ఫలితం శుభాన్తం అయ్యేవరకూ, ఏ కష్టానికైనా నేను వెనుదీయను. కానీ నీ సంగతే, నాకు భయం వేస్తుంది. నామూలాన్న నిన్ను బావగారు ఎన్ని హింసలు పెట్టారో!"

"ఇది రామరావణ యుద్ధం చెల్లీ, ఇందులో రావణ..."

అక్కా ఏమిటిది, నీనోటి వెంబడి అటువంటి మాటలు! వద్దక్కా, నా కొఱకు నీవు బలై పోవద్దు. నేను తెనాలి వెళ్ళి తాడోపేడో తేల్చి పారేస్తాను."

"కాదమ్మా నీకు తెలియదు. నేనంతా తెలుసుకొనే వచ్చాను నీకిప్పట్లో తెనాలిలో స్థానం లేదు. అయితే నన్ను గూర్చి నీకు భయం! అధర్మం పిచ్చ

ఢిల్లీ వీధుల్లో వికటాట్టహాసం చేస్తుంటే, ధర్మం సందుగొందుల్లో కూడా స్థానం దొరకక అడవులు పట్టిపోతో ఉన్నది. కొందరు జీవితాలర్పించైనా, దీన్నెదురొర్కోవడానికి సిద్ధపడక పోతే, ఈ అధర్మం తాండవానికి హద్దూ, పద్దూ ఉండేట్లు లేదు. సరేలే, నెవెళ్తానింక, నీజాగ్రత్తలో నీ వుండు."

* * *

"జగదాంబ గారున్నారాండీ"

"ఆ నేనే జగదాంబను బాబూ, ఎవరు మీరు? రాజగోపాలుకాదూ?

"అవునండీ అత్తయ్య గారూ, రాజగోపాలాన్నే, అంతా కులాసాయేనా?

"ఏంకులాసాలో లే, మాయింటి సంగతే చెప్పాలి. నీకు తెలియని దేమున్నది? నిప్పును ముట్టుకుంటే, ముద్దెట్టుకుంటుందా నాయనా! రాజ్యం తల్లిని ఈ యింట్లో నుండి ఎప్పుడు, బయిటకు పంపేశామో, అప్పుడే, పండంటి కాపురం కాస్త పంచ బంగాళమై పోయింది. రా నాయినా, రా లోపలికి వచ్చి కూర్చో, నిలబెట్టి మాట్లాడుతున్నాను. పేదవాళ్ళం, మీ బోటి వాళ్ళకు తగిన మర్యాద చెయ్యలేం. దాహం పుచ్చు కొంటావా?"

"మనలో మనకు, పెద్దా గొప్పా ఏమిటత్తయ్యా, బావగారికి కులాసా లేదని తెలిసి చూచి పోదామని వచ్చాను."

"ఆ, ఉన్నాడు బాబూ, అవమానం భరించలేక, అది ఇక్కడకు రాకుండా పుట్టింటికి వెళ్ళిపోయింది. ప్రజలముఖం చూడలేక వీడు మంచం పట్టిపోయాడు. చిక్కి శల్యమై పోయాడు. ఏం చెయ్యాలో దరీదోవా తోచడం లేదు."

"పెద్దవారు మీరే బాధపడ్తే ఎట్లా చెప్పండి, జగన్‌బావఏడీ? గదిలో ఉన్నాడా, నే వెళ్ళిచూస్తాలెండి"

"ఏంరాజా, నన్ను పరామర్శించడానికి వచ్చావా, రాకూర్చో."

"అయ్యో. జగన్. ఏమిటీ యువతరం? ఈగడ్డమేమిటి? ఈగుడ్డలేమిటీ? బైరాగుల్లోకానీ కలసి పోలేదుకదా కొంపతీసి."

"అవును బావగారూ, సరియైన సూచన. కర్తవ్యం తోచక కొట్టు కుంటున్నా, మెనీ థాంక్స్"

"ఛాల్లే, సంతోషించా తెలివికి, జీవితంలో ఏదైనా దెబ్బ తగిలితే ఎదురు దెబ్బకొట్టాలి. ఏడుస్తూ కూర్చోవడమేనా, పురుష లక్షణం."

"ఏం పురుష లక్షణమో, ఏంపాడో...సుందరం సంగతీ సీతయ్య పెద నాన్న సంగతీ అట్లాఉంచు. ఏ పాపం ఎఱుగనిదైతే, రాజ్యం ఇక్కడకు రాకుండానే వెళ్ళిపోయిందే మఱి? అసలుకంటే, ఈ వడ్డీ నామెదణ్ణి కొఱికి పారేస్తూంది."

"ఔను.బావా రాజ్యం శీలవతేకాదు, మానవతి కూడా. తానుఅల్లరిపడీ, నిన్ను అల్లరిపెట్టి నల్గురిలోనూ, అవమానాలుపడి, వెళ్ళగొట్టించు కోవడం ఇష్టం లేక,..."

"రాజా నీవుకూడా, రాజ్యం శీలవతేనని నమ్ముతున్నావా, రాజ్యం శీలవతేనని నా అంతరాత్మకూడా, ఘోషిస్తూఉన్నది. కానీ, ఏమో..."

"జగన్, నీతో కొన్ని విషయాలు చెప్పాలి లే, లేచికాస్త తయారవ్వు, సినిమాకు, వెళదాం. ఒక స్నేహితుడు వచ్చాడు. ఆయన భలే చమత్కారిలే."

"ఆ నా బ్రతుక్కి తోడు సినిమాకూ్కడానా, అందఱి ఎక సక్కెలు భరించేడానికా నన్ను సినిమాకు రమ్మంటున్నావు."

"జగన్, మన బాల్య స్నేహం మఱచి మాట్లాడుతున్నావా. నీకు అవ మానం రానిస్తానా. పోనీలే షికారుకు వెళ్దాంలే. మా స్నేహితుడు నీతో ఏదో మాట్లాడాలంటున్నాడు. దానితో వాడిపోయిన నీ జీవనలత మళ్ళీ నవనవ లాడవచ్చు."

"ఆ ఇంక ఈ మ్రోడుకు నవంలేదు. శివంలేదు పదవెళ్దాంలే."

* * *

చీకటి రాజ్యం వచ్చేలోపుగా, తాను పశ్చిమకొండ చేరుకోవాలనే తహ తహతో సూర్యుడు గబ గబా నడకసాగిస్తూన్నాడు.

ప్రక్కనున్న పట్టణానికి మందు కోసం వెళ్ళిన యువకుడు ఒకడు, తమ పల్లెప్రక్కగా సాగి పోతూఉన్న రోడ్డుమీద అప్పుడే బస్సు దిగి, పుంత గుండా, చేతికఱ్ఱ ఆధారంగా తట్టుకొంటూ నడవసాగాడు. కార్తీక మాసం. దీపావళి అమావాస్య రోజు కావడం చేత అరుగంటలకే కప్పెడు కప్పెడుగా,

కమ్ముకొని చీకటి కన్నూ మిన్నూ కప్పేసింది. గిలకోళ్ళరొదలతో పుంత ప్రక్క పొదలన్నీ గుయ్యి మంటున్నాయి. గుడ్లగూబల వికృతారావాలతో ప్రకృతే భీతావహంగా అయిపోయింది. మెల్లిగా నడచి వస్తూన్న యువకుని మనస్సే వాతావరణానికి బెదరి పోయింది. చీకటి ముసుగులో చిక్కుకొని భూమాత వెక్కి వెక్కి ఏడుస్తూన్నదా అని అనిపిస్తుంది. కళ్ళు రెంటినీ కోల్పోయిన ఆ యువకుడు, చీకటి రాజ్యవిస్తరణం దెబ్బకు లొంగిపోయిన ప్రకృతి పరాజయాన్ని కండ్లతో చూడలేక పోయినా, పూర్వానుభవాన్నిబట్టి చీకటి హెచ్చి పోతూందని గ్రహించి, అయ్యో, ఎంత ప్రయత్నించినా బస్సు దొరక్క ప్రొద్దుక్రుంకనే గ్రుంకింది. నాగ్రుడ్డి వాలకానికి తోడు ఈ పుంత దారి ఒకటి. ఈ వేళ ఏం కానున్నదో అనుకొంటూ, తట్టుకొంటూ నడుస్తున్నాడు.

ఆవేళ దీపావళి కావడంచేత పొలాల్లో వాళ్ళంతా ముందే పల్లెకు చేరుకున్నారు. గబ్బగీమంటూన్న ఆ నిశ్శబ్ద వాతావరణం చీల్చుకొని, "తాటిచెట్టు కొచ్చినన్ని పళ్ళుఉన్నాయి. రంభలాంటి పెండ్లాం. పిల్లామేకా కావలిసినంత. పైగా గ్రామపెత్తనం నెత్తిన పెట్టుకొన్న మొగాడివి. నీకేం పోగాలం, నా చెయ్యి పట్టుకున్నావు? ఛీ నీ జిమ్మడ, వదులు లేకపోతేనా..." అంటూ తుభీక్కున ఉమ్మిన చప్పుడుతో సహా అంతా యువకుడి చెవిన పడింది.

"ఎవడ్రావాడు" అంటూ, యువకుడు కర్రెత్తి అటువైపు వెళ్ళాడు. "ఏయ్ మహిళోద్ధరణ ఎప్పటినుండీ మొదలు బెట్టావ్. ఇంటికిపోయి నీయేడుపేదో నీవేడు!" ఈమాటలు వినంగానే ఆ యువకుడు ఉద్రేకంతో ఎదుటి వ్యక్తిని ఒక్కదెబ్బ వేశాడు.

"ఓహ్హో, గ్రుతిమించిందే ఎవ్వారం. చింతచచ్చినా పులుపు చావలేదే. ఎవరనుకొన్నావ్. గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరిస్తూందే! నాకే అడ్డు తగిలి నానోటి కండను ఎత్తుకొని పోవాలని చూస్తూన్నావ్. అయితే, కాచుకో" అంటూ ఆ యువకుని చేతిలో కఱ్ఱ లాక్కొని, 1, 2, 3 అంటూ, పైశాచికంగా నవ్వుతూ బాది పారేశాడు, అవతల ఘరానావ్యక్తి.

"ఆ! ఆ! నీవా, నీవా, నీవేనా, నన్ను చంపేసింది" అంటూ ఆవ్యక్తి చావుకేకలు పెడ్తూ రక్తం మడుగులో కుప్పగూలిపోయాడు.

"ఖూనీ, ఖూనీ" అంటూ, ఆ యువతి ఊళ్ళోకి దౌడు తీసింది.

దీపావళి పండుగ ఎటుపోయిందో! కరణంగారి యింటిదగ్గర ఊరి జన మంతా గుమికూడి పోయారు. అందరూ తలోమాట అనుకొని గుసగుస లాడ్డమే తప్ప, అసలు విషయం ఎవరికీ తెలియలేదు.

ఇంతలో "జనం తప్పుకోండి, కరణంగారు డాక్టర్ని తీసికొచ్చారు" అనే మాటలు వినపడ్డవి. ఆ దృశ్యంచూచి డాక్టరుకూడా దిగ్భ్రాంతుడై పోయాడు. ఇంజెక్షనిచ్చి గాయాలకు కట్టుకట్టి, "లాభంలేదండీ," అంటూ పెదవి విఱచి "ఏమైనా, పట్నం తీసుకెళ్దాం, అంబులెన్సు తెప్పించండి' అని తేల్చేశాడుడాక్టరు.

"నా చర్మం ఒలిచి చెప్పులు కుట్టిస్తా. నా బిడ్డను ఎలాగైనా బ్రదికించండి," అంటూ రాధమ్మ ఆ యువకుని పాదాలమీద పడిపోయింది. అరుంధతి మొదలు తెగిన మ్రానులాగ స్మృతితప్పి పడిపోయింది. నెత్తిన చేతులు పెట్టుకొని నిట్టూరుస్తూ నిలబడిపోయాడు కరణం.

"ఇదంతా రాజ్యం యెడల నేను చేసిన పాపానికి ఫలితం అరూ! అరూ! నెత్తీనోరూ బ్రద్దలుకొట్టుకొని నీ వెంత చెప్పినా నేను వినలేదు. అరూ అరూ నన్ను క్షమించమని రాజ్యానికి చెప్పమని అడగడానికి కూడా యోగ్యత లేదు. నాపాపాగ్ని నన్ను నిలువునా కాల్చిపారేస్తూంది. అమ్మా నే నింక బ్రతకను. అభం శుభం ఎఱుగని ఒక అమాయకురాలి జీవితం నాశనం చేసిన కటిక దుర్మార్గుణ్ణి. కన్నూమిన్నూకానని కళ్ళ కావరంతో చేసిన దోషమే నా రెండు కళ్ళూ పోగొట్టింది. నాన్నా, ఇంకైనా తప్పుదారులు పట్టకు, ఇది గుణపాఠంగా అయినా మేలుకో" అంటూ ప్రేలాపించే సుందరాన్ని అంబులెన్సులో పట్నానికి తీసుకు పోయారు.

# బల్లకట్టు బాపులు

శ్రీమతి లక్ష్మీరమణ

ఆనాడు పెద్ద పెట్టున గాలివాన మొదలైంది. కృష్ణా కెనాల్ అవతల గట్టు కింద ఉన్న పెద్ద తోటలో చెట్లన్నీ ఉగ్రరూతలూగి పోతున్నాయి. పెద్ద పెద్ద చెట్ల కొమ్మలు ఫెళ్ళున విరిగి నేలపడుతున్నాయి. చెట్ల ఆకులతో, కొమ్మలతో తోటంతా భీభత్సంగా ఉంది.

అంత పెద్ద గాలి దుమారంలో స్కూలుకు వెళ్ళాలన్న బుద్ధి మాకు. ఆ మాట చెబితే అమ్మ ఏమాత్రం ఒప్పుకోదని మాకు బాగా తెలుసు. అందుకే గప్‌చిప్‌గా రెయిన్‌కోట్స్ తీసుకుని బడికి బయలు దేరాము. ఒక్కొక్కమారు గాలివాన లేకపోయినా, ఎండలుమండి పోకపోయినా బడికి పోబుద్ధి కాదు. ఎందుకో ఆనాడు మాత్రం ఎలాగయినా వెళ్ళితీరాలని కోరికగా వుంది.

మా స్కూలు కెనాల్‌కు అవతలి గట్టుకు కొద్దిదూరంలోవుంది. అందు వల్ల స్కూలుకు వెళ్ళాలంటే బల్లకట్టు ఎక్కికాసేపు నీటిమీద ప్రయాణం చేసి మరీ వెళ్ళాలి. ఈ గాలివానకు బల్లకట్టు నీటిమీద ఎగిరెగిరి పడుతుంటే దానిలో కూర్చున్న థ్రిల్ ఎలావుంటుందో ఊహించుకుంటూ చిన్నా, పండు, నేను బయలుదేరాము. తోటలోనుండి జారుతూ లేస్తూ కాలవగట్టు ఎక్కాము. బల్ల కట్టు వుండే చోటు చేరుకోవాలంటే కాలవగట్టున కొంతసేపు నడవాలి. వానకు దారంతా బురదగా వుంది. ఆ బురదకు జారిపడకుండా బొటనవేళ్ళు బురదలో గుచ్చి పెడుతూ జాగ్రత్తగా నడవసాగాము. ఎంత జాగ్రత్తగా నడిపించినా చిన్నా జర్రునజారి పడనే పడ్డాడు. వాడిని పండు, నేనూ కలిసి కష్టంమీద లేవదీశాము. రెయిన్ కోటంతా బురదైపోయింది. చిన్నాను ఇంటికి వెళ్ళమని బ్రతిమాలినా వాడు ఒప్పుకోలేదు. అదీ మంచిదేలే అనుకున్నాం. చిన్నా అంత త్వరగా ఇంటికి చేరితే మేము బల్లకట్టు ఎక్కకముందే ఇంట్లో వాళ్ళు పాలేరును పంపించి మమ్మల్ని కూడా ఇంటికి లాక్కెళ్ళే ప్రమాదం వుంది గనక. ఎలాగో తిప్పలుపడి గట్టు దిగి బల్లకట్టు చేరుకున్నాము.

బల్లకట్టు బాపులు అవతలివైపున బల్లకట్టు ఆపుకుని ఉన్నవాడు మమ్మల్ని చూసి ఇవతలిగట్టుకు వచ్చాడు. బల్లకట్టు ఆపి, నోట్లోచుట్ట తీస్తూ "అదేంటి బాబులూ-ఇంతగాలానలో బడికి పోకపోతే పంతులయ్య కొడతాడేంటి? సలి ఇదిలించేత్తుంటే! నడవండి బాబూ, ఇంటికాడ దిగెట్టొత్తా". పెద్దసలిపో

ఇవ్వవచ్చాడు బాపులు. నానాతిప్పలూ పడి మేము ఇంట్లో చెప్పకుండా బయట పడితే ఈ బాపులు ఒకడు మా ప్రాణానికని బాపులుమీద మాకు బలే కోపం వచ్చింది. మెల్లగా చెబితే బాపులు వినిపించుకోడని ముగ్గురంకలిసి గట్టిగా అరిచాం. ''అవును. మాష్టారు కొడతారు బాపులూ. మేము తప్పకుండా ఈవేళ స్కూలుకు వెళ్ళితీర వలిసిందే'' అంటూ బల్లకట్టు ఎక్కేశాము.

''బల్లకట్టు అంచులు గట్టింగా పట్టుకు నిలుసొండి బాబులూ. ఈ మాయ దారి గాలికి కుదుపుడుగా వుంది. మీరుకాత్తా జారి పడితే ఆనక నాకు మాటొత్తది. పెద్దదొర కూకలేత్తాడు'' అంటూ బాపులు చుట్టనోటో పెట్టు కుని తెడ్డుచేతపట్టాడు. బాపులు బల్లకట్టు నడుపుతుంటే చూడాలి, ఎంత దర్జాగా వుంటాడని! ఆ తెడ్డు నీళ్ళలో కదులుతుంటే చూడ ముచ్చటవుతుంది. కుండలో కవ్వం పెట్టి పెరుగు చిలుకుతుంటే మజ్జిగంతా ఎగిరెగిరి పడ్డట్లు నీరుచుట్టూచింది తుంపరలుగా మీద పడుతుంది. కానీ ఈ నాడు వానకు నీళ్ళు గోధుమరంగులో బురదలుగా ఉన్నాయి, తెడ్డువేసినప్పుడంతా ఎత్తుగా ఎగిరిపడుతున్నాయి. గాలికి బల్లకట్టు అటూ ఇటూ ఊగిపోతూంది.

వానపడుతూనే ఉంది. ఆకాశంలో నల్లని మబ్బులు బొబ్బలు పెడు తున్నాయి. చిన్నా బిక్కమొహం వేసుకుని బల్లకట్టు అంచుకు కరుచుకునే నిలు చున్నాడు అంతవరకు. అంతలో బురద అంటిన రెయిన్ కోట్ జారి కాలుకింద పడిందేమో, పట్టుతప్పికాలుజారి నీళ్ళలో పడిపోయాడు. పండు కేక వేసాడు. బాపులు చుట్టపారేసి, తెడ్డు నాచేతికిచ్చి గబుక్కున నీళ్ళలోకి దూకేసాడు. అప్పటికే ఒక్కసారి నీళ్ళలోకి మునిగి తేలిన చిన్నాని ఎత్తుకుని అటూఇటూ తిరిగిపోతున్న బల్లకట్టు ఎక్కేశాడు. చిన్నాని పడుకోబెట్టి వెంటనే తెడ్డు అందు కున్నాడు.

నేను, పండు తెల్లమొహాలు వేసుకుని బాపులు వంక చూశాము. మా కప్పుడు బాపులు శివాజీ కన్నాగొప్ప వీరుడులా కనిపించాడు. చిన్నామునిగి పోకుండా ఒక్కక్షణంలో పట్టుకురావటం, మేమంతా మునిగి పోకుండా వెంటనే బల్లకట్టును అదుపులో పెట్టటం మాటలేనా! తనపై కండువా లాగి మావైపు విసిరేస్తూ, "బాబులూ, చిన్నాబాబుపైన కప్పండి. ఆ సీరాముడి దయవల్ల ఈనాడు గండం గడిసింది. నాకు మాట దక్కింది. లేకపోతే నేనియేళ ఎంత నింద మొయ్యాలిసొచ్చేది!" అన్నాడు.

బాపులు పైకండువా చుట్టవాసన కొడుతూంది. చిన్నా గడగడ వణికి పోతున్నాడు. భయంతో కళ్ళు తేలవేస్తున్నాడు కూడా. వాడిని చూస్తే మాకు ఒణుకు పుట్టింది. పండూ నేనూ ఎలాగో చిన్నా ఒళ్ళుతుడిచి, కండువా కప్పాము. బాపులు బల్లకట్టు తిప్పుకుని ఇంటివైపు గట్టుకు చేర్చాడు. బల్ల కట్టును తాడుతో గుంజకు కట్టేసివచ్చి చిన్నాని బుజాన వేసుకుంటూ "బాబులూ, నేను సెప్పానా, లేదా? అయినా సిన్నోరికి ఇంత ఆగడం పనికి రాదు. అయినా బడిపంతులు మాత్తరం ఇంత గాలానకి రాకపోతే కొట్టి కొదవేత్తాడా, ఎరక్క అడుగుతాగాని. నాకు తెలవదేంటి, ఇదంతా మీ మొండి తనం కాకపోతే? ఇంటికి నడవండి" అంటూ గదమాయించాడు. పండూ, నేనూ కిక్కురు మనకుండా తేలుకుట్టిన దొంగల్లా ఒకరివంక ఒకరం చూసు కున్నాము. చేసిన నేరం మనసులో ఒప్పుకున్నాము.

గట్టు ఎక్కేసరికి పాలేరు పరుగెత్తుకుని వస్తూ మాకెదురయ్యాడు. చిన్నాని చూసి గాబరాగా "ఏమైంది బాపులూ చిన్నాదొరకి?" అన్నాడు.

బాపులు మాత్రం ధైర్యంగా "ఏమీ కాలేదులేరా. గాలికీ ఆనకీ బెదురు గొడ్డులాగా అట్టా బెదురుతా వేందిరా? చూత్తవేం, ఆ బాబులిద్దరినీ చెరో బుజానేసుకో. నాలుగడుగుల్లో ఇల్లు చేరుకుందాం. ఈ రొండిలో బాబులు నిలదొక్కుకోలేరు" అన్నాడు. మేమిద్దరం ఎంత వద్దన్నా పాలేరు మా ఇద్దరినీ చెరో బుజాన వేసుకున్నాడు.

మునిగితేలిన చిన్నాని ఎవ్వరూ ఏమీ అనలేదు. కానీ పండునీ నన్ను మాత్రం మొహాలు వాచేలా చీవాట్లు పెటారు ఇంట్లో. తిట్లతోనే ఒదిలిపెట్టి నందుకు, పీపులు పగలకొట్టనందుకు లోలోపల సంతోషించాం మేమిద్దరం. అయినా ఎంతో ఉత్సాహంగా ప్రారంభించిన మా అడ్వెంచర్ మరీ అంత అన్యాయంగా ముగిసినందుకు లోలోపల చాలా చింతించకపోలేదు. రెండో రోజు వానవెలిసినా మమ్మల్ని స్కూలుకు పంపించలేదు ఇంట్లోవాళ్ళు.

మూడో రోజుకూడా చిన్నా ఇంట్లో ఉండిపోయాడు. నీళ్ళలోపడ్డ భయంనుండి ఇంకా పూర్తిగా కోలుకోలేదు వాడు. పండూ నేనూ ఆ గాలివాన రోజు కబుర్లే చెప్పుకుంటూ బల్లకట్టు చేరుకున్నాము. బల్లకట్టు బాపులుకు ఏలా థాంక్సు చెప్పాలా అనుకున్నాం. థాంక్సు అని చెబితే అర్థం కాదుగా?

బాగుండదుకూడా. బాపులుకు మరింకెలా చెప్పాలా అని ఆలోచిస్తూ అటు చూశాము. ఇద్దరం ఆశ్చర్యపోయాము.

బల్లకట్టు నడుపుతున్నది బాపులు కాదు, బాపులు బదులు ఎవరోకొత్త బ్బాయి కనిపించాడు. మేము స్కూలుకు వెళుతున్నప్పటి నుండీ బల్లకట్టు బాపులేగా నడుపుతున్నదీ అనుకున్నాం. మరి ఈరోజు ఈ కొత్త వాడెందుకు వచ్చినట్లు? మాకిద్దరికీ అర్థంకాలేదు. "ఎందుకనీ? ఎందుకనీ?" అని మాలో మేము ప్రశ్నించుకున్నాం. చివరకు పండే అడిగాడు ఆ కొత్త అబ్బాయిని "మా బాపులు రాలేదేం?" అని.

ఆ కొత్త అబ్బాయి మాట్లాడలేదు. "కొంపతీసి వీడు మూగవాడుకాదు కదా?" మెల్లగా అన్నాను నేను పండు చెవిలో. పండు కాదన్నట్లు తల అడ్డంగా తిప్పుతూ, తనచూపుడు వేలు ఎత్తి ఆ కొత్తవాని వంక చూపాడు. ఆ కొత్త బ్బాయి కళ్ళనుండి బొటబొట కన్నీరు కారుతూవుంది. దానితో పండుకి, నాకు పెద్ద భయం పట్టుకుంది. నేను నోరు జారి మనసులోమాట గబుక్కున అన్నాను.

"బాపులు చచ్చిపొయ్యాడా?"

కొత్త అబ్బాయి తల అడ్డంగా తిప్పి, "బాపులు బాగానే వుండాడు." అన్నాడు.

ఆ మాటవినగానే—"అమ్మయ్య, బ్రతికాం బాబూ. బాపులు చచ్చి పోలేదు. బతికే ఉన్నాడు. అంతేచాలు అనుకున్నాము.

"మరయితే నీవెందుకు ఏడుస్తున్నావు?" అని అడిగాం.

"ఏమని సెప్పను బాబూ? అంతకన్నా అన్నాయం జరిగింది. బాపులు మా అక్క మొగుడు. నాకు సయాన బావ. మా అక్క పిల్లాడ్ని కని పురిటోనే సచ్చిపోయింది. మాబావ బల్లకట్టుని నమ్ముకు బతికేవాడు. కాలవ గట్టునే గుడిసేసుకుని, ఆ సిన్నోడ్ని పెట్టుకుని కాలం ఎళ్ళబుచ్చుతుండాడు. గాలి అనలో ఎవరి గుడిసెలు అవ్వు ఎగిరిపోకుండా సూసుకుంటుండగా, పిల్లగాడు గట్టు ఒడ్డుకి వచ్చాడు గావాలు, అమెరికను ఆసుపటలు దగ్గర మెట్లు జారాడని

ఒకరన్నారు. ఏమైతేనేం బాబు నీళ్ళలో పడిపొయ్యాడు. పసోడిని కాలవ కడుపునెట్టుకుంది" అని కండువాతో కళ్ళొత్తుకున్నాడు.

"బాపులు బల్లకట్టు మీద నుండి దూకి పైకి తియ్యలేదా?" ఆత్రంగా నేనడిగాను.

"అదే గాచారం బాబూ. ఆ సమయానికి బల్లకట్టు అవతలగట్టున కట్టేసి అటు కేసి పొయ్యాడంట, ఒక పిల్లోడి నెత్తుకుని."

పండూ నేనూ ఒకరినొకరం చూసుకున్నాం. ఇద్దరికీ అర్థమైంది, బాపులు చిన్నాని ఎత్తుకొని మా ఇంటికి వచ్చినప్పుడే బాపులు కొడుకు నీళ్ళలో పడిపోయాడని. మా ఇద్దరికీ ఏడుపొచ్చేసింది. బాపులు చిన్నాని నీళ్ళలో నుండి తీసి "ఆ సీరాముడి దయవల్ల గండం గడిసింది" అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. మరి ఆ శ్రీరాముడు బాపులుకొడుకుని ఎందుకు గండం నుండి కాపాడకూడదు? బాపులు కొడుకు ఎందుకు చచ్చిపోవాలి? దేవుడికి బాపులు కొడుకంటే అంత ఇష్టమా!

# మాయని మచ్చ

**శ్రీమతి జి. లలిత**

"రా లావణ్యా!" అన్న మావదిన ఆహ్వానంలో ఆర్ద్రత వినిపించి వెనక్కు తిరిగి చూచాను ఆ రోజు పేరంటంలో నేను. పేరెంతో నాజూకుగా వున్నది కదా! ఆ పేరుగల చిన్నది ఇంకెంత నాగరీకంగుంటుందో నన్న కుతూహలంకూడా నన్ను గిలిగింతలు పెట్టింది. అయితే నాకంటబడిన కన్యను చూచి చలించిపోయాను. ఆమెను న్యాయంగా "కురూపి" అనే అనాలి. శిల్పులు మలచే, చిత్రకారులు చిత్రించే, కవులు వర్ణించే శిల్పసుందరిగ, దేవ కన్యగ, అపరంజి బొమ్మగ దైవమామెను రూపొందించలేదు. మరి వికారి గనూ పుట్టించలేదు. కాని విధివశాత్తు ఆమె కురూపి అయినట్లున్నది. ఎముక విరిగి సొట్టబోయిన ముక్కు, ఎడమ బుగ్గపై కాలిన నల్లమచ్చ ఆమె ముఖం లోని కళను తొలగించి వికృతంగ మార్చినై.

వదినగారింటికి పేరంటానికి విచ్చేసిన వనితాలోకం వివిధాలంకార భూషితమై భూమికవతరించిన ఇంద్రచాపంలా వెలుగుతున్నది. కోలాహలం గున్న హాలులో కాలుపెట్టిన లావణ్య బెదురుతూ, సంశయిస్తూ, బిత్తరచూపు లతో ఓమూలను ఒదిగి కూర్చున్నది.

"శరణ్యా, ఓ పాట పాడుదూ" అని ఒక అర్థింపు.

"అబ్బ! మహా బెట్టు చేయకోయ్." అని ఒక హెచ్చరిక.

"నీ గానామృతంబులో నోలలాడ వేచి యుంటిమి చెలీ!" అని ఒక వెక్కిరింపు. లావణ్య ఈడు ఆడపిల్లలందరూ ఇలా త్రుళ్ళుతూ ఆడుతూ పాడుతూ హాలంతా తిరుగుతున్నా ఆమె మాత్రం ఎందులోనూ కల్పించుకో లేదు. లావణ్యనే పరిశీలిస్తున్న నాకు అందం ఆడదానికి ఆత్మవిశ్వా సాన్నిస్తుంది. అది లేకపోతే స్త్రీ జీవితంలోనే నమ్మకను కోల్పోతుందని ఎవరో అన్నమాటలు గుర్తువచ్చినవి. లావణ్య తన సౌందర్యలోపంచేత ఆ వయస్సుకు సహజమైన చలాకీతనాన్ని పోగొట్టుకొని, ఓ విధమైన పిరికితనంతో, తక్కువ భావంతో కించపడుతున్నట్లున్నది. పట్టపగలు సూర్యుని వెలుగులోనికి వచ్చిన గబ్బిలం మరలా చీకటిలోకి వెళ్ళ ఆశించేట్లు ఆమె అందరి చూపులు తప్పించు

కొని మరుగుననుండ కోరుతున్నట్లున్నది. మానవ స్వభావ పరిశీలన నాకొక హాబీ. మెల్లగ లావణ్య ప్రక్కకు చేరాను.

"మీరీవూరికి క్రొత్తా? ఇక్కడున్న వారిలో మీ పరిచయస్థులెవరూ లేరా?" అని మృదువుగ ప్రశ్నించాను. నా పలకరింపుకు మొదట లావణ్య సంకోచించినా ఆ తరువాత మనస్సు విప్పి మాటాడ సాగింది.

"మాదీవూరేనండి. నేను పుట్టి పెరిగినదిక్కడే. చోడవరం చౌదరిగారు మా నాన్నగారు."

"ఓహో! జమీందారుగారమ్మాయా మీరు?" అన్నాను ఉత్సాహంగా.

"ఆ, నేను పుట్టేవేళకే మా జమీందారీ దర్జా అంతా కొండెక్కింది. మా తాతగారి కాలానికే మా వంశం చితికి పోయింది, వారి భవనాలన్నీ శిథిలమైనవి. కాని మానాన్నగారు ఈ ఊరిని మాత్రం విడిచి పోలేక పోయారు. అంతా పోగా మిగిలిన భూమినే సాగుచేసుకుంటూ ఇక్కడే స్థిరపడ్డారు. ఈ పల్లెల్లో సంప్రదాయాలు అంత తొందరగా పోవు. వారిప్పుడు జమీందారు కాకపోయినా, గుఱ్ఱపు పందేలలో పాల్గొనకపోయినా, పల్లె అంతా గుబాళించే విందులు చేయకపోయినా, కార్లలో షికార్లు తిరగక పోయినా, ప్రస్తుతమొక సామాన్య కర్షకుడే అయినా ఈ పల్లెవాళ్ళు ఆయనను ఇంకా ఒక జమీందారుగ, తమకన్న భిన్నమైనవానిగ, తమ నాయకునిగనే చూస్తున్నారు." అన్నది అదేదో ఒక నేరంలా. లావణ్య మాటలు నాకు ఆశ్చర్యాన్ని కలిగించినై. ఆమెనోమారు తేరిపారచూచాను. ఆమెలో ఆ జమీందారీ దర్పంలేదు. ఆమె ఎన్నడూ ఆ పెద్ద అంతస్తుల మేడలో నివసించలేదు. ఒక చిన్న పెంకుటింటిలో పుట్టి పెరిగింది. చిన్ననాటినుండి భూమాత గోమాతలామె సఖియలు. లావణ్యకు తరగతుల అంతరం అవగాహనమైనట్లు లేదు, ఈ తరపు సమసమాజమే ఆమెకు పరిచయం.

"మనుష్యుల్ని వేరుచేసే ఆ భవనాలు లేకపోవడమే నాకెంతో బాగున్నది. ఈ తరతమ విభేదాలు నాకు నచ్చవు. మానవులు ఎక్కడపుట్టినా, వారి తల్లిదండ్రులు ఏ వృత్తిని చేపటినా అందరూ మానవులేకదా? మా తాత గారు ఎదురుపడితే చాలు, దారినుండి తప్పుకొని చేతులెత్తి దండాలు పెట్టడం

చూస్తే నా కెలాగో వుంటుంది.'' అన్నది సన్నగా నిట్టూరుస్తూ. ఏదో చింత ఆమెను క్రుంగ దీస్తున్నట్లున్నది. లావణ్యవరకు ఆమె ఒక సామాన్యురాలు. కాని పెద్దతరం వారికి ఆమె పెద్దింటి పడుచు. ఆ కారణంగ ఆమె కొన్ని గౌరవాలకు అర్హురాలు.

''మీకెప్పుడైనా యాక్సిడెంటు జరిగిందా?'' అన్నాను ఆమె బుగ్గమీద మచ్చను చూస్తూ. మునివ్రేళ్ళతో మచ్చను తడువుతూ చెప్పింది లావణ్య.

''నాకప్పుడు పద్నాలుగేండ్లు. అవి సంక్రాతి పండగ రోజులు. పల్లెలో భోగిమంటలు వేస్తున్నారు. పిల్లలందరూ చుట్టూ చేరి కేరింతలు కొడుతున్నారు. అందరి యిండ్లలో నుండి గడ్డి, గ్రాసం తెచ్చి, దుంగలు దూలాలు లాక్కొచ్చి మంటల్ని ఆకాశమంటేలా చేస్తున్నారు. ఒకళ్ళ నొకళ్ళు తోసుకుంటూ చలికాచుకుంటున్నారు. ఆ త్రొక్కుడులో ఎవరో ఎలాగో నన్ను ముందుకు తోసారు. ఆదమరచివున్న నేను మంటమధ్యలో పడ్డాను." ఆ విషాదోదంత చిహ్నం ఆమె నునులేత బుగ్గమీద శాశ్వత ముద్రను వేసింది.

రెండేండ్ల తరువాత మరలా విధి ఆమెను వెంటాడింది. ఈమారు లారీ రూపంలో ఆపద వచ్చింది. ఎండు గడ్డివేసిన రెండెడ్ల బండిలో లావణ్య పొలంనుండి ఇంటికి వెళ్ళుతున్నది. అది సన్నని బాట. ఎడమవైపు మలుపులో నుండి అకస్మాత్తుగా ఒక లారీ వచ్చింది. రోడ్డు చిన్నది కావటం వలన ఎద్దుల్ని ఎంత అదుపులోవుంచినా అవి బెదరి బాటప్రక్క పల్లంలో పడ్డయి. బండిక్రిందనుండి లావణ్యను బయటకు తీసారు. ప్రాణాలు దక్కినైగాని, ముక్కు ఎముక విరిగింది. తన వృత్తాంతాన్ని వివరించిన తరువాత, ''మిమ్మల్ని హేమగారింట్లో ఇది వరకు చూచిన గుర్తులేదు.'' అన్నది లావణ్య నేనెవరినో తెలుసుకోవాలని.

''అవునండి. నేను సెలవలకు మా వదినగారింటికి వచ్చాను మొన్ననే. ప్రక్క పట్టణంలో డాక్టరుగ పనిచేస్తున్నాను. నాకు పల్లెపట్టులంటే ప్రీతి. అందుకే అప్పుడప్పుడు పట్టణం నుండి పరుగెట్టుక వస్తుంటా నిక్కడికి.''

''మీవీ నా లాంటి భావాలే. పట్టు కంబళ్ళవంటి పచ్చనిపొలాలు. చల్లని పైరుగాలి. ప్రకృతిమాత ఒడిలో లభించే హాయి పట్టణంలో ఎలా వస్తుంది?

నాట్లు వేసేటప్పుడు, కోతనూర్చేటప్పుడు, పొలం గట్లలో పాటక జనంతో పాడుకుంటూ జీవితాన్నే ఒక పాటగ గడిపేయవచ్చు. అందునా ప్రక్కన సురేంద్రవుంటే..." అంటూ అంతవరకు పారవశ్యంతో చెప్పుకపోతున్న లావణ్య చటుక్కున ఆపేసి బిడియంగ చూచింది. అవును, నేనింకా లావణ్యకు అపరిచితనేకదా!

లావణ్య కబుర్లతో కాలగమనం తెలియలేదు. చుట్టూ కలయచూచాను. పేరంటాండ్ర గుంపు పలచబడింది. వదిన వచ్చేవారిని ఆహ్వానించడంలో, పోయేవారిని సాగనంపడంలో, ఉన్నవారిని మర్యాద చేయడంలో మునిగి పోయింది. లావణ్య కూడా వెళ్తానంటూ లేచింది. "రెండురోజుల పాటుంటా రేమో. వీలయితే ఓమారు మాయింటికి రండి" అని ఆప్యాయంగ నన్నా హ్వానించి మరీ వెళ్ళింది.

* * *

"మీ పిలుపును ఎంత త్వరగా వినియోగించుకున్నానో చూడండి" అంటూ లావణ్య వాళ్ళ యింటిలో అడుగుపెట్టాను మరునాడు. లావణ్యనన్ను చూచి చాలా సంబరపడింది. ఒక్కొక్క వేళా విశేషమో! మనసుల తత్త్వమో తెలియదు. చిరకాల పరిచయం లేక పోయినా మనసులు కలిసి మనుష్యులు చేరువౌతుంటారు చిటికలోనే. లావణ్యతోటి నా స్నేహం అలాగే జరిగింది. మూన్నాళ్ళ అనంతరం అడిగాను.

"ఆనాడు 'సురేంద్ర' అంటూ ఆగిపోయావేం? మీ యింట్లో ఆపేరు గల వ్యక్తి వున్నట్లులేదే?"

లావణ్యముఖ కవళికలు మారినై, ఆ పేరు వినడంతో ఆమె కండ్లలో ఓ మెరపు మెరసింది.

"సురేంద్ర నాన్నగారు మా కమతదారు. మా వంశానికి వారు తర తరాలుగ కమతం చేస్తున్నారు. సురేంద్ర తండ్రి కోటయ్య పాతకాలపువాడు. ప్రభుభక్తి పరాయణుడు. అతని దృష్టిలో తూర్పుపడమరల కెంత అంతర మున్నదో ఈ రెండు కుటుంబాల వారికంత ఎడమున్నది. అది దాటరానిది. దాటకూడనిది" అన్నది నీరసంగ, నావైపు జాలిగా చూస్తూ.

నాకర్థమైంది. గ్రహాలు ఒక మార్గంలో తిరుగుతున్నా అవి వాటి పరిధిని దాటి మరొక గ్రహంలోకి పోవు. వీరికుటుంబాలూ అంతే. సురేంద్ర లావణ్య నేస్తగాడు, వారి స్నేహలత పెంపొందే సందర్భంలో కూడ మరలా విధి అడ్డుకుంది. కోటయ్యకు ఈ రెండు కుటుంబాలలో ఇచ్చిపుచ్చుకోవచ్చు ననిగాని, సంబంధ బాంధవ్యాలు పెంచుకోవచ్చుననిగాని ఎన్నడూ తోచలేదు. సురేంద్రకి బూజు పట్టిన భావాలు లేకపోయినా అతడు తండ్రి చాటు బిడ్డడు. తండ్రి గీసిన గిరిని దాటే సాహసం ఇంకా అతనికి లేదు. కనుకనే లావణ్య కుటుంబాన్ని తమ కుటుంబాన్ని వేరుచేస్తున్న అంతస్తుల అగాధానికి వంతెన వేయలేకున్నాడు. పరిహాసానికైనా అటువంటి మాటను తన తండ్రి చెవినివేస్తే పరిణామమేమిటో అతనికి తెలుసు.

లావణ్య యీ గాథనంతా మధ్యమధ్య ఆపుతూ, సందేహిస్తూ అర్థోక్తులతో చెప్పింది. ఆమె చెప్పింది పిసరంత, నేనూహించింది కొండంత. వంశ సంప్రదాయాలు, అంతస్తుల అంతరాల విషవలయంలో లావణ్య సురేంద్రలు చిక్కుకున్నట్టనిపించింది. ఎందుచేతనో ఆ యువకుడు తన భావాల్ని సుస్పష్టంగ లావణ్యకు వ్యక్తం చేయలేక పోయాడు. ఒకవేళ అతనిలో ఆ స్పందన కలిగిందో లేదో తెలియదు. అతని ముభావాన్ని లావణ్య అపార్థం చేసుకున్నది. తన వికృత రూపమే అందుకు కారణమని యెంచి క్రుంగి పోయింది. పరిపూర్ణ పరువంలో కాలుపెట్టిన యేపడతికైనా యిది భరింపరానిదే! సురేంద్రకు లావణ్యపట్ల ఆదరమున్నది, కాని ఆ ఆదరం అనురాగంగ మారక పోవడానికి ఆమె అందవిహీనతే కారణమని అను కుంటున్న లావణ్య మానసిక వేదనను ఊహించ వలసినదే.

"నేనంటే అభిమానమే. ఎంతో సానుభూతితో ప్రవర్తిస్తాడు. కాని నా ముఖాన్ని..." లావణ్య చెప్పలేక నీళ్ళు నమలింది.

"సురేంద్రిప్పుడు ఎక్కడున్నాడు?"

"సైన్యంలో చేరి ఉత్తరాదికి వెళ్ళిపోయాడు. సురేంద్రది కొద్దిపాటి చదువే. తండ్రికి పొలం పనుల్లో చేదోడు వాదోడుగ ఉండేవాడు. నిరుద్యోగ సమస్య నింగినంటుతున్నయీ రోజుల్లో, పట్టభద్రులే పొట్టచేత పట్టుకొని నడి వీధుల్లో తిరుగుతున్న యీదేశంలో సురేంద్రవంటి వారికి ఉద్యోగా లెలా దొరుకుతవి?"

"జాబులు వ్రాస్తుంటాడా?"

"ఊఁ" అన్నది లావణ్య. ఆ ఒక్క ధ్వనిలోనే యెన్నో అర్థాలు ప్రతిధ్వనించినవి. ఆ లేఖలు స్నేహసౌహార్దాలతో నిండివుండేవి. సన్నిహితత్వం, ఆత్మీయత వున్నట్లే వుండేది. అయినా అది కేవలం అపోహకావచ్చునని కొట్టిపారేసింది. తియ్యని తలపుల్ని పెంచుకోవడం తప్పుగ భావించింది.

"ఒకటి రెండు మారులు సెలవల్లో సురేంద్ర పల్లెకు వచ్చాడు. ఈ చిన్న పల్లెలో అతడొక పెద్ద వీరుడేమరి. ఏమైనాను దేశసంరక్షణ భారాన్ని వహిస్తున్నాడు కదా! ఈ పల్లెపడుచులందరూ గోపికలై నీరాజనాలు పట్టారనుకోండి." అని లావణ్య విషయాన్ని తేలికగా చెప్పప్రయత్నించింది. అయినా అందులోని వ్యథ వ్యక్తమౌతోంది. వారందరూ తనకంటే రూపవతులు. పోటీలో తానెలా నిలవగలదు? నిస్సహాయంగ నిట్టూర్చివుంటుంది లావణ్య.

"కాని సురేంద్రలో నాకో మార్పు కనిపించింది. పల్లెలోవున్న సురేంద్రకు, సైనికుడైన సురేంద్రకు తేడావున్నది. ఈ అనంత విశ్వంలో యీ మారుమూలపల్లె ఓ బిందువు వంటిది. గొంగళీ పురుగు పిసినికాయ నుండి వెలికి వచ్చినట్లున్నది సురేంద్ర స్వభావం. చీకటి గూటినుండి బయట పడినట్లున్నది. భిన్న భిన్న సంస్కృతులు, ప్రవృత్తులుకల వ్యక్తుల తోడి సంపర్కం అతని దృక్పథాన్ని విశాలపరచినట్లున్నది.

"ఆ రోజు...అదే. సురేంద్ర తిరిగి వెళ్ళకముందు రోజు సాయంత్రం మేమిద్దరం పంటచేలోకి వెళ్ళాం. అది సంధ్యాసమయం. నీలి నింగికి నీరెండ బంగారు పూత పట్టిస్తుంది. చేలల్లోని పచ్చని మొక్కలు పైరుగాలికి ఊగిసలాడుతున్నవి. తెల్లని కొంగలు బార్లు తీరి గూళ్ళకు పయనమైనవి. నాగలికి కట్టిన ఎడ్లను విప్పి ఇంటి ముఖం పట్టాడు కాపు. గడ్డి మోపుల్ని నెత్తికెత్తి వయ్యారంగ నడచి పోతున్నారు కాపు పడుచులు.

ఈ ప్రశాంత సుందరదృశ్యాన్ని చూచి నిట్టూర్చాడు సురేంద్ర. అప్పటి దేశపరిస్థితుల్ని నాకు వివరించాడు. మన సేన పాక్ దుస్తంత్రాల్ని అప్పటికే పసిగట్టింది. తర్ఫీదైన సైనిక దళాలను పశ్చిమ, తూర్పు సరిహద్దులకు పంపుతున్నారు. ఏ క్షణంలో ఏమి జరగనున్నదో ఎవరికెరుక?

ఉన్నట్టుండి సురేంద్ర కొంత ఆవేశంతో ఇలా అన్నాడు: "చూడు లావణ్యా! ఈ గొడవలన్నీ సద్దుమణగిన తరువాత, దేశంలో ప్రశాంతత నెలకొన్నతరువాత నీతో నేనొకటి చెప్పాలి." అంతే. ఆ మరునాడు సురేంద్ర వెళ్ళిపోయాడు'' అన్నది గతాన్ని గుర్తుచేసుకుంటూ లావణ్య.

సురేంద్ర లావణ్యతో ప్రేమ పాఠాలు వల్లించలేదు. ఆ పేదరాలికి అదే పెన్నిధిలాగున్నది. నేనింటికి తిరిగి వచ్చాను. అయినా లావణ్యసురేంద్రల తలపులు నన్ను వీడలేదు. ఏవిధంగానైనా లావణ్యలోని వికృతత్వాన్ని, తనను గూర్చిన తక్కువభావాన్ని పోగొట్టి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించాలన్న పట్టుదల నాకు కలిగిందీ. నాకో ప్లాస్టిక్ సర్జన్ స్నేహితురాలున్నది. ఆవిడకు లావణ్యను చూపిస్తేనో! ఇప్పుడు వైద్యశాస్త్రంలో ఎన్నో అద్భుతాలు చేస్తున్నారు. గుండెను తీసి గుండెను పెడుతున్న కాలమిది. లావణ్య బుగ్గపైన కాలిన మచ్చను, విరిగిన ఎముకను సరిచేయడం కొంత వ్యయప్రయాసలతో కూడిన పనికావచ్చును. కాని— అసాధ్యమేమీ కాదు.

ఊరికి వెళ్ళకముందు లావణ్యను కలుసుకొని విషయాన్ని వివరించాను. "నిన్నొక అప్సరసగ మార్చలేము. కాని, యీ వికారాన్ని పోగొట్టవచ్చు. నా మాటల్నిబట్టి రంగురంగుల భవిష్యత్తును ఊహించకు లావణ్యా! పురుష ప్రయత్నమంటూ చేద్దామంటున్నాను. అంతే. ఆపైన..." — "దైవేచ్ఛ. ప్రయత్నించటంలో తప్పులేదులెండి. మీరన్నట్లు రెండు రోజుల్లో ఆసుపత్రికి వస్తాను." అని మాటిచ్చింది లావణ్య.

వాడు పున్నమి. నిర్మలాకాశంలో పున్నమి చంద్రుడు నిండుగ నిగనిగ లాడుతున్నాడు! అది శుక్రవారం. ముస్లిములకు పవిత్రమైంది. డిసెంబరు 3. వ. తేది, 1971. వ. సంవత్సరం!

అలవాటు ప్రకారం రేడియో ఆన్ చేసాను సాయంత్రం.

"ఆకస్మికంగా పాక్ విమాన దళాలు ఈ సాయంత్రం అమృతసర్ పై విమాన దాడులు జరిపినై. మనదేశ రక్షణార్థం ప్రధాని పాకిస్తానుపై యుద్ధం ప్రకటించారు. రెండు రంగాలలోను" అన్న వార్తలు నన్ను విచలితను చేసినై. యుద్ధరంగాలలోనేమో కాని నా మస్తిష్కంలో ఎన్నో బాంబులు

పేలుతున్నై. నా ఆప్తులు! ఆత్మీయులు ఎందరో నాకళ్ళెదుట నిలిచారు. మూడు నెలల క్రితమే మూడుముళ్ళువేసి పసుగుతీసేడు నావికదళంలోకి మరలా మోహన్. ముక్కుపచ్చలారని ముగ్ధవయస్సులో వున్నాడు విజయపాల్. అతడు వైమానికుడు. ఊహల ఉయ్యాలలో ఊగుతున్న సురేంద్ర సైనిక దళం ఇప్పుడు సరిహద్దులోనే ఉన్నది. ఇలా ఎందరో! ఎందరో! నావాళ్ళందరూ గుర్తుకు వచ్చారు. ఎందర్ని మరలా కండ్లారా చూడగలనో? ఎందర్ని విక లాంగులుగ వీక్షింపనున్నానో!

నా కండ్లలో చిత్తడి. ఎందుకు వచ్చినట్టి యుద్ధం? యుద్ధాలవల్ల అనర్ధాలు తెలిసివుండికూడ ప్రాణాలతో చెలగాటమాడే నాయకుల్ని నమిలి మ్రింగేయాలన్నంత కోపం వచ్చింది. ఎందరు తల్లులకడుపుల్లో చిచ్చు రగుల్తుందో? ఎందరు పత్నులకు పసువుకుంకుమలు కరవవుతవో? ఎందరు సంతానం తండ్రిలేని అనదలౌతారో? ఈ ఆలోచనల సుడిగుండం మధ్య లావణ్య సుడులు తిరిగింది. లావణ్య స్ఫురణతో నాగుండె అగినంత పనైంది.

రేడియోలో యుద్ధవార్తలు ఇంకా చెప్పతూనే ఉన్నాడు. ''భగవాన్! సురేంద్రను చల్లగా చూడు'' అని మనసారా వేడుకున్నాను. లావణ్య ఇప్పటికే విధిఆడే చదరంగంలో ఒకటికి రెండు మారులు ఓడిపోయింది. కాని అదృష్ట వశాత్తు నా సలహా పనిచేసింది. అనుకున్నట్లు లావణ్య నా డాక్టరు ఫ్రెండును కలుసుకున్నది. ఆవిడ హస్తవాసి వల్ల లావణ్య ముఖంపైని మచ్చ పూర్తిగా పోయింది. ఆ సొట్టముక్కు నిటారుగా వచ్చింది! ఇది మూడు ముక్కల్లో చెప్పానుగాని, ఇదంతా జరగడానికి మూడు ఆపరేషన్లు చేసారు ఆరునెలల్లో. ఇప్పుడు లావణ్య చూడటానికి ముచ్చటగవున్నది. అంతే ఆమె అపురూపమైన అందగత్తెగా మారలేదు ఇదివరలో ఆమెలోలేని ఆత్మవిశ్వాసం ఇప్పుడామెకొక నిండుదనాన్ని, కండ్లలో ఓవింతకాంతిని, పెదవులపై ఓ కొంటె నవ్వును ప్రసాదించింది. అవే ఆమెకుపెట్టని తొడవులైనై. శస్త్ర చికిత్స లావణ్య శారీరక వికారాన్నే కాకుండ, అంతకన్నా భయంకరమైన ఆమె మానసిక రుగ్మతను ఛేదించింది. ఇప్పుడామె లోకాన్ని ధైర్యంగా ఎదుర్కొగలదు. ఆ నిబ్బరం ఆ నడకలోనే కనిపిస్తుంది. ఇంతకాలం సురేం ద్రకు తనకు అడ్డుగున్న గోడ పడిపోయినట్లు లావణ్య అనుకోనుండవచ్చు.

ముసి ముసి నవ్వుల్తో నా యెదుట నిలుచున్న లావణ్యను చూచి అంతా సుఖాంత మవుతుందని మురిసి పోయాను. కాని అంతలో ఈ అవాంతరం! విధి తానెంచు కున్న వాళ్ళను అంత సులభంగా తప్పించుక పోనివ్వదను కుంటాను. పిడుగు ఒకే స్థలంలో రెండు మారులు పడదు. కాని విధి ఎక్కుపెట్టే బాణాలు పదే పదే ఒకే లక్ష్యాన్ని గురిచూచి గుచ్చుకుంటవి.

రెండు రంగాలలోను యుద్ధం తీవ్రంగ జరుగుతున్నది. ఎప్పటి కప్పుడు వార్తలందు తున్నవి. మనసేనలు శత్రుదళాలను తరిమికొట్టి ముందుకు చొచ్చుక పోతున్నవి. దేశమంతా ఒక్క త్రాటిమీద నడుస్తున్నది. ఎవరినోట విన్నా యుద్ధవార్తలే. శత్రు విమానదళాలు కూలిపోయినై. నౌకాదళాలు బంధింపబడ్డయి. సరిహద్దుల్లో అతి ఘోరంగ యుద్ధం జరుగుతున్నది.

సైన్యంలో మరణించిన వారి, గాయపడ్డవారి పేర్ల జాబితాను ప్రభుత్వం ఎప్పటికప్పుడు ప్రకటిస్తూ వచ్చింది. అప్పటికి యుద్ధం ప్రారంభమై పది రోజులు. ఆరోజు పత్రికలో క్షతగాత్రుల జాబితాలో సురేంద్ర పేరును చూచాను. నా చుట్టూవున్న వెలుగు ఒక్కమారే తుడిచి పెట్టుకపోయింది.

కొన్నిక్షణాల తరువాత కొంత తెప్పరిల్లాను. యుద్ధం అన్న తరువాత యివి తప్పవు. పోనీలే. ఏకాలో, చేయో పోయినా ఫరవాలేదు. ప్రాణాలు దక్కినై. అంతేచాలు.

నా పనుల తొందరలో తీరిక చిక్కక ఓ నెలనాళ్ళ వరకు పల్లెకు వెళ్ళ లేక పోయాను. ఇంతలో యుద్ధ విరమణమూ జరిగింది, లావణ్య నుండి ఎటువంటి వార్తలూ అందలేదు. కొంత వెసులుబాటు చేసుకొని నేనే పల్లెకు వెళ్ళాను.

* * *

లావణ్య తనగదిలో కిటికీ దగ్గర కూర్చొని శూన్యంలోకి చూస్తున్నది.

"లావణ్యా!" అని మృదువుగా పిలిచాను. తల తిప్పి నన్ను చూచిన లావణ్యలో కొంత చైతన్యం కనుపించింది.

"వచ్చారా? రారేమో ననుకున్నాను" అన్నది. దీనంగున్న ఆమె ముఖం వారాకతో కొంత దీప్తిని పొందింది, తన హృదయావేదన్ని పంచు

కోడానికి వేరెవరూ లేరు గనుక, నాతో చెప్పుకొని కొంత ఊరటిల్ల వచ్చునన్న భావమే కావచ్చు. ప్రశ్నార్థకంగున్న నా ముఖాన్ని చూచి తనే చెప్పనారంభించింది.

"నా ఆపరేషన్లు జరిగిన తరువాత ఇప్పటి నా ఫొటోలు తీసి సురేంద్రకు పంపుదామా వద్దా అని రెండు వారాలు తటపటాయించాను. సురేంద్ర స్వయంగా వచ్చినన్ను చూస్తే బాగుండుననిపించింది. కాని యుద్ధప్రకటన విన్న తరువాత ధైర్యంచేసి విషయాన్నంతా వివరిస్తూ నా ఫోటోలతో ఓ సుదీర్ఘ ఉత్తరాన్ని సురేంద్రకు పంపాను. ఈ సంగ్రామంలో సురేంద్ర తీవ్రంగా గాయపడవచ్చునని అనుకున్నా. నేను ఎదురుచూడనిదే జరిగింది.

ఓ ఉదయం సురేంద్ర నాన్నగారు వచ్చారు. ఆయనను చూస్తేనే తెలిసిపోయింది ఏదో అపసవ్యం జరిగినట్లు. నా ఆతురతను అణచిపెట్టి ప్రశాంతంగనే సురేంద్ర బాగోగుల గురించి అడిగాను.

"ఇంకెక్కడి సురేంద్ర. ఈ జీవితంలో వెలుగును చూడలేని కబోది వాడిప్పుడు" అన్నారాయన అతి గంభీరంగ.

ఆ రోజంతా నేను ఏదో సాకులు చెప్పతూ నాగది విడిచి బయటకు రాలేదు. కాలో, చెయ్యోపోతే కృత్రిమంగ పెట్టుకోవచ్చు. కాని కన్నుపోతే ఆ జన్మాంతమూ అంధకారమే. నాఒళ్ళు కంపించింది.

ఆ గాఢాంధకారంలో తటిల్లత వంటి తలంపు, ఈ ఆపద సంభవింపక పూర్వమే నా ఫోటోను పంపడం ఎంత మంచిదైంది! ఆ మచ్చతో వికారంగున్న ఆనాటి ముఖమే సురేంద్ర మనోముకురంలో నిలవకుండ, ఇపుడున్న రూపును రేఖా మాత్రం గైనా చూడగలిగాడు. నాయీ ప్రయాసంతా తన కొరకే అని తెలుసుకోనుంటాడు. బ్రతుకంతా నేనొక కురూపిని అన్నభావం సురేంద్రకుండదు అని సంతృప్తిపడ్డాను...సురేంద్ర అంధుడని తెలిసినా అతనిపై అనురాగం అణగారలేదు.

వారం రోజుల క్రితం సురేంద్రను ఈ పట్టణపు మిలిటరీ ఆసుపత్రికి పంపారని తెలిసింది. నేను పట్టణం వెళ్ళి డాక్టరును చూడాలన్నసాకుతో సురేంద్రను చూచి వచ్చాను.

నేను వెళ్ళేసరికి సురేంద్రను ఆసుపత్రి డాబాపై ఆరుబయట కూర్చో పెట్టున్నారు. నేనతని ప్రక్కనే కూర్చున్నాను. నర్సు మమ్మల నిద్దరిని విడిచి వెళ్ళిపోయింది. సురేంద్ర నన్ను తడిమి నా చేతిని మొదటి సారిగా తన చేతిలోకి తీసుకున్నాడు. జీవితంలో ఇంకే [illegible] తాకసికి అవసరమేమీ చెప్పక చెప్పినట్లనిపించింది.

సురేంద్ర తన యుద్ధాను భవాలను చెప్పుతూ ఉంటే ఊఁ కొడుతూ కూర్చున్నాను. అంతా ఏదో సర్వసాధారణ సంభవాలులా చెప్పుకపోతున్నాడు. ఆతనికి విధి కలసి రాలేదు. అంతే. నా చేతిని మృదువుగ నొక్కుతూ చెప్పు తున్నాడు.

"లావణ్యా! ఆ రాత్రి నీ దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. నేను ట్రెంచిలో పొంచివున్నాను. అప్పుడందించారా ఉత్తరాన్ని. వెంటనే చదవ డానికి అది చీకటి. జేబులో పదిలంగ పెట్టుకున్నాను. ఆ మంచులో, చలిలో కాచుకొని కూర్చున్నంత సేపు లకోటలాగున్న అంత పెద్దవుత్తరంలో నీవేమేమి కబుర్లు చెప్పావో అన్న ఆతురత కలుగకపోలేదు. నిన్నుగురించిన తియ్యని తలంపులే నాకా చలిలో వెచ్చదనాన్ని కలిగించాయి. అయితే ఆ ఉత్తరం మోసుక వచ్చిన ఊసుల్ని వినే భాగ్యం నాకీనాటికీ కలగలేదు లావణ్యా!" అన్న సురేంద్ర మాటలు విని స్తంభించి పోయాను.

అంటే? సురేంద్ర నా ఉత్తరాన్ని చదవనే లేదన్నమాట. నా ఫోటోను చూడనే లేదన్నమాట. సురేంద్ర చేతితోని నాచేయి కొంచెం బిగుసుకున్నది. నేనింకా సురేంద్ర దృష్టిలో నల్లని మచ్చ, సొట్టముక్కు లావణ్యనే! నా గొంతులో తడి ఆరింది. సురేంద్ర ఇంకా చెప్పుతూనే ఉన్నాడు.

"ఏ నర్సునైనా చదివి వినిపించమని అడిగివుండవచ్చుననుకో. కాని... నీ వుత్తరాన్ని అలా పరాయి వాళ్ళచేత చదివించు కోవాలనిపించలేదు. నీ వుత్తరాల్ని ప్రాణసమంగ ఎంచేవాడిని. ఆ నాటినుండి అది ఈనాటి వరకు నా జేబులోనే ఉన్నది. ఆఁ. చూడు లావణ్యా! ఆ ఉత్తరాన్ని ఇప్పుడు నీ వెందుకు చదివి వినిపించకూడదూ?" అంటూ పసిపిల్లవాడి ఉత్సాహంతో తన జేబులో నలిగి మాసిపోయి, అక్కడక్కడ చినిగినా ఇంకా ముద్ర విడిపోని నా ఉత్తరాన్ని తీసి నాచేతిలో పెట్టాడు. పెల్లుబుకి వస్తున్న

దుఃఖాన్ని దిగమ్రింగే ప్రయత్నంలో నేను మౌనంగుండి పోయాను. ఒక నిమిషమాగి సురేంద్ర—

"లావణ్యా! ఉత్తరం చదవనా?" ఆప్యాయంగా అడిగాడు.

"దానిని ఇప్పుడు చదవట మెందుకులే సురేంద్రా? నాకు నీవు చెప్పే దంతా వినాలనివున్నది. నీ స్వరాన్ని వింటూ కూర్చోవాలని వున్నది" అన్నాను నా కంఠాన్ని సవరించుకుంటూ.

సురేంద్ర దానితో సంతృప్తిపడి ఏదో కబుర్లలో పడ్డాడు. నాకు గొంతెత్తి ఏడవాలనిపించింది. ఇంతలో నర్సువచ్చి సమయమై పోయిందని నన్ను అక్కడినుండి సాగనంపింది.

మాటల మధ్య సురేంద్ర, "లావణ్యా! నీ బుగ్గమీద మచ్చను నన్నుతాకి చూడనీ'' అన్నప్పుడు నాగుండె పగిలినట్లయింది. సురేంద్రకు నేనింకా పూర్వపు లావణ్యనే. మల్లెపూవులాంటి మనస్సునే కోరే సురేంద్ర నేనెలావున్నా పెండ్లి చేసుకోవాలనుకున్నాడేమో! మరి యిప్పుడు...రూపుమారిన నన్ను తానెరుగని లావణ్యనని సందేహించ వచ్చు. అంతేకాదు. నేనిప్పుడు చెప్పినా నన్నొక వింత వ్యక్తిగ, క్రొత్త దానినిగ సంశయించవచ్చు. అతడు మనసిచ్చిన లావణ్యను కాదు నేనిప్పుడు. అలా అని చెప్పక పోయినా జీవితమంతా అతనిని మభ్య పెట్టినదానినవుతాను అది నేనెలా చేయగలను? వేరెవరైనా సురేంద్రకు చెప్పితే. నేనేదో సానుభూతితో అతనిని చేరదీసి, వివాహమాడ సమ్మతిస్తున్నాననుకో వచ్చు. అది నేను సహించలేను.

ఓ భగవాన్! మరలా నా మచ్చ, నాసొట్ట ముక్కు నాకుంటే... ఆ డాక్టరు తిరిగి వాటిని ఇవ్వగలిగితే! ఎంత బాగుండును...చెప్పక్కా చెప్పు. నేనేమి చేయాలో చెప్పు." విలవిలలాడుతున్న లావణ్యను నిస్సహాయంగ చూచాను.

ఏమి చెప్పేది? ఏమి చెప్పగలను. ఎవరి మట్టుకు వారే పరిష్కరించు కోవలసిన సమస్యలు కొన్ని వుంటవి. అటువంటి సమస్యలలో తలదూర్చి సలహాలివ్వడం తెలివి తక్కువే అవుతుంది. చెప్పనలవికాని నీరసం నన్నావరించింది!

లావణ్యను విడిచి వస్తున్న నాకు ఇకఇది ఇంతేనా అనిపించింది. కాక? ఏమో!

లావణ్య కండ్లలోని ఆ స్థిరనిశ్చయం, కష్టాలను కాదనక వాటికి బెదరిపోక నిలబడి పోరాడగల ఆమె ధైర్యాన్ని తలచుకున్నపుడు నాలో ఆశపొడసూపింది. జీవిత పోరాటంలో ఇంతవరకు నెగ్గుకవచ్చిన ఆమెకు అంతిమ విజయం అందదా? ఇన్నాళ్ళుగ ఆమె వెదకుతున్న, ఇన్నేండ్లుగ ఆమెను తప్పించుక తిరుగుతున్న ఆ ఆనందాన్ని ఆమె అంది పుచ్చుకోలేదా?

ఆశకు అంతులేదు. నిరాశకు చింతలేదు.

# ఇక్కడ పూలు పూస్తాయి

కుమారి వి. లలిత

ముక్కుకి సూటిగా చూస్తూ, ప్రయత్న పూర్వకంగా నిటారుగా నిల బెట్టిన నడుముతో నడుస్తోంది సంధ్య. తోపుడు బండి మీద చేతులు బిగుసు కున్నాయి. అందరూ తలలు తిప్పి చూస్తున్నారు. చూడనీ నాకేం అనుకుంది బలవంతాన. బండిలోని వసపిట్టలా వుంగా భాషలో వాగుతున్న చిన్ని ఆకారం కేసి చూడలేదు సంధ్య. తలవంచితే, కనులు కలిపితే కన్నీళ్ళు జారిపోతాయని.

వెనుదిరిగి పారిపోవాలన్న పిరికితనాన్ని నెట్టి వేసింది. పార్కులో చెట్టు కింద ఆగి, పక్క పరిచి పాపని దింపింది. చెట్టు మీదికి కంగారుగా ఎక్కిపోయిందో ఉడత. దాన్ని తరుముతూ యింకొకటి. పిచికలూ, చిలుకలూ, కాకులూ అన్నీ గోలగానే అరుస్తున్నాయి. కాని సంధ్యకి తనవైపు దొంగ తనంగా చూస్తున్నవారి గుసగుసలే సముద్రపు హోరులా వినిపిస్తున్నాయి.

ఈ చూపులను, చెవులు కొరుక్కోటాల్ని తను భరించగలదా? విశ్వ నాథ్‌తో తనని చూసి పలకరింపుగా, ఆప్యాయంగా నవ్వేవారే...పాపనీ తననీ చులకనగా చూస్తుంటే-తను ఊరుకోగలదా?

ఎవరో యీలవేశారు. ఎదురుగుండా కలువలు నిండివున్న కొలను గట్టున చేరిన గుంపు. వీరే విశ్వాని, తనని-ఆదర్శ ప్రేమికులనీ, వల్లకాదనీ అల్లరి చేసేవారు! ఒక చేతిలో కొన్ని పచ్చనోట్లు విసనకర్రలా విరిశాయి.

చివాలున తల తిప్పుకుంది సంధ్య. కేరింతలు కొడుతోంది పాప. ఆ చిన్ని చేతికి తన వేలొకటి అందించింది, సరిగ్గా పాపపుట్టిన నెలలోనే కట్నాలు పుచ్చుకునే వాళ్ళమీద బహిరంగ చర్యలు తీసుకోడం మొదలెట్టింది ప్రభుత్వం. తనకేం లాభించింది? ఈ పరిస్థితి పదినెలల క్రితం వుండి వుంటే?

పాప అనాథ అయివుండదు. తను తాళిలేని తల్లి అయివుండదు. తండ్రిపట్ల తన బాధ్యతే ఎక్కువ అనుకున్నాడు విశ్వా. పెళ్ళిచేసుకుంటాడని-ఎంత నమ్మకం తనకి! ఈ పాప ఉనికీ-అతని పెళ్ళి శుభలేఖా ఒకేసారి ముట్ట డించాయి తనని.

విశ్వా నల్లని జుట్టూ-ముక్కూ సంతరించుకుని బోసి నోటితోనే నిండుగా నవ్వే పాప పునాది-అంత బలహీనమయినదని ఎవరూ చూసినవాళ్ళు

అనుకోరు. సరదాకి మొదలెట్టి-పెళ్ళయ్యాక మానేద్దామనుకున్న ఉద్యోగం-భవిష్యత్తు చీకటి కాదన్న ధైర్యాన్నిచ్చింది. తోడి ఉద్యోగులు, మగవారు, పెళ్ళికాని నడివయస్కులైన స్త్రీలూ, పెళ్ళయిన పతివ్రతలూ వాళ్ళ వెటకారాలూ—చాటుగా అనుకునే మాటలూ భరించడం కష్ట మయింది.

అందీ అందక ఉన్న సంధ్య కాలిని అందుకుందుకు ఎగిరెగిరి పడుతోంది పాప. ఎత్తుకొని గాల్లోకి ఎగరేసి పట్టుకుంది సంధ్య-పాప భాషలోనే తనూమాట్లాడుతూ, దగ్గిర్లోనే సకిలింపులకి పట్టుబడ్డదోషిలా-పాపని దించేసింది.

విశ్వా తండ్రిమటుకు: ఎంత చనువుగా తిరిగేది ఆ యింట్లో తను: సంధ్యకేం బంగారు బొమ్మ అనేవారు. పెళ్ళిమాటలు ఆడాల్సి వచ్చే సరికి బంగారు బొమ్మ చాలకపోయింది. వర్కింగ్ వుమెన్స్ హాస్టల్ వార్డెను-'పసి బిడ్డలకి తావులేదు యిక్కడ, నీకూ తెలుసు. మా హాస్టల్ పేరు పోతుంది' అనేసింది. అదృష్టం కొద్దీ-తనతోటి ఉద్యోగినులు కలిసి వుంటున్న ఫ్లాట్‌లో ఒకమ్మాయి బదిలీ అయి వెళ్ళిపోయింది. వారంతా సహృదయలు. తన వయసువారే. పాప పుట్టినపుడు హాస్పిటల్‌కి కారియర్ తెచ్చిపెట్టి—రాత్రిళ్ళు తోడువుండీ-ఎంతో సాయపడ్డారు. పాపని నెత్తికెక్కించుకుంటారు. చివరికి అది మురికిచేసిన బట్టలు మార్చడానికి కూడా పోటీలు పడతారు. మగవారూ-నడివయస్కులైన స్త్రీలే వ్యంగ్యాలూ, సూటిపోటీ మాటలు.

ఫ్లాట్‌లో అమ్మాయిలే- 'పాపని పార్కుకి తీసి కెళ్ళి తీరాలి నువ్వు-గాలీ వెలుతురూ తగలాలి పాపకి' అని బలవంత పెట్టారు. 'లోకానికి భయపడి లాభం లేదు. పాపని కనిపెంచుదామను కున్నాక నలుగుర్లో నా కూతురని చెప్పి చూపించుకునే ధైర్యం చెయ్యొద్దా. ఎన్నాళ్ళు దాచుకుంటావు పాపని?' అని ధైర్యం చెప్పారు. పౌరుషాన్ని పంతాన్ని రెచ్చగొట్టారు.

నిజమే-తనెందుకు సిగ్గుపడాలి? తనదా తప్పు? పెళ్ళిని వ్యాపారం చేసిన విశ్వా తండ్రిది. పెళ్ళి విషయంలో మాత్రం తండ్రి చాటు బిడ్డ అయిన విశ్వాది. కట్నం ఇచ్చుకోలేని తన ఆర్థిక పరిస్థితిది. కఠోర నిబంధనలలో మనిషిని కట్టి ఉంచే సమాజానిది. మమతని, ప్రేమానురాగాల్ని నలిపివేసే డబ్బు పిచ్చిది. తను చేసిన తప్పల్లా-ప్రేమించి-గుడ్డిగా నమ్మి ఆరాధించడం, పూజించడం.

పెళ్ళి మాట ఎత్తిన స్నేహితురాళ్ళకి-మానవత మీద-మగవారి మీద నమ్మకం పోయింది అని జవాబిచ్చి వూరుకొంది. మరోసారి తన జీవితాన్ని ఛిద్రం చేసుకొనే సాహసం చేయలేదు తను. అనుమానపు నీడలు-అవమానపు మంటలు నిండి వుండే వైవాహిక జీవితం ఎందుకు? అక్కర్లేదు.

తన కాళ్ళ మీద తాను నిలబడగలదు. ఆ ధైర్యం తనకి వుంది. పాపని పెంచి పెద్దచేయగలదు తను. ఈ వెటకారాలూ వ్యంగ్యాలూ వెక్కిరింతల నుంచి పారిపోదు. భరించగలదా అన్న ప్రశ్నే లేదు. భరించి తీరుతుంది తను. ఎన్నాళ్ళు మాట్లాడతారు కనక? విసుగెత్తి మానేస్తుంది లోకం. ఇంకే అమ్మాయీ తనలాగా వంచితురాలు కాకుండా-సహాయపడుతుంది. తనపాప లాయరో-డాక్టరో అవుతుంది. తన హృదయం కాలిపోయిన బూడిద. పాప పెరిగి ప్రఖ్యాతి పూలు పూయడానికి ఎరువవుతుంది.

తన కుటుంబ చరిత్ర పాపని నొప్పించ నివ్వదు. తండ్రి లేని లోటు తెలియనివ్వకుండా పెంచుకుంటుంది తను.

బుగ్గల మీద జారిన కన్నీళ్ళు తుడిచేసుకుంది సంధ్య. చీకట్లు నీడలు పరుస్తున్నాయి-పాపని గుండెలకి హత్తుకుని పెరాంబులేటర్‌లో కూర్చోపెట్టింది. నిరసనగా అటూ యిటూ చూస్తూ నడక సాగించింది. 'నవ్వుతున్నారా-నవ్వుకోండి మీ సరదామీది.' అనుకొంది, సంధ్య తల అప్రయత్నంగానే నిటారుగా నిలిచింది. తన ఫ్లాట్ చేరేసరికి ఆహ్వానించిన స్నేహితురాళ్ళకి-బుగ్గల మీది కన్నీటి చారికలు కంగారు పుట్టించినా-సంధ్య కళ్ళలో వెలుగుతున్న దీక్షా జ్యోతి-ఉత్సాహాన్నిచ్చింది.

ఉదయిస్తున్న నక్షత్రాలు మెరుస్తున్నాయి. రాత్రి ప్రారంభమైనా సూర్యుడు మరణించలేదు.

# అడవి పువ్వు

శ్రీమతి ఆర్. వసుంధరాదేవి

'ఇంటి తలుపు బార్లా తీసుందేమబ్బా. అమ్మా, బాబూ పన్లో కెల్లలేదేంటి' అనుకుంది రాగమ్మ రోడ్డుమీద నుండి తమ పూరింటివేపు చూసి.

కోమటామె యిచ్చిన చద్దన్నం గిన్నె, చిన్న పులుసుగిన్నె ఒకదాని మీద వొకటి పెట్టుకొని ఎడమ అరిచేతిలో భుజం మీదుగా ఎత్తి పట్టుకుని అప్పుడే యిళ్ళ పనులు ముగించుకొని తిరిగొస్తోంది పదిహేనేళ్ళ రాగమ్మ.

సినిమా హాలుకు ఎదురుగ్గా రోడ్డుకు ఆవలివేపున గజం లోతు పల్లంలో తీరూ తెన్నూ లేకుండా వీలునుబట్టి తలకో ప్రక్కకు ముఖంపెట్టి చిక్కురొక్కురుగా కట్టబడ్డ పూరిళ్ళలో ముందుగా రోడ్డు దగ్గరగా వున్నది రాగమ్మ యిల్లు. డబ్బు యిబ్బందులవలన రెండేళ్ళ నుండీ వరి గడ్డి కప్పించనందున కప్పు పాతబడి నల్లబడి కొంత కొంత ఎగిరిపోయి అక్కడక్కడా తాటాకులు కన్పిస్తున్నాయి.

దాదాపుగా అన్ని యిళ్లూ ఆ స్థితిలోనే ఉన్నాయి. ఆ యిండ్లకు వెనుక వైపున యిరవై గజాల దూరంలో వూరి మురుగంతా చేరుతుంది. వాటికీ వూరికీ మధ్యనున్న కాస్త ఖాళీ స్థలము చీకటిపడ్డ తర్వాత వూరివారికి కక్కసు దొడ్డిగా ఉపయోగపడుతుంది.

ఇదివరలో వూరి నడిబొడ్డులో పారిన మలిదేవి చోటు మార్చుకుంటూ దక్షిణంగా జరిగి జరిగి ఆ స్థలాన్ని వూరివారి ఉపయోగాని కిచ్చింది. ఆ చోటు పెద్ద రెడ్డిగారి సొంతం అయింది. ఆయన దాతృత్వాన వాళ్ళు అక్కడ పూరిళ్ళు వేసుకున్నారు. స్థలాన్ని మెరక చెయ్యడానికి రెడ్డిగారు పూనుకోలేదు. వాళ్ళకు చేసుకునే స్తోమతలేదు. పంచాయతీ వాళ్ళు ఏడాది కోమారు మూడు రూపాయిలు పన్ను కట్టించు కోవడం మినహాగా వాళ్ళజోలే పట్టించుకోరు.

వాళ్ళందరూ రెడ్డిగారి ఆశ్రితజనంలోనివాళ్ళు. వారి వదాన్యతకు కృతజ్ఞులై వుండి ఎప్పుడో ఒకసారి ఎలక్షన్లు వచ్చినప్పుడు వారి అభ్యర్థికి వోటు వెయ్యడం మినహాగా మరేమీ చెయ్యలేని చిన్న మనుష్యులు.

నిజంగా రెడ్డిగారు చాలా మంచివారు. వాళ్ళకి అత్యవసరమైనప్పుడు తక్కువ వడ్డీకి అప్పు యిస్తారు, వూళ్ళోని మిగతా పెద్దల్లాగా సమయం దొరికిందే చాలని ఇరవై రూపాయిల వడ్డీలో వాళ్ళకి వూపిరి సలుపనివ్వని వురి వెయ్యరు. కూలినాలి చెయ్యగలవాళ్ళకు వారి చేలలోనే పని యిస్తారు. ఈ మధ్యనే ఎవరెవరు యిళ్ళు వేసుకున్న స్థలాల్ని వాళ్ళే అతి చవకలో అంకణం ముప్పై రూపాయిల లెక్కన సొంతం చేసుకోవచ్చునని చెప్పారు.

ఇంకో పదేళ్ళపాటు అల్లానే గడిపితే చట్టం ప్రకారంగా డబ్బు కట్టకుండానే స్థలం వాళ్ళకే చెందిపోతుందని రెడ్డిగారంటే కిట్టనివాళ్ళు సలహా యిచ్చినా, వినక, ఏ కార్యానికో కూడబెట్టుకున్నది కాస్తో కూస్తో మూలధనం గలవాళ్ళు నలుగురైదుగురు దస్తావేజులు వ్రాయించేసుకున్నారు.

అలాంటి సొంత దార్లలో రాగమ్మ తల్లి సుబ్బమ్మ ఒకతె. రాగమ్మ పెళ్ళికని చేర్చిన రెండొందలూకాక అప్పు చేసిన వందతో కలిపి మూడొందలకు యిల్లు నాదనిపించుకున్నది.

దానితో చేతనున్న డబ్బు పోవటమేకాక అప్పొకటి మీద పడ్డది.

ఇల్లు సొంతం చేసుకున్నందుకు మరో ఫలితంగా రోజుకు రెండు మూడు తగాదాలు పెట్టుకోవలసి వస్తున్నది. వాళ్ళ తాలూకు మురుగునీరూ బూడిదా కసువూ తమ స్థలంలోనికి వచ్చాయని యిరుగు పొరుగులతోను, రాత్రి సినిమా వదిలినప్పుడు హాలుకు ఎదురుగా రోడ్డు కీవలగా సరిగ్గా సుబ్బమ్మ యింటిపైగా అత్యవసరంగా కాలకృత్యాలు తీర్చుకోవలసి వచ్చిన పిన్నలు పెద్దలతోనూ వున్నట్లుండి యుద్ధం ప్రారంభమవుతుంది సుబ్బమ్మకు.

పెద్దగా అరచుకోవడాలూ, తిట్టుకోవడాలూ అయ్యాక యింట్లోకి వచ్చిన సుబ్బమ్మకి మొగుడిమీదా, కూతురిమీదా తగనికోపం వస్తుంది. వాళ్ళిద్దరూ యీ పోట్లాటలలో కలుగజేసుకోరు. సుబ్బమ్మకు తోడుగా మాట్లాడరు, ఇంటి మంచి చెడ్డలు వాళ్ళ కెందుకు కాబట్టవో సుబ్బమ్మకు అర్థంకాదు. గుడ్డోడి సంగతి ఒదిలేసినా చేతికందొచ్చిన పిల్లకీ నిర్లక్ష్యం ఉండటం సుబ్బమ్మకు గిట్టదు. 'బాబూ కూతురూ నాలిముచ్చులు. కర్మకొద్ది దొరికారు' అంటూ తలబాదుకొంటుంది కసిపట్టలేక.

అమ్మ కోపాలు తాపాలూ రాగమ్మ లెక్క చెయ్యదు. నవ్వుకుంటూ తన పని తాను చేసుకుంటుంది.

రాగమ్మ కళ్ళు పెద్దగా గుండ్రంగా మెరుస్తుంటాయి. ముక్కు సన్నగా చిన్నగా వుంటుంది. పెదాలు నాజుగ్గా ఒంపు దిరిగ చక్కటి పలువరుసమీద ఉల్లాసంగా నవ్వుతుంటాయి. రాగమ్మ చామనచాయలో వయసూ నవ్వూ కూడబలుక్కొని ఏర్పాటుచేసిన నిగారింపు వున్నది. ఆ పిల్ల పేదరికాన్ని పట్టిచ్చే భాగాలు, పాచిపనివలన కాస్త మొరటుదేరిన చేతులూ, వెడల్పుగా పెద్దగా వుండే పాదాలూను. రాగమ్మ పనిచేస్తున్న యింటి కోమటామె తన కూతురివి, వెలిసిపోయి పాత బడినవి, పావడాలూ ఓణీలు రాగమ్మ కిచ్చి, ఆ పిల్ల ఒంటిమీద చూశాక 'యింత చక్కటి గుడ్డలు ఎందుకిచ్చానా' అని బాధపడ్డ సందర్భాలున్నాయి,

జీవం ఆనందం తొణికిసలాడే రాగమ్మ అడివి పువ్వు. ఆకుగాని పచ్చదనం లేశంగాని లేని మోడులాంటి చెట్టుకు పూసే పువ్వు. ఆ చెట్టులో ఆ పువ్వు ఉండటం గొప్ప సృష్టివైచిత్రి!

ఎడంచేతిలోవున్న గిన్నెలు జారకుండా వాటిమీద కుడిచెయ్యి బరువుపెట్టి పరుగులాంటి నడకతో రోడ్డుక్రింది పల్లంలోకిదిగి యింట్లోకి వెళ్ళింది రాగమ్మ.

అనుకున్నట్లుగానే అమ్మా బాబూ యిద్దరూ యింట్లోనే ఉన్నారు. తడిక వారగా చాపమీద యిద్దరు అడవాళ్ళు కూర్చొని వున్నారు. కాస్తపతల కుక్కి అయిన నులకమంచంమీద ఇరవై ఏళ్ళ అబ్బాయి కూర్చున్నాడు.

ఆడవాళ్ళలో ఒకామె ఉత్తరపు వీధిలో కొత్తగా మిద్దెయిల్లు కట్టుకున్న కాంతమ్మ అని గుర్తించింది రాగమ్మ. రెండో ఆమె రంగు అద్దిన రేకును కట్టుకుని కుచ్చెళ్ళు ఎగదోపుకున్నది. గ్లాస్కోమల్లురైక కొత్తది పలచగా, తెల్లగా నాజూగ్గా వున్నది. మోకాళ్ళు ఎత్తి పెట్టుకుని చుట్టూ చేతులు తేలిగ్గా బిగించి హుందాగా కూర్చున్నది ఆవిడ. ఇంట్లోకి వచ్చిన రాగమ్మని పరిశీలనగా చూసింది.

మంచంమీద కూర్చున్న అబ్బాయి పీలగా చామ నలుపులో వున్నాడు. బాగా చమురు పూసిన పలచటి జుట్టు మొహమ్మీదికి దారాల్లాగా వేళ్ళాడు

తున్నది. వరుసగానే వున్నా కాస్త పొడుగ్గా వున్న పళ్ళవలన నవ్వకపోయినా నవ్వుతున్నట్లు కనిపిస్తాడు. ఈ అబ్బాయీ రాగమ్మని పరిశీలించి చూశాడు. 'శానా బాగుందే సినిమా ఏక్టరులాగా' అనుకుని తల పంకించుకున్నాడు.

'కాసిని నీళ్ళు పొయిలో ఏసి కోమిటి రత్తయ్య దగ్గిరికెళ్ళి బేడ కాఫీ పొడి పట్టుకరా. డబ్బులు మళ్లీ యిత్తానని సెప్పు. అట్టాగే రాజమ్మ దగ్గర నవటాకు పాలు బోయించకరా' అని కూతురికి చెప్పింది సుబ్బమ్మ.

కాఫీలయ్యాక 'పిల్ల మరీ అబ్బనాకారంగా వుంది' అన్నది రేకు కట్టు కున్నావిడ కాంతమ్మతో. 'పోషణ సరిలేకనే. శేషమ్మా' అన్నది కాంతమ్మ.

అందరూ వెళ్ళడానికి లేచారు. వాళ్ళేమంటారోనని ఆశగా ఆత్రంగా చూస్తూంది సుబ్బమ్మ.

'ఇంటికిబోయి మా అన్న దమ్ముల్తో మాటాడి ఏ మాటా తెలుపుతాము' అన్నది రేకు కట్టుకున్న శేషమ్మ.

'పర్లేదు...మాట్టాడు' అన్నాడు అబ్బాయి.

శేషమ్మ కొడుకుని కొరకొరా చూసింది.

అది లెక్క జెయ్యకుండా చమురుతో తళతళ్ళాడుతున్న జుట్టును మొహమీమ్మీదనుండీ వెనక్కిపోయేట్లు తల ఎగరేసి 'పర్లేదు...మాట్టాడు' అన్నాడు అబ్బాయి.

వాళ్ళని చూస్తుంటే రాగమ్మకి నవ్వు ఆగలేదు. తడికవతలికి వెళ్ళి పోయింది.

శేషమ్మ లేచి నవ్వు తెచ్చిపెట్టుకుంటూ 'మా శంకరానికి పిల్ల నచ్చిం దమ్మోవ్' అన్నది.

* * *

శేషమ్మకు శంకరం ఒక్కడే సంతానం. నెల్లూరినుండీ అంకమ్మ తిరుణాళ్ళకని యీ పల్లెటూరికి తెలిసిన వాళ్ళింటికి వచ్చింది కొడుకుతో సహా. వారూ వీరూ చెప్పగా పనిలో పనిగా రాగమ్మను చూసింది. వాళ్ళ యిల్లూ

తీరూ ఏదీ ఆమెకు నచ్చలేదు. మరీ తూగని సంబంధం అనుకుంది. ఆ పేద రికం చూచి ఏవగించుకున్నది. కాని శంకరం పట్టుపట్టాడు. పెళ్ళిరోజంతా శేషమ్మ మొహం మాడ్చుకునే వున్నది.

తీరా పెళ్ళి జరుగుతున్నప్పుడు యింకో విషయం బయట కొచ్చింది. రాగమ్మ బాబు గుడ్డోడు రోజూ సాయంత్రాలూ నలుగురూ పోగయ్యే పోలీసు స్టేషను ముందరి వేపచెట్టు దగ్గర పంచెగుడ్డ క్రింద పరచుకుని కూర్చుని తత్వాలు పాడుతూ సిగ్గులేకుండా...అడుక్కుంటాడట!

శేషమ్మకి ఒంటినిండా తేళ్లూ జెర్రులూ ప్రాకినై. ఉక్రోషంతో శోకాలు పెడుతూ పెద్దగా అరిచింది.

ఆమెకంటే పెద్దగానే అరిచింది సుబ్బమ్మ మొగుడి మీద. 'నే జెప్తే సెవి నేసుకోకపోతివి. సిగ్గుమాలినోడా. నలుగురూ వూస్తుండారు సూడు. ఇగ పిల్లగతి ఏమైపోతాది' అంటూ ఏడిచింది.

గుడ్డోడు రవణయ్య దిగాలబడిపోయాడు. తన మూలాన కూతురి పెళ్ళికి యిబ్బంది కలుగుతుందని అనుకోలేదు. 'దేవుడు సిన్న సూపు జూసి యిట్టాగయిపొయ్యాను గాని ముందంతా లచ్చనంగా నేత పని జేసుకోని కట్టం సెయ్యలా నేను! రెక్కలు దాసుకున్నానా? ఏపీ సెయ్యలేని అప్రయోజకుణ్ణయిపోయ్యానే అని దీనికి తలపడ్డాను' అంటూ గుడ్ల నీరెట్టుకున్నాడు.

రాగమ్మ లేచివచ్చి బాబును కావలించుకుంది. 'నాకీ పెళ్లొద్దులే అయ్యా' అని బావురుమన్నది.

నలుగురూ కలగజేసుకుని 'యిదివర్లో వాళ్ళు బాగా బతికినోళ్లే' నని నచ్చజెప్పి అయిందనిపించారు.

చిన్న ట్రంకు పెట్టెలో రెండు సాదాచీరెలూ, నలభై రూపాయిలకో పట్టుచీరే పెట్టుకుని బయల్దేరబోతున్న రాగమ్మని చాటుకు పిల్చుకుపోయి ఎవరికీ తెలియకుండా యాభై రూపాయిలు చేతిలో పెట్టాడు రవణయ్య. 'అమ్మాయ్, నేను పనికిమాలినోణ్ణయిపొయ్యాను, మీ అందరికీ బరువు సేట య్యాను. మొగోడూ ఆడదీ గూడా మీ యమ్మే అయ్యి అన్నీ సూసుకుంది... ...నా సేతనయ్యింది యింతేనమ్మా. పెట్టడగు నెట్టుకో' అన్నాడు.

రాగమ్మకి ఏడుపొచ్చింది. 'బాబూ, నువు శానా మంచోడివి' అన్నది ఏడుస్తూ.

రవణయ్యకి సంతోషం కలిగింది. సన్నగా వుండి ఎముకలు పొడుచుకొస్తున్నట్లున్న కూతురి భుజం చుట్టూ చేతులేసి దగ్గరికి లాక్కుని తడుముతూ 'అమ్మాయ్, నాకు సేతనయ్యింది నేను సేస్తుంటాను. నీకేవన్నా కావాలంటే సెప్పంపు' అని ఓదార్చాడు.

* * *

'మంచి సవందం' అని సుబ్బమ్మ మురిసిపోయిందిగాని రాగమ్మకి అత్తగారింట్లో సుఖం కనబడలేదు.

శేషమ్మ సూటీ పోటీమాటలు, ఎత్తి పొడుపులూ రాగమ్మని తికమక జేసేస్తున్నాయి. 'కూలోళ్ళు, అడుక్కునేవాళ్ళు, బురదగుంటలో వుండేవాళ్ళు' అంటూ యిరుగు పొరుగుల్తో చెప్పి ఎద్దేవా చేసేది.

రాగమ్మ తిరుగు మాటాడలేక పోయింది. ఎందుకు వీళ్ళు అట్లాహీనం చేస్తున్నారో తెలియలేదు. తమ వూళ్లో ఉన్నప్పుడు పొయ్యిలోకి పుల్లా కంపా ఏరుకోడానికి తన యీడు పిల్లల్తో కలిసి కాస్తవతల బ్రిడ్జి దగ్గరకువెళ్తే అక్కడ పచ్చటి చేలూ, దూరాన్న వెండిలాగా మెరిసిపోతూ పారే మలిదేవీ, పెద్దరెడ్డిగారి కొబ్బరితోటా చుట్టూ ఎంతందంగా ఉండేవి! ఈ నెల్లూళ్ళో ఏముంది, యీ పక్కిల్లూ, ఆ పక్కిల్లూ! అనుకున్నది. 'మా బాబు ఎంత మంచోడో, యీళ్ళకేం తెల్సు. కళ్ళు బాగున్నప్పుడు వన్నె వన్నెల సీరలు ఎన్ని నేసాడు? రెక్కలు ముక్కలు సేసుకున్నాడు. గుడ్డోడై పొయ్యాడు. అయితే ఏం? రోజూ కోవటికొట్లోనో వోటల్లోనో ఏదో ఒక తీపి మిఠాయి తెచ్చిపెట్టేవాడు. అదక్క తింటుండారా అని అమ్మ నానా తిట్లూతిట్టేది. ఎవరికి లెక్క. మా బాబూ నేను ఒకటి' అని తనకు తానే సర్దిచెప్పుకున్నది. కాని రాగమ్మలోని చైతన్యం గుండెల్లో ముడుచుకుపోయింది. ఏపుగా పెరుగుతున్న మొక్కను పీకి కంకర నేలలో పెట్టినట్లయింది.

తిరువెంగడం బ్రతికున్నన్నాళ్లూ ఆ యింట్లో బాగా జరిగింది. నాలుగు వేల పెట్టుబడిమీద నూలు తెచ్చి రకరకాల అంచులతో రంగుల చీరెలూ

చారల చీరెలూ—ఆ రోజు మోజునుబట్టి నేయించి అమ్మేవాడు. రోజుకు పదీ పదిహేను మగ్గాలవరకూ పని చేయించేవాడు. పెద్ద ఖాతాలు గట్టిగా పెట్టుకున్నాడు. కూలిపోనూ మగ్గానికి సరకును బట్టీ అయిదునుండీ పదివరకూ గిట్టేది. అరెకరం మాగాణితో ప్రారంభించి మొదలుపెట్టిన వ్యాపారస్థుడు పదేళ్ళ కాలంలో అయిదెకరాల మాగాణీ, మిద్దెయిల్లూ సంపాదించాడు. చదువు మీద శ్రద్ధలేక ఆరోక్లాసు చదువుతూ చాలించిన శంకరం సినిమాలూ షికార్లతో కాలం గడుపుతుండగానే తండ్రి దగ్గర పని నేర్చుకోక మునుపే ఒకనాటి రాత్రి చీకటి పడ్డాక చేలల్లోనుండీ వస్తున్న తిరువెంగడానికి చెడ్డ తేలు కుట్టి ఆసుపత్రికి పోయేదోవలోనే చావు వచ్చింది...రాబడి తగ్గిపోయింది. ఖర్చులు తగ్గలేదు. శేషమ్మది భారీ చెయ్యి. పిండివంట చేసినప్పుడు గంపనిండా చెయ్యాల్సిందే, పలకరించను వచ్చినవాళ్ళకీ యిరుగు పొరుగులకీ తలా కాస్త పంచాల్సిందే. లేకుంటే ఆమెకు తోచదు. 'మీకేమమ్మా, కూర్చుని తినగల వాళ్ళు' 'నీ చేతి వంటేవంట' అని వాళ్లూ వీళ్లూ అంటూంటే సంతోషంతో పొంగిపోతుంటుంది. చూస్తూండగానే వచ్చేపోయే చుట్టాలతో అన్నీ అత్యవసర మనిపించే అనేకమైన ఖర్చులతో యీ ఏడెనిమిదేళ్ళల్లో నాలు గెకరాలు అమ్ముడు పోయింది. మిగిలిన ఎకరం మాగాణి తనఖా క్రిందకు పోయింది. పెళ్లికోసం యింటిమీద మూడు వందలు అప్పు తెచ్చారు. అయినా పులుసూ చారూ అంటూ, పట్టుకెళ్ళడానికి చిన్న చిన్న గిన్నెల్తో రోజూ ఒచ్చే వాళ్ళున్నారు. గంపలో యిడ్లీలు అమ్మే సీతమ్మ రోజూ ప్రొద్దున్నే రావలసిందే. కాఫీ లేకపోతే రోజు గడవదు....

'రాగాం, పిండి రుబ్బెయ్యవే...అన్నంలోకి నాలుగు గారెలు కాలుస్తాను' 'నా బిడ్డకి నీళ్లు మసిలిపోవాలే...ఇంకా రెండు కట్టెలు పెట్టి బాగా కాయి...' 'ఇవాళ కోవూరు చుట్టాలు వొస్తామన్నారు. పైనుండే పెద్ద దబరాలు దించి శుభ్రంగా తోమి పెట్టు...కాసిని శనగపప్పు ఉడకేసి బెల్లంవేసి పోళీలు కాలుస్తాను...' ఈ పురమాయింపులు యిళ్ళపనులు చేసిన రాగమ్మకు క్రొత్తాకాదు, కష్టమూ కాదు. కాని ఎందుకో అక్కడికీ యిక్కడికి తేడా వున్నది. రాగమ్మకు బెంగ పట్టుకున్నది. ఇల్లు దాటి నాలుగడుగులు వేస్తే కళ్ళనిండుగా కన్పించే చేలూ, తోటలూ, అమ్మ కోపాలూ, బాబు ముద్దూ—అన్నీ గుండెల్లో నిండిపోయి ఏ పనిచేసినా వుల్లాసంగా వుండేది. అన్నీ ఠీవూరికే నవ్వొచ్చేది....

యిక్కడ అట్లాగుకాదు. బ్రతుకు బ్రతికినట్లు కాకుండా దానంతటదే నీరసంగా గడిచి పోతున్నట్లుంది.

శంకరయ్య తన అవసరాలకు మించిన మిగతా విషయాలన్నీ నిశ్చింతగా తల్లిమీద ఒదిలేస్తాడు. 'నువ్వేదైనా పని చూసు కోకపోతే జరగదురా' అని శేషమ్మ కొడుకుతో అప్పుడప్పుడు చెప్తూనే వున్నది, 'సూస్తావున్నా... సూస్తావున్నా' అంటాడు శంకరయ్య.

రోజూ వచ్చి చిన్న గిన్నెతో కూర పట్టుకేళ్ళే తులిశప్ప ఒకనాడు 'నీ కోడల్ని నాతోపాటు కూలిపనికి పంపరాదూ' అన్నది. శేషమ్మ కళ్ళ నీళ్ల పెట్టుకుంది. 'నవ్వండమ్మా, నవ్వండి. మీ యిచ్ఛ వచ్చినట్లు నవ్వండి. తెలియక పోయి యీ సంబంధం కట్టు కొచ్చాము...కూలి పనికి రమ్మంటావు. ఇళ్ళ పనికీ పొమ్మంటావు' అన్నది. తులిశప్పని చూస్తేనే రాగమ్మకి భయం. మాట మామూలుగా మాట్లాడుతూందో ఎద్దేవా చేస్తుందో కనుక్కోనివ్వకుండా మాట్లాడుతుంది.

ఒకనాడు రాత్రి శంకరయ్య సినిమా కెళ్లాలని తొందరగా అన్నం తింటూవుండగా శేషమ్మ పని మాట కదలేసింది. 'అయిస్కూల్లో జవాను పని కాళీ వుందంట గాని ఎడ్మాస్టరోళ్ళకి యింట్లో పనికి మనిషి కావాలంట. జవాను యింటో ఆడమనిషి అరికి పని చెయ్యాలంట' అన్నాడు.

'ఎంతిస్తారు జీతం?' అనడిగింది శేషమ్మ ఆత్రంగా.

'వంద' అన్నాడు శంకరం అన్నం గబ గబా నమిలేస్తూ.

శేషమ్మ కాసేపు మాటా పలుకూ లేకుండా వుండి 'ఆ పనికీ యీ పనికీ లంకేమీ టంటా...' అన్నది. మళ్ళీ 'యీ పనన్నా దొరికితే కాస్త గట్టెక్కినట్టు' అన్నది రాగమ్మ వైపు చూస్తూ. రాగమ్మ మాట్లాడలేదు. 'ఏవన్నా అవనీ, నాకేం' అనుకుంది. శంకరయ్య సినిమా కెళ్లాడు. ఆ ఉద్యోగం మాట వాయిదా పడిపోయింది.

* * *

ఇంతలో రాగమ్మ గర్భవతి అయింది. మనవడు పుట్టబోతున్నాడని

శేషమ్మ చాలా హడావుడి చేసింది. అందరితోనూ ఆ విషయమే మాట్లాడేది. రాగమ్మకి మాత్రం ప్రత్యేకంగా ఏమీ అనిపించలేదు.

నల్లగా సన్నగా ఎలుక పిల్లలా వున్న కొడుకుని చూసినప్పుడూ ఏమీ అనిపించలేదు. వాడికి సినిమా నాగేశ్వరరావని పేరు పెట్టాడు శంకరయ్య. వాడికి ఆకలయినా చలేసినా కళ్లు గట్టిగా మూసుకుని మొహమంతా సొటలూ మిట్టలూచేసి నోరంతా తెరచి వోపికకొద్దీ అరవటమూ, నల్లటి చిన్న నోటితో పాలకోసం ఆత్రంగా తడుముకోవటమూ చూసి 'పిచ్చెదవా, నీకేం తెలవదు' అంటూ నవ్వుకుంటూ గుండెల కదుముకున్నది రాగమ్మ. మూడోనెల పడ్డాక వాడు కడుపు నిండి ఆడుకుంటున్న సమయాల్లో తల్లి కనపడగానే గుర్తుపట్టి ఆనందంతో దవడలు నొక్కుకుపోయేట్లుగా చేతనయినంతగానూ తెరిచి, కాళ్లూ చేతులూ గాలిలో మరింత జోరుగా ఆడించేసి కళ్ళతోనూ ఒళ్ళంతటితోనూ నవ్వినప్పుడు 'నాగేశూ, ఏందిరా అంత నవ్వూ' అంటూ వాడిని ముద్దుల్తో ముంచేసి వాడితో కలిసి నవ్వింది.

సుబ్బమ్మ వచ్చి మనవణ్ణి చూసి రంగు రంగుల వాయిల్ చొక్కాలు నాలుగు, పౌడరు డబ్బా, సబ్బు బిళ్లా, కస్తూరి మాత్రలూ, పది రూపాయిలూ యిచ్చివెళ్లింది.

రాగమ్మకు కాన్పు అయి కొడుకు పుట్టేసరికి అప్పు భూతంలా ఎదురైంది. ఇల్లు అమ్మెయ్యాల్సిన పరిస్థితి వచ్చింది.

'ఆ బళ్లో జవాను పని మళ్ళీ కాళీ ఒచ్చింది. ఎవడో సాకలాడికిస్తే ఆడి పెళ్ళాం యింట్లో పని సరిగ్గా సెయ్యకుండా అమ్మగార్నే ఎదిరిచ్చి మాట్టాడి, ఆడో గండాగొండిగావుంటే తీసిపారేశారంట' అన్నాడు శంకరయ్య ఒకనాడు.

'అయ్యో పాపం. మరి సాకలోళ్లకి యిటాటి పనుల్లోలకి ఒంగి సస్తదా. అదీ గాకుండా అట్లాటోళ్ళకి అయ్యవార్లకి మనకి మల్లేనే ఇల్లు శుభ్రం, ఒల్లు సుబ్రం, పని సుబ్రం ఉండాలి... ఎట్టాగైనా ఆ పనిలో చేరేట్లు చూడరా నాయినా' అన్నది శేషమ్మ.

మరునాడు మధ్యాహ్నం హైస్కూలు వాచ్‌మేనూ శంకరయ్యా వచ్చి రాగమ్మను హెడ్మాస్టరుగారింటికి తీసుకెళ్లారు.

'...పని శుభ్రంగా ఉండాలి, మీ ఎడ్డీ మడ్డీ పనులు మాకు పనికిరావు. ఒళ్లు దగ్గర పెట్టుకొని పని చెయ్యాలి. రెండు పూటలా యిల్లు అద్దంలాగా తుడవాలి. మాయింట్లో వాడేది మామూలు చీపురు కాదు. పట్నంలో అమ్మే కుంచెలు...వారానికోసారి యిల్లు కడిగి బిందెలూ కళాయిలూ తోమాలి. దొంగ తనం అన్నమాట వినపడకూడదు...' హెడ్మాస్టరుగారి భార్య కఠినంగా హెచ్చరికలుచేస్తోంది.

ఆమె కట్టుకున్న లేత ఆకుపచ్చ జరీ అంచు వెంకటగిరి చీరెనూ, ఆమె మాట్లాడుతున్న తీరునూ చూస్తూ నిల్చుంది రాగమ్మ. శంకరయ్య దారప్పో గుల్లాంటి జుట్టును మొహమ్మీద నుండి పక్కకి పోయేట్లు తల ఎగరేసి 'పని బాగా సేస్తది లెండి' అన్నాడు. ఆమె సందేహంగా యిద్దరివేపూ చూసి 'సరే రేపు తెల్లారుజామున్నే ఒచ్చెయ్యి' అని చెప్పింది.

అన్నం లేదు. జీతం మూడు రూపాయలు—బళ్లో యిచ్చే వంద కాకుండా.

*　　　*　　　*

నాగేశు పుష్టిగల పిల్లవాడు కాలేదు. ఎప్పుడూ జలుబో జ్వరమో విరేచనాలో ఉంటూనే వుండేవి. శేషమ్మ అమ్మలక్కలందరి సలహాలతోనూ కస్తూరిమాత్రలూ సొంటిమాత్రలూ వాడుతూనే ఉంది. రెండు రూపాయిలకు గ్రైప్‌వాటర్ అనే పళ్ళరసం సీసా కూడా తెచ్చి వాడింది ఎవరో చెప్పగా. అయినా వాడికి ఒకటి తగ్గితే ఒకటిగా ఏదో ఒక నలత ఉంటూనే వుంది. ''ఏవిటో, మారకంగాదు. వాళ్ళమ్మసాలు'' అన్నది శేషమ్మ విసుగు పుట్టి.

ఒకసారి జలుబూ విరేచనాలూ రెండింటిలోనూ జ్వరం ఫెళ్ళున కాస్తూ పిల్లవాడు తల్లక్రిందులయిపోతుంటే రాగమ్మ పనినుంచీ తొందరగా వచ్చి వాడిని వూరి కాచివర వున్న ధర్మాసుపత్రికి తీసుకెళ్లింది. రెండు గంటలసేపు నిలబడ్డాక డాక్టరు చూసి ఇంజక్షను రాసిచ్చాడు. అది వేయవలసిన నర్సు ముఖంలో చిటచిటలతో, 'ముందుగానే రాకూడదూ' అంటూ రుస రుసలతో సూదిలో మందు తెచ్చింది. ''పిల్లాడి కాళ్లూ, నడుమూ కదల కుండా గట్టిగా పట్టుకో'' అన్నది. ఆవిణ్ణి సూదినీ చూసి అర్థంకాక తల్లిని కరుచుకుపోయాడు నాగేశు. రాగమ్మకి గుండె దడదడ లాడింది. నాగేశు వీపుని ఒక చేత్తోనూ,

కాళ్ళను ఒక చేత్తోనూ గట్టిగా కదలకుండా పట్టుకుంది. నర్సు సూదిని ఒక్క పూపుతో లోనికి గుచ్చింది. అది లోపలికిపోయి ఫట్ మని విరిగింది. 'పిల్లాణ్ణి కదలనివ్వద్దంటే మొద్దుమాదిరి నిల్చున్నావు' అంటూ తిడుతూ బయటికి కన్పిస్తున్న కొనని పట్టుకుని సూదిని బయటకు లాగింది నర్సు. ఇంకో సూది తెచ్చి దానితో మందు ఎక్కించింది. నాగేశు గిలగిల్లాడిపోయాడు. రాగమ్మకు ఒళ్ళంతా చెమటలు పోసినై. కొడుకుని గట్టిగా కావిలించుకొని ధర్మాసుపత్రిలో నుంచీ బయట బడింది. మళ్ళీ ఆ చాయలకు వెళ్ళడానికి ధైర్యం చాలలేదు.

నాగేశుకి ఒంట్లో బాగా లేనప్పుడు రాగమ్మ పనికెళ్తుంటే ఏడ్చేవాడు. మరీ ఏడ్చినప్పుడు చంక నేసుకు తనతోటే తీసుకెళ్ళేది. వాడిని ముందు వరండాలో ఒక ప్రక్కగా విడిచిపెట్టి తన పని చేసుకునేది. ముక్కులో నుండి నోట్లోకి చీమిడి కారుతుంటే నోట్లో నాలుగు వేళ్ళు వేసుకుని ఒళ్ళంతా చొంగ కార్చుకుంటూ ఓ ప్రక్కగా గోడవారగా కూర్చోని పెద్దకళ్ళతో బయటకీ లోపలికీ తిరిగే పిల్లల్నీ పెద్దల్నీ చూస్తూ కూర్చునేవాడు, మధ్య మధ్యన రాగమ్మ వచ్చి తన చీరకొంగుతో వాడి ముక్కు తుడిచి మొహమ్మీద పడే దూది లాంటి ప్రాణంలేని జుట్టును పైకి సర్ది ముద్దు పెట్టుకునేది. తల్లిని చూడగానే వాడి మొహంనిండా సంతోషం పాకిపోయేది. రాగమ్మ అటు వెళ్ళగానే యథాప్రకారం వచ్చేపోయే వాళ్ళను చూస్తూ కూర్చునేవాడు.

సన్నగా నల్లగా వున్న ఆ చీమిడి పిల్లవాడిని చూడగానే అమ్మగారికి చీకాకు వచ్చేది. 'ఈ జలుబులూ విరేచనాలూ జ్వరాలూ వుండే పిల్లవాడిని పిల్లలుండే యింట్లోకి తెచ్చి ముందర పెడితే ఎలాగే, రాగాం. ఏం, కాసేపు యింట్లో వుండ లేడంటనా?' అని కేక లేసేది ఒక్కోసారి.

ఆ ఏడాది నాలుగుసార్లు పెద్ద తుఫాన్లు వచ్చినై. మంచి కోతల సమయంలో వచ్చిన గాలివాన పంటల్ని చాలావరకు నాశనం చేసింది. ఆకాశం రెండు నెలలపాటు మూసుకుపోయేవున్నది. సూర్యుడు బలహీనంగా కాంతి లేకుండా కాసేపు కనబడి మాయమై పోయేవాడు. నాగేశు యీ రెండు నెలలూ నలతగానే వుండి మరీ చిక్కిపోయాడు. రాగమ్మ మనసుకు మబ్బు కమ్మేసినట్లయి ఏవిటో మూగ బాధగా వుండిపోయింది.

'ప్రపంచానికే ప్రళయకాలం వచ్చినట్లుంది. మనుషులు మంచీ చెడ్డా

మర్చిపోయి డబ్బు మోజులో పడిపోయారు. కాకపోతే యీ తుఫాను లేమిటి, సూర్యుడే కనబడకపోతుంటేనూ' అనుకుంటున్నారు ముసలివాళ్లూ, పాతకాలపు వాళ్ళూను.

ఇటువంటి సమయంలోనే వూళ్ళో అక్కడక్కడా పిల్లలకు చెడ్డ జ్వరాలు తగులుతున్నాయని తెలిసింది. నెలగడిచే సరికి పిల్లలుండే వాళ్ళందరికీ మాట్లాడుకోవడానికి అదే ముఖ్య విషయమై పోయింది.

హెడ్మాస్టరుగారి మూడేళ్ళ కూతురికీ తొమ్మిదేళ్ళ కొడుక్కూ ఆ జ్వరం రాకుండా ఉండడానికి ముందుగానే ఏదో మందు వేయించారు. 'నీవు కూడా వేయించరాదూ. జబ్బు రాకుండా వుంటుంది' అని రాగమ్మకి సలహా యిచ్చింది అమ్మగారు.

రాగమ్మ యింటికొచ్చి చెప్పింది. అది డబ్బు ఖర్చుతో కూడుకున్న పని.

"ఏం మందులో. పూర్వకాలంలో యిట్టాటివన్నీ వేసి పిల్లల్ని పెద్ద జేశామా? ఆ మందులన్నీ కలసి అసలే అబ్బనాకారపు వాడికి ఉడుకు జేస్తయి' అన్నది శేషమ్మ.

'సూద్దాంలే' అన్నాడు శంకరయ్య.

అక్కడో పిల్లాడు పోయాడనీ, యిక్కడో పిల్లకు కాళ్ళు పడిపోయాయనీ వార్తలు విన్న రాగమ్మ శంకరయ్యని మళ్ళీ హెచ్చరించింది.

'మేం అయ్యన్నీ లెక్క లేసుకున్నాం. తడవకు అయిదు రూపాయిల లెక్కన మూడు తడవల మందుకి పదేనురూపాయి లౌతాయి. అంతకంటే జెరం తగిల్తే మందుకి తక్కువవుతది. వాస్ మేనూ, సీపరూ అందరూ అట్టనే అంటుండారు. ఇప్పుడు డబ్బు గూడా సేతిలో లేదు' అన్నాడు.

తరువాత నాగేశుకి ముమ్మరంగా జలుబు చేసింది. రెండు రోజులు జ్వరం తగిలింది. కాళ్ళు చచ్చుబడి పోయాయి.

'అయ్యో దేవుడా. యిదేం కాలమో. యీ కొత్త రోగా లేమిటో! మేం ఎరగం యిట్టాటివి. ఈ అక్కుపచ్చి పిల్లాడికి యిదొకటి పెట్టాడమ్మా దేవుడూ?' అంటూ అందరికీ చెప్పుకొని శోకాలు పెట్టింది శేషమ్మ.

బాగా తిరిగి ఆడుకుంటున్న పిల్లవాడు కదల లేకుండా మంచం మీదనే వుండి పోవటం రాగమ్మకు కష్టంగా వున్నది. మంచం మీద పడుకుని పీక్కు-పోయిన మొహంలోంచీ మరీ పెద్దగా కనబడే కళ్ళతో అందర్నీ వూరికే చూస్తూ పడుకునేవాడు. తల్లిని చూడగానే వాడి మొహంనిండా నవ్వు విరిసేది. రాగమ్మ కూడా నవ్వేది. 'ఒరే నాగేశూ, నీకు బాగయినాక నాతో పాటు అమ్మ గారింటికి తీసుకెల్తా లేరా' అని చెప్పేది. జబ్బు చేసినప్పటి నుండీ వాడంటే రాగమ్మకు మరీ ప్రాణమై పోయింది.

నెల్లూరికి యిరవై మైళ్ళలో వుండే పల్లెనుండి శేషమ్మ అక్క-పిల్లవాడిని చూడటానికి వచ్చింది. పదిరోజులుండి గుడ్డలు కుట్టించుకుని కావలసిన సరుకు లన్నీ కొనుక్కొని సినిమాలన్నీ చూసి తిరిగివెళ్తూ "మా వూళ్ళో ఆయుర్వేద వైద్దుగుడున్నాడు. శానామంది సచ్చురోగాలాళ్ళు ఆయన దెగ్గిరికి పోతండారు. వీడిని గూడా తీసకపోయి సూపిద్దాం" అన్నది.

ఇరవై రూపాయిలు చేత బట్టుకొని మనవణ్ణి ఎత్తుకొని బయల్దేరింది శేషమ్మ. వాడు వెళ్ళుతుంటే రాగమ్మకి చెప్పలేనిదిగులు వేసింది. 'నేనూఒస్తా' నన్నది.

'ఇంటో ఎవురూ లేకుండానా? ఎడ్మాస్టరు అయ్యవారింటో పని మాటెట్టా? అంతగా అయితే మల్లీ ఒద్దువుగాని' అన్నది శేషమ్మ.

నాగేశు వెళ్ళినప్పట్నుండే కాలూ చెయ్యీ ఆడక మతి పోయినదాన్లా వుండిపోయింది రాగమ్మ. ఇంట్లో కూడొండుతున్నా, అయ్యవారింట్లో పని జేస్తున్నా 'వాడేం జేత్తన్నాడో. ఎట్టా గున్నాడో. నే లేనని బెంగపడ్డాడేవో' అనుకునేది.

పది రోజులు తిరక్కుండానే ఆ వూరినుండి నాగేశు పోయాడనీ, వెంటనే రమ్మనీ కబురొచ్చింది. రాగమ్మ ఆవురావురంటూ ఏడ్చింది. కడుపులో ఏడుపు పొర్లుపొర్లుగా వస్తుంటే కుళ్లి కుళ్లి ఏడ్చింది. శంకరయ్య అప్పటి కప్పుడు రెండు రోజులు శెలవడిగి వచ్చాడు. బస్సులో కూడా ఏడుస్తూనే వుంది రాగమ్మ. నోట మాట మాత్రం రాలేదు. పచ్చి మంచి నీళ్ళు గూడా ముట్టలేదు. పిల్లవాడు కనబడగానే కట్టెలాగా నిగుడుకుపోయిన వాడిని గుడ్డల

తోటే ఎత్తుకుని గుండెల కదుముకుంది. శోకంపొంగు తగ్గుతూవుండగా 'వాసన గొడతన్నాడు. తరవాత పని కానియ్యా'లని బలవంతాన రాగమ్మ దగ్గర్నుండీ పిల్లవాణ్ణి లాక్కున్నారు. మీద గుడ్డ లేకుండా చేసి టవలులో చుటుకుని శంకరయ్య భుజాన వేసుకున్నాడు. మొగవాళ్ళంతా వెళ్ళి పోయారు. తెలివి లేకుండా బిళ్ళ బీటుగా పడిపోయింది రాగమ్మ...

* * *

ఇంటి కొచ్చాక రాగమ్మకి బ్రతుకంతా అయోమయం అయిపోయి నట్లయింది. 'అమ్మా బాబూ దగ్గరుంటే బాగుండు' ననిపించింది. ఎవరిమీదో చెప్పరాని కసి పుట్టుకొచ్చింది. బలహీనంగా చూసే వాడికళ్లూ, రోగంతో వాడి పోయిన ఒళ్లూ కళ్ళముందున్నట్టే వుండేవి. దూదిలాగా మెత్తగా ప్రాణం లేకుండా వుండే వాడి జుట్టు చేత్తో తాకినట్లే వుండేది, 'వాడు ఎవరి కేవపకారం జేశాడు? ఎవురికి బరువయ్యాడు? కాళ్ళు లేక పోతేనేం, నా కడుపులో పెట్టుకు కాపాడుకునేదాన్ని. భగవంతుడికి నాయం లేదు' అనుకున్నది.

శంకరం పనిలో చేరగానే 'అది నాలుగు రోజులు రాకపోయినా పర్లేదు. అమ్మగారు నిన్ను రమ్మన్నారు' అంటూ శేషమ్మని హెడ్మాస్టరుగారింటికి పనికి తీసుకెళ్ళాడు. 'నాలుగు రోజులే కదా' అని మనసు గట్టి జేసుకుని విధిలేక బయల్దేరింది శేషమ్మ. శుభ్రంగా గులాబీపువ్వులా వున్న చలవరేకు కట్టుకుని సన్నగా తల దువ్వి కొప్పు పెట్టుకుని తెలిసిన వాళ్లింటికి వెళ్ళినట్లు వెళ్ళింది. అమ్మగారితో కబుర్లు చెబుతూ నిదానంగా పని చేసుకుని ఆలస్యంగా యింటి కొచ్చింది. చాటంత మొహంతో 'అమ్మగారు బలే మంచిది. ఎంత బాగా మాట్టాడుతుంది!' అంటూ ఒకగిన్నెడు పులుసూ మజ్జిగా తెచ్చింది.

నాలుగు రోజులయ్యాక 'చచ్చు రోగం వచ్చినవాడు పోయిందే వాడికి హాయి. వూరికే కూచుంటే మరీ దుఃఖం, రాగాంని పనిలోకి రమ్మను రేప ట్నుంచీ అన్నది అమ్మగారు' అంటూ ఆవిడిచ్చిపంపిన పాత చీర తెచ్చింది.

పెద్ద ఎఱ్ఱ చుక్కలుండే గులాబీరంగు వాయిల్ చీర. ఆమె ఆ చీర కట్టుకు తిరుగుతుంటే ఆ రంగుల్ని కన్నార్పకుండా చూస్తూ వుండేవాడు నాగేశు అన్న సంగతి గుర్తు కొచ్చింది రాగమ్మకి. అప్పుడు ఆ అమ్మగారు

నాగేశుని చీదరించుకున్నది. ఇప్పుడు వాడు పోయాక ఉదారంగా చీర యిచ్చి పంపింది. 'ఎవరిక్కావాలి. ఎదవసీర' అనుకున్నది. 'నే నింక ఆ పన్లోకి పోను' అన్నది.

శేషమ్మకి చాలాకోపం వచ్చింది. 'లోకంలో మనకేనా కష్టవొచ్చింది? ఏం అంత అబ్బురం!' అంటూ విసుక్కుంది.

ఇంకో పది రోజులకు పదిసార్లు రాగాంని రమ్మని చెప్పిపంపాక అమ్మగారికి కోపం వచ్చింది.

'ఏదో ఒక వంక పెట్టుకొని ఇంట్లో పనిఎగ్గొట్టి వుద్యోగం మిగిలించు కుందా మనుకున్నారా? ఈ శేషమ్మ మాకు పనికిరాదు. ఎంత సేపూ లోకాభి రామాయణం మాట్లాడుతుంటూ యీడ్చుకుంటూ పనిజేస్తుంది. పైగా కూరలు కావాలి, అన్నం కావాలి, గుడ్డలు కావాలి. అన్నిటిమీదా ఆశే. రాగాం ఒస్తే ఒచ్చినట్లు. లేకపోతే సీ వుద్యోగం పోయినట్లే' అని ఖండితంగా చెప్పింది శంకరంతో.

నాగేశు పోయాడని వార్త తెలిసి సుబ్బమ్మ వచ్చింది. తల్లిని చూడగానే రాగమ్మకి ఒక్కసారిగా దుఃఖం కట్టలు తెంచుకుంది. తల్లిని కావిలించుకుని ఒకటే ఏడుపు.

'బగమంతుడికి యింత పెపంచంలోనూ వాడే బరువయ్యాడే. బగ మంతుడికి నాయం లేదు. వాడులేకుండా నేనెట్టా బతికేది? నేనూ చచ్చిపోతానే' అంటూ బావురు మన్నది.

సుబ్బమ్మ కూతురి తలా వీపూ నిమురుతూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. 'సాల్లే వూరుకో. ఇంత పెపంచకంలో కట్టం లేనోళ్ళున్నారా? అందరూ బతకటంలా? కడుపుతీపి ఆ నిమిసాని కట్టా అనిపిస్తది. బగమంతుడిని తప్పు పట్టేవాళ్ళమా మనం?' అంటూ గట్టిగా కేకలేసింది.

'నోరు లేదు గాని వాడికుండే బెమత ఎంతదని? మనిసి కనబడగానే ఎంత సంబరం బడిపోయ్యేవాడు? ఎర్రినాయన! ఏ అర్ధంరేత్తిరి మెలకూ ఒచ్చినా అప్పుడు నా కడుపులోకి దూరి సీరకొంగు మొగాన కప్పుకుని నిద్ర

బొయ్యేవాడు. ఎక్కడున్నాడో. ఏం జేత్తన్నాడో' అన్నీ వైనవైనాలుగా తలచుకు తల్లితో చెప్పుకున్నాక రాగమ్మకు గుండెల్లో బరువు కాస్త తెరిపి యిచ్చినట్లయింది.

'ఇప్పుడు మంచి రోజులు గాదు. సుక్కోదురంటుండారు. మూడోనెల్లో మీ యిద్దర్నీ యింటికి తీసుకెళ్ళి గుడ్డలు పెడతాను. అందాకా ధైర్యంగా వుండు. నీ బాబు నువ్వెట్టుండావోనని మరీ బెంగెట్టుకున్నాడు' అని చెప్పి వూరి కెళ్ళిపోయింది సుబ్బమ్మ.

వుద్యోగం పోయేసరికి అప్పులవాళ్ళు బాకీలు తీర్చమని తొందర పెట్టారు. విధిలేక యిల్లు అమ్మి అప్పులు తీర్చి తులిశప్ప యింటిదగ్గరగా ఒక అద్దెయింట్లోకి మారారు. చిన్న పూరిల్లు. అద్దె నెలకి ఆరు రూపాయలు. సొంతయిల్లు పోయినందుకు శేషమ్మ కడుపు తరుక్కుపోయినట్లుగా ఏడిచింది. అప్పట్నుండీ సగంప్రాణం పోయిన దానిలా వుండిపోయింది.

'ఎంతటి సంసారం ఎంతట్లోకి దిగజారి పోయింది! కోడలు కాలు మోపినప్పట్నుండీ అంతా ముదనష్టం అయిపోయింది. శివాలయంలో నవగ్రహాలకు శాంతిచెయ్యించాలి' అన్నదిగాని చేయించలేదు.

శేషమ్మకి డబ్బుకి కటకట అయిపోయింది. ఏమీలేనివాళ్ళకి ఎవరూ అప్పు లివ్వడం లేదు. ఇంట్లో గింజ కూడా లేని రోజు వచ్చింది. ''ఏరా శంకరం, యీ పూటకి యింటో గింజ లేదు! ఏం జేసేదిరా' అంటూ తలపట్టు కూర్చుంది శేషమ్మ.

'ఏదన్నా పని కాళీ పడద్దని సూస్తా వున్నా. అందాకా ఎట్టనో' అన్నాడు శంకరయ్య.

శంకరయ్య ఉద్యోగం పోయినప్పటి నుండీ శేషమ్మ కోడలితో మాట్లాడటం మానేసింది. నాగేశు పోయినప్పటినుండి అత్త మొహం చూడాలని బుద్ధి పుట్టలేదు రాగమ్మకు. ఇప్పుడు ఏమీ చెయ్యలేని పరిస్థితిలో ఎదురెదురుగా కూర్చుండిపోయిన తల్లీ కొడుకుల్ని చూస్తే రాగమ్మకి నవ్వుతోబాటు జాలి కలిగింది.

ఉన్నట్లుండి ఒక రోజున చలికాలపు చీకట్లు పలచబడి పోయాయి. మాఘమాసంలోనే వసంతం ప్రవేశించింది. ముదిరి వాడిపోయిన మురికి ఆకుల్తో ముసలిగాన్లా కనబడుతున్న వేపచెట్టు అక్కడక్కడా సన్నటి చిగురుటాకులు వేసింది. ఒడిలి పలచబడి పోయిన సన్నజాజి పొద లేతాకు పచ్చకొనలువేసి కాంతి పుంజు కొంటోంది. సాయంత్రాలు సంజెచీకట్లు ఒక్క సారిగా ముసురుకు రాకుండా నిదానంగా అందంగా ఆకాశంనుంచి దిగు తున్నాయి. పగలంతా చీకటి గుయారంలా వుండే పూరిల్లు (సూర్యుడు కాస్త తెల్లబడేప్పటికే) లేత వెలుగుతో నిండిపోతోంది. మనుషుల మనస్సుల్లోని చీకట్లు తొలగి ఆశా ఉత్సాహమూ నిండినట్లయి తేలిగ్గా వూపిరి పీలుస్తున్నారు.

తులిశప్ప తన కట్టలోని కూలీలందర్నీ కేకేసుకుంటూ పోతోంది వీధిలో 'టైవయింది. రండమ్మోవ్' అంటూ. రాగమ్మ లేచింది. వీధి మొగలో అందరూ పోగవుతున్న చోటికి వెళ్ళింది.

'నేంగూడా ఒస్తాను. యియ్యాల' అన్నది తులిశప్పతో.

తులిశప్ప నవ్వి 'అట్టనే, రా, అన్నంబెట్టి రూపాయన్నర కూలి' అన్నది.

రామిరెడ్డిగారి తూర్పు పొలానికి ఆరుగురితో కలిపి పంపింది రాగమ్మని. ''రవణమ్మా, రంగయ్యా మీరు కాస్త ఆ రాగమ్మని సూసుకోండి. అలవాటు లేదు, నలుగుర్తోపాటుగా ఎక్కి రాలేదేమో నాలుగు రోజులు. సర్దుకు పోండి' అని చెప్పి వప్పగించింది.

అందరితో కలిసి వూరి బయట పొలాల మధ్యన నడుస్తున్న రాగమ్మకి మళ్ళీ వూపిరి పీల్చుకున్నట్లయింది.

# వెండిగిన్నె

శ్రీమతి పులిగడ్డ విజయలక్ష్మి

అనసూయమ్మ అన్నం వడ్డిస్తోంది. అయిదేళ్ళ అన్నపూర్ణ పరుగెత్తు కొచ్చింది రోజుకుంటూ. ''ఎక్కడున్నావే పూర్ణా! పాయసం తాగకుండా ఏమిటా పరుగులు? రా. రా. తొందరగా కాళ్ళు కడుక్కురా'', అనసూయమ్మ తొందరబెట్టింది. తలుపు మూలగా నిల్చుని దిగాలుగా చూస్తున్న లలిత మరింత దిగాలుపడిపోయింది. పదినిముషాలనుంచి పాయసం తాగుదామని తనక్కడే నిల్చుంది. అత్తయ్య చూసింది కూడా. కాని తన్ను పిలవ లేదు. పైగా "పూర్ణ ఎక్కడే, దాన్ని కేకెయ్!'' అని పురమాయించింది. తప్పక తను కదిలింది అక్కడనుంచి. ఇప్పుడేమో అన్నపూర్ణను మాత్రమే పిలుస్తోంది ఎంతో ఆప్యాయంగా. తనవైపన్నా చూడలేదు! అవునుమరి! సొంతకూతురాయె! పిలవదూ! ఒక్కపిలవటమేమిటి? ఒళ్ళోకూర్చో బెట్టుకుని మరీ ముద్దలు తిని పిస్తుంది. మరి! తన అమ్మ? వంటింట్లోంచి కాలివతల పెట్టటానికే వీలులేదు. ఆ వంటింటికే అతుక్కుపోతుంది అమ్మ. ఎందుకో! ఆరేళ్ళ లలిత మెదడులో పెద్దపెద్ద వూహలు మెదులుతున్నాయి.

''పండగ కదూ! అందులోనూ దీపావళి! చిన్నమామయ్య కూడా వచ్చేశాడే'' అనుకుంటూ ముందుగదిలోకి దౌడుతీసింది "లలితా" అన్న అతని పిలుపు వినగానే.

లలితను వెంటబెట్టుకుని లోపలికి వచ్చాడు చిన్న మామయ్య శ్రీధరం. లలిత చెయ్యి పట్టుకుని వచ్చిన బాబాయివైపు బాధగా చూసింది అన్నపూర్ణ తన్ను దగ్గరకు పిలవలేదే అని. పీటమీద కూర్చొనిపోయిన అన్నపూర్ణ మరి కదల్లేదు బాబాయి దగ్గరకు వెళ్ళాలనిపించినా. వెళితే ఆనక తల్లి కొడుతుందని కూడా తెలుసు. అనసూయమ్మ మరిదివైపు ఉరిమిచూసింది క్షణం పాటు. గమనించీ గమనించనట్టే లలితను తనపక్కనే కూర్చో బెట్టుకున్నాడు శ్రీధరం. ఏదో గుర్తువచ్చినట్టు బీరువాతలుపు తీసింది అనసూయమ్మ. పెద్ద పెద్ద వెండి గిన్నెలు రెండు తీసింది. ఒకదానిలో పాయసంపోసి అన్నపూర్ణ పళ్ళెందగ్గర పెట్టింది. రెండో దానిలో కొద్దిగానే పాయసంబోసి చంటాడికి తినిపిద్దామని తీసుకొచ్చింది. అప్పటికే వడ్డనంతా పూర్తయి పోయింది.

''లలితా! ఆ గూట్లో చద్దెన్నం గిన్నె ఉంది. తెచ్చిపెట్టుకో'' అంది

కొంచెం కోపంగా అనసూయమ్మ. మరో సమయంలో అయితే అత్తయ్య వేపు బిత్తరపోయి చూసేది లలిత. కాని ఇప్పుడాపిల్ల -దృష్టంతా అన్నపూర్ణ పళ్ళెం దగ్గరవున్న వెండి గిన్నె మీదే వుంది.

"పోన్లే వదినా! నే తింటాలే చద్దెన్నం. లలితను వేడన్నం తిన్నియ్యి" నేతిగిన్నె పట్టుకొని వచ్చింది వర్ధనమ్మ.

"మరీ విడ్డూరం నీది! చద్దెన్నం తింటేనే మొక్కపోతుందేమిటి నీ బిడ్డ! మడికట్టుకున్న దానివి నువ్వు తింటావా చద్దెన్నం" సాగదీసింది అనసూయమ్మ.

లలితకు తల్లి మాటలుగాని అత్తయ్య మాటలుగాని వినపడలేదు. వెండి గిన్నెవైపే చూస్తోంది తదేకంగా! అట్లాంటిగిన్నె తనకూ ఉంటే! ఎంత బావుంది? గిన్నె అంచంతా పూజలు, నగిషీ. వంకుల గిన్నెపైన ఉన్నచారలు చాలా బాగున్నాయి. తనా గిన్నెలో పరమాన్నం తినాలి. అత్తయ్య ఇవ్వదు. ఎట్లా? మెరుపులా ఓ ఆలోచన వచ్చింది లలితకు. తను పెద్దయ్యాక అలాంటి గిన్నె కొనుక్కోవాలి, అందులోనే పరమాన్నం తినాలి.

"లలితా! అన్నంతిను" శ్రీధరం బుజం తడుతూ చెప్పాడు.

అప్పటికే పెద్దమామయ్య ఔపోసన పట్టాడు.

భయంతో గబగబా అన్నం కలుపుకుంది లలిత.

* * *

"అమ్మా! ఈ వెండి గిన్నె ప్యాక్ చెయ్య మంటారా?" షాపతను అడుగుతున్నాడు.

డాక్టర్ లలిత ఏం సమాధానం చెప్పకుండా ఆ గిన్నెను చేతిలోకి తీసుకుని అటూయిటూ తిప్పి తిప్పి చూస్తూ "అదే గిన్నె" అనుకుంది మనస్సులో. ఆరోజు అత్తయ్య అన్నపూర్ణకు పాయసం పోసిచ్చిన గిన్నె అచ్చం ఇట్లాంటిదే. ఈ గిన్నెకొంటే! ఎందుకు? పాయసం తాగడానికా? అర్థంకాని ఓ చిరునవ్వు మెరిసింది లలిత పెదవుల మీద.

"మీరు సెలెక్టు చేసిన కుంకుంబరిణతోపాటు దీన్ని కూడా పాక్ చెయ్యమంటారా?'' మళ్ళీ అడిగాడు షాపతను ఆ గిన్నెను చేతిలోకి తీసుకుంటూ.

''ఆఁ. వద్దు" అర క్షణం ఆగి చెప్పింది.

''అమ్మా నాకా గిన్నెకావాలి" ముద్దుగా అడుగుతున్న అనిత వైపు చూసింది. సరిగ్గా అదే వయస్సు. ఆరో ఏడు. ఆ వయసులోనే తనాగిన్నె కావాలని కోరింది. ఇప్పుడు తన కూతురు కూడా కోరుకుంది. తనకు కోరిక తీరడానికి డబ్బులేక పోయింది ఆ రోజు. ఈ రోజు డబ్బుంది కూడా కొనాలని అనిపించడంలేదు, ఒకసారి కోరిక తీరక పోతే దాని మీద విరక్తి కలుగుతుందేమో! "అమ్మా! వెండిగిన్నె కొనవూ! పాయసం తాగుతానే అందులో".

అదిరిపడి చూసింది కూతురువైపు లలిత. ఏమిటీ అవినాభావ సంబంధం! వెండిగిన్నెలో పాయసమే తాగాలా? ఇంకేం తినగూడదా? ''పమిడి గిన్నెలో పాయసం, వెండి గిన్నెలో వేడిబువ్వ" చిన్నప్పుడు అమ్మ అన్నం పెడుతూ పాడిన పాట గుర్తొచ్చింది. పసిడిగిన్నె కొనే అంతస్తులేని మనుషులు వెండి గిన్నెలోకి దిగారేమో బహుశా! ''ఎంత?'' అని అడిగింది అప్రయత్నంగా షాపతన్ని.

వెంటనే తూకంవేసి లెక్కకట్టాడు.

''నూటనలభై ఏడురూపాయలమ్మా''.

''అమ్మా! పదిపైసలుంటే వెయ్యమ్మా. రెండు రోజుల్నుంచీ బువ్వ లేదు!'' షాపుగడప దగ్గర నుంచుని అడుగుతున్నది బిచ్చగత్తె. అటుతిరిగింది లలిత. అనిత కూడా ఆ అమ్మాయివైపే చూసింది. ఆ బిచ్చగత్తె పెద్దదికాదు. చిన్నపిల్లే. ఆరేడేళ్ళుంటాయి. అంతే. తల్లిచెయ్యి పట్టుకుని నిలబడివుంది. రెండో చేతిలో ఓ చిన్న సత్తుగిన్నె పట్టుకొని గలగల్లాడిస్తోంది పైసాకోసం. అంతకు ముందే ఏ ధర్మాత్ముడో రెండు పైసల బిళ్ళవేసివుంటాడు. అది ఆ గిన్నె కదుల్తుంటే ఠంగు ఠంగు మంటోంది.

''ఫో. ఫో.'' అని తరిమి గొడుతున్నాడు రెండుపైసల బిళ్ళకూడా

వెయ్యలేని షాపు యజమాని. "అయ్యా దరమ ప్రభువులు దయసేయండి. పైసావేసి పున్నెంకట్టుకోండి బాబూ! గుడ్డిముండను. పనికూడా చేసుకొని బతకలేని దాన్ని" ఆ పిల్లతల్లి మొరబెట్టుకుంటోంది.

పైసాతో వాళ్ళ కడుపులు నిండుతాయా? క్షణం ఆలోచించింది లలిత. ఎందుకో ఆ పిల్ల చేతిలో ఉన్న సత్తుగిన్నె తను కొనబోయిన వెండిగిన్నెలా కనిపిస్తోంది. ధగధగా మెరుస్తోంది. ఆ పిల్ల తన పిల్లలాగే అచ్చం అనిత లాగే కనిపిస్తోంది. ఒక సెకండు తల తిరిగి నట్టనిపించింది.

"అమ్మా! ఆ అమ్మాయికి పదిపైసలేస్తానే" తల్లి పర్మిషన్ కోసం తలెత్తి చూసింది అనిత. ఆ పసిమనసులో పేరుకు పోయిన అమాయకతకు అడుగుపెట్టని కాలుష్యానికి జాలిగా నవ్వుకుంటూ తలూపింది. వెండిగిన్నె సంగతే మర్చిపోయిన అనిత ఆ బిచ్చగత్తెకు తనుగాంగా పదిపైస లేసాననే గర్వంతో ఎగిరి గంతేసింది.

ఆ పిల్ల అనితకు చేతులెత్తి దండం పెట్టింది రెండుసార్లు కృతజ్ఞతగా. ఆ కృతజ్ఞతా భావంలో కోటి వెలుగులు కనిపించాయి లలితకు. దాని ఖరీదు ఒక వెండిగిన్నె ఖరీదుకు సరిపోతుందా? బేరీజు వేసుకుంది. వెలలేని, వెలకట్ట లేని అటువంటి కృతజ్ఞతను ఈ ఒక్క వెండిగిన్నె ఖరీదుతో ఎన్నివేలసార్లు పొందొచ్చో! ఏం! పాపం! ఆ పిల్లకు మాత్రం ఉండదూ వెండిగిన్నె కొను క్కోవాలనీ! అందులో పాయసం తాగాలని!

ఆ పిల్ల వెళ్ళిపోవడంతో అనితకూడా వెళ్ళిపోదాం అంది.

"మరివెండిగిన్నె?" ఆఖరి సారిగా గుర్తు చేశాడు షాపతను.

"నాకేం వద్దు" అంది అనిత దూరంగా పోతున్న బిచ్చగత్తెవైపు చూస్తూ.

ఆశ్చర్య పోయింది లలిత. అంతవరకు కావాలని మారాం చేసిన అనిత ఇప్పుడెందుకు వద్దంది? దాని తత్వమే అంత. ఏదైనాసరే. కాసేపు కావాలంటుంది. మరి కాసేపటికి వద్దంటుంది. కావాలంటే కావాల్సిందే! వద్దంటే వద్దే. అంత ఖయాల్ పిల్ల. దానితో మాటలనవసరం. తనకు కూడా గిన్నె కొనాలనిపించలేదు. ఆ రోజుల్లో తండ్రిలేక, డబ్బులేక గిన్నె కొనుక్కో

లేక పోయానే అని బాధపడింది. ఈ రోజు అన్నీ వున్నా కొనుక్కోవడానికే బాధనిపిస్తోంది. ఎందుకు? ఆ రోజు ఏమీ తెలియని పసితనం? ఈరోజు అనుభవం నేర్పిన నైరాశ్యం. అది కొన్నా కొనక పోయినా ఒకటే. ఉన్నా ఉండక పోయినా ఒకటే. తనకొచ్చే సంతోషమూ లేదు. పోయే దుఃఖమూ లేదు. ఎంతకష్టపడితే, ఎన్ని స్కాలర్‌షిప్‌లు సంపాదిస్తే తనీనాటికి డాక్టర్ కాగలిగింది! ఎంత మెరిట్ ఉన్నా డిగ్రీ పూర్తి చెయ్యడానికి ఎంతమంది దయాధర్మాలు కావాల్సివచ్చాయి? అంత కష్టపడి మానవత్వం తెలుసుకున్న తనుకూడా అమానుషంగా సుఖంకోసం వందలు, వేలూ ఖర్చుచెయ్యడమే!

షాప్‌వాడు కుంకుంబరిణి బిల్ యిచ్చాడు. డబ్బిచ్చేసి బయటకు వచ్చిన లలిత హఠాత్తుగా గుర్తొచ్చినట్టు అడిగింది కూతుర్ని "ఎందుకు వెండి గిన్నె వద్దన్నావ్?"

"మరే! ఆ అమ్మాయి చేతిలో సత్తుగిన్నె చూశాక నాకీ వెండిగిన్నె బాగా లేదమ్మా".

"ఆఁ" కూతురి మాటల్ని అర్థం చేసుకోటానికి అరక్షణం పట్టింది.

"ఆ అమ్మాయి నీ చేతిలో ఉన్న గిన్నెవేపే చూసిందమ్మా కన్నార్పకుండా! కొని ఆ అమ్మాయికిచ్చేద్దామా అనుకున్నా నువ్వు కోప్పడతావుగా!" ఎందుకో అనిత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

అది చూసిన లలిత తట్టుకోలేక పోయింది. "అనితా" కూతురు భుజం మీద చెయ్యి వేసి దగ్గరకు తీసుకుంటూ అంది. ఆ పిలుపులో ఎన్నో భావాలు. ఏవేవోఅర్థాలు. ఏదో ఆర్ద్రత!

# మెహ్తారాని

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

శాంతి వేదిక మీదకెక్కి ఉపన్యాసం ఇస్తున్నది. ముగ్ధమోహన రూపం. ఔత్తరాహుల సౌందర్యం-ఆమె విగ్రహం పొడవైనది. అందానికి మెరుగులు దిద్దే అలంకరణ చేసుకున్నది. ప్రింటెడ్ నైలక్సుచీరె ధరించింది. ఆచీరె కట్టు, భుజాలు దాటీదాటని ఒత్తైన నల్లటి తలవెంట్రుకలూ-వాటిని రెండుభాగాలుగాచేసి రిబ్బన్లతో బంధించబడిన చిన్నచిన్న జడలు - ఎడమచేతి కొక ప్లాస్టిక్‌గాజూ-కుడిచేతికొక రేడియమ్ డయల్ వాచ్-కనుబొమల మధ్య తిలకం బొట్టూ-ప్రేక్షకుల దృష్టిలో ఒకచిత్తరువులా నిలిచింది.

విషయవైశద్యమూ, చక్కటి శైలి-అంతకంటె చక్కని స్ఫుటమైన ఉచ్చారణ. శ్రావ్యమైన కంఠం ప్రేక్షకులను ముగ్ధులనుచేసింది.

వివాహాల విషయం-యువకుని మనసుమీద విశ్వాసాల (సెంటిమెంట్లు) ప్రభావమెక్కువా? సంస్కారభావాల ప్రభావమెక్కువా? ఏవి ఎక్కువ పని చేస్తాయి? చేస్తే ఎంతకాలం? ఈ విషయం పైన చర్చ. చర్చలో పాల్గొన్న వారు ఆరుగురు. వారిలో ఇద్దరు విద్యార్థినులు. ఆంగ్లభాషలో రసవంతంగా సాగుతున్నది చర్చ.

శాంతి చర్చావేదికపైకిరాగానే అందరూ చకితులై ఆమెనుచూస్తున్నారు. ఆమె చెప్పేదే వింటున్నారు.

"గుండెబలంకల యువకుడు చిత్తశుద్ధితో దృఢనిశ్చయం చేసుకుంటే సంస్కారం నిలబడుతుంది. మనోబలం లేకపోతే దృఢనిశ్చయం కూడా కొంతకాలానికి సడలిపోతుంది. విశ్వాసాలు ఆచోట స్థావరమేర్పరచుకొంటాయి" ఇది ఆచర్చలోని సారాంశము. దీనినే సోదాహరణంగా చర్చించింది. ఎందరో యువకులు మొదట సంస్కారమనే బులుపుతో కులాంతర మతాంతర వితంతు వివాహాలు చేసుకుంటారనీ-ఆ బులుపు తీరగానే వారిలో విశ్వాసాలు చోటుచేసుకోగా చాలామంది తమ వైవాహిక జీవితాలను నరకప్రాయం చేసుకుంటున్నారనీ - మానవజీవితంలో విశ్వాసాలకున్న బలం దేనికీ లేదనీ-యువకులకు ఆత్మస్థైర్యం కావాలనీ-అదిఉంటే విశ్వాసాలను జయించవచ్చనీ శాంతి కంఠం మారుమ్రోగింది-కళాశాల ఆవరణమంతా.

ప్రేక్షకలోకంలో విద్యార్థులూ ఉపాధ్యాయ వర్గమూ పురజనులూ ఉన్నారు అందరికీ ఆనందానికి మరో మెట్టు పైన ఉన్న అనుభూతి కలిగింది. అంతా తన్మయులై పోతున్నారు. ఆమె విగ్రహం చాలామంది హృదయాలలో ముద్రపడిపోయింది.

విద్యార్థిలోకంలో వాళ్ళకు కలిగిన అనుభూతీ-ఉపాధ్యాయ వర్గంలో కొందరికి కలిగిన అనుభూతీ అంతలో క్షణికమయిపోయింది. వాళ్ళ అనుభూతిలో ఏదో వెలితి, ఏదో అసంతృప్తి.

అందం ఉండవచ్చు-ఆధునిక నాగరికత ఉండవచ్చు గాని-ఆపిల్ల మెహ్తర్‌లపిల్ల! (పాకీవాళ్ళపిల్ల).

ఆ సంగతి మనసులోకి రాగానే దుర్వాసన! వాళ్ళముఖాలు అప్పటి కప్పుడు రంగులు మారుతున్నాయి.

సభ ముగిసే వరకూ మురళీమోహను కళ్ళకొక అనుభూతి-నాసికకొక అనుభూతీ-రెండూ పరస్పర విరుద్ధంగా ఉండి ఘర్షణ పడుతూనే ఉన్నాయి. ఈ విభిన్న దృక్పథాల మధ్య అర్భకుడైన మురళీమోహను నలిగిపోతున్నాడు.

ఈ చర్చంతా కృతకమే. ఇవన్నీ చిలుకపలుకులే. కాని-యువకుల హృదయాలమీద వాటిప్రభావ మెంత? వాటిబలమెంత?

మామూలే! రోజూ ఎన్నినీతులు వినటం లేదు? కూటి కోసం కొందరు-గౌరవమర్యాదల కోసం కొందరు-ఉన్నతికి కొందరు-ఇదిగో ఈ విద్యార్థినీ విద్యార్థులు బహుమతుల కోసం! అంతేగా? ఇలాసాగుతున్నాయి అతడి మనసులో ఊహలు.

ఆ సంవత్సరం ప్రారంభంలో మొట్ట మొదటి సారిగా తను బాటనీ క్లాసురూమ్‌లో అడుగుపెట్టాడు. పాఠం చెబుతూ మధ్యలో బోర్డుమీద ఏదో వ్రాయాలని చూసేసరికి క్రిందుగా ఒక బొమ్మవేసి ఉన్నది. ఆపరేషన్ చేసేటప్పుడు డాక్టర్లు నోటికీ ముక్కుకూ కలిపి కట్టుకునే మాస్కుతో ఒక ఆడపిల్ల బొమ్మ. దాన్ని చూడనట్టే పాఠం చెబుతూ క్లాసు నాలుగు వైపులా చూశాడు. ముందుసీట్లో ఇద్దరు చేతి గుడ్డలను అలా కట్టుకుని కూర్చున్నారు. మురళీమోహను అదంతా గమనించనట్టే పాఠం పూర్తిచేసి - "మీలో చాలా

మంది మెడిసిన్‌లో సీటు దొరక్క ఇక్కడికి వచ్చారని నాకు తెలుసు. థియేటర్‌లోనికి వెళ్ళి ఆపరేషన్ చేయాలని ఎంతో సరదా పడుతున్నట్టు కూడా నాకు తెలుసు" అంటూ బోర్డు తుడిచి, అందరినీ ఒకసారి అనుమానంగా చూసి నవ్వుతూ వెళ్లాడు క్లాసు రూమ్‌లో నుంచి.

అతడా కార్టూన్ చూడగానే గ్రహించాడు ఎవరిని ఉద్దేశించి వేసినదీ. అది మూడు మూర్తులా శాంతి బొమ్మ. శాంతి అందానికి అతడి హృదయం తబ్బిబ్బవుతుంది. ఆమెకు సన్నిహితం కావాలనీ-పాఠంచెప్పేనెపంతో పలకరించాలనీ-ఇంకా ఏమేమిటో కలలు కంటుంది కాని-మన్మథకృష్ణ శాంతిని గురించి చెప్పిన తరువాత మనసంతా అదోలా అయిపోతున్నది. ఆమె మీద అభిమానమంతా వెగటుగా మారిపోతున్నది. బుద్ధికీ హృదయానికీ మధ్య సంఘర్షణ భరించరానిదిగా ఉన్నది.

మన్మథకృష్ణ క్లాసులో శాంతిని చూసిన తరువాత ఈ పిల్లను ఎక్కడ చూశానా అని మథనపడిపోయాడు. అతడూ గోవిందరాజన్ సరోజినీదేవీనగర్ కాలనీనుంచి వస్తారు, అదికొత్తగా వెలసిన కాలనీ. అలవాటు చొప్పున మరుగుదొడ్లు కడిగే మెహతర్ల కోసం ఆ కాలనీ వాళ్ళు ఎదురు చూశారు. పదిరోజుల వరకూ ఎవరి దొడ్లు వాళ్ళే కడుక్కోవలసి వచ్చింది. గాంధీసూత్రాలను గట్టిగా నమ్మినవాళ్ళు ''మనపనిని మనం చేసుకుంటే ఏం'' అనుకున్నారు. కనబడిన వాళ్ళకు చెప్పారు. కాని కొందరు ఇంట్లో పనిచేసుకుని కూడా అది గౌరవభంగం అనుకుని పైకిచెప్ప లేకపోయారు. ఇలా అందరూ మెహతర్ల కోసం అలమటించిపోతున్న సమయంలో ఇరవై ఏళ్ళ అబ్బాయి, పదిహేనేళ్ళ అమ్మాయి పాయజామా కుడతా ధరించి సైకిల్‌మీద వచ్చారు. అమ్మాయి తలమీదుగా ఓణీ కప్పుకుంది. ముఖం పూర్తిగా కనబడలేదు.

ఆ కాలనీ వాళ్ళంతా ''ఇంటికి రెండేసి రూపాయలిస్తాం. పాకీవాళ్ళను పంపించమని" వాళ్ళతో చెప్పారు. ఆ మరునాటి నుంచే ఆ అన్నాచెల్లెళ్ళు ఉదయం ఐదుగంటల నుంచి ఎనిమిది గంటలవరకూ దొడ్లుతుడిచేవారు. కొన్ని ఇళ్ల మిగిలిపోతే సాయంత్రం పూట తుడిచేవారు. అవి డ్రైనేజి దొడ్లు. నీళ్ళు పోయించుకుని చీపురుతో గబగబా కడిగేసి వెళ్ళేవారు. ఆడపిల్ల కొంగుచాటున చీపురు పట్టుకుని నీళ్ల నీళ్లు అంటూ ఉండేది. ఇంట్లో ఎవరో పోసేవారు.

ఒకనాడు మన్మథకృష్ణ పోశాడు. ఆమె ముఖం సరిగ్గా కనబడలేదు. మూడో నాడూ నాలుగోనాడూ తానే నీళ్ళుపోస్తూ ముఖం బాగా తేరిపార చూశాడు.

ఆ కార్టూను చూసే అంత వరకూ విద్యార్థులు ఆమెతో మాట్లాడాలనీ- ఆమె మాట్లాడుతుంటే వినాలనీ ఉవ్విళ్లూరేవారు. విద్యార్థులు ఆమెను మధ్యగా కూర్చోబెట్టుకొని కబుర్లు చెప్పుకునే వారు. అప్పుడప్పుడు ఆమె టిఫిన్‌డబ్బా తెరచి ఆమె తెచ్చుకున్న పూరీకూరా తీసుకుని తమ అన్నం కూరలు పెడుతూ ఉండేవారు.

కార్టూనుచూసి శాంతి భయపడిపోలేదు. తనతల్లి డ్రైనేజిలేనిచోట దొడ్లు తుడిచేటప్పుడు అలా ముక్కుకు గుడ్డకట్టుకుంటుంది. అదొకవృత్తి. ఆ వృత్తికి మాత్రం గౌరవంలేదా?

కాని కార్టూను తరువాత శాంతి వంటరిదయిపోయింది. ఇప్పుడామెకు సమీపంగా ఎవరూరారు. దూరదూరంగా తొలగిపోతున్నారు. శాంతి ఇంటికి వచ్చి అన్నకు చెప్పుకుని భోరున ఏడ్చింది.

లక్ష్మణ్‌ను చూసినవాళ్ళు అతడు ఏ తెల్లదొర సంతానమోననుకుంటారు. అతడు శాంతి చదువుకునే కాలేజి ప్రిన్సిపాల్ గదిలోకి వచ్చి "సర్, నేను మీతో కొంచెము మాట్లాడాలి" అన్నాడు.

ప్రిన్సిపాల్‌కు రెండు అంగుళాల పొడుగు డిగ్రీలు ఉన్నాయి. కాని కాలాన్ననుసరించి విద్యార్థులంటే మనసులో భయంభయంగా ఉంటుందాయనకు.

లక్ష్మణ్ తనచెల్లెలికి జరిగిన అవమానాన్ని గురించి చెప్పి "అందరి హక్కులూ కాపాడవలసినవారు మీరు. నా చెల్లెలికిక్కడ అవమానం జరిగితే ఫలితాలు బాగుండవు" అన్నాడు.

లక్ష్మణ్ టెరిలిన్ షర్టు-టెరికాట్‌ప్యాంటు-ఖరీదయిన బూట్లూ, జేబులో ఖరీదయిన కలమూ-చాలా హుందాగా ఆఫీసరులా కనబడుతున్నాడు.

తనుచూస్తున్నదానికీ విన్నదానికీ పొత్తుకుదరక తెల్లబోతూ "మీరేం చేస్తున్నారు?" అని ప్రశ్నిస్తూ కాస్త ధైర్యాన్ని పుంజు కోవటానికి ప్రయత్నించాడు ప్రిన్సిపాల్.

"మెడికల్ కాలేజిలో మూడవసంవత్సరము చదువుతున్నాను" అన్నాడు లక్ష్మణ్.

"చాలా సంతోషం. నేను ఇక్కడి విషయాలను అదుపులో పెడతాను" అంటూలేచి లక్ష్మణ్‌తో కరచాలనముచేసి-అతడు వెళ్ళిన తరువాత 'అమ్మయ్య' అనుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు ప్రిన్సిపాల్.

నలుగురు ఆడపిల్లల మధ్య అపురూపంగా పుట్టిన లక్ష్మణ్‌ను చూసి తండ్రి మురిసిపోతూ పీడిచేత చీపురు పట్టించకూడదనుకున్నాడు. ముద్దుగా పెంచి చదువు చెప్పిస్తున్నాడు. కాని-కొడుకు కాలేజిలో ప్రవేశించగానే కాలూ చెయ్యీ పడిపోయి మంచాన పడ్డాడు. తల్లి ఒక్కతె పనిచెయ్యగా వచ్చే రాబడి చాలటం లేదు. లక్ష్మణ్ తరువాత పుట్టిన శాంతి అన్నతో కూడా చదువులో ప్రవేశించింది.

కాలేజిలో అభ్యుదయ ఉత్సవాలు జరిగి వారం రోజులయినా అందరి కళ్ళల్లో అవే మెదులుతున్నాయి. అందరి చెవుల్లో ఆ ఉపన్యాసాలూ ఆ నాటకాలలోని పాటలూ పద్యాలూ ఇంకా మారుమ్రోగుతూనే ఉన్నాయి

ఆ కాలేజిలో తెలుగులెక్చెరరు ముకుందం ఆనాటినుంచీ ఏమిటోగా ఉంటున్నాడు. సాధారణంగా తెలుగు లెక్చెరర్లమీద విద్యార్థులకుండే గౌరవము కంటె అతడికెక్కువే ఉన్నది. అతడెప్పుడూ తెలుగులో మాట్లాడడు. ఎప్పుడూ ఫుల్‌సూటులో ఉంటాడు. ఈ రెండు కారణాలతో విద్యార్థుల గౌరవాన్ని సంపాదించాడు. అభ్యుదయ ఉత్సవాలల్లో విద్యార్థులకు ఉపన్యాసాలు తయారు చేసి ఇచ్చాడు. వాళ్ళల్లో ఒక్కరికయినా ప్రైజ్ వస్తుందని నమ్మాడు. కాని-వాళ్ళకు రాలేదు. ఆ ఓటమి తనదిగా భావించాడు. మనసు చిన్నబోయి నట్లయింది.

కాని అది క్షణికమే. వేదిక మీదికెక్కి ఉపన్యాసం ఇచ్చిన శాంతి రూపం ఆమె వాక్కులోని మాధుర్యం-దాని సారాంశం అతడి బాధను మరపింపచేస్తున్నాయి. ఆ అజంతాసుందరి తనను ఓడించేసింది. కాని- ఆ ఓటమి కూడా ఎంత ఆనందాన్నిస్తున్నది! ఆమెకు కూడా ఎవరో కాచివడబోసిన అనుభవాన్ని చక్కగా బోధించారు. ఆమె తనతీయటి కంఠంతో వెలిబుచ్చటమే అతడికెంతో ముచ్చటగా ఉంది.

ఋతువులు మారుతున్నాయి. ముకుందం ఆలోచనలు ఒకరూపానికి వచ్చాయి. అతడీమధ్య నరేంద్ర పండిత్ దగ్గరకెళ్ళి "నాకు ఆరునెలల్లో హిందీ నేర్పమని" కోరాడు. "నేను సంస్కృతం వచ్చినవాడిని. ఆ లిపి కూడా వచ్చు. భాషరావాలి" అన్నాడు. నరేంద్ర పండిట్ వయోజన విద్యా ప్రణాళికారచనలో సిద్ధహస్తుడు. రెండు మూడు నెలలలోనే సంభాషణ కౌశలాన్ని, ఉపన్యాసాలయినా అర్థంచేసుకునే శక్తినీ ప్రసాదించాడు.

ముకుందం ఆత్మస్థైర్యాన్ని కలిగించుకుంటున్నాడు. అతడి కళ్ళఎదుట అనేక దృశ్యాలు కదిలిపోతున్నాయి. అమెరికాదేశం నుంచి రీసర్చిస్కాలరుగా మదరాసు వచ్చి మూడు సంవత్సరాలు గానకళ నభ్యసించిన జాన్ హిగ్గిన్సు చక్కని ఉచ్చారణతో భావయుక్తముగా కీర్తనలు పాడి గురువులనే కాక భారతీయులనందరినీ మెప్పించిన అతడి మూర్తి– జరీ అంచులధోవతి అడ్డకట్టూ– సరిగ అంచుల ఉత్తరీయమూ ముఖానబొట్టూ తమిళగాయకుడిలా మెదిలాడు. ఆ చిత్రం మారి మరొక దృశ్యం, అమెరికా దేశస్థురాలు కుమారి రాక్సేన్ ఆలయనృత్యాలు. ఆమె భారతదేశానికి వచ్చి అనుకరించిన భారత స్త్రీల కట్టూ బొట్టూ–ఆ అలంకరణ కళ్ళు చెదరిపోతున్నాయి. పాశ్చాత్యులే మనదేశానికి వచ్చి మన పద్ధతులను అవలంబించి మనలో కలిసిపోయి మన ఔన్నత్యాన్ని విదేశాలలో చాటుతుంటే మనదేశం–మనజాతి–వర్గభేదం ఉన్నంత మాత్రాన మెహ్తర్ల పిల్ల తనకు అర్ధాంగి కాలేదా? శాంతి రూపం అనేక భంగిమలలో ఆతడిని గిలిగింతలు పెట్టటం మొదలుపెట్టింది.

ముకుందం అభిలాష వినగానే లక్ష్మణ్ ఎగతాళి క్రింద జమకట్టాడు. వారం రోజులపాటు ప్రతిసాయంకాలము దానిలోని కష్టనిష్ఠూరాలను వర్ణించి చెబుతూ వచ్చాడు. ఆఖరి రోజున "మీ మనస్థాయిని అభినందించకుండా ఉండలేకపోతున్నా"నంటూ కరచాలనం చేశాడు,

ముకుందం మూడు పూటలా గాయత్రిని జపిస్తాడు. ఆ దేవతే తనకా మనస్థైర్యాన్ని ఇస్తోందని అతడి నమ్మకము.

తరువాత పదిరోజులకు ప్రిన్సిపాల్ దంపతులనూ లక్ష్మణ్‌ను కూడా రిజిస్ట్రార్ ఆఫీసుకు తీసుకువెళ్ళి శాంతిని పెళ్ళి చేసుకున్నాడు ముకుందం.

ఆ సాయంకాలము ప్రిన్సిపల్ క్వార్టర్సు ముందర పెద్ద షామియానాలో విద్యార్థులకూ స్టాఫ్‌కూ పెద్దవిందు జరిగింది. ప్రిన్సిపల్‌భార్య అనితాసింగ్ అన్ని ఏర్పాట్లూచేసింది. వధూవరులు టెరిలిన్ నైలెక్సు దుస్తులలో గులాబీ దండలతో మెరిసిపోతున్నారు— మెర్క్యూరీ లైట్ల కాంతిలో. ఆహూతులందరికీ ఈ పెళ్ళిని గురించి ఏమనటానికీ నోరురావటం లేదు. పచ్చివెలక్కాయ గొంతున పడినట్టుంది. అయినా నవ్వుతూ వధూవరులను అభినందిస్తూ కర చాలనం చేశారు.

అందరి పరిస్థితి లాంటిది కాదు మురళీమోహన్‌ది. అతడి ముక్కు ముడతలు పడిపోతున్నది. కనుబొమలు ఆత్మీయంగా కలుసుకుంటున్నాయి. ఆవేదనకు అంతులేదు. కాని—ఈనాడు ముక్కు ముడతలు పడటం అసహ్యం కొద్దీకాదు. తనకుఆత్మస్థైర్యం లేనందుకు—గుండెబలం లేనందుకు—తన పరిస్థితులు చెయ్యిజారిపోయినందుకు.

"తీపితిని నవదంపతులను దీవించండి" అంటూ అనితా సింగు ఇచ్చిన ఐస్క్రీంప్లేటు అతడికి వేడివేడిగా చేదుచేదుగా ఉంది. నవ్వుతూ అందరితో కరచాలనం చేస్తూ కృతజ్ఞతలు తెలుపుతున్న వధూవరుల వైపు కళ్ళెత్తి చూడ లేకపోయాడు మురళీమోహన్!

# తన దాకా వస్తే...?

శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి

సుధాకర్ బుర్ర ఆలోచనలతో చెదల పుట్టలా వుంది. నిద్రపట్టడం లేదు. అటూ ఇటూ దొర్లుతూ నిద్ర పోవడానికి చేసిన ప్రయత్నం వృథా అయింది. విసుగ్గా లేచి కూర్చుని సిగరెట్ మీద సిగరెట్ తాగడం మొదలు పెట్టాడు.

మాలతి ఏమయినట్టు? వారం రోజులుగా ఎందుకు కన్పించడం లేదు? శనివారం పార్కుకు వస్తానని రాలేదు. తను ఎంతోసేపు ఎదురుచూశాడు. రోజూ ఒక సారయినా ఆఫీసుకు ఫోన్ చేసే మాలతి కనీసం ఫోన్‌కూడా చెయ్యడం లేదేమిటి? తాను ఎన్నోసార్లు ఫోన్‌చేశాడు. ప్రతిసారీ పనికుర్రాడి నుంచి ఒకే సమాధానం: "అమ్మగారు పడుకొని వున్నారు" అని. ఆరోగ్యం బాగా లేదా అంటే "నాకు తెల్దండి." అంటాడు. డాక్టరు వస్తున్నాడా అని అడిగితే 'లేదు' అన్నాడు.

మరి ఏమయింది మాలతికి? తండ్రి చండశాసనుడు. తమ ప్రేమ వ్యవహారం తెలిసి కట్టడిలో పెట్టాడా!

మాలతి స్వయంగానే మనసు మార్చుకుందా! అలా ఎన్నటికీ జరగదు. మాలతికి తనంటే ప్రాణం. తన రచనలంటే మహా గౌరవం. ముందు తనను రచయితగా ఆరాధించింది. పరిచయం పెంచుకుంది. ఆ పరిచయం ప్రేమగా మారింది.

మాలతి తండ్రి వివాహానికి ఒప్పుకోకపోతే! మాలతి తండ్రిని ఎదిరించి తనను వివాహం చేసుకుంటుందా? మాలతికి తండ్రిని ఎదిరించే ధైర్యం లేక పోతే? లేదు... లేదు... మాలతికి చాలా ధైర్యం. ఆధునిక భావాలు గల స్త్రీ. ఆధునిక యుగంలోని యువతరానికి ప్రతినిధిలాంటి మాలతి, తండ్రికి భయ పడుతుందా? ఆమెకు భయం అంటే ఏమిటో తెలియదు. విప్లవ భావాలు గల రచనలు తను చేస్తాడనేగా మాలతికి తనంటే అంత అభిమానం, గౌరవం? మరి వారం రోజులుగా ఎందుకు కన్పించనట్టు?

సుధాకర్ బుర్ర వేడెక్కిపోయింది.

ఎవరో తలుపుకొడుతూన్న శబ్దంవిని ఉలిక్కి పడ్డాడు సుధాకర్. టేబుల్ మీద వున్న టైంపీసుకేసి చూశాడు. తొమ్మిదిన్నర. ఇప్పుడు ఎవరొస్తారు? రామం కాని కాదు కదా? మరో కొత్త కవిత్వం వ్రాశాడేమో? కొత్తగా కవిత్వం వ్రాసేవాళ్ళకు ఇదోపిచ్చి. వ్రాయగానే ఎవరో ఒకరికి వినిపించాలి.

విసుగ్గా లేచివెళ్ళి తలుపు తెరిచాడు సుధాకర్.

ఎదురుగా నిల్చుని వున్న వ్యక్తిని చూసి నివ్వెరపోయాడు ఓ క్షణం.

"మాలతీ, నువ్వా? ఇంత పొద్దుపోయి ఇలా వచ్చావేం?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సుధాకర్.

"ముందు నన్ను లోపలకు రానిస్తావా?" మాలతి కంఠం బరువుగా ఉంది,

"సారీ! రా! లోపలకు!" మృదువుగా పిల్చాడు.

మాలతి కుర్చీలో కూర్చుంటూనే రెండు చేతులతో ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది.

సుధాకర్ నివ్వెరపోయాడు. దగ్గిరగా వెళ్ళి భుజాలు పట్టుకుంటూ "ఏమయింది మాలతీ! ఎందుకేడుస్తున్నావు?" ఆరాటంగా అడిగాడు.

మాలతి దుఃఖం కట్టలు తెంచుకుంది. సుధాకర్ అయోమయంలో పడ్డాడు.

తను ఊహించింది నిజమే. మాలతి తండ్రి మాలతిని ఈ వారం రోజుల నుంచి నిర్బంధించి వుంటాడు. ఇప్పుడు ఎలాగో తప్పించుకొని వచ్చింది.

"మాలీ... చెప్పు? ఏం జరిగింది? మీ నాన్నగారు మన వివాహానికి అంగీకరించ లేదా? అంత మాత్రానికే ఇంతగా బాధపడాలా? ధైర్యం కలదానివి అనుకున్నాను?" తల మీద గోముగా నిమురుతూ అన్నాడు సుధాకర్.

"సుధాకర్, నా జీవితం..." వెక్కిళ్ళ మధ్య మాటలు చిక్కుకుపోయాయి.

"ఛ! నీ జీవితానికి ఏమొచ్చింది? మీ నాన్నగారు ఇంట్లో నుంచి వెళ్ళ కొట్టారా? నేనుండగా నీ జీవితానికి ఏ అపవా రాదు"

"అలా అనుకొనే నీ దగ్గరకు వచ్చాను. నువ్వు కాదంటే ఏ నుయ్యో గొయ్యో..."

ఒక్కసారిగా సుధాకర్ మాలతిని రెండు చేతులతో బిగువుగా పట్టు కున్నాడు.

"ఛ! ఏం మాటలవి? మనం రిజిష్టర్ మారేజ్ చేసుకుందాం. కొంత కాలం పోయాక నాన్నగారే నిన్ను వెతుక్కుంటూ వస్తారు." అన్నాడు లాలిస్తున్నట్టు.

మాలతి కళ్ళు తుడుచుకొని సుధాకర్ ముఖంలోకి దీనంగా చూసింది.

"మరీ అంత ఇదై పోకు. అసలు జరిగిందేమిటో చెప్పు, మీ నాన్నగారు ఏమన్నారు?"

"నాన్నగారు ఏమీ అనలేదు. మన వివాహం గురించి ఇంకా ఆయనతో మాట్లాడలేదు. ఆయనకు ఎటువంటి అనుమానంలేదు."

"మరి ఐతే ఎందుకేడుస్తున్నావ్?"

"ఏం చెప్పను సుధా!"

మళ్ళీ ఏడుపు ప్రారంభించింది.

సుధాకర్‌కు విసుగనిపించింది. ఏమిటి? చెప్పకుండా ఏడుస్తుంది?

"ఆ రోజు పార్కుకు వస్తానని రాలేదేం?"

"ఆ రోజే... ఆ రాత్రి... నా జీవితానికి కాళరాత్రి..."

"మాలతీ, ప్లీజ్! అసలు ఏం జరిగిందో చెప్పు?"

"చచ్చిపోవాలనుకున్నాను, మళ్ళీ నీకు నా ముఖం చూపించకూడ దను కున్నాను. వారం రోజులుగా నాతో నేను పోరాడి అసలు విషయం నీకు చెప్పాలని నిర్ణయించుకున్నాను. అంతా విని నీ నిర్ణయాన్ని చెప్పు. నీ నిర్ణయం

మీదే నా భవిష్యత్తు ఆధారపడి వుంది.''

సుధాకర్ బుర్రలో ఆలోచనలు చిక్కు పడిపోతున్నాయి. చిక్కు విడదీయడానికి ప్రయత్నించిన కొద్దీ పీటముడులు పడిపోతున్నాయి.

''అసలు సంగతేమిటో చెప్పు!'' విసుగ్గా అన్నాడు సుధాకర్.

మాలతి సుధాకర్ ముఖంలోకి చూసింది ఓ క్షణం.

''ఆ రోజు పార్కులో నిన్ను కలుసు కోవడానికి బయలు దేరాను. ఎంతకి బస్‌రాలేదు. నిల్చొనిల్చొనిల్చొని కాళ్ళు పీక్కుపోతున్నాయి. సంధ్య చీకట్లు కమ్ముకుంటున్నాయి. కనీసం ఆటో కూడా దొరకలేదు. అంతలో ఒక టాక్సీ వచ్చి నా ముందు ఆగింది. ఎందుకో ఆ టాక్సీలో వున్నవాళ్ళు నా కోసమే ఆపి వుంటారనిపించింది. టాక్సీ కేసి చూశాను. టాక్సీదిగుతూ రమేశ్ కనిపించాడు,'' ఆగి సుధాకర్ ముఖంలోకి చూసింది మాలతి.

సుధాకర్ కనుబొమ్మలు ముడుచుకున్నాయి.

''ఊ! తర్వాత?'' అన్నాడు కొంచెం తీవ్రంగా.

''అతన్ని చూసి నేను ముఖం తిప్పు కున్నాను.''

''వాడు ఒకప్పుడు నిన్ను లవ్ చేశాడనుకుంటాను?''

''ఒకప్పుడేమిటి? ఎప్పటికీ చేస్తున్నాననే అంటూ వుంటాడు. ఉత్తరాలు రాస్తూ వుంటాడు.''

''ఏడ్చాడు...'' సుధాకర్ కంఠంలో ఈర్ష్య స్పష్టంగా ధ్వనించింది.

''రమేశ్ నా దగ్గరగా వచ్చాడు. 'మాలతీ' అని పిల్చాడు, నేను కోపంగా చూశాను.''

''అతను ఆత్రుతతో గబగబా చెప్పాడు. 'మాలతీ చాలా అన్యాయం జరిగింది. సుధాకర్‌కు యాక్సిడెంటు జరిగింది. అతని ఆటో ఒక బస్‌కు గుద్దుకుంది. సమయానికి నేను ఆ బస్‌లో వున్నాను. ఆస్పత్రిలో చేర్పించాను. పరిస్థితి విషమంగానే వుంది. మేము అక్కడికే వెళ్తున్నాము. నువ్వూ వస్తావా' అన్నాడు.''

"ముందు నేను ఏం విన్నానో నాకు అర్థం కాలేదు. అర్థం కాగానే నాకు కళ్ళు తిరిగాయి. తూలిపోతున్న నన్ను పట్టుకొని రమేశ్ టాక్సీ దగ్గరకు నడిపించుకొని వెళ్ళాడు. టాక్సీ ఎక్కించాడు."

"స్కౌండ్రల్?" గుప్పిళ్ళు బిగబట్టాడు సుధాకర్.

మాలతి తలవంచుకొని కూర్చుంది మూర్తీభవించిన విషాదం లాగ.

"ఆఁ, ఆ తర్వాత?"

"టాక్సీలో వెనక సీట్లో తన పక్కనే నన్ను కూర్చోబెట్టుకున్నాడు. ఏదేదో అంటూ ఓదారుస్తున్నాడు. కాని నా బుర్ర మొద్దుబారి వుంది. అతని మాటలు వినే స్థితిలో లేను. కాని ఎంత సేపటికీ ఆసుపత్రిరాదు. అద్దంలో నుంచి బయటకు చూశాను. కారు ఊరుబయట నిర్మానుష్యమైన రోడ్డు మీద స్పీడ్‌గా పోతూవుంది. ఊరు దాటి చాలాదూరం వచ్చామని తెలుసుకున్నాను. వెంటనే నాకు ఏదో స్ఫురించింది, అబద్ధంచెప్పి నన్ను మోసం చేసినట్టు అర్థం చేసుకున్నాను."

అంతవరకూ చెప్పి సుధాకర్ ముఖంలోకి చూసింది మాలతి.

సుధాకర్ సిగరెట్ పొగ గట్టిగా పీల్చి వదిలాడు.

"ఎక్కడికి తీసుకెళ్తున్నారు? ఆపండి టాక్సీ అని అరిచాను."

"ఆపారా?" ఆత్రంగా అడిగాడు సుధాకర్.

"లేదు. రమేశ్ నా చేతిని తన చేతిలోకి తీసుకొని నొక్కాడు.

"స్కౌండ్రల్!"

"నేను చెయ్యిలాక్కోవడానికి ప్రయత్నిస్తుండగానే రమేశ్ తన రెండో చేతిని నా నడుంచుట్టూ వేసి దగ్గరకు లాక్కున్నాడు."

సుధాకర్ చేతిలో సిగరెట్ ఒళ్ళోపడింది. చివుక్కునలేచి నిల్చున్నాడు.

"నువ్వెలా ఊరుకున్నావ్! ఆ రాస్కెల్ పళ్ళు రాలగొట్టకుండా?"

"నేను పెనుగులాడాను. కాని వదిలించుకోలేక పోయాను."

"మరి గట్టిగా అరవలేదూ!"

"అరిచినా వినడానికి అక్కడెవరుంటారు?"

"తర్వాత ఏం జరిగింది? ఆ గాడిదను లాగి చెంపమీద కొట్టావా?"

"అబ్బే లేదు. నన్ను గట్టిగా పట్టుకొని ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే నేనేం చెయ్యగలను? రమేశ్ ఎంత భారీ మనిషో నీకు తెలియదూ?"

సుధాకర్ ఊపిరి బిగబట్టాడు ఓ క్షణం. సిగరెట్ తీసి పెట్టెమీద అశాంతిగా కొడుతున్నాడు. అతని గవదల ఎముకలు పైకి తేలాయి.

"సంతోషించాలే? వాడి శరీరపు ఒంపుల్ని మరోసారి వర్ణించవచ్చు. ఇప్పుడు అసలు సంగతి చెప్పు!"

"ఎందుకంత కోపం? అటువంటప్పుడు నేనేం చెయ్యగలను!"

"టాక్సీలోనుంచి మాకెయ్యాల్సింది"

మాలతి ఆశ్చర్యంగా సుధాకర్ ముఖంలోకి చూసింది.

"అతను నన్ను అంత గట్టిగా..."

"ఛీ- సిగ్గులేదూ?"

"నన్నంటావేం? నేను కాదు గట్టిగా..."

"సరేలే! ఆ తర్వాత చెప్పు!"

అశాంతిగా గదిలో పచార్లు చేస్తున్నాడు సుధాకర్. వాడు తప్పక ఏదో చేసే వుంటాడు!

"టాక్సీ పొలాల మధ్యలో వున్న ఒక తోటలో, చిన్న కుటీరంలాంటి యింటి ముందు ఆగింది."

"ఆ తోట ఆ రాస్కెల్‌గాడిదే! వాడి రక్తం కళ్ళజూస్తాను!" పళ్ళు పట పట కొరికాడు సుధాకర్.

మాలతి మౌనంగా బల్బ్‌పైగా గోడమీద పురుగుల్ని వేటాడుతున్న బల్లిని చూస్తూ కూర్చుంది. అది- ఆ బల్లి- ఆ పురుగును పట్టుకోవడానికి ఎన్ని వేషాలు

వేస్తుందో? తోక పురుగువైపుకు పెట్టి. నడుం విరిచి దొంగలా చూస్తోంది అవకాశం కోసం.

"ఆ బల్లి చూడు, పురుగును పట్టుకోవడానికి ఎన్ని దొంగవేషాలు వేస్తుందో?"

సుధాకర్ మాలతి ముఖంలోకి విస్మయంగా చూశాడు.

"పాపం! చూడు! ఆ పురుగు తల కిందుగా ఎలా పాకుతూ ఆ బల్లి దగ్గరకే పోతుందో! పురుగులు తలకిందుగా ఎలా పాకగలుగుతాయో! మనుషులు కూడా తల కింద పెట్టి నడవగలిగితే...?"

సుధాకర్ అయోమయంగా చూశాడు.

మాలతికి మతి చలించలేదు గదా? ఇటువంటి సమయంలోనా బల్లీ-పురుగూ... గురించి మాట్లాడటం. మాలతి ముఖంలోకి భయం భయంగా చూశాడు.

మాలతి ముఖంలో పిచ్చిపట్టిన ఛాయలు ఏమీ కన్పించలేదు.

"బల్లీ-పురుగూ-కథ తర్వాత. ముందు నీ కథ చెప్పు. టాక్సీ ఆగింది. ఆ తర్వాత ఏం జరిగింది?" విసుగ్గా ప్రశ్నించాడు సుధాకర్.

"ఏం జరిగి వుంటుం దనుకుంటున్నావ్?" ఎదురుప్రశ్న వేసింది మాలతి.

మాలతికి నిజంగా మతి చలించినట్టుంది! లేకపోతే ఏమిటా ప్రశ్నలు?

"రమేశ్‌ను ఒక్కతోపు తోసేసి పారిపోయి వచ్చివుంటావు."

మునిగిపోతున్నవాడు గడ్డిపరక ఆసరాకోసం వెతుక్కుంటున్నట్టు అన్నాడు సుధాకర్.

మాలతి సుధాకర్ ముఖంలోకి నిరసనగా చూసింది.

"ఏమిటలా చూస్తావ్?" వళ్ళు మండిన సుధాకర్ అన్నాడు.

సుధాకర్ కణతలు పట్టుకొని కూర్చున్నాడు. అనేక అనుమానాలు మన

సును కుదిపేస్తున్నయ్. రక్తనాళాలు చిట్లటానికి సిద్ధంగా వున్నట్టు బాధ పర సాగాడు.

"అరే! ఆ పురుగుచూడు సుధాకర్! తలక్రిందులుగా పాకుతూ కింద పడి పోయింది. చచ్చిపోయిందా! లేదు కదులుతూవుంది. అరే మళ్ళీ పైకే పాకు తోంది. మళ్ళీ బల్లి వైపుకే పోతూంది."

"సందేహం లేదు. మాలతికి మతి పోయింది. జరగరానిదే ఏదో జరిగింది?" అనుకుంటూ భయం భయంగా మాలతి ముఖంలోకి చూశాడు.

"టాక్సీ ఆగింది. రమేశ్ నన్ను దిగమన్నాడు. నేనుదిగనన్నాను. అంతే! అమాంతం ఇంగ్లీషు సినీమాల్లో హీరోలా నన్ను ఎత్తి భుజంమీద వేసుకొని లోపలకు తీసుకెళ్ళాడు."

సుధాకర్ ఎవరో గొంతు పిసుకుతున్నట్టు ఉక్కిరిబిక్కిరై పోయాడు.

"రాస్కెల్! ఆ తర్వాత నిన్ను బలవంతం చేయబోయాడా! ఆ దగ్గిర్లో వున్న దేంతోనో గట్టిగా తల మీద బాది పారిపోయి వచ్చావా?"

మాలతి మాట్లాడలేదు. సుధాకర్ ముఖంలోకి చూస్తూ కూర్చుంది.

"అంతే చేశావ్ గదూ? ఆ టాక్సిడ్రైవరు గాడికికూడా బుద్ధిచెప్పావా?" బావిలోకి జారిపోతూ జారుడు మెట్లు పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్న వాడిలా అడిగాడు సుధాకర్.

మాలతి విరక్తిగా నవ్వింది.

మాలతికి ఇటువంటప్పుడు నవ్వు ఎలా వస్తుందో? బహుశా ఏం జరిగి ఉండదు. తప్పించుకొని వచ్చి ఉంటుంది. అందుకే నవ్వగలుగుతోంది. సుధాకర్ గుండెల నిండుగా గాలి పీల్చుకున్నాడు.

"చెప్పు మాలతీ! వెధవ లిద్దరికీ బుద్ధిచెప్పి వచ్చేశావు గదూ!"

సుధాకర్‌కి జారుడుమెట్టు చేతికి తగిలినట్టు వుంది.

"ఇదేం సినిమా అనుకుంటున్నావా? జయలలితలాగో లేక జమాభాధురిలాగో 'డిష్యూం! డిష్యూం!' చేసి చుట్టూచేరిన మగవాళ్ళకు తలొకటి తగిలించి పారిపోయి రావడానికి?"

చేతికందిన జారుడుమెట్టు మళ్ళీ జారిపోయింది. సుధాకర్ పడిపో తున్నాడు. క్రింద లోతు తెలియని అగాధం వుంది.

మళ్ళీ ఆధారం కోసం తడుముకుంటున్నాడు.

''సమయానికి ఎవరైనా వచ్చి రక్షించారా?''

మాలతి సుధాకర్ ముఖంలోకి చిత్రంగా చూసింది.

"ఇదేం నువ్వు రాసే కథ అనుకున్నావా? లేక తెలుగు సినీమా అనుకు న్నావా? సరిగ్గా సమయానికి తలుపులు బద్దలుకొట్టుకొని హీరో ప్రవేశించి, హీరోయిన్‌ను రక్షించడానికి?'' మాలతి కంఠం తీవ్రంగా వుంది.

సుధాకర్ స్థాణువులా కూర్చున్నాడు.

"అయినా నువ్వేగా నా హీరోవి? మరి నువ్వు ఇక్కడే, ఈ గదిలో, ఆ సమయంలో, హాయిగా నిద్రపోతూవుండి వుంటావు. మరి ఆక్కడికొచ్చి రక్షిం చేవాళ్ళెవరున్నారు?'' మళ్ళీ మాలతి అన్నది వ్యంగ్యంగా.

''సరేలే! పిచ్చిమాటలు మాట్లాడక ఇంతకూ జరిగిందేమిటో చెప్పు."

టైంబాంబ్ ముందు కూర్చున్నవాడిలా ప్రాణాలు చిక్కబట్టుకొని కూర్చు న్నాడు సుధాకర్.

మాలతి సుధాకర్‌కేసి నిర్లక్ష్యంగా చూసింది.

గోడమీద బల్లికేసి చూసింది. బల్లి సౌందర్యానికి ముగ్ధురాలైనట్లు, పురుగు బల్లివైపుకే పాకుతోంది.

రాజబాబు రమాప్రభ మీదకు గెంతినట్టు, ఒక్కసారిగా బల్లి పురుగు మీదకు గెంతింది.

క్షణంలో పురుగు బల్లి నోట్లోనుంచి సగం మాత్రమే కన్పించింది. మరు క్షణంలో ఆ సగంకూడా కన్పించకుండా పోయింది.

''మింగేసింది! చూడు!'' అంది మాలతి.

సుధాకర్‌కు మాలతిని ఆ చెంపా ఈ చంపా వాయించాలనిపించింది. ఉద్రేకంతో ఊగిపోతున్నాడు.

''చివరకు ఆ బల్లీ పురుగూ కథే అయింది. బలవంతుడూ- బలహీనుడీ కథే అయింది''అన్నది మాలతి, సుధాకర్‌ముఖంలో దేన్నో వెతకడానికి ప్రయత్నిస్తున్నట్టు దీక్షగా చూస్తూ.

''అంటే...అంటే వాడు నిన్ను...''

''అవును. అతను నన్ను రేప్‌చేశాడు'' కసిగా అన్నది మాలతి.

సుధాకర్ చివుక్కున లేచి నిల్చున్నాడు. గదిలో ఊపుగా పచార్లు చేస్తున్నాడు. మధ్యమధ్య అగి మాలతికేసి పిచ్చివాడిలా చూడసాగాడు.

మాలతి ఆత్రుతతో సుధాకర్‌కేసి చూస్తూ కూర్చుంది.

సుధాకర్ ఎలాంటి నిర్ణయానికి వస్తాడు? తనభవిష్యత్తు అతని నిర్ణయం మీదే ఆధారపడి వుంది. సుధాకర్ విప్లవభావాలుగల రచయిత. అతని రచనలు భావవిప్లవానికి దోహదం చేసేవిగా వుంటాయి. అతనిలో నిజాయితీ వుంది. తను నమ్మినదాన్నే రాస్తాడు సుధాకర్. సుధాకరు తప్పక తనను వివాహం చేసుకుంటా నంటాడు.

''ఇంత జరిగాక ఏ ముఖం పెట్టుకొని నా దగ్గరికి వచ్చావ్?''

మాలతి తెల్లబోయి చూసింది.

''నీదగ్గిరకు రాక మరెక్కడికెళ్తాను సుధాకర్. ప్లీజ్, అట్లామాట్లాడకు.''

''కుళ్ళి పోయిన పండును తినే మూర్ఖుణ్ణి అనుకున్నావా?'' కోపంగా అరిచాడు సుధాకర్.

మాలతి తీవ్రంగా సుధాకర్ కళ్ళలోకి చూసింది కోపంతో, అసహ్యంతో. నిలువెల్లా వణికి పోయింది. తను ఆలోచించిందేమిటి? జరిగిందేమిటి? సుధాకర్ రచనలూ, ఉపన్యాసాలూ అన్నీ ఇతరుల కోసమేనా?

''సుధాకర్, నువ్వు రచయితవి. భావవిప్లవం రావాలనే రచయితవు. నేను మనిషిని. మనిషి కుళ్ళిపోవడం ఏమిటి? పళ్ళు కుళ్ళిపోతాయిగాని. నువ్వు కాదంటే నేనెక్కడి కెళ్ళను?''

"ఛ! ఛ! నీకు బొత్తిగా మానం అభిమానంలేదు. మరో ఆడదైతే ఇంత జరిగాక ఏ హుసేన్‌సాగర్‌లోనో పడుతుంది," అసహ్యించుకుంటూ అన్నాడు సుధాకర్.

"సుధాకర్, ఒకసారి జ్ఞాపకంచేసుకో. పోయిన వారం సభలో నువ్వేం మాటాడావో? నీ కథకు ప్రథమ బహుమతి వచ్చినందుకు సన్మానం జరిగింది. నీ కథలో ఇతివృత్తం ఏమిటి? ఒక అమ్మాయిని ఒక దుర్మార్గుడు రేప్‌చేస్తాడు, ఆ అమ్మాయి ఆత్మహత్యకు సిద్ధపడుతూ వుంటే ఒక యువకుడు ఆదుకొని పెళ్ళి చేసుకుంటాడు. ఆ రోజు ఎంత ఉద్రేకంగా ఉపన్యాసం ఇచ్చావు! మన దేశంలో అలాంటి యువకులు కావాలన్నావ్!

సుధాకర్ జవాబివ్వలేదు.

"ఆ రోజు నీ ఉపన్యాసం వింటూ నేను ఎంతగర్వించానో? నా స్నేహితురాలు రమ "కబుర్లు చెప్పడం-కథలు రాయడం వేరు. ఇంత ఉద్రేకంగా మాట్లాడుతున్న ఈ రచయిత ఒక దగా పడిన పిల్లని పెళ్ళి చేసుకో గలడా?" అని అన్నప్పుడు నేను ఆమెతో వాదించాను. ఆ తెల్లవారి మనం పార్కులో కలుసుకున్నప్పటి మన సంభాషణ ఒకసారి జ్ఞాపకం చేసుకో."

*　　　*　　　*

"కథలు చదివి మనుషులు మార్తారా" అని అడిగాను.

"ఎందుకు మారరూ? కథలు చదివి మనిషి ఆలోచిస్తాడు. ఆలోచనలే మనుషుల్ని మారుస్తాయి. మారిన మనుషులే సమాజాన్ని మారుస్తారు" అన్నావు.

"కావచ్చు. కాని ఒక సందేహం!"

"ఏమిటది?"

"వ్రాసేవాళ్ళందరూ తాము నమ్మిన అభిప్రాయాలనే నిజాయితీతో రాస్తున్నారంటావా? అవసరం అయితే ఈ రచయితలు వారి పాత్రలలాగే ప్రవర్తించ గలరంటావా?" అని అడిగాను.

"ఒకరి సంగతి నాకు తెలియదు. నేను మాత్రం నేనునమ్మిన సిద్ధాంతాలనే రాస్తాను." అన్నావు నువ్వు.

"అంటే నువ్వు దుండగుల పాలిటపడి గర్భవతి అయిన అమ్మాయిని మనస్ఫూర్తిగా స్వీకరించగలవా?" అని సంతోషంగా అడిగాను.

"తప్పకుండా!" ఉద్రేకంగా అన్నావు. నా కళ్ళు ఆనందంతో వెలిగిపోయాయి.

* * *

"ఆ నాడు నువ్వు అన్నమాటలు గుర్తు తెచ్చుకో. నువ్వు ప్రేమించిన అమ్మాయిని ఆమె చెయ్యని పాపానికి శిక్షిస్తావా? నీ మాలతి...నువ్వు ప్రాణప్రదంగా ప్రేమించిన మాలతి దగాపడింది."

"నేనురచయితను. నేనురాసేవన్నీ ఆచరణలో పెట్టి చూపించాలని ఎక్కడుంది? నీ ఉపన్యాసం వినే స్థితిలో నే నిప్పుడు లేను. ఇక వెళ్ళు. మళ్ళీ నాకు కన్పించకు" అన్నాడు సుధాకర్.

"సుధాకర్, ప్లీజ్ అట్లామాట్లాడకు. నీపాదాల్లో... కనీసం నీదాసిగా... ఇంత చోటు..." కాళ్ళు పట్టుకో బోయింది మాలతి.

సుధాకర్ నిప్పులు తొక్కిన వాడిలా ఒక్కసారిగా వెనక్కు వెళ్ళాడు.

"నన్ను ముట్టుకోకు. నీకు ఆ అర్హత లేదు. ముందు ఇక్కడ్నుంచి వెళ్ళు. నాకు పిచ్చెక్కి పోతూంది. నే నేం చేస్తానో నాకే తెలియదు" గట్టిగా అరిచాడు సుధాకర్.

"శభాష్! బలే బాగా యాక్ట్ చేశావ్ మాలతీ! ఇక చాల్లే పద!" అన్నది రమ లోపలకు వచ్చి.

మాలతి ముఖంలో ఏవగింపు, కళ్లలో తిరస్కారం కొట్టొచ్చినట్టు కన్పించాయి.

"మాలతీ! ఏమిటి ఇదంతా, తమాషాగా అడిన నాటకమా? చంపేశావ్ పో!" రిలీఫ్‌గా అన్నాడు సుధాకర్.

"అవును, నీ అసలురూపాన్ని తెలుసుకోడానికి ఆడిన నాటకం. వస్తాను. గుడ్‌బై!"

"మాలతీ, ప్లీజ్..." ప్రాధేయపడుతున్నట్టు దగ్గరగావచ్చి నిల్చున్నాడు.

"ఏమిటి ప్లీజ్? నా పాదాల్లో ఇంత చోటు కావాలా? నీకు ఆ అర్హత లేదు. వస్తాను. రా! రమా!

విసురుగా మాలతి బైటికి వెళ్ళిపోయింది. మాలతిని అనుసరించింది రమ.

సుధాకర్ వాళ్ల వెళ్ళినవైపే చూస్తూ స్థాణువులా నిలబడిపోయాడు!

# ఆముక్త

శ్రీమతి మాదిరెడ్డి సులోచన

బయట ఉరుములు, మెరుపులతో వచ్చే వర్షంలా ఉన్నాయి వాగ్బాణాలు

ఆదెమ్మ కాంపౌండులో వున్న పదహారు కాపరాల వారు ఏకమయి సావిత్రిని దూది ఏకినట్లు ఏకి పడేస్తున్నారు? సావిత్రి గదిలో తలుపులు వేసుకుని గోడకు చేరబడి కూర్చుంది. ఆమె వద్దనుకున్నా ఈటెల్లాంటి మాటలు వచ్చి ఆమె చెవులను తాకుతున్నాయి.

"ముగ్గురు పిల్లల తల్లి! దీనికేం పోయేకాలమే."

"మగడు మూడేండ్లు జైల్లో ఉంటే ఆగలేకపోయిందా! పిదపకాలం పిదపబుద్ధులు. మా మేనత్త మగడు రంగమెల్లి పదేండ్లు తిరిగి రాలేదమ్మ. పక్షిలా పడివుంది"

"పక్షి పడి వుంటదా! యెగిరి పోద్దిగాని" అన్నారెవరో.

"మాటవరసకన్నానే అమ్మా. ఆ వచ్చే పెద్దమనిషికయినా సిగ్గుం డక్కర్లేదా!"

"ఆ వాలకం కులుకులు చూస్తూనే గ్రహించాను." అన్నదో మగ కంఠము. అతనెప్పుడూ ఆకలిగొన్నట్టు చూడటం సావిత్రికి గుర్తే. అతన్ని చూస్తే జూలో అటు ఇటు చూచే కోతులు గుర్తుకు వస్తాయి.

"మగడొచ్చి బయటికి రమ్మంటేరాదేం?"

"సరే. యెంతసేపు గదిలో ఉంటదో నేను చూస్తాను. పోలీసులకు రిపోర్ట్ ఇస్తాను" బాలరాజు అన్నాడు. యెంతమందిలో వున్నా ఆ కంఠము గుర్తు పట్టగలదు.

మరి కాసేపు చర్చాగోష్ఠి జరిపి, సావిత్రినుండి రెస్పాన్స్ లేదని నిరాశ చెంది అందరూ వెళ్ళిపోయారు.

"ఈ వెధవ వేషాలు వేసేవారు ఈ కొంపలో యెలా వుంటారో నేను చూస్తాను. ఆదెమ్మ అంతు తేలుస్తాను." అనుకుంటూ వెళ్ళింది, బీడీల కంపనీలో పని చేసే సంగమేశ్వరి. తను ఆటో రిక్షా ఆంజనేయులితో రహస్యంగా తిరగటం మరిచిపోయింది.

సావిత్రికి బాలరాజుతో పదేళ్ళక్రితం వివాహమయింది. అప్పుడామె వయసు పదహారేళ్ళు. అతను శ్రీరంగ రాజ లారీ సర్వీస్‌లో ఉద్యోగం చేస్తు న్నాడు. నెలకు నూటడెబ్బై అయిదు రూపాయల జీతం. అతను దుష్టుడు దుర్మార్గుడు కాదు. కాని చిత్తుగా త్రాగేవాడు. సావిత్రి తల్లితండ్రులు యెదురుగా ఏమి అనలేక పోయేవారు. వారికి ఓ పూటకు ఉంటే రెండోపూట పస్తులే. అలాంటి వారికి అల్లుడిని అనే హక్కు ఉందా? చాటుగా మాత్రం గొణుక్కునే వారు.

"ఇంత చిన్న వయసులో ఇదేం అలవాటు!" సావిత్రి యెన్నోసార్లు తాగొద్దని చెప్పబోయింది. కాని త్రాగిఉన్నా భార్యను ఒక్కమాట అనకుండా ప్రేమగా చూచేవాడు.

"సావిత్రీ! నువ్వు నిజంగా సినిమాస్టార్‌లాగున్నావబ్బా!" అని దగ్గరకు లాక్కునేవాడు. యెలా తెచ్చేవాడో, ఏం చేసేవాడో కాని సావిత్రి అడిగింది లేదని ఏనాడూ అనలేదు. అతని ప్రేమ మైకంలో ఉండగా వరుసగా ముగ్గురు పిల్లలు పుట్టు కొచ్చారు. సంతోష్ నగర్ కాలనీలో ఓ రేకుల షెడ్డులో ఉండే వారు. బాలరాజుకు ఇద్దరన్నలు, ఒక అక్క ఉన్నారు. అప్పుడప్పుడు వచ్చి పోతుండేవారు.

ఓరోజు సావిత్రి పెద్ద కొడుకును బడినుండి తీసుకు వస్తుంటే భర్త లారీలో క్లీనర్‌గా పని చేసే బాబుల్ పరిగెత్తుకు వచ్చాడు.

"సాయిత్రక్కా! తప్పతాగి బావ లారీనడిపిండు. లారీ కింద ఓ పోరడు పడి చచ్చిపోయిండు. బావను అరెస్ట్ చేసిండ్రు" అని వార్త అందించి వెళ్ళి పోయాడు. సావిత్రి కుప్పలా కూలిపోలేదు, దిక్కులు పిక్కటిల్లేలా ఏడ్వలేదు గాని అయోమయంగా చూచింది. ఆమెకు ఏంచేయాలో యెవరిని అడగాలో కూడా తెలియదు.

"ఒరే రాజూ! ఒక్కడవు చేస్తే అయిదుగురు తినాలిరా. అమ్మాయి ఏదయినా పని చేస్తేనేం?" ఆడబడుచు అడిగేది.

"వద్దక్కా! ఆడవాళ్ళను బయటికి తిప్పితే బరి తెగించి పోతారు. ఆ కష్టమేదో నేను పడతాను" అనేవాడు. తలుపు తీసి ఉంటే భార్య అందరికి

కనిపిస్తుందని ఇంటికో పరదా కట్టాడు. ఓ పూట వంట చేయకపోతే క్షమించే వాడు కాని వీధిలో నిలబడితే అతనికి కోపం. అందుకే సావిత్రికి ఏం తెలియదు. పుట్ట వదిలిన పాములా ఉంది ఆమె స్థితి. ఇంటికి వచ్చింది. ఆ ఇల్లుగల అమ్మ గారితో ఈ విషయము చెప్పింది.

"అయ్యో పాపం అలాగా: ఏంచేస్తాం, కష్టాలు వచ్చినప్పుడు ధైర్యంగా ఉండాలి'' అన్నది ఓదార్పుగా,

''ఆయనకు శిక్ష పడుతుందా?''

''ఏమో, లాయర్ చెప్పాలా మాట. నా మాట విని మీ బావల దగ్గరకు వెళ్ళు'' సలహా ఇచ్చిందామె. ఒకతను తిలక్ నగర్‌లో ఉంటాడు. మరొకతను వారిస్ గూడాలో ఉంటాడు. పిల్లలను లాక్కుని తిలక్ నగర్ వెళ్లింది. యెందుకో బావగార్ని చూడగానే దుఃఖం ఆగలేదు.

''ఏమయిందమ్మా? ఏమిటి సంగతి?''

"మీ తమ్ముడు...'' అతి కష్టం మీద అరెస్ట్ అయిన విషయం చెప్పింది. అతను ముఖం చిట్లించాడు.

"తప్పత్రాగి మనుషుల్ని చంపితే ఊరుకుంటారూ!'' తను న్యాయాన్ని ప్రతిష్ఠించే వాడిలా మాట్లాడి తన పనులే తనకు బోలెడున్నాయని వెళ్లి పోయాడు.

వారిస్ గూడాలో ఉన్నాయన కాస్త ఓదార్పుగా మాట్లాడి తను కను క్కుంటానన్నాడు. సావిత్రి ఆడబిడ్డతో కూడా ఓ మాట చెప్పి వచ్చేసింది.

అడపా దడపా ఆడబిడ్డ వచ్చి పిల్లల కోసం డబ్బులు బియ్యం ఇచ్చి వెళ్లింది. కాని అన్నదమ్ములు యెవరూ రాలేదు. ఏమిటి విషయమని అడగలేదు ఆమె తల్లి తండ్రులు. పేదరికం అతి భయంకరమైన అంటువ్యాధులలో ఒకటి. దాన్ని చూస్తే అందరికి భయమే ఎక్కడ అంటుకుంటుందోనని. సావిత్రి పరిస్థితి చాలా దిగజారింది. బాబుల్ సలహా మేరకు లారీ ఓనర్ దగ్గరకు వెళ్లింది.

"ఒళ్ళు కొవ్వెక్కి తప్పతాగి నడిపితే నేనేం చేసేది?" అతను అడిగాడు. సావిత్రికి జాలికలిగేలా ఏడ్వటంరాదు. తిరిగివచ్చేసింది. ఆమె అయోమయంలో ఉండగానే బాలరాజుకు మూడు సంవత్సరాలు శిక్ష పడింది. అయిదు వందలు జుల్మానా కట్టమన్నారు. శిక్ష తగ్గుతుందన్నారు. అప్పటికే ఒకపూట పస్తులుంటుంది. జుల్మానా యెవరు కడతారు?

చెవులకున్న ఒంటిరాయి దిద్దులు అమ్మి అందరి దగ్గరకు తిరిగింది. యెవరూ కరుగలేదు, కనికరించలేదు.

"ఇదిగో సావిత్రీ, అభిమానపడితే లాభం లేదు. మీ బావగార్ల దగ్గరే ఆ పని, ఈపని చేసుకుంటూ పడి ఉండు. మేం నిత్య దరిద్రులం" తల్లి తండ్రి ఓ ఉచిత సలహా పారేశారు. ఆమెకు ఏడ్పురావటంలేదు.

బావగార్ల దగ్గరకు వెళ్ళింది. అమె అడగకుండానే గ్రహించారు ఆమె యెందుకు వచ్చిందో.

"చూడమ్మాయ్, మేం నీకు దగ్గరవారమయినా మా భార్యలు కారుగా. నెలకు అయిదో, పదో పంపుతాను. మీ పుట్టింట్లోనే ఉండు. పుల్లకూరతిన్నా పుట్టిల్లన్నారు" ఒకతను సలహా యిచ్చాడు.

"మా దగ్గర మిద్దెలు మేడలున్నాయా! నా భార్య పనిచేయటం లేదూ. అలాగే చేసుకుని బ్రతుకు" రెండో ఆయన సలహాఇచ్చాడు. ఆయన భార్య ఆస్పత్రిలో ఆయగా పనిచేస్తుంది. బ్రతిమాలినా ప్రయోజనం లేదని ఆడ బడుచు దగ్గరకు వచ్చింది.

"కొన్నవాడు జైల్లో వున్నా కన్నవాడున్నాడుగా. వెళ్ళి అక్కడే వుండు. నాకు నల్గురు పిల్లలు..." అన్నది.

మారు మాట్లాడక బయలు దేరింది సావిత్రి. యెంతయినా ఆడపిల్లకదా.

"ఇదిగో మరదలు పిల్లా! ఈ కాలంలో ఒకర్ని సాకాలంటేనే మహా యాతన! తల్లి నల్గురుని యెవరయినా ఏం సాకుతారు? పెద్దాడిని నా దగ్గర ఉంచిపో! రాజు వచ్చాక తీసుకు వెళ్ళువుగాని" అన్నది ఉదారంగా. నిజంగా ఉదారతే. ఆమె భర్త దర్జీకొట్లో పని చేస్తాడు.

"మంచిది వదినా..." చేతులెత్తి దండం పెట్టింది. అన్నింటికన్నా ఆకలి గొప్పదేమో. ఆకలి రుచి తెలిసిన పెద్దాడు అమ్మే కావాలని పట్టు పట్టలేదు. అత్త దగ్గర అమృతం దొరక్కపోయినా రెండు పూటలకు సరిపడే తిండి అయినా దొరుకుతుందని తెలిసి పోయింది.

సావిత్రి ఇద్దరు పిల్లలతో ఇంటికి వచ్చింది. ఇంటామెను బ్రతిమాలి రెండిళ్ళలో పాచి పని కుదుర్చుకున్నది.

"సావిత్రీ ఆ జడ యెందుకే!" ఇంటామె ఇబ్బందిగా చూచింది. సావిత్రి ఆ రోజు నుండి వేలు ముడి వేసుకుంది. ఆ వీధిలో రసికులంతా సావిత్రి సాంగత్యం కోరేవారే. యెలా తప్పించుకోవాలో తెలియలేదు. తల వంచుకుని వచ్చినా ఏదో ఒకటి అంటుంటారు. ఆ రోజు ఇంటావిడ పిలిచింది.

"చూడు సావిత్రీ! యెక్కడయినా చిన్న ఇల్లు చూచుకో. నెలకు ముప్పై రూపాయలు వచ్చే గారేజి. మేం నష్ట పోవటం భావ్యంగా ఉందా చెప్పు?"

"ఒక నెల జీతం దొరికిన తరువాత చూచుకుంటానమ్మా" అన్నది. సావిత్రికి నవ్వు వస్తుంది. ఒకింట్లో పదిహేను, మరొకింట్లో పద్దెనిమిది. ఆ ముప్పై మూడు రూపాయల చుట్టూ యెన్ని ఆశలు! రోజూ సద్ది! బొద్దితో ఒకపూట తింటున్నారు. వెండి గిన్నెలు, గ్లాసులు కడిగి, తుడిచి పెట్టినందుకు ఒక తల్లి టీ ఇస్తుంది. సావిత్రికి ఏం తోచటం లేదు.

"అమ్మా! అయిస్ ఫ్రూట్ కావాల్నె" రెండోవాడు మారాం.

"...నా...నాకె..." పారాడుతున్న కూతురి గోల. ఇప్పుడు అడిగి నవి ఇవ్వలేక పోయినా, దెబ్బలు బాగానే ఇస్తుంది. సావిత్రి పిల్లలను జోకొడుతూ కూర్చుంది.

"సావిత్రీ!"

ఆమె అదిరిపడి చూచింది. ఇంటాయన గుమ్మంలో నిల్చున్నాడు.

"ఏందయ్యగారూ!"

"ఏం లేదు. ఈ కష్ట సమయంలో ఇల్లు వదిలి ఏం పోతావ్! రోజూ పదకొండు, పన్నెండు మధ్యల తలుపు తీసి ఉంచు. అర్థమయిందా! ఇల్లు వదల అక్కరలేదు. అడప దడప ఏదయినా ఇస్తాను. ఇప్పటికి ఇదుంచు." పదిరూపాయల కాగితం విసిరి వచ్చినంత వేగంగా వెళ్ళిపోయాడు. సావిత్రికి ముచ్చెమటలు పట్టాయి. ఆయన భావం అర్థంగాని అమాయకురాలేం కాదు. తలుపులు బిగించుకుని కూర్చుంది. బాలరాజు ఆంక్షలు గుర్తుకు వచ్చాయి. రాత్రంతా ఏడ్చింది. తలుపుకొడితే రగడ అవుతుందని వెళ్ళిపోయి ఉంటాడు ఇంటాయన.

పనికి వెళ్ళి వచ్చేసరికి కొడుకు కూతురు ఇంటాయన ఆగ్రహానికి గురి అయ్యారు.

"ఛీ... ఛీ... విశ్వాసంలేని జాతి. కూడునీడ యిచ్చినా, ఎగబడి ప్రాణాలు తీస్తారు. మొక్కలన్నీ పాడయి పోయాయి..."

"జీతం రాగానే వెళ్లిపోతారు లెండి" భార్య సముదాయించింది.

రోజూ అలాంటి సంఘటనలే యెదురు అవుతుండె. పక్కింటి పనిమనిషి ముత్యాలమ్మ గుడిసె ప్రక్కన పది రూపాయలకో గుడిసె మాట్లాడుకుని వెళ్లింది.

అక్కడ మరో సమస్య ఎదురయింది. సాయంత్రమయితే అంతా తాగుతారు. రిక్షావారు, తాపీ కూలీలు, బూతులు మాట్లాడుతూ తడిక తట్టే వాళ్ళు యెక్కువయి పోయారు. చంటిదానికి జ్వరంవచ్చి పనిలోకి వెళ్ళలేదని ఒక ఇంటామె తీసివేసింది. పనిపోగా పిల్ల ప్రాణాలు పొయ్యే స్థితి. బంధు జనాన్ని మరోసారి దర్శించుకుంది.

"కూడు పెట్టుకోలేని దానివి బిక్షం ఎత్తి అన్నం ఏం పెడతావ్?" అని యెత్తిపొడిచారు. ఏడుస్తూ పిల్లను పెట్టుకూర్చుంది. ఆ వీధిలో పేరు పడ్డ రౌడీ ముత్యాలమ్మ. ఆమె పది రూపాయలు ఇచ్చింది.

"సావిత్రీ! ఓ మాట జెప్తా వింటావ్, నీతి నియమాలు మనలాటి ఓల్లకు కుదరవే..." అన్నది. మందు, బన్ను రొట్టె తెచ్చారు.

"ఏమిటక్కా!"

"ఏంలేదు. నాకు తెలిసినాయన ఉన్నాడు. భార్య రోగిష్టి. ఆయన అల్లరి చిల్లరగా తిరిగే మనిషి కాదు. నీకు నెలకింత యిస్తాడు. మనసు పుట్టి నపుడు వస్తాడు...ఆలోచించు..."

"ఏమిటీ?" ఆడపులిలా లేచింది సావిత్రి.

"నేనేదో చెప్పాను. ఇనుకోక నలుగురి చేతిలో పడి కుక్కలు చింపిన విస్తరాకు జేసుకో..." అనుకుంటూ వెళ్ళిపోయింది ముత్యాలమ్మ.

ఇంకో ఇంటివాళ్ళు కూడా మర్యాదగా వద్దని చెప్పారు. పని పోవటం కాక ఆ వీధిలో సావిత్రి గురించి పనిదొంగ అనే ప్రచారం బయలు దేరింది. ఎన్ని రోజులు ఉపవాసం ఉంటుంది? ముత్యాలమ్మే శరణ్యమయింది.

చంద్రశేఖరం పెద్ద బిజినెస్ మాగ్నెట్. కావాలంటే అమ్మాయిలను క్యూలో నిలబెట్టుకోగల సమర్థుడు, యెందుకో ఆతనికి అలాంటి వారు నచ్చ లేదు. సావిత్రిని చేరదీసాడు. ఆదెమ్మ ఎనిమిది బై ఎనిమిది గదిలో ఆమె నుంచాడు. ఆమెకు కావల్సిన బట్ట, పొట్టాచూచుకుంటున్నాడు. అప్పుడప్పుడు సినిమాలకు తీసుకు వెడతాడు. అప్పుడప్పుడు అర్థ రాత్రి వచ్చి వెళ్లి పోతాడు. కొన్ని సార్లు చీటి పంపితే పిల్లలను ముత్యాలమ్మ దగ్గర వదిలి అతని వెంబడి ఊర్ల వెంబడి వెడుతుంది,

"మీ ఆయన ఏం చేస్తాడు?" యెవరయినా అడిగితే వ్యాపారం అని చెప్పేది.

"యెప్పుడూ కనిపించరేం?"

"ఊర్లు తిరుగుతాడు" అనేది. ఆమె యెవరి జోలికి వెళ్ళదు. కొందరికి కుతూహలమున్నా అడగలేక పోయారు. ఆదికాక అక్కడ యెక్కువమంది చార్మినార్ సిగరెట్ల ఫ్యాక్టరీలో పని చేస్తారు. భార్యా భర్తలు ఉద్యోగాలు చేస్తే ఊకదంపు కబుర్లకు అవకాశ ముంటుందా!

జైలునుండి విడుదలయిన బాలరాజు భార్య జాడ తెలియక అల్లి కల్లోలపడి తన పిల్లలకోసం గాలిస్తున్నాడు. పెద్దాడు పూర్తిగా తల్లిని మరిచి పోయాడు. ఆరాతీస్తూ వచ్చిన బాలరాజుకు ముత్యాలమ్మ అక్కకొడుకు సావిత్రి వుండేపేట అడ్రసు చెప్పాడు!

పంపు దగ్గర నీళ్లు పట్టుకుంటున్న సావిత్రి దూరంనుండి వచ్చే పురుషుడు భర్తేఅని తెలియగానే, నిండినంతవరకే చాలన్నట్టు, బిందె తీసుకుని లోపలికి వెళ్లి తలుపులేసుకుంది. ఆమె గుండె ఎగిసెగిసి పడుతుంది. అలాగే గోడకు చేరబడింది. బయట బాలరాజు రావటం, పిలువటం వినిపించాయి. తలుపు తీసే ధైర్యం లేదు.

"అక్కడ వాళ్ళు చెబితే ఏమో అనుకున్నాను. ముగ్గురు పిల్లల తల్లి లేచివచ్చి నా కన్యాయం చేసింది" అన్నాడు. అందరి సానుభూతి పొందాడు. తనెందుకు అలా చేసిందో భర్త ఆలోచించడు. సంఘం ఆలోచించదు. తమకుక్కమనే విలువలు కావాలి. తిట్టి, తిమ్మి, పోలీసులకు రిపోర్ట్ ఇస్తానని వెళ్ళాడు బాలరాజు. అరిచి, అరిచి అమ్మలక్కలు వెళ్లిపోయారు సావిత్రి అలాగే కూర్చుంది.

"అమ్మా...తలుపు తియ్యమ్మా..." పిల్లలు పిలిచారు. అప్పుడే నాలు అయిందా అనుకుని తలుపు తీసింది. పిల్లలను హృదయానికి హత్తుకుంది. బిస్కట్లు ఇచ్చి, టీ త్రాగించింది. వాళ్ళను తీసుకుని ఇంటికి తాళం పెట్టి బయటికి వచ్చింది.

"అదిగో...అదిగో, వగలాడి పోతుంది" అన్నారెవరో.

ఆదేం లెక్క చేయలేదు. రిక్షా మాట్లాడుకుని ఆడబడుచుఇంటికి వెళ్లింది. ఆమె వెళ్లిన అరగంటకు, ఆడ బడుచు, బాలరాజు ఇద్దరూ వచ్చారు.

"ఏమిటే, ఏం ముఖం పెట్టుకుని వచ్చావే:" ఆమె అరిచింది.

"మీ తమ్ముడి పిల్లలను ఆయనకిచ్చి వెడదామని వచ్చాను."

"ఏమిటి? సిగ్గు, యెగ్గూ, ఏం లేదా? యెవడితో ఉంటున్నావే, జుటు పట్టి తంతాను..." ముందుకు వచ్చింది.

"నేను అంత దూరం వస్తే తలుపు తియ్యవా:" బాలరాజు పళ్ళు కొరికాడు. పెద్ద కుర్రాడు తమాషా చూస్తున్నాడు. చిన్నకుర్రాడు బావురుమన్నాడు.

"ఆగండి...!' మంకెన పువ్వుల్లా ఉన్న కళ్ళతో ఇద్దరిని చూచింది.

"ఊరోక్కా... ఊరోక్కా నాన్నా!...తాగి తందనాలాడి లారినడిపి యాక్సి డెంటు చెయ్యటం నా తప్పా? మీకు శిక్ష వేశారు. నాకేం రక్షణ ఉంది. ఆయన జైల్లో ఉండగా తోబుట్టు అయిన మీ ఇళ్ళచుట్టూ తిరిగానే. కనికరిం చారా. కన్నీరు తుడిచారా. మా పంచన పడి ఉండి పని చేసుకోమన్నారా!"

"నా చేతనయింది నేను చేశాను..." అడపడుచు ముఖం మాడ్చు కుంది.

"అదేమాట నేను అంటాను. అనాధగా ఈ ప్రపంచంలో ఒంటరిగా నిలబడిన నా లాంటి అభాగ్యురాలికి అండ ఏది? ఈ పిల్లలను పస్తులతో మాడ్చి చంపలేక ఒకరి అండన చేరాను. పదవులాశించి, డబ్బుకు కక్కుర్తిపడి కాదు. కన్న పిల్లలను కళ్ళముందు చంపుకోలేక". దుఃఖం ఆగటం లేదు.

ఈ కళంకం కన్నా చచ్చినా బావుండేది."

"ఇదిగో మీ పిల్లలు" చంపుకుంటారో పెంచుకుంటారో. నాకేం మీ పాదాల చెంత పడివుండాలని లేదు."

"బరితెగించావే..." ఆడబడుచు శాపనార్థాలు పెట్టింది.

"అడ్డంగా నరుకుతాను" బాలరాజు అరిచాడు.

"ఉహుం" నిర్లక్ష్యంగా ఒక సారి చూసింది.

"వెళ్ళండి మురళి...శ్యామూ, మీ నాన్న దగ్గరుండండి. ఒరేయ్ శివా ఇలా రా..." పెద్ద కొడుకును పిలిచి నాల్గు అణాలు చేతిలో పెట్టింది. ఆమె వెనక్కి తిరిగింది. ఆడబడుచు గుండె అదిరిపోయింది. ఇంత మందిని తమ్ము డికి ఉద్యోగం దొరికే వరకు పోషించగలదా!

"ఇదిగోనమ్మా, మీరు మీరు ఏమన్నా చేసుకోండి" పెద్దాడినికూడా రెక్కపట్టి లాక్కువచ్చి బయటకు గెంటింది.

"మీకు పని దొరకగానే వచ్చి పిల్లలను తీసుకు వెళ్ళండి" అని రిక్షా మాట్లాడుకుంది సావిత్రి. ఆమె రిక్షా దిగేసరికి పద్మవ్యూహంలా స్త్రీలు, ఆడెమ్మ నిలబడ్డారు. గదిలో బంధించి కొట్టినపిల్లి శాస్త్రం అయింది సావిత్రి విషయంలో. వాళ్ళనందరిని పరికించి చూసింది. ఆమె చూపులు పదునుగా వున్నాయి.

"ఇందాక ఏమేమో అంటున్నారు. నా రంకుతనమే చూచారు? పంపు క్రింద బిందెపెట్టి పక్కింటి కాలేజీ కుర్రాడితో తిరిగానా? బస్సు దొరకలేదన్న మిషతో బాస్‌తో తిరిగానా? భర్తకు నైటుషిఫ్ట్ ఉంటే ప్రియులను పిలిపించు కున్నానా! మౌనంగా ఈ యింట్లో వున్నవారి ఒక్కొక్కరి చరిత్ర ఆకళింపు చేసుకున్నాను. మీరు ఒక్కమాట నోరు జారినా మర్యాద దక్కదు" హెచ్చరికగా అన్నది. అందరూ అసహాయంగా ఆదెమ్మ వంక చూచారు.

"నా కిరాయ సరిగ్గా ఇస్తే సాలు! ఎవడే ఏట్లోపోతే నాకేం?" అని విసవిస వెళిపోయిందామె. హాలీవుడ్ సినిమా తారల కున్నన్ని ప్రేమ కథ లున్నాయి ఆదెమ్మకు. మిగిలినవారు తేలుకుట్టిన దొంగల్లా యెవరి యిళ్ళల్లోకి వారు వెళ్లిపోయారు.

రాత్రి పిల్లలు పడుకున్నారు. చీటి అందింది. తలుపుకు తాళం పెట్టి బయలు దేరింది సావిత్రి.

ఆ రాత్రి అన్యమనస్కంగా ఉంది సావిత్రి. అతను గమనించాడు. మెల్లగా ఆమె ముఖం తన వైపు తిప్పుకున్నాడు చంద్రశేఖరం.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్!"

"ఏం లేదు..." అన్నది తడబడుతూ.

"చూడు సావిత్రీ! నాకెంత డబ్బున్నా పరపతి ఉన్నా ఈ సుఖం ఏనాడు అనుభవించలేదు. దినమంతా ఆరాటంగా ఉన్న మనసు నీ సమక్షంలో ఊరట చెందుతుంది."

ఆమె కళ్ళు చమర్చాయి. అతని చేయి కళ్ళకు ఆనించుకుంది.

"నాకు యెక్కడయినా చిన్నపాటి ఉద్యోగం చూపగలరా!"

"సావిత్రీ!" విస్మయంగా చూచాడు. ఇల్లడుగుతుందో, ముల్లె అడుగుతుందో అనుకున్నాడు.

"అవునండీ! మిమ్మల్ని నిర్లక్ష్యం చేయాలని కాదు. ఏ పరిస్థితి ఎలా వస్తుందో..."

"అలాగే...ఈ సమయంలో చెప్పే కబుర్లా ఇవి..." ఆమెను దగ్గరగా లాక్కున్నాడు.

రెండు నెలలు తిరగకుండానే హౌసింగ్ బోర్డ్ వాళ్ళ సింగిల్ రూమ్ క్వార్టరు, స్టేట్ హాండ్లూమ్ షోరూములో సేల్స్‌గర్ల్ ఉద్యోగం వచ్చింది. బాల రాజు పిల్లలకోసం రాలేదు. ముగ్గురిని బడిలో చేర్పించి తను ఉద్యోగానికి వెడుతుంది సావిత్రి.

మొదటి జీతం అందుకున్నరోజు అతడి పాదాలకు నమస్కరించింది కన్నీటితో.

"నన్ను మాత్రం మరిచిపోకు సావిత్రీ" అన్నాడు. కాలం గడిచింది. ఓ రోజు బాలరాజు వచ్చాడు.

"నన్ను మన్నించబ్బా. కలో, గంజో త్రాగుతూ కలిసి ఉందాం" కంప రంగా చూచింది. వెంటనే తనను తాను అదుపులో పెట్టుకుంది.

"రెండు రోజులయ్యాక 'చబీల్ దాస్ లారీసర్వీస్'కు వెళ్ళండి. అక్కడ ఉద్యోగం దొరుకుతుంది. జాగత్త్రగా చేసుకోండి" అని లోపలికి వెళ్ళిపోయింది. తల వంచుకుని బయటికి నడిచాడు, భరించే భర్త బాలరాజు పుట్టెడు దుఃఖం భరిస్తూ.

# వాన వచ్చింది   శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి

వర్షాలు వచ్చేసినాయి.

పుడమితల్లిని తడుపుతూ. పూలజల్లుగా మొదలై సూదులు విసిరినట్టుగామారి, నింగికి, నేలకి వారధి కడుతున్నట్టుగా ఏకధారగా ఉధృతంగా కురవటం ప్రారంభించినాయి!

వేసవికాలపు పొగలు, సెగలుతో ఉక్కిరి బిక్కిరి అయిన అందరూ రాకరాకవచ్చిన అతిధిని చూసినట్టు వానజల్లుల్ని అపురూపంగా ఆనందంగా చూస్తున్నారు! కుంభవృష్టిగా మారిన ఆవానలో తడుస్తూ హాయిని పొందుతున్నారు, దట్టంగా ఆకాశంలో నిండిపోయిన చిక్కటి నల్లటి మేఘాలని సంబరంగా చూస్తున్నారు!

ఆఫీసులనుంచి వచ్చేవాళ్ళు బస్‌స్టాప్‌ల దగ్గర, అడుక్కునేవాళ్ళు చెట్ల క్రింద, పనిమీద బజారు వచ్చినవాళ్ళు షాపుల చూరులక్రిందా నిలబడి, హఠాత్తుగావచ్చిన ఈ కుండపోతని విస్మయంగా పన్లుమానేసి నిలబడినట్టుగా చూస్తున్నారు!

ఆ వీధిలోకెల్లా అందమైన మేడ అది! దానిపైభాగంలో, పడకగది కిటికీకిఉన్న లేసుపరదాలని వజ్రపు ఉంగరం మెరుస్తున్నచేతితో పక్కకి నెట్టి చూస్తోంది ఒక యువతి!

అదే వీధిలో, చిట్టచివరవీధి పంపుదగ్గర కుండలోకి నీళ్ళు నింపుకుంటున్న రత్తి పంపులో నీళ్ళతోపాటు, కుండలోకి కురుస్తున్న వానధారలని చూస్తోంది.

గాలి రయ్యిన వీచింది.

మేడమీదగదిలో నిలబడిన ప్రమీల చెంపలమీదకి వచ్చిపడిన వానజల్లుని, వెంకటగిరి జరీచీర కొంగుతో సుతారంగా అద్దుకుంది! క్రింద పంపు దగ్గర రత్తితలలోనుంచి నీళ్ళు నుదుటిమీదనుంచి కళ్ళవైపుకి కారుతుంటే, కుడికాలుఎత్తి కుండని తొడమీద అనించి ఎడమచేత్తో నీళ్ళుపక్కకి విదిలించింది!

అప్పుడే, ఆ వీధిలోకి ఖరీదయిన తెల్లటికారు. వానసీళ్ళలో యీదుతున్న పెద్దపడవలా మెల్లగా వస్తోంది. కారులో కూర్చున్న నీలంయూనీఫారం తెల్లచై ధరించిన అబ్బాయి వానని తదేకంగా చూస్తున్నాడు! ఆకారు పక్కనుంచే పుస్తకాల సంచీనెత్తిన పెట్టుకొని సీను పరిగెత్తుకు వస్తున్నాడు. కారు వెళ్ళడంతో వీధిలోనిండిన బురద నీళ్ళుచింది శీను మీద పడ్డాయి! 'ఛీ!' నోటి దగ్గరకి అవి వచ్చిపడడంతో శీను చిరాకుపడ్డాడు. కారులోకూర్చున్న నీలం బట్టల అబ్బాయి ఫక్కున పళ్ళన్నీ కన్పించేలా నవ్వాడు. మేడమీదగదిలో నిలబడిన ప్రమీల కూడా శీను అవతారంచూసి ఫకాల్న నవ్వింది!

కారు ఇంటిముందుకువచ్చి అగింది! వానని చూస్తున్నప్రమీల ఒక్క-సారిగా, అదంతా మర్చిపోయినట్టుగా, గబాల్న గదిలోనుంచి ఇవతలికి వచ్చి, "సుబ్బయ్యా! అబ్బాయివచ్చాడు గొడుగుతీసుకువెళ్ళు. రుక్కమ్మా పాలు వేడి చేయి. బాబుబట్టలు ఇక్కడ పట్రా" అంటూ కేకలు పెట్టింది.

అతి నిశ్శబ్దంగా ఉన్న ఆయింట్లో ఒక్కసారి చలనం వచ్చింది. నౌకర్లు పరుగులు పెడుతున్నట్టు పన్లు చేయసాగారు.

క్రిందవీధిలో రత్తి నీళ్ళకుండని భుజంమీదపెట్టి తీసుకు వెళ్తూ "శీనిగా! తొందరగాపోరా యింటికి" అంటూ మందలించింది. శీను వెళ్ళలేదు.

తల్లితోపాటే నడవసాగాడు. వాననీళ్ళు కాలితో తంతుంటే వాడికి చాలా సరదాగా వుంది.

"వానలో నానితే సచ్చిపోతావురా, పో" కసిరింది.

"ఏం సావను. నువ్వు తడవటంలేదేంటి.?

"మొండియెదవా నడు? నడు." కొడుకుకోసం తన నడక తొందర చేసుకుంది.

అరగంట తర్వాత—

మేడమీద ప్రమీల కొడుకుని పాలుతాగమని బ్రతిమి లాడుతోంది!

"మాబాబువిగా! తాగు! చల్లారిపోతాయి. అదుగో ఆ శీనుచూడు,

మొలకిగోచీ ఎలాకట్టుకున్నాడో?'' మేడమీద వరండాలో నిలబడి దూరంగా కన్పిస్తున్న పాకలో గుమ్మం దగ్గర నిలబడిన శీనుని చూపిస్తూ అంది.

బాబు ఫక్కున నవ్వాడు. ''ఛీ! షేమ్‌కదూ! మమ్మీ.''

''వాళ్ళకి సిగ్గుండదులే! వాడి పొట్టచూడు. కుండలావుంది. కాళ్ళు పూచల్లావున్నాయి!''

బాబు తల్లిమాటకి పక్కున నవ్వాడు. ప్రమీల కొడుక్కి మాటల సందడిలో పాలుతాగిస్తోంది.

క్రింద పాకలో శీను ఏడుస్తున్నాడు, ''అమ్మా. సలేస్తోందే?''

గంజి వేడిచేస్తున్న రత్తి విసుక్కుంది. ''నన్ను సావమంటావురా. ఆ లాగు తడిపి ఆరేసాను. ఆరిసావలేదు. ఇదుగో, యిది యేడేడిది తాగు.''

''నాకేం వద్దులే.''

''మా బాబుగా! అదుగో. సూడ్రా ఆ ఎట్టి జాంపండు ఎట్టావున్నాదో. బుగ్గలేమో బూరిల్లావున్నాయి. కల్లేమో నచ్చిత్రాలు. ఆ మొకంలో నోరెక్కడుందో మనం ఎతుక్కోవాలిరా!''

రత్తి వర్ణిస్తుంటే శీను మేడమీద బాబుని చూస్తూ గంజి తాగసాగాడు.

''అమ్మా! ఆ బాబుకేమొ అంతమంచి బట్టలు. నాకేమో యీ గోచీ! ఛీ!'' అన్నాడు శీను అసూయగా. రత్తి నిట్టూర్చింది.

''ఆ బాబుకేం రా! అద్దుష్ట వంతుడు. యేలు సంపాయించే నాన్న వున్నాడు. నువ్వూ వున్నావు. మీ నాన్న నన్నొదిలి యింకోదాన్ని సేసుకుని కులుకుతున్నాడు. సచ్చానో బతికానో గూడా సూడలేదు.'' రత్తికి ఏడుపు వచ్చేసింది,

''యేడవకే అమ్మా! నేను పెద్దయి ఆడినితంతాలే!''

''మా బాబే!'' రత్తి కొడుకుని కౌగలించుకుంది.

చీకటయింది.

వాన జోరుకూడా ఎక్కువ అయింది. గాలి కూడా తోడు కలవటంతో స్వైర విహారం సాగింది.

ఆకాశంలో వెలుగుపూలు పూసినట్టు అప్పుడప్పుడూ మెరుపులు మెరుస్తున్నాయి.

ప్రమీల పడుకోబోతూ, కిటికీరెక్కలు మూయటానికి అక్కడికివచ్చింది.

దూరంగా, వీధి దీపపు కాంతిలో, వాన తెరల మధ్య గుడిసెలు లీలగా కన్పిస్తున్నాయి.

ఈ రాత్రంతా యిలాగే వానపడితే, ఆ గుడిసెల్లోకి నీళ్ళు వచ్చేస్తాయి. ఆ మనుషులు ఎలా బ్రతుకుతారో?

ప్రమీల కిటికీ తలుపులు మూసి, పక్కమీదకు వచ్చి పడుకుంది. మెత్తటి పరుపుమీద. వెచ్చటిరగ్గు కప్పుకుని పడుకున్నా, ప్రమీలకి యింకా వేడి సరిపోలేదు. భర్త దగ్గరకి జరిగి అతన్ని అనుకుని పడుకుంది.

గుడిసెలో శీను చలికి గడగడలాడుతున్నాడు. వాడికి కప్పటానికి రత్తికి ఆ పాకలో పొడిబట్ట ఏదీ కనిపించలేదు. వాన వస్తే మేకకూడా ఆ గుడిసెలోనే వాళ్ళతోపాటు పడుకుంటుంది. రత్తి మేకకి పక్కగా ఎండుగడ్డి వేసింది. కొడుకు చలి చూడలేని రత్తి మేకని లేపి, ఆ గడ్డితెచ్చి శీనుకి వేసింది. శీను ఆ గడ్డిలో పడుకున్నాడు. మేక మే మే అని చలికి అరుస్తూ ఆ గడ్డిలోకే వచ్చి ఒదిగి పడుకుంది. ఎంత సేపయిందో తెలియదు.

శీను లేచాడు. "అమ్మా, అమ్మా!" అంటూ పిలిచాడు.

రత్తి లేచింది. "ఏంటిరా!" అనే లోపలే శీను వాంతి చేసుకున్నాడు.

గాలికి దీపం ఆరిపోయింది.

వీధి దీపపు వెలుతురు గుడిసెలోకి జొరబడడానికి విశ్వప్రయత్నం చేస్తోంది.

రత్తి శీనుకి నీళ్ళు తెచ్చింది.

శీనుకి వాంతులు తగ్గలేదు. అదిగాకుండా మాటిమాటికీ గుడిసె బైటకి వెళ్ళివస్తున్నాడు.

రత్తికి భయంవేసింది! సాయంత్రం పంపుదగ్గర అమ్మలక్కలు వూరిలో మహమ్మారిలా వున్న కలరా గురించి మాట్లాడుకోవటం వింది!

ఏం చెయ్యటం?

రత్తి శీనుని లేవదీసి భుజంమీద వేసుకుంది: డాక్టరుగారు రెండువీధుల అవతల వున్నాడు.

రత్తి గుడిసె యివతలకి వచ్చింది. వీధి లైటు కూడా పోయింది!

చీకటి! వాన!

కానీ కొడుకు ప్రాణం గురించి ఆదుర్దా పడుతున్న రత్తికి అవేవీ ఆటంకాలుగా అనిపించటంలేదు? శీనుని భుజాన వేసుకుని పడుతూ, లేస్తున్నట్టుగా, ఆ నీళ్ళలో ఈదుతున్నట్టుగా నడుస్తూ వెళుతోంది!

ఆ చీకట్లో ఆ డాక్టరుగారి యింటికి ఎట్లా చేరుకుందో రత్తికే తెలియదు!

రత్తి గొంతు చించుకున్నట్టుగా అరవగా, అరవగా, తలుపులు బాదగా డాక్టరుగారి నౌకరు లేచివచ్చి తలుపు తీశాడు.

"డాక్టరుగారు లేరు! మీ వీధిలోనే ప్రమీలమ్మ కొడుక్కి కలరాగా వుందని ఫోన్ వస్తే వెళ్ళారు." అన్నాడు.

"అయ్యో! డాక్టరుగారు మా యీదికే వచ్చారా. నా కెదురు అవలేదే". రత్తి మళ్ళీ అంతలోనే గుర్తుచేసుకుంది. "అవునవును! నాకెట్టా ఎదురవుతారు. నేనేమో దగ్గర గందా అని యీరయ్యగారి సందంబడి వస్తిని!" అనుకుంది.

"డాక్టరుగారు యిప్పుడు రారు!" అన్నాడు నౌకరు.

"వచ్చేదాకా కూసుంటాను" అక్కడ కొడుకుని పెట్టుకుని కూర్చుంది.

శీను వాంతులు చూసి నౌకరు అసహ్యించుకున్నాడు.

"ఇదుగో! ఆయన అక్కడే వున్నాడుగా! ఆ ప్రమీలమ్మగారి యింటికే పో!" అని తలుపులు వేసేసుకున్నాడు.

రత్తి కొడుకునెత్తుకుని లేచింది!

మళ్ళీ వాన నీళ్ళలో యీదుతున్నట్టుగా ఈ సారి డాక్టరుగారు ఎదురవుతారు అన్న ఆశతో కారు వచ్చే రోడ్డువెంట వచ్చింది!

రత్తి కొడుకునెత్తుకుని వచ్చేసరికి ప్రమీలమ్మ యింట్లో పట్టపగలులా లైట్లు వెలుగుతున్నాయి! నౌకర్లందరూ గుమిగూడి చిన్నబాబు ఆరోగ్యం సంగతి మాట్లాడుకుంటున్నారు.

డాక్టరుగారు ఆయింటికి వస్తుంటే మధ్యదోవలో కారు చెడిపోయిందిట! ఆయన యిప్పుడే వచ్చారు! చాలాఆలస్యం అయిపోయింది! చిన్నబాబుని అయ్యగారి కారులో అదేదో పెద్ద హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళారుట! ఎప్పుడు తిరిగి వస్తారో తెలియదు. రత్తి కొడుక్కి కూడా కలరా అనేసరికి వాళ్ళంతా దూరంగా తొలిగి నిలబడ్డారు!

శీను అప్పటికే వడిలిన తోటకూర కాడలా వేళ్ళాడిపోతున్నాడు.

వాడిని చూసి నౌకర్లంతా పెదవి విరిచారు.

"యింకేం మందులే. యింటికి తీసుకుపో!" అన్నారు.

రత్తి కొడుకుని భుజాన వేసుకుని పాకకి తిరిగి వచ్చింది,

రత్తి కళ్ళనుండి వానధారల్లా నీళ్ళు కారుతున్నాయి. డాక్టర్ దొరకలేదు! మందు పడలేదు! అయిపోయింది! శీనుకి తనకీ రుణం తీరిపోయింది! రత్తి పాకలో పొయ్యిపక్కగా కాస్త పొడిగామిగిలిన జాగాలో ఎండుగడ్డి వాగి దానిమీద కొడుకుని పడుకోబెట్టింది! ఆగడ్డిని చూడగానే రత్తి వెన్నెముక ఝల్లుమంది!

"పాపిష్టిదాన్ని! యిట్టా సేసానేంటి! అసలు గడ్డి మీద రాత్రి ఆడిని ఎందుకు పడుకోబెట్టాను! నా సేతులు పడిపోను!" అని తిట్టుకుంది.

వీధి దీపం ఆరిపోయినా ప్రమీలమ్మ ఇంట్లో లైట్లు వెలుగుతూండ డంతో గుడ్డివెలుతురు పాకలోకి వస్తోంది! రత్తి కళ్ళ నుంచి నీళ్ళధారలు ఆగటంలేదు!

ఆ అమాయక హృదయం మూగగా దేవుడితో దెబ్బలాడుతోంది.

"ఆ పెమీలమ్మకి ఏంతక్కువని? ఈ డాక్టరు కాకపోతే ఇంకో డాక్టరు వచ్చేవాడు. కారుగల ఆసామి! కొడుకుని ఎంతదూరం అయినా తీసుకెళ్ళి రచ్చించుకోగలదు! భగమంతుడా! నువ్వు మంచోడివి కాదు? వున్నవాళ్ళకే అన్నీ యిస్తావు! నాకేం కారులు యిచ్చావా! మిద్దెలిచ్చావా? యేలు సంపాయించే బరతనిచ్చావా? యిచ్చింది ఈ నలుసు ఒక్కడు. వాడిని కూడా లాక్కుని నన్ను యింకా బికారిని సెయ్యి." రత్తికి ఆపుకోలేనంత ఏడుపు వచ్చేసింది. "ఈడుకూడా లేకపోతే నాకెవరుదిక్కు?" అనుకుంటూ, "శీనూ! శీనూ!" అంటూ ఒంటిమీద చేయివేసింది. శీను పలకలేదు.

"శీనూ!" రత్తి ఘొల్లుమంటూ ఏడ్చిన ఏడుపు ఆ గాలిలో కలిసి పోయింది.

రాత్రి ఎటా గడిచిందో! వాన ఎప్పుడు ఆగిపోయిందో. తూర్పున ఎప్పుడు తెలతెలవారిందో రత్తికి తెలియనే తెలియదు! ఆ పాకలో శ్మశానంలో కూర్చున్నట్టుగా కూర్చుంది.

"అబ్బా!...అమ్మా...ఊ!" ఎక్కడి నుంచో మూలుగు వినిపించింది. రత్తి యింకా ఆ పిలుపే వింటోంది.

"అమ్మా!" పాతాళలోకం నుంచి మాట్లాడుతున్నంత నీరసంగా శీను పిలుపు వినిపించింది!

పిచ్చిదానిలా కూర్చున్న రత్తి వెఱ్ఱి చూపులతో గడ్డి మీద పడుకున్న కొడుకు వైపు చూసింది.

"అమ్మా!" శీను పిలుస్తున్నాడు. బాధతో మూలుగుతున్నాడు. రత్తికళ్ళు పత్తికాయల్లా అయినాయి!

"అబ్బా! ఊ!" మూలుగు స్పష్టంగా వినిపించింది. రత్తి లేచి వచ్చింది! శవం ప్రాణం పోసుకుని మళ్ళీ కదిలినంత ఆశ్చర్యంగా చూసింది!

"శీనూ! శీనిగా, ఒరే! శీనిగా!" ఒక్కసారిగా కొడుకు మీద పడి ముఖం, చేతులు ముద్దులతో నింపేసింది. రత్తి ఏడుస్తోంది! కానీ ఆ ఏడుపులో ఎన్నడూ ఎరగనంత సుఖం ఆనందం కనిపించ సాగాయి! పదిగంటలు అయినాయి! మేకని బైట గట్టేసి, పాకని శుభ్రం చేసి, కుండ పుచ్చుకుని పంపు దగ్గరికి నీళ్ళకి వస్తున్న రత్తికి ఆవీధి వీధంతా కారులతో నిండి పోవ టం ఆశ్చర్యంగా అనిపించింది.

"అక్కా! ఏమయిందే?" అని పంపు దగ్గర నీళ్ళు తెస్తున్న యువతిని అడిగింది.

"అయ్యో నీకు తెలియదా? రాత్రి పెమీలమ్మ కొడుకు పోయాడంట! కలరా తగిలిందట! పాపం! ఒక్కడే కొడుకు!"

రత్తి నిశ్చేష్టురాలయినట్టు నిలబడి పోయింది!

వారంరోజులు గడిచినాయి!

రత్తి కొడుకుని వెంకటేశ్వరస్వామి దేవాలయానికి తీసుకువెళ్ళి, తలనీ లాలు యిప్పించి ఇంటికి తీసుకు వస్తోంది!

ప్రమీల మేడమీద బాల్కనీలో కుర్చీలో కూర్చుని వుంది! మేడ, కారు, నగలు, నౌకర్లు. వేలుసంపాయించే భర్త అన్నీవున్నా ప్రమీల కళ్ళలో ఏమీలేని బికారిలాంటి బీదతనం కనిపిస్తోంది, అవేవీ ఆమెకు సంతోషం కలిగిం చటంలేదు! ఆకళ్ళలో అంతులేని శూన్యం! చెప్పలేని బాధ కన్పిస్తున్నాయి! బాల్కనీలో కూర్చుని వున్న ప్రమీల వీధిలోనుంచి వెళ్తున్న రత్తిని చూస్తోంది!

రత్తి ముఖం అష్టయిశ్వర్యాలు తనకే వున్నంత అందంగా మెరిసి పోతోంది!

ఎందుకో తలెత్తి పెమీలమ్మ తనవైపే చూస్తుండటం చూసిన రత్తి గుండుచేయించిన కొడుకుని భుజాల చుట్టూచేయివేసి మరింత దగ్గరకి

లాక్కుంది! పెమీలమ్మ ముఖం చూడగానే రత్తి కళ్ళలో చివ్వున నీళ్ళు చిమ్మినాయి! కడుపుకోత ఏ ఆడదానికైనా ఒకటే.

ప్రమీలమ్మ బంగళాదాటి వచ్చేస్తున్న రత్తి గబగబా కుడిచేత్తో చెంపలు వాయించుకుంది. ''బగమంతుడా? ఆ రాత్రి తొందరపడి నిన్ను తిట్టానయ్యా! తప్పుతప్పు! ఈ పెపంచంలో నువ్వు ఎవరికీ అన్నీ యివ్వవు. ఏవో కొన్ని యిస్తావు సుమా!'' అనుకుంది.

---